రచయిత శ్రీ వేమమల్ల కామేశ్వరరావుగారు, బి. ఏ., బి.ఇడి. 55/6 చావడివీధి, చిత్తూరు, ఆంధ్రప్రదేశ్. ప్రతులను గ్రంథకర్తకే వ్రాయఁదగును.

శ్రీ కామేశ్వరరావుగారు కీ॥ శే॥ శ్రీ వేమమల్ల అచ్యుత రావుపంతులుగారి ప్రథమపుత్రులు తండ్రికొడుకులిరువురు సుప్రసిద్ధ రచయితలయి యాంధ్రవాఙ్మయరంగమున విశేషగౌరవస్థానమును బడసినవారు. కామేశ్వరరావుగారికి వ్యావహారిక భాషలో రచన సాగిం చుట పరిపాటి. ఈ రచనమయినను విశృంఖలముగ నుండక వారేర్ప ఱచికొన్న కొన్ని నియమములకు లోనయి యుండును. కొంతకాలము క్రిందట వీరు "వాడుక భాష,రచనకుఁ కొన్ని నియమాలు"అను గ్రం థముకూడ వ్రాసి ప్రకటించినట్లు తెలియుచున్నది. భాషాకాఠిన్యము లేక రచన చదువరులకు చాల సుగమముగనుండును. ఈ గ్రంథము ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి గ్రాంటును పొందినది. రచ యిత మిత్రులు శ్రీమాన్ ఆత్మకూరి గోవిందాచార్యులుగారు (రిటైర్డు హైకోర్టు న్యాయమూర్తులు) రచించిన 4 పుటల పీఠిక, గ్రంథమునకు ముఖాలంకారముగ నున్నది. అటుతరువాత "నామాట" యను పేరితో 4 పుటలు రచయిత విజ్ఞప్తియున్నది.

కేవలము భాషాభిమానులయి ప్రతిఫలాపేక్ష యేమియు వాం ఛింపక నిస్స్వార్థ సారస్వతసేవ గావించిన కవిపండితుల రచయితల,జీవి తములిందుఁ గలవు. కీ॥ శే॥ 1846 లో జనించిన గుంటూరు వీరభద్ర శాస్త్రిగారు మొదలుకొని 1894 లో జనించిన పింగళి లక్ష్మీకాంతము గారివఱకు నించుమించుగ నొక యర్ధశతాబ్దికాలములో సేవగావించిన, కావించుచున్న, ప్రఖ్యాత రచయితలు 102 మంది జీవితములిందుఁ గలవు. వీరందఱు నేదోవిధముగ రచయితకుఁ బరిచితులయిన. మిత్ర వర్గములోనివారే. అందుచేతనే గ్రంథమునకు 'నా వాఙ్మయమిత్రులు'

అను పేరిడినారు. గిడుగు వేంకట రామమూర్తిగారిని చేర్చియు వారి కుమారులు సీతాపతిగారి నిందుఁ జేర్పకుండుట యొక లోపమేమో యని తలంతుము.

ఈ సమీక్షాకారుఁడుకూడ 87వ నెంబరుగ నిందుఁ జేరియున్నాఁడు. తమకు స్వయముగఁ బరిచితములయిన యీ యా వాఙ్మయసేవకుల జీవితవిశేషములను వివరించుటయేగాక, రచయిత విశేషపరిశ్రమతో తమకెఱుఁగరాని వారిసంగ్రహ జీవితచరిత్రములనుగూడ సేకరించి యందు గూర్చియున్నారు. గ్రంథమునఁ జేరనివారు పెక్కురు గలరనుట నిక్కువము. ఈవిషయమున రచయిత వాక్యమునే యుదాహరింతుము. "ఈ గ్రంథములో చేరని మిత్రులెందరో ఉన్నారు. ఇక రెండవ సంపుటములో చేర్చుటకు ప్రయత్నిస్తాను". వీరి యీ కోరిక త్వరలోనే సిద్ధించుటకుఁ బరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక! పీఠికాకర్తలు శ్రీ గోవిందాచార్యులుగారు పీఠిక చివర నులికించిన "చరిత్రకారుని దృక్పథమున భావిసంతతికి నేటి కవుల జీవిత మొక దర్పణముగా ప్రసాదింపబడినది. ఇవి సమకాలిక జీవిత దర్పణమనుట నిశ్చయము. ఆంధ్రలోకమునకే, చరిత్రాత్మక గ్రంథరాజమును ప్రసాదించిన మిత్రులు శ్రీ కామేశ్వరరావుగారు ధన్యులు. ఈ గ్రంథము ఆంధ్రభాష జీవించినంత కాలము నిత్యసత్యజీవియై వెలుఁగొందగలదు. ఈ గ్రంథకర్త చిరంజీవి కాగలఁడు. విజయవంతముగ గ్రంథమును వ్రాసిన మిత్రులు శ్రీ కామేశ్వరరావుగారికి నా హృదయపూర్వక అభివందనములు." అను వాక్యములను మేముగూడ నామోదించి యనువదించుచున్నాము.

[సశేషము]

## ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

### శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | |
|---|---|
| 5 వ సంపుటము | రు. 15—00 |
| 6 వ సంపుటము | 15—00 |
| 7 వ సంపుటము | 15—00 |

1—4 సంపుటములు పునర్ముద్రణములు గావింపబడనున్నవి.

ప్రతియొక్కటికి వెల రు 15 లు

### కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కుపాఠభేదములతోఁ గూడిన వెనుకటి విషయ మంతయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణ పీఠికతో ముద్రితమైనది వెల రు 1—50

### మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము. కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము [illegible] రు. 2—50

ఆంధ్ర సాహిత్యపరిషత్తు,
కాకినాడ

Printed by J Gopalam, B. A. L. T, at Republic Press, Kakinada
Edited by K. ISWARADUTT
Published by Andhra Sahitya Parishat, Kakinada.

శ్రీ



# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

విశ్వావసు

చైత్ర-ఆషాఢములు

సంపుటము ౫౪ సంచికలు ౧-౩



దేశభాషలందుఁ దెలుఁగులెస్స.

**Journal of the Telugu Academy**

**KAKINADA**

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు :

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు
బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము
మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు



# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక


విశ్వావసు చైత్ర - ఆషాఢ మాసములు.

సంపుటము 54. : : సంచికలు 1-2.

సంపాదకుఁడు : శ్రీ కుందూరి ఈశ్వరదత్తు.


విషయసూచిక.

# మా రచయితలు.

1. శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు.

వీరు M A Phd. పట్టభద్రులు ఉస్మానియా విశ్వకళాపరిషత్తు ఆంధ్రశాఖాధ్యక్షులు, ఆంధ్రభాషావేత్త, నన్నయభట్టాది గ్రంథ కర్తలు.

2. శ్రీ బిరుదరాజు రామరాజు గారు.

వీరు M A, Phd. పట్టభద్రులు ఉస్మానియా విశ్వకళాపరిషత్తులో ఆంధ్రభాషోపన్యాసకులు, ఆంధ్రగేయ వాఙ్మయకర్తలు.

3. శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు.

వీరు M.A పట్టభద్రులు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో ఆంధ్ర భాషోపన్యాసకులు, శ్రీనాథకవినిగూర్చి ప్రత్యేకముగ పరిశోధనము గావించినవారు.

4. శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు.

వీరు M.A. పట్టభద్రులు. మదరాసు విశ్వకళాపరిషత్తులో ఆంధ్రశాఖాధ్యక్షులు, ఆంధ్రమందలి వీరశైవవాఙ్మయచరిత్రకారులు.

5. శ్రీ మోచర్ల రామకృష్ణకవిగారు.

వీరు నెల్లూరిపురవాసులు న్యాయవాదులు, సుప్రసిద్ధాంధ్ర కవులు.

6. శ్రీ శనగన నరసింహస్వామిగారు.

వీరు M.A. పట్టభద్రులు. ఆంధ్రభాషోపన్యాసకులు.

7. శ్రీ పి. సాయినాథశాస్త్రిగారు.

వీరు M.A. పట్టభద్రులు. విజయనగరము కళాశాల ఆంధ్ర భాషోపన్యాసకులు.

8. శ్రీమతి రావూరి సుబ్బమ్మగారు.

ఈ విదుషి ఉభయభాషాప్రవీణ పట్టమునొంది; చిరకాలము ప్రభుత్వ పాఠశాలలలో నుపాధ్యాయినిగానుండి, ఉద్యోగవిరామమును బొందుచున్నది.

# శ్రద్ధాంజలి - డాక్టరు జోగారావు.

## 1911—1965

క్రోధి సంవత్సరాంతమున మా కార్యనిర్వాహక సభ్యులలో నొకరగు శ్రీ ఇవటూరి జోగారావుగారు శివ సాయుజ్యము నొందిరి. వీరు కాకినాడ పట్టణములోని వివిధ సంస్థలలో సభ్యులుగానుండి ప్రజాదరణమునకు పాత్రులైరి. వీరి మరణమువల్ల వైద్యవృత్తి యొకప్రసిద్ధ భిషగ్వరుని, కాకినాడపట్టణము ప్రజారంజకుడైన పౌరుని పోగొట్టుకొనెను.

వీరి కుటుంబమునకు మా సానుభూతి.

# ప్రాచీనాంధ్ర వాఙ్మయమందలి ప్రమాణములు.

డా. దివాకర్ల వేంకటావధాని.

ఆధునికకాలమున నన్నిరంగములందు, ముఖ్యముగా విద్యా వాఙ్మయరంగములందు, ప్రమాణములు పతనము చెందినవని పెద్ద లనుచుండుట తఱచుగా వినుచుందుము. వారట్లనుటకుఁ బ్రాచీనాధు నిక ప్రమాణములందుఁ దారతమ్య మధికముగాఁ గానవచ్చుచుండు టయే కారణము. చిత్రమేమనఁ బ్రమాణములు పెంపుచెందవలెనను ప్రచార మెంత యెక్కువగా వినఁబడుచున్నదో అంత యెక్కువగా నవి పలుచబడుచున్నవి. క్లేశసాధ్యమైన యుదాత్తతపై నభిమానము తగ్గి లాఘవసౌకర్యములపై నాసక్తి పెరుగుట, లక్షణానుసరణమునకంటెఁ దదుల్లంఘనమే స్వాతంత్ర్యమను భ్రాంతితోఁ గూడిన భావము ప్రబ లుట, వ్యుత్పత్తిరాహిత్యమువలన సదసద్వివక్షణతాలోపముతో పాటసద్విషయమును సద్విషయముగా గ్రహించు నవివేకము హెచ్చు గుట, అల్పసిద్ధికై ఆడంబరముతోఁ గూడిన యహంకార మతిశయిం చుట, ప్రమాణపతనమునకు ముఖ్యములైన కారణములు. ఇట్టి స్థితిలో నున్నదానితోఁ దృప్తిపడి యూరకుండక కొందఱైనఁ బ్రమా ణములు పెంపుచేయవలెనని యాందోళనము సాఁగించుట కొంతవఱకు శుభోదర్కమే. ఈ భావమేలేనిచోఁ బతనము నిరాటంకముగా సాఁగి సాఁగి కొలఁదికాలముననే పరిపూర్ణత ప్రాపించుటకవకాశమున్నది. దీని నరికట్టుటకు యత్నించుటతోపాటు ప్రాచీనప్రమాణముల పరి పాటి నెఱుంగుట యెంతైన నవసరము. అందలి యుత్తమతత్త్వమును నేఁటి వైశిష్ట్యమును మిశ్రము కావించి మనమొక ప్రశస్తమైన పద్ధ తిని బ్రతిష్ఠించుకొనుట కది వీలుకలిగించును.

లాక్షణికులు ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు మూఁడింటిని గావ్యహేతువులుగాఁ బరిగణించిరి. ప్రాచీనాంధ్రకవులు పలువురిలో

నీ మూఁడు హేతువులు సమభాగములుగాఁ గనిపించును. అవి యట్లు లేనివారుకూడఁ గొంత తెప్పుమండి యుందురు. వారుకావించిన రచనలే యంతగా వ్యాప్తినొందక యిప్పటికిని దాళపత్రగ్రంథ భాండాగారములందే యప్రకటితములుగా నుండి పోయినవి. ప్రతిభావంతులైన రచయిత లెప్పుడు నెల్లదేశములయందు నుందురు. భగవద్దత్తమైన యీప్రతిభకుఁదోడు వారితర హేతువులకుఁగూడఁ గిరవులు కాఁజాలినచో వారిరచన లుదాత్తములును సహృదయజన స్తుతిపాత్రములునై యలరారును. ఆ మూఁడును బుష్కలముగాఁ గలిగిన వారై యుండుటచేతనే ప్రాచీనుల సాహిత్యము పఠితల బుద్ధిహృదయములు రెండింటిని రంజించు శక్తితో శోభిల్లి యుత్తమప్రమాణముల కాదర్శములు కాఁజాలినవి. అందుచే సాహిత్యమున నుత్తమప్రమాణములు నెలకొల్పవలెనన్న రచయితలు వానిని సమకూర్చు హేతువులనన్నిటిని సంపాదించుటకు యత్నము చేయవలసియున్నది. కారణములు సమగ్రములై యుండుచోఁ గార్యములు కూడ సౌందర్యసామగ్ర్య సంశోభితములై యలరారుటలో సందేహముండదు.

పూర్వాంధ్రకవులు లక్షణగ్రంథములతో నధికమైన పరిచయము కలవారు. వారుఁదలి లక్షణములను సానుభూతితోఁ బరికించి తదనుగుణముగాఁ గావ్యరచన కావించెడివారు. ఈ లక్షణాను సరణము వారి స్వాతంత్ర్యము నరికట్టి కొన్నియెడల వారిప్రతిభకుఁ గూడఁ బ్రతిబంధకముగా నుండెనని తలంచువారు కొందఱున్నారు. కాని వారు కేవల లక్షణదాసులు కారు. ప్రతిభానుగుణముగఁ లక్షణములను, లక్షణానుగుణముగాఁ బ్రతిభను మలచి కావ్యరచనకుఁ గడఁగినవారు. అందుచే వారి కావ్యములందు

లక్షణములకుఁ బ్రతిభ, ప్రతిభకు లక్షణములు మెఱుఁగులు దిద్దుచుండెను. శ్రీనాథయుగమునందలి కావ్యములను, తరువాత వెలువడిన ప్రబంధములను బరికించిన నీ విషయము తేటతెల్లము కాఁగలదు. ప్రబంధకవులు తమ రచనలలో సంస్కృత మహాకావ్యములయు నాటకములయు లక్షణములు జోడించి వానికొక వైలక్షణ్యము కలిగించిరి. పద్యములు వ్రాయునప్పుడు వృత్తవైవిధ్యమును బాటించుటచేతను, నడుమనడుమ సుందరములైన వచనభాగములను జొప్పించుట చేతను, వారు తమ కావ్యములందొక నూతనత్వమును వెలయించిరి. కాని వారందఱు ననుసరించిన లక్షణమొక్కటియే యగుటచే వానియందుఁ బ్రతిభాపార్థక్యముతో పాటు ధర్మసాధారణ్యము కూడఁ గొంత గోచరించుచుండును. నియమబద్ధతలో నిట్టి సమానత్వముండక తప్పదు. దాని నొక దోషముగాఁ బరిగణించుటకంటె దానిపై పరివేషమువలె ప్రత్యగ్రప్రభలు వెదజల్లు ప్రతిభాతిశయమును బరికించి ప్రమోదమందుట మంచిది. అనంతరప్రబంధయుగమునందలి కవులు కొందఱు లక్షణములకే ప్రాధాన్యమొసంగి అనుకరణమయములైన కావ్యములు రచించినమాట నిజమే. అది వారి ప్రతిభాలోపమునకు నిదర్శనము. ఈ ప్రతిభాలోపమే వాని ప్రచారమునకును గొంతయాటంకము కలిగించినది.

క్రీ. శ. 16వ శతాబ్ది ఆరంభము వఱకును దెలుఁగున వెల్వడిన గ్రంథములు పెక్కులు సంస్కృతమునుండి అనువదింపఁబడినవే. కవిత్రయమువారు పంచమవేదమైన భారతము నాంధ్రీకరింప మారన మార్కండేయపురాణమును పోతనమహాభాగవతమును దెనిఁగించిరి. శ్రీనాథుఁడు నైషధమహాకావ్యమును పూర్తిగా ననువదించుటయేకాక హరవిలాసమున కుమారసంభవమందలి గౌరీకల్యాణభాగమును సం

గ్రహణముగా నాంధ్రీకరించెను అతని కాశీఖండ భీమఖండములు స్కాంద
ననువాదములే. దండిదశకుమార చరిత్రమును కేతన చంపూకావ్య
ముగా ననువదించెను. వాల్మీకిరామాయణము తెలుఁగున భాస్క
రాదులచే చంపూరూపమును బుద్ధారెడ్డిచే ద్విపదరూపమును బొంది
నది. విద్ధసాలభంజిక, శాకుంతలము, ప్రబోధచంద్రోదయము అను
సంస్కృతనాటకములు తెలుఁగున ప్రబంధరూపమున ననువదింపఁబడి
నవి. ఇట్లు సంస్కృతగ్రంథములను తెలుఁగున కనువదించుటలో
తెలుఁగు కవులు చూపిన కౌశలము ప్రశంసాపాత్రమైనది. వారి
అనువాదవిధానమును రెండు విధములుగా విభజింపవచ్చును. కవి
త్రయము వారి అనువాదము కథానువాదము. వారు మూలమునం
దలి కథాసూత్రమును మాత్రము విడువకుండఁ దమ కనవసరములని
తోఁచినచోట్లఁ గొన్ని భాగములను తగ్గించి, అవసరములని తోఁచిన
చోట్లఁ గొంతభాగమును బెంచి, అనౌచిత్యములను బరిహరించి భార
తానువాదమును సాగించిరి. వారి భారతము పేరునకనువాదమే
యయ్యు నిజమునకు స్వతంత్రకావ్యమువలెనే భాసించును. శ్రీనాథా
దులయాంధ్రీకరణము భావానువాదము. వారును ఎడనెడఁగొన్ని
మార్పుచేర్పులు చేయుచు ననౌచిత్యములను బరిహరించుచు అనువా
దము సాగించిన మాట నిజమేయయ్యు భారతకవులంత స్వాతంత్ర్యము
వహించియుండలేదు. వారు మూలమునందలి కథను గాని భావము
ములనుగాని యెక్కడను విడిచివేయక వానిని స్వాయత్తీకరించుకొని
తమ భాషకు జాతీయమునకు ననుగుణముగా సమర్థతతో ననువదించి
యుండిరి. మూలగ్రంథముల ప్రధానతత్త్వమునకెచ్చటను భంగము
కలిగింపకుండుట, వీలైనచో మూలమునకుఁగూడ మెఱుఁగులుదిద్దుట
తెనుఁగుకవుల అనువాదపద్ధతియందలి ప్రధానగుణములు. అనువాద
విషయమున వారు ప్రతిష్ఠించిన ప్రమాణము ననన్యసాధ్యమైనది. అందు

చేతనే రసనిధానములని చెప్పఁదగిన సంస్కృత నాటకములను
పూర్వాంధ్రకవులనువదించి యుండలేదే అను విచారము తెలుఁగు
వారికి మిగిలిపోయినది. మూలములను మఱపించునట్లనువాదములను
వెలయించువారి విజ్ఞానము శ్లాఘాలంఘనజాంఘికమైనట్టిది.

వస్తువు నెన్నుకొనుటలోఁ గూడ పూర్వులు సంస్కృత లక్షణ
మునే యనుసరించిరి. ప్రఖ్యాతమైన యితివృత్తమును గ్రహించి దానిని
వర్ణనాదులతోఁ బెంచి కావ్యమును సంతరించుట ప్రబంధకవులపరిపాటి.
ప్రబంధయుగమునందలి కృతులలో నొక్క కళాపూర్ణోదయము
మాత్రమే కల్పితవస్తుకము కానవచ్చుచున్నది. దానినిరచించిన పింగళి
సూరనార్యుఁడు తాను దరువాత రచించిన ప్రభావతీప్రద్యుమ్నములో
మరలఁ బ్రఖ్యాతవృత్తమునే స్వీకరించినాఁడు. భట్టుమూర్తి కేవల
కల్పనాకథలను కృత్రిమరత్నములని నిరసించినాఁడు. అది ఆ కాల
మున ప్రచారమందుండిన సాధారణాభిప్రాయము కావచ్చును. అందుచే
సంఘమునుండియో లోకమునుండియో వస్తువును సేకరించుట అప్పుడు
చాలనరుదు. పాల్కురికి సోమనాథుఁడు లోకమునుండి కొన్నికథలు
గ్రహించి తనకావ్యములలోఁ జేర్చెను. కాని యా సాంప్రదాయ
మాతనితోనే యాగిపోయినది. వర్ణనలయందత్యాసక్తిగల ప్రబంధ
కవులు కథావిషయమున నంతగా శ్రద్ధ వహింపలేదని కొందఱు విమ
ర్శకులందురు. అది యథార్థమే. వారు వర్ణనమున కొసంగినంత
ప్రాధాన్యము కథాకల్పనమున కొసంగియుండలేదు. ఈ విషయమునను
గూడ నపవాదమని చెప్పఁదగిన దొక్క కళాపూర్ణోదయమే. కాని
కొన్ని పూర్వకావ్యములలోఁ జక్కనిపాత్రచిత్రణముతోడను, సన్ని
వేశ కల్పనముతోడను, ఉపదేశప్రదానముతోడను గూడి పద్యరచిత

ములయ్యు నిప్పటి కథానికలకెందును దీసిపోని రమణీయములైన కథ లక్కడక్కడ కానిపించును. వానిని జూచినప్పుడాకవులు కథాకల్పనము నెడ నెందుకుపేక్షవహించిరాయను విచారము కల్గుచుండును. శ్రీనాథుని గుణనిధికథ, రామకృష్ణుని నిగమశర్మకథ, రాయలవారి మాలదాసరికథ మున్నగునవిందుకుఁ దార్కాణములు.

పూర్వకవుల కావ్యములందలి నాయకులు పలువురు ధీరోదాత్తులు. వారు రాజులో రాజకుమారులో తత్సదృశులోనై యుందురు. దీనినిబట్టి యందలి నాయికలసంగతి మన మూహింపవచ్చును. సామాన్యప్రజలనుండి ప్రబంధకవులెవ్వరును నాయికానాయకులను గ్రహించియుండలేదు. కావ్యముపదేశాత్మకమై కూడ నుండుట వాంఛనీయమగుటచే లాక్షణికులుత్తమ ప్రకృతికులే నాయకులుగా నుండఁదగుదురని శాసించిరి. మఱియు శృంగారాది రసములు లోకోత్తర నాయకాశ్రయత్వముచేతనే సమ్యక్పరిపోషము నందుట కవకాశముండుటయు వారట్లు నియమించుటకు హేతువు. ఏలయన నవి నీచాశ్రయములగుచో ధర్మహీనములగుటయు తద్ద్వారా కావ్యము దుర్నీతిబోధకమగుటయు సంభవించును. అందుచే పూర్వకావ్యములలో సామాన్యప్రజాప్రవృత్తి వర్ణనకంతగా నవకాశము కలుగలేదు. నిరంకుశోపాఖ్యానము, విప్రనారాయణ చరిత్రము మున్నగు ప్రబంధములలో సాంఘికచ్ఛాయ లెక్కువగాఁ గనిపించుమాట సత్యమేకాని అట్టి వాని సంఖ్య చాల తక్కువ. ప్రబంధకవులు రాజాంతఃపురముల నుండి సామాన్యగృహముల కెన్నఁడును దిగియుండలేదను. నపవాదమున్నను వారు సంఘమునందలివ్యక్తులే కావున తమ కావ్యములలోఁ బరోక్షముగా సామాన్య ప్రజాజీవితప్రవృత్తులను గూడ నెడనెడ తడవియుండకపోలేదు. దీనికి రాయలవారి ఆముక్తమాల్యద చక్కని నిదర్శ

నము. అది యానాఁటి సాంఘికాది పరిస్థితులకు దర్పణమువంటిది.

పూర్వాంధ్రకవులు రసపోషణమున సిద్ధహస్తులు. కావ్యములలో శృంగారవీరములలో నేదో యొకటి అంగిరసముగా నుండవలెనను లక్షణము ననుసరించి వారు వానినే, అందును శృంగారరసమునే, తమ కావ్యములం దెక్కువగా వర్ణించియుండిరి. ఇతర రసములు వారి కావ్యములలో నంగములుగా మాత్రము గోచరించును. భారతాది విస్తృతగ్రంథములలో నాయాసన్నివేశములను బట్టి సర్వరసముల సముచిత పరిపోషమును గనిపించును. కాని శ్రీనాథుని తరువాత వెలువడిన కావ్యములలో శృంగారరసపోషణమునకే ప్రాధాన్యము హెచ్చు. శృంగారరసము నౌచిత్యమర్యాద నతిక్రమింపకుండ సభ్యముగా వర్ణించుట కొంచెము క్లేశకరమైన విషయము. ఏలయన దానికి రచయితను గూడఁ బరవశునిఁ జేసి నిగ్రహాభావ్యునిఁ గావించుగుణమున్నది. తెలుఁగు కవులలోఁ గవిత్రయము వారిశృంగారమును వర్ణించుటలో నద్భుతమైన నిగ్రహము ప్రదర్శించిరి. నన్నయ నాయకాదుల సంగమేచ్ఛను 'నిజహృదయం బెఱిఁగించె' 'నిజాభిప్రాయం బెఱిఁగించె' అనిగాని చెప్పునుగాని వాచ్యముగా నెచ్చటను బ్రకటింపఁడు. తిక్కన యెఱ్ఱనలు నాయికావర్ణనము గావించునప్పుడు సాముదాయిక సౌందర్యమునే వర్ణింతురుగాని ప్రత్యంగ వర్ణనము గావింపరు. వారు రచించిన సంభాషణములును బరమౌచిత్యభాసురములై ప్రశంసాపాత్రములుగా నుండును. నాచనసోముఁడూర్వశీనరకాసుర సంభాషణమున శృంగారమును విచ్చలవిడిగావర్ణించి కొంత నిగ్రహహీనత ప్రదర్శించినాఁడు. శ్రీనాథుని కావ్యములందును, ప్రబంధములందును శృంగార రసవర్ణన విషయమున సనిగ్రహము కొంతతక్కువగనే కనిపించును. దానికైన హేతువులలోఁ దత్కాలప్రభావముకూడ నొకటి. కాని

వారు చాలవఱకు ధర్మ్యమైన శృంగారమునే వర్ణించిరి. దక్షిణాంధ్ర యుగమున వెలసిన ప్రబంధములలో శృంగారరసవర్ణనమున నిగ్రహ లోపము పూర్తిగా గోచరించును. వారు కావ్యప్రయోజనములలో నానందమునకే కాని యుపదేశమున కంతగాఁ బ్రాముఖ్య మొసంగి యుండలేదు. అందుచేతనే అప్పుడు తారాశశాంకవిజయము, అహల్యా సంక్రందనము, సారంగధరచరిత్రము మున్నగు కావ్యములుదయించి నవి. ఈ యుపదేశ రాహిత్యముచేతను, శృంగారవిశృంఖల వర్ణనము చేతను అప్పటికావ్యములు శబ్దార్థసౌందర్యభూయిష్ఠములయ్యు నుదా త్తతాహీనములుగాఁ గానిపించును.

కావ్యములం దష్టాదశవర్ణన లుండవలెనని లాక్షణికులనియ మము. పురాణములం దీవర్ణనములన్నియుఁ గనిపించునుగాని యవి నాతివిస్తృతములుగానుండును. ఆంధ్రకవులలో నీవర్ణన ప్రియత్వము మొట్టమొదట నన్నెచోడునిలో హెచ్చుగాఁగనిపించును. శ్రీనాథుఁడు నైషధము నాంధ్రీకరించిన పిమ్మట నందలివర్ణనలను మనసులోనుంచు కొని తరువాతి కవులు తమ కావ్యములలోఁగూడ నట్టి వర్ణనలను సాగించిరి. ప్రబంధకాలమున కది అపరిహార్యమైన ఒక లక్షణమే యైపోయినది. కొంచెమించుమించుగా నీవర్ణనలన్నియు నన్ని ప్రబం ధములందును గోచరించును. అవి పెక్కుతిశయోక్త్యుత్ప్రేక్షాదులతోఁ గూడియుండుటచే వానిని జదువుచున్నప్పు డొక స్వప్నప్రపంచమున సంచరించుచున్నట్లు కనిపించును. అందుచేతనే కొందఱు విమర్శకులు ప్రబంధకవు లైహికప్రపంచమునువీడి గంధర్వనగరవిహారము కావింతు రని చెప్పుచుందురు. కాని అందలి అతిశయోక్తులను దొలఁగించి పరిశీలించినచో వారి సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలనపాటవము సర్వతో ముఖమై యాశ్చర్యము కలిగించును. ప్రబంధముల ప్రౌఢిపరిపాకమున

కాలంబము లీవర్ణనలే. వానియందాకవుల పాండిత్యమొకవంక, పద ప్రయోగపాటవ మొకవంక, భావనాశక్తియొకవంక ప్రత్యక్షములై పఠితలకు వారియెడ నపారమైన గౌరవభావమును రేకెత్తించును. వారి భావనాసంపద యమోఘమైనది. 'కవికాననిచోఁ గవి గాంచునే కదా' యనుసూక్తి వారియెడసార్థకము. ఈ భావన క్రమముగా సన్నగిల్లి అనంతర ప్రబంధకవులలో ఊహాతిశయముగా పరిణమించినది.

పూర్వాంధ్రకవులు కావ్యజీవితమైన ధ్వని సౌందర్యమును పూర్తిగా గుర్తించినవారు. తిక్కన సంభాషణలు పెక్కు ధ్వని గాంభీర్యమున కిరవులై రమ్యములుగా నుండును. నాచనసోమనాథుని ఉత్తరహరివంశమున నుక్తిచమత్కారము సర్వతోముఖముగా గోచరించును. ప్రబంధకవుల రచనలలో ధ్వనిగాంభీర్యమో, ఉక్తిచాతుర్యమో, అలంకారపాటవమో కనిపింపని భాగమేయుండదు. వసుచరిత్ర ఆమూలాగ్రము ధ్వన్యలంకార శోభితమై ప్రబంధయుగమునకొక వన్నెవాసి చేకూర్చినది. దక్షిణాంధ్రయుగమునందలి కావ్యములకుఁ దలమానికమైన విజయవిలాసమున శబ్దార్థాలంకారసౌష్ఠవముతోపాటు వ్యంగ్యచమత్కారమును విరివిగా గోచరించుచుండును. పూర్వకవులెల్లరు కావ్యకళామర్మజ్ఞులనుటకు పెక్కుదాహరణములు చూపవచ్చును.

ద్విపదకావ్యములును తిక్కన నిర్వచనోత్తర రామాయణమునుదప్ప పూర్వాంధ్రకావ్యములన్నియు చంపూకావ్యములే. గద్యపద్యమిశ్రితములైన చంపూకావ్యములు చదువునప్పుడు గద్యమయములో కేవలపద్యమయములో నైయుండు కావ్యములను పఠించునప్పుడువలె విసుగుదల జనింపదు. నడుమనడుమ చేర్పఁబడు గద్యభాగములు పఠితకువైవిధ్యముచే నుత్సాహాతిశయము కలిగించుచుండును. పురాణమునందలి వచనములు విషయప్రధానములై మిక్కిలి

సరళముగనుండును. ప్రబంధముల నాటికి వచనరచనాక్రమము మిక్కిలి మార్పు చెందినది. అందలి గద్యము లర్థశబ్దాలంకార భూయిష్ఠములై రచయితల అపార పాండితీ సౌందర్యమున కాటపట్టులై అత్యంత ప్రౌఢములుగానుండును. ఛందోరహితత్వము తప్ప నానికిని అందలి పద్యములకును భేదమంతగా నుండదు. ఈ వచనములు ప్రాయికముగా వర్ణనా పరిపూర్ణములై బాణభట్టువచనమును దలఁపునకుఁ దెచ్చుచుండును.

పూర్వాంధ్రకవులెల్లరు విద్వత్కవులు. వారెంతకవులో అంత పండితులు. అందుచే వారిరచన లక్షణానుగుణమై నిర్దుష్టముగానుండును. అచ్చ తెనుఁగు కావ్యములను వ్రాసినవారు తప్ప మిగిలినవారు సంస్కృత పదప్రయోగాసక్తినే మెక్కువగాఁ బ్రకటింతురు. వారి రచన సమాసజటిలమై పండితజనైకవేద్యముగా నుండును. అచ్చటచ్చట సంభాషణములను రచించుపట్ల వారు చక్కని తెలుఁగు పలుకులను గూడ వాడుచుందురు కాని అట్టిఘట్టములు చాలతక్కువ. పురాణకవులు శబ్దార్థములకు సమానమైన ప్రాధాన్య మొసంగిరి. ప్రబంధములలో నర్థముకంటె శబ్దమే యెక్కువ ప్రాభవము వహించినట్లు కన్పించును. దక్షిణాంధ్రయుగమునాటికా శబ్దాభిమానము మఱింత హెచ్చినది. శైవకవులు దేశికవితను జానుతెనుఁగును బలువిధముల ప్రశంసించియుండిరి. వారి కావ్యములందుఁగూడ సంస్కృతపద ప్రయోగ మధికముగనే గోచరించును కాని వారు కొంతస్వాతంత్ర్యము వహించి తమనాఁడు వ్యవహారమందున్న పలుకుబడులను జాతీయములను నైరి సమీపములను విరివిగా వాడుటకు యత్నించియుండిరి. భాషావిషయమున వారు వహించిన యీ స్వాతంత్ర్యమే వారి కావ్యముల ప్రశస్తిప్రచారములకుఁ గొంతవఱకంతరాయము కల్పించినవి. మొత్తముమీఁద పూర్వాంధ్రకవులు కావ్యనిర్మాణమునందు వలెనే

భాషాప్రయోగము నందును లక్షణానుగుణ్యమునే యెక్కువగా ప్రదర్శించిరి.

సంస్కృతలాక్షణికుల ననుసరించి పూర్వాంధ్రకవులు పలువురు కావ్యమునకు సద్యఃపరనిర్వృతితోపాటు పదేశప్రదానమును గూడ ప్రయోజనముగా భావించిరి. అందుచే వారి రచనలందు రసవత్త్వోపదేశవత్త్వములు రెండును సమానాంతరముగా గోచరించుచుండును. ఆదికవి నన్నయ కావ్యము విశ్వశ్రేయస్కరముగా నుండవలెనని చెప్పుట యిందుచేతనే. "నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్" "కృష్ణద్వైపాయనుఁ డర్థిలోక హితనిష్ఠంబూని కావించె ధర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్" "బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్" మున్నగు వాక్యములుకూడ నీవిషయమునే సూచించు చున్నవి. పురాణవాఙ్మయము నీతి తత్త్వప్రధానమని వేఱుగాఁజెప్ప నక్కఱలేదు. ప్రబంధములందుసైతము సూక్ష్మముగాఁ బరిశీలించి నచో నుపదేశప్రదానము సువ్యక్తమగును. మనుచరిత్ర జితేంద్రియత్వ ప్రాధాన్యము, ఆముక్తమాల్యద, పాండురంగమహాత్మ్యము భక్తి ప్రాధాన్యమును, పారిజాతాపహరణ నుహంకార ప్రశమనమును బోధించుచున్నవి అనంతర ప్రబంధయుగమునందు మాత్రముపదేశమునకు ప్రాధాన్యము పూర్తిగా సన్నగిల్లినది. అప్పటికవులు పలువురు "తస్మైనమః స్వాదుపరాఙ్ముఖాయ" అనుభావమును గ్రోడిచేసి నట్టివారే. ఆనందమొక్కటే వారి యేకైకలక్ష్యము. శైవకవులు పలు విషయములందు స్వతంత్రులయ్యుఁ దమకావ్యములందు మతమునకు తత్సంబంధితత్త్వమును ప్రచారముచేయుటకు నెక్కువ ప్రాముఖ్యము నొసంగిరి. మొత్తముమీఁద నేకార్యమొనరించినను లౌకికోప

యోగముతో పాటాముష్మిక ప్రయోజనమునుగూడ మఱిపెట్టుట పూర్వుల పరిపాటి.

ఈ విధముగా పూర్వాంధ్రకవులు కలుపురు రసవస్తు నాయకాదులయందును ఇతర కావ్యనిర్మాణవిశేషములందును సంస్కృతలాక్షణికులు సూచించిన మార్గమునే యనుసరించిరి. ఇట్లని వారు కేవలమనుంధానుకరణము కావించిరని భావింపరాదు. ఆ లక్షణముల ననుసరించుచునే కొన్ని విషయములందు స్వప్రతిభోచితముగా నూత్నమార్గములను వెలయించిరి. అనఁగా నొకనియమమునకు లోఁబడియే వారు స్వాతంత్ర్యము ప్రకటించి యుదాత్తము ప్రశంసనీయమునైన సాహిత్యమును సృజించిరి. వారి కావ్యము లిహమున నానందము చూఱలిచ్చి పరమున మోక్షమునకు దారిచూపు పాటవమునకు పేరుపొందినవి. వారిలోఁ గొంద ఱాముష్మికమును విడిచి యైహికమునకే ప్రాకులాడినవారు లేకపోలేదు. కాని అట్టివారిసంఖ్య చాలస్వల్పము. ప్రాచీనులల్పసిద్ధితో తనివిచెందినవారు కారు. ఉత్తమసిద్ధి సముపార్జనమునకై వారున్న శక్తియంతయు ధారవోసి కృతకృత్యులుకాఁజాలిరి. వారి యడుగుజాడ లాంధ్ర సారస్వతమున కుత్తరోత్తరాభ్యుదయ పరంపరల నావహించుఁగాక.

---

# శశివింశతి

శ్రీ కనగన నరసింహస్వామి.

1

తమమను పూర్ణసాగరము ద్రావు నగస్త్యుఁడు, సర్వజీవలో
కమునకు భోగభాగ్యము లఖండముగా నిడు రాజు, కైరవ
ప్రమదల మోములం గలతఁ బాపు భుజంగుఁడు, చంద్రకాంత బృం
దముల గరంచు భావుకుఁడు తారకనాథుఁడు మిమ్ముఁ బ్రోచుతన్ !

2

శరనిధిశుక్తిగర్భమున జన్మముగాంచిన ముత్తియంబు, ని
ర్జరులకు నిత్యమైన మధుశాల, చకోరవిహంగమ ప్రపా
శరణము, సస్యసంతతుల సాకి వెసం బెఁగించు మందు, చం
ద్రుఁడు భవత్సుఖంబుల ననూనముగా వెలయించుఁగావుతన్ !

3

తెలివలిపంబు లంగముల దీరిచి, వేనలులందు మల్లెలన్
దలముగ నింపి, చిన్నగవుతళ్కుల వెన్నెలఁ జిమ్ముచుం బ్రియ
స్థలములు చేరఁబోవు నభిసారికలం దన శీతగౌరర
శ్మలు సిగిడించి నాకు శశినాయకుఁడు మిమ్ముల సాకుగావుతన్!

4

శ్రీపుర మేశ కేశకుజశృంగము పూచిన పూలగుత్తి, ల
క్ష్మీపతి మోమునం జలువచిందెడు వామవిలోచనంబు, భూ
మీపరమానుబింబము ప్రింగు మణీముకురంబు, మానిసే
త్రోపరిహర్ష బాష్పక మనుష్ణమయూఖుఁడు మిమ్ము నేలుతన్ !

5

విరహితమానినీతతికి వేయివెలుంగులవాఁడు, జారతా
పరులకు చోరచక్రియుగపాళికి గర్భవిరోధి, రాగసం
గరవశదంపతిం గలిపి గౌరవమొంగొను రాయబారి, పం
కరుహారిపుండు మీ హృదయకాంక్షితముల్ నెఱవేర్పుగావుతన్ !

6

మూఁడుజగంబులున్ నిదురమున్గి విరామము నొందుచుండ, నే
మోడక యర్ధరాత్రమున నుజ్జ్వలవేషము దాల్చి, చుక్కపూ
బోఁడులమధ్య నోలగము పొంది ధరాపతిభంగి నాడుచుం
బాడుచుఁ గాలముం గడపు పార్వణచంద్రుఁడు మిమ్ము నేలుతన్ !

6

నీలవియన్మహాతలము నిర్మలమైన సరోవరేణ్యముం
బోలఁగ, తారకాతతులు పూచిన తామరపూలచాలుగాఁ
గ్రాలఁగ, చంద్రికాలహరికారుచిరోర్ముల రాజహంసమై
తేలి విహారమున్ నెఱపు దివ్యుఁడు చంద్రుఁడు మిమ్ముఁ గాచుతన్ !

8

జలదపథోదధిం బొడము స్వాదుసుధాకలశంబు, ప్రాక్సతీ
తిలకము ఫాలదేశమున దిద్దెడి కుంకుమబొట్టు, శైలభి
న్నిలయమతల్లికాగ్రమున నిల్పు సువర్ణఘటంబు, రిక్కచె
ల్వలగమికాఁడు మీ మధురవాంఛలు సర్వము దీర్చుగావుతన్ !

9

విరహితభామినీజనము వేయితెఱంగుల దూఱ దుర్యశః
స్ఫురణము పేరి లాంఛనము పూన కళంకితుఁడైనవాఁడు; తా
మరసపతివ్రతామణులు మాటికి రోయుచునుండ భీతిమైఁ
సురిగి యమాసయందుఁ దలసూపని చంద్రుఁడు మిమ్ము నోముతన్ !

10

పడఁతుల చిత్తవీథికలఁ బంచశరాగ్ని రగిల్చి తద్గతిం
బొడమినధూమ మంబరము పొందినవాంబుదముల్ సృజింప; నం
దెడనెడ మాటుచెందివెలిపేది బయల్పడు పాలసంద్రపుం
బుడుతఁడు మీకు సౌఖ్యములు పూర్ణముగా విరజిమ్ముఁ గావుతన్ !

11

గాదిలిబావ శౌరి ప్రళయకాలమునందు జగంబులెల్ల న
మ్మోదమునూన ముగ్ధశిశుమూర్తి ధరించి సముద్రశయ్య సి
ద్రాదరుఁడైన చంద మపహాస్యముగా నొనరింప నెంచి; య
భ్రోదధియందు పండుకొనియుండు శశాంకుఁడు మిమ్ముఁ బ్రోచుతన్ !

12

సుతుఁగనినంతకా దతనిఁజూచి జనంబు స్తుతించునప్పుడే
పితృమతి సంతసించునను పెద్దలవాక్యము నిశ్చితంబుగాన్
సుతుని నుతించు లోకమునుజూచి కరంబును బొంగు నాపగా
పతిపితగాంచి గర్వపడు పార్వణచంద్రుడు మిమ్ము నేలుతన్ !

13

మాసిన చీరవీడి యసమానసితాంశుకమున్ ధరించి పే
రాస శచీహృదీశవిమలాశఁ బ్రతీక్షబొనర్చు శర్వరీ
వాసకసజ్జికన్ దరియవచ్చి కరంబులుసాచి మర్మముల్
రోసి కరంచు చంద్రముఁ డురుప్రమదంబులు మీకొసంగుతన్ !

14

దివిజులు పట్టణంపు మొగదీసుచు దీపము, సౌరబాలికా
నివహము లాటలాడుకొను నిగ్గులబంతి, స్వసౌధమెక్కి భూ
భువనముఁ జూచి మెచ్చు శచిఫుల్లముఖాంబురుహంబు, రోహిణీ
ధవపరిపూర్ణబింబము సదాభవదర్థము లిచ్చుఁగావుతన్ !

15

ముందు వియన్నదీకుముదముగ్ధల దేరిచి, కన్నుదోయికిన్
విందొనరించి, పైనపృథివీసరసీసరసోత్పలాంగనా
తుందిలమానముం దిగుచు ధూర్తుఁడు, దక్షిణనాయకుండు, పూ
ర్ణేందుఁడు మీకు భోగము లహీనముగా దయసేయుఁ గావుతన్ !

16

కలశసముద్రము దఱువఁగా బొడసూపిన వెన్నముద్దయై
బెళుకుల నీను సభ్రమణిభిత్తిక దోఁచిన భూమిగోళమై
తిలకము దిద్దికొన్ మఘవుదేవి గ్రహించిన నిస్తులద్దమై
వెలుఁగులు జిమ్ము పూర్ణశశిబింబము మిమ్మలరించుఁగావుతన్ !

17

తామసదుర్వనిం దునుము దారుణమైన లతాంతవిభ్రమ ము-
ద్దామతమోనరాదముఖధామ వినిర్గతదంష్ట్ర యామినీ
కామిని కొప్పునం దుఱుము కమ్మనిగేదఁగి పువ్వురేక, శ్రీ
సోముని రేఖ, మిమ్ము సుఖసోమరసంబులు గ్రోల్చుఁగావుతన్ !

18

తన సహజన్మ లక్ష్మి మురదానవభేది భుజాంతరంబు నం-
దునికిని బొందఁగాంచి స్వకులోన్నతి నిల్పఁగ నిశ్చయించి, రు-
ద్రుని తలమీఁద నెక్కి బహుధూర్జటికాలతికాల తాంతసా
వనతనుగాంచు శీతరుచిబాలుఁడు మిమ్ములఁబ్రోచు గావుతన్ !

19

కలువమెఱుంగు గుబ్బెతలఁ గౌగిటఁజేర్పఁగ సాహసంబుతోఁ
గోలఁకుల నీరిలో నుఱుకు గూఢచరుండు, పసిండికోరలన్
దోలఁకు సుమాసవంబులను దోచి నెలంతల మూర్ద్ధమోముల-
బులకలు జేర ముద్దుగొను పూర్ణసుధాంశుఁడు మిమ్మునోముతన్ !

20

శరకథమెక్కి, షట్చరణశూరులు కోకిలవందిమాగధ
ప్రకరము వెంటరా, పథికభామలఁ గొట్టఁగనేఁగు పుష్పసా-
యకు నడుమంతరంపు సిరికద్దమరేయిని బట్టు మౌక్తిక
ప్రకటసితాతపత్రము ముదుభర్త భరించుత మిమ్మునెప్పుడున్ !

(సూర్యశతకమును స్మరించి-)

\- సమాప్తము -



ఓం

# శ్రీ కాళిదాసు — ధర్మశాస్త్రవిజ్ఞానము.

(విద్వాన్ శ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి)

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా"*

విశ్వకల్యాణమునకు "ధర్మము" మూలమగుచున్నది. ధర్మము సత్కీర్తి సంధాయకము. విశ్వములోని విశిష్టకీర్తి విశ్వకల్యాణ కారకము. కాఁగా ధర్మము పరంపరా సంబంధమును బట్టి ప్రపంచ సంస్థితికి మూలకారణమగు చున్నది. దీని వ్యుత్పత్త్యర్థముకూడఁ బైవిషయమునే విశదీకరించుచున్నది. విలోకింపుఁడు. "ధ్రియత ఇతి ధర్మః" "ధర్మ" శక్తిచేతనే యీ చరాచర ప్రపంచము ధరింప (నిలువ)ఁబడుచున్నది. 'ధారణాద్ధర్మఇత్యాహుః' అను సూక్తి కూడఁ బైవిషయమునే సుస్పష్టము చేయుచున్నది.

పైవిధముగా ప్రపంచ మాంగల్యమునకు మహితకారణములైన యీ 'ధర్మములు' శ్రీ కాళిదాస కావ్యములందు సందర్భానుసారముగాఁ బొదుగఁబడియున్నవి. శ్రీ కోలచల మల్లినాథసూరి తన సంజీవినీ వ్యాఖ్యలోఁ బైధర్మములకుఁ జక్కని ప్రమాణ వచనములను శ్రుతిస్మృతి పురాణాదులనుండి యుద్ధరించి చూపి యనేక ధర్మసూక్ష్మములను బాఠకలోకమునకు సుపరిచితము సేసినాఁడు. ఈ వ్యాఖ్యయే లేనిచో కాళిదాస కవితామాధురి యిప్పటికిని మఱుఁగుపడి యుండెడిదేమో.§

శ్రీ కాళిదాసకవి తనకుమారసంభవములోఁ బార్వతీ జననమునకు ముందుగ మైనాక (సోదర) వర్ణనమును జేసినాఁడు. 'భ్రాతృ

---

* తైత్తిరీయోపనిషత్సూక్తి.

§ "భారతీకాళిదాసస్య వ్యాఖ్యావిషమూర్ఛితా ।
ఏషాసంజీవినీ టీకాతామద్యోజ్జీవయిష్యతి ॥" (మల్లినాథసూరి).
చూ. రఘువంశవ్యాఖ్యారంభము.

మతియైన కన్యకయే వివాహమునకు యోగ్యమైనది' అను భారతీయ ధర్మమును పాఠకులకుఁ దెలుపుటకే పై వర్ణనముద్దేశింపఁబడినది. ఈ ధర్మమునకుఁ బ్రమాణమును జూపుచు మన మల్లినాథసూరి తన సంజీవినీవ్యాఖ్యలో

"పితా నజ్ఞాయతే యస్యాః భ్రాతా యది న విద్యతే ।
నోపయచ్ఛేత్తు తాం కన్యాం ధర్మలోప భయాత్సుధీః ॥"

"ఏ కన్యకకు తండ్రి ఫలానా అని తెలియకుండునో, ఏ కన్యకకు సహోదరుఁడు లేఁడో, అట్టికన్యకను బుద్ధిమంతుఁడు వివాహమాడరాదు" ఇది ధర్మానుశాసనము. ఈ ధర్మవిషయమునే కృష్ణయజుర్వేదమంత్రపన్నములోని యొక మంత్రమిట్లు విస్పష్టము సేయుచున్నది."

"అభ్రాతృఘ్నీంవరుణాఽపతిఘ్నీం బృహస్పతే ."

వరుఁడు తనవివాహవేళ, నూతన వధువును వినూత్నముగ విలోకించునపుడు వరుణదేవునిసంబోధించి 'ఈమెకు సోదర సంపద సుస్థిరముగుఁగాక'యని ముందుగాఁగోరును. కాఁగా మన కాళిదాసు సూచించిన యీశ్రుత్యర్థమును స్పష్టీకరించెడి స్మృతిని జూపి మన సూరి పైధర్మమును బాఠకులమనస్సులలోఁ బాదుకొల్పినాఁడు. ఈ స్మృతి ప్రమాణమునే సూరి చూపకున్నచో కాళిదాసుయొక్క భావమగమ్యగోచరమై యీ పాటికంతరించి యుండెడిదేమో? ఎవరికెఱుక? ఈమైనాక వర్ణనమును నన్నెచోడుఁడు (టెంకణాదిత్యుఁడు) కాళిదాస కావ్యమునుండియే గ్రహించి యుండనోపు. ఈ చోడకవి కాళిదాసకృతినుండి యెన్నియో విషయములను స్వీకరించియున్నాఁడు.*

ఇట్టి విశిష్ట ధర్మవిషయములు కాళిదాసకృతులలో లెక్కకు మిక్కిలిగ నున్నవనుటలో నీ క్రింది యుదాహృతులే నిదర్శనములు

* చూ. "కాళిదాస నన్నెచోడకవుల కల్పనారీతులు" అను నా వ్యాసము.

కాఁగలవు. ఈ కవి, పార్వతీదేవిచే పంచాగ్ని మధ్య తపమును జేయించు సందర్భమునఁజెప్పిన శ్లోకభావమిది.

"పార్వతీదేవి తనకు నాల్గువైపులను అగ్ని ప్రజ్వరిల్లుచుండఁగా గ్రీష్మకాల మధ్యందినసమయమునఁ గన్నులు మిఱుమిట్లు గొల్పు చున్న సూర్యునిఁగన్నులు మూయక తదేకధ్యానముతోఁ జూచుచుఁ దపము సేయసాగెను.' (చూ. కు. సం. సర్గ 5. శ్లో 20) ఈ శ్లోక ములో '...చతుర్ణాంజ్వలతాంహ విర్భుజాం...' అని నాల్గు అగ్నులే పేర్కొనఁబడినవి. ఈ నాల్గు అగ్నులమధ్యను నిలిచిచేయు తపము పంచాగ్నితపము కాఁగలదా? అను సందేహము జనించును. కాని 'సూర్యుఁడుకూడ నొకయగ్నియే' అను విషయమును

'అగ్నిస్సవితా । సవితైవాగ్నిః'

అను శ్రౌతవచనము స్పష్టముచేయుచున్నది. ఈ శ్రౌతవచనార్థమునే మనమహాకవి పంచాగ్ని మధ్యతపస్సంధర్భమున మనకుఁ దెలిపినాఁడు. ఇంతియేకాక యిటనింకొక విశేషముకూడఁ గలదు. 'గ్రీష్మకాల ములో పంచాగ్నిమధ్యతపమునే సేయవలయును. వర్షాకాలములోఁ దపస్సు చేయువారు * కేవలభూమిమీఁదనే పరుండవలెను.'అను ధర్మ విశేషమునకుఁ బ్రమాణవచనముగాఁదనసంజీవినిలో'గ్రీష్మేపంచాగ్ని మధ్యస్థో వర్షాసు స్థండిలే శయః', అను వచనమును జూపినాఁడు. సూరిచూపిన యీధర్మనిదర్శనమును బట్టియే మన కాళిదాసు పార్వతి యొక్క వర్షాకాలతపమును వర్ణించుచు

"శిలా శయాంతామనికేతవాసినీం నిరంతరా స్వంతరవాతవృష్టి షు। వ్యలోకయన్నున్మిషితై స్తటిన్మయైః మహా తపస్సాక్ష్య ఇవస్థి తాః క్షపాః ॥" (5-25) గిరిజ వర్షాకాలపు రాత్రులందు విపరీతమైన

* పక్క లేని వట్టినేల.

గాలివాన వేధించుచుండఁగా వట్టితాలపైఁ బఱుండి కఠోరముగాఁ దన తపమును సాగించుచున్నది. ఇట్టి యీమె కఠోరతపమును దమ కన్నులారఁగాంచుచున్నట్లు నాఁటిరాత్రులు తమ మెఱపుదృష్టులతోఁ దత్కఠోర మహాతపస్సునకు సాక్షులై చూచుచున్నవి. ఇట మొదటిపాదమునకుఁ బ్రమాణము "వర్షాసుస్థండిలేశయః" అని చూపఁబడినది. ఇఁక ద్వితీయపాదార్థమునకుఁ బ్రమాణమును జూపుచు సూరిమహాశయుఁడు మానవులకువలె రాత్రులకుఁగూడ నీక్షణశక్తియున్నదని "ఆదిత్యచంద్రావనిలోఽనలశ్చ ద్యౌర్భూమి రాపోహృదయంయమశ్చ। అహశ్చ రాత్రిశ్చ ఉభేచ సంధ్యే సర్వస్య జనాతి సమస్తవృత్తం॥" ప్రతి మానవుని ప్రవర్తనమును సర్వకాలసర్వావస్థలయందును గనిపెట్టుచుఁ బదునాల్గు (భూతములు) మందిసాక్షులు సర్వదా చూచుచుందురు. వారెవరనఁగా సూర్యచంద్రులు 2, అగ్ని 3, వాయువు 4, ఆకాశము, 5, భూమి 6, జలము 7, హృదయము 8, యముఁడు 9, రాత్రి 10, పగలు 11, రెండుసంధ్యలు 13, ధర్మము 14, ఈ పదునాల్గుమంది సాక్షులును అందఱయాశయములను గనిపెట్టుచుందురు. గాన ప్రస్తుతమునఁ బైపదునాల్గింటిలో నొకటియగు 'రాత్రి' యీమె మహాతపమునకు సాక్షిన్మైయున్నది. ఈ విశిష్టవిషయమును మనమహాకవి యిట సందర్భానుసారముగ మనకు బోధించి, పాప భావపంకిలములగు కొందఱ చిత్తములకుఁ బ్రకాశమార్గమును జూపినాఁడు. ఇంతమంది సాక్షులమధ్య బ్రతుకుచున్న మానవుఁడు ఎవరికిఁ దెలియకుండుననుకొనుచు మోహపుఁ బన్నుగడలతో తనవారిని మోసగించుచుఁ దన్నుధన్యమ్మన్యునిగా నెంచి జీవించుట ఎంతటి మూర్ఖతాప్రభావమో కదా! ఎంతటి యుపహాస్యకరకృత్యమో కదా! న్యాయాధికారి సన్నిధిలో నొకనిని హింసించి యాహింసాకృత్యమును నోరులెఱుంగకుండఁ జేసితినని భుజములెగురవేసికొన్నవాని కృత్యము వంటిదే పై

కృత్యముకదా! దీనికి నిష్కృతి? అనుభవము. ఇట్లే యీ కవి పుష్య మాసరాత్రులలోఁ బార్వతీదేవిచే జలములలోనుండి తపస్సుచేయించుటకుఁ బ్రమాణము, మనుస్మృతివచనము.

'అప్సువాసస్తు హేమంతే క్రమశో వర్ధయే_త్తప,'

'హేమంతర్తువులలో నీళ్ళలోనుండి తపస్సుచేయువారి తపము క్రమాభివృద్ధిఁజెందును.'

ఇట్లే మాయావటువు పార్వతితో ప్రసంగించు సందర్భమున "ఓ భామినీ! నీవు పురుషార్థత్రయములో ద్వితీయతృతీయ పురుషార్థములను వీడి మొదటిదగు 'ధర్మ'మునే సేవించుచుండుటచేఁ బురుషార్థములలోనెల్ల "ధర్మమే" శ్రేష్ఠతమమని భావించెదను.' మన కవీశ్వరుఁడు ఈశ్వరపాత్రచే నిట్లు పలికించుటలో నితనియొక్క యీ క్రింది యుపనిషదర్థవిజ్ఞానమే మూలమనుకొందును. చూ (కు. సం సర్గ 5. శ్లో. 38) "ధర్మోవిశ్వస్యజగతః ప్రతిష్ఠా। లోకేధర్మిష్ఠం ప్రజా ఉపసర్పంతి। ధర్మేణపాపమపనుదతి। ధర్మేసర్వం ప్రతిష్ఠితం తస్మాత్ ధర్మం పరమంవదంతి' చూ.(తైత్తిరీయోపనిషత్తు.) ఇట్లే మాయావటువు మాటిమాటికిని బరమేశ్వర నిందసేయుచున్నప్పుడు పార్వతి తనచెలికత్తెతో' చూ.(సర్గ 5 - 83 శ్లో)

"ఓ చెలీ! ఈ వటువింకను నీశ్వర నిందకుఁబూనుకొనుచున్నాఁడు. కనుక నీవు వీనినిటనుండి గెంటివేయుము. కారణమేమనఁగా ఈశ్వర నిందసేయువాని కొక్కనికేకాదు పాపము. ఆ నిందనువినువారికిఁగూడ పాపమంటుకొనును" 'మహాపురుషులకుఁ జెందిన నిందను వినువారు కూడఁ బాపాత్ములగుదురు' అనుటకుఁ బ్రమాణముగా సూరి.

"గురోః ప్రాప్తః పరీవాదో న శ్రోతవ్యః కదాచన।
కర్ణౌ తత్రపిధాతవ్యౌ గంతవ్యంవా తతోన్యతః ॥

"గురు (మహాత్ములగు) జనులకుఁ జెందిననిందను శిష్యులు వినరాదు. చెవులనైన మూసికొనవలెను. లేక మఱియొకచోటికైనఁ బోవ వలెను. ఎట్లైనను శ్రేయస్కామికి గురునిందాశ్రవణము పాపజనకము. గాన దాని నెట్లయిన వినకుండనుండవలెను. ఔరా! మన మహాకవి కావ్యరత్న పేటికలో నెన్నిరకముల ధర్మరత్నములు భద్రపఱుపఁబడి నవో! ఇవన్నియు నధికారులగు పాఠకోత్తములకొఱకే యుద్దిష్టములై యున్నవికదా! శ్రీ మల్లినాథసూరియను తాళముచెవి మనకుఁ బ్రాప్తిం చనిచో నీ కావ్యరత్న పేటికలోని యమూల్యరత్నములు మనకిట్లు లభించియుండెడివికావేమో ?

ఇట్లే యీశ్వరాజ్ఞాదేశముపై రాయబారులుగావచ్చిన సప్తర్షు లకు, ఈశ్వరునికై గిరిజనడుగవచ్చినవారికి * సమాధానముగా హిమ వంతుఁడు తన కన్యకనుగూర్చి యిట్లు పలుకును.

"అమ్మా! ఓ గౌరీ! ఇటురమ్ము. ఇదిగో సప్తర్షులు రాయబారులై యీశ్వరునికిఁ బత్నిగా నిన్నడుగ వచ్చినారు. కనుక నేనందుల కం గీకరించి నిన్ను ఆ (మహేశ్వరునికి) తపస్వికై 'భిక్ష'గా నొసంగదలఁ చితిని. వచ్చినవారు సాక్షాన్మునీశ్వరులు. వరుఁడు విశ్వభర్త. నా గృహస్థజీవితము ధన్యమైనది." చూ. (6-88) ఇట గిరిరాజు తన తనయను ఈశ్వరునికియ్యకొనుటను కాళిదాసు 'భిక్ష' అని పేర్కొను టలోఁ గల ప్రమాణమునుగూర్చి మనసూరిమహాశయుఁడు ఈ క్రింది స్మృతివాక్యముఁ జూపినాఁడు.

---

* "సుహృదస్సమవేతాన్ మంత్రవతో వరాన్ ప్రహిణుయాత్। (వరః) మదర్థం కన్యాంవృణీధ్వం" ఇతివరాన్ ప్రేషయతి॥ చూ. ఆపస్తంబ గృహ్యసూత్రము. ఈ సూత్రమునుబట్టి నేఁటి కట్నములు నాఁడు లేవు. అని చెప్పవచ్చును.

"రత్నాది స్తంబ పర్యంతం సర్వం భిక్షా తపస్వినః"

"తపస్వికిఁ జేసెడు ప్రతిదానము అనగా రత్నము మొదలు చిన్న * మొక్కవఱకుఁ గలవస్తువులలో నేవస్తువైనను 'భిక్ష' క్రిందనే పరిగణింపఁబడును' కనుక మన మహాకవి యీ ధర్మమునుబట్టి యీ తపస్వికిఁ జేయు కన్యాదాన విషయమునుగూడ 'భిక్ష' అని వాక్రొనుటలో నెంతో ధర్మవిషయము ఈ శ్లోకరత్న పేటికలో భద్రపఱుపఁబడినదని చెప్పకతప్పదు. ఈ విషయమును మనము మన సూరిసత్తముని వలననే తెలిసికొనగలిగితిమికదా! పైశ్లోకార్థమునుబట్టి పూర్వఁ కాలమునుండియు వరుఁడు కన్యావరణార్థై తన స్నేహితులను కన్యాదాతవద్దకు "మదర్థం కన్యాంవృణీధ్వం" అని చెప్పిపంపుటయు వారి యభ్యర్థనమున కనుకూలముగా దాత "వృణీధ్వంతస్మైదాస్యామి" అని తనయంగీకారమును దెలుపుట, మనసనాతన సంప్రదాయ మిట మన మహాకవిచేఁ జక్కగఁజూపఁబడినది. ఈ యాచారముచే నాఁటి జనసంఘము నేటి వరశుల్క బాధనుండి ఎంత రక్షింపఁబడినదోకదా ! ఆపస్తంబ మహర్షి మున్నగు సూత్రకర్తలు లోకకల్యాణమునుగోరియే కదా తమసూత్రములలో నిట్టిలోకహితకర సంప్రదాయములను జేర్చినారు.లోకశ్రేయస్సు,సంఘసౌభాగ్యముతద్ద్వారమునలోకకళ్యాణము అనువీనియందు మన మహర్షులకెంత యాసక్తియో ! ఎంత చక్కని మక్కువో! ఇట్లే మనమహాకవి, ఈశ్వరపరిణయ మహోత్సవానంతరమున ఈశ్వరునిచే మామగారికి నమస్కరింపఁజేయును. ఈ సందర్భములో మన సూరిమహాకవి ప్రమాణమును జూపుచు నెవరెవరు నమస్కరింపఁదగినవారో మనకిట్లు తెలియఁజేసినాఁడు.

"ఋత్విక్పితృవ్య శ్వశుర మాతులానాం యవీయసాం ।
ప్రవయాః ప్రథమంకుర్యాత్ప్రత్యుత్థాయాభివాదనం ॥"

---

* చూ. శబ్దరత్నాకరములో 'స్తంబము'

ముందుగా లేచి నమస్కరింపఁదగినవారు ఎవరనఁగా ఋత్విజులు, పిన తండ్రులు, పెత్తండ్రులు, మామగారు, తనకంటెఁ బెద్దవారైన మేన మామలు, వీరికి శ్రేయోభిలాషియగువాఁడు లేచి నమస్కరింపవలెను' ...లోకసంగ్రహమేవాపిసంపశ్యన్ కర్తుమర్హసి "యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః" అను గీతావాక్యములనుబట్టి యెట్టివా రైనను ముందు తరములవారికి, అప్పటివారికిని మార్గదర్శకముగా స్వస్వ ధర్మము నాచరించవలెను" అను ధర్మరహస్యమును దెలుపుటకే మనకాళిదాసు మహేశ్వరునిచే మామగారైన హిమవంతునికి వందనముచేయించినాఁడు. ఇట్టి భారతీయసంప్రదాయములు ఒక్క భారతదేశమునకేకాక ప్రపంచమునకే శ్రేయోదాయకమనుటలో సందేహములేదు. చూ. కు. సం. (సర్గ. 7-శ్లో 54) ఇట్లే "ఈశ్వరుఁడు పునస్సంధానాఽగారమునఁ బ్రవేశించినాఁడు" అను సందర్భమున మన కాళిదాసు 'భూమిపైఁ బక్క (శయ్య) కలకేళీగృహమును బ్రవేశించినాఁడ'ని తెలిపినాఁడు. '...క్షితివిరచితశయ్యం కౌతుకాగారమాగాత్॥' చూ. (కు. సం. సర్గ. 7 శ్లో 94)

ఈ యాచారము (సంప్రదాయము) నకుఁ బ్రమాణమును జూపుచు మనమల్లినాథ యజ్వ ఆశ్వలాయనసూత్రము నుద్ధరించినాఁడు. (7-94)

"అతఊర్ధ్వం అక్షారలవణాశినౌ, అధశ్శాయినౌ, బ్రహ్మచారిణౌస్యాతాం" ఈ విషయమునే ఆపస్తరాలు సూత్రకారుఁడు కూడ "త్రిరాత్రముభయోరధశ్శయ్యా బ్రహ్మచర్యంక్షారలవణవర్జనంచ" అని సూత్రించినాఁడు. అనఁగా వివాహానంతరమున మూఁడురాత్రుల వఱకు ఆ నూత్నదంపతులు ఉప్పు, కారములేని సాత్వికాహారము తినుచుఁ గ్రిందఁబరుండి బ్రహ్మచర్యము సలుపవలెను. ఈ సూత్రార్థ

మునే ఆరోగ్యశాస్త్ర మనఁదగిన కామశాస్త్రమిట్లు విస్పష్టముగా వివ రించుచున్నది.

"అధపరిణయరాత్రౌ ప్రక్రమేన్నైవకించిత్ తిస్సృషుచరజనీషు స్తబ్ధభావాధునోతి। త్రిదినమిహనభింద్యాద్బ్రహ్మచర్యం నచాస్యా హృదయమనురుధ్య స్వేచ్ఛయానర్మకుర్యాత్॥" ఇప్పటి కొంతమంది వరులు ఈ శ్లోకార్థమును దెలియఁదగియుండిరి. "వివాహము నాఁటి రాత్రి వరుఁడు ప్రారంభోత్సవమునకుఁ బ్రయత్నించరాదు. కారణ మేమనఁగా నూతనవధువు వివాహత్రిరాత్రపర్యంతము భావచలనము లేక స్తబ్ధత చెందిన భావముతోనుండును. గనుక నీత్రిరాత్రములలో వరుఁడు బ్రహ్మచర్యవ్రతదీక్షితుఁడు కావలెను. ఇచ్చట నింకొక విశే షము కలదు. కృష్ణయజుర్వేదీయ మంత్రపన్నములలో నొక మంత్రా ర్థమును బట్టి స్త్రీకి మొదటివరుఁడు సోముఁడనియుఁ దరువాతివాఁడు గంధర్వుఁడనియు మూఁడవవాఁడు అగ్ని యనియు నాల్గవవాఁడు మనుష్యుఁడనియుఁ గలదు * కనుక సోముఁడు గంధర్వునకు,గంధర్వుఁ డగ్నికి, అగ్ని మానవునకుఁ గన్యకనీయవలెను. కనుక నాల్గవవాఁడైన మానవవరునికి నాల్గవరోజుననే ఆ నూత్నవధువుపై అధికార మేర్ప డును. కనుక నీ భారతీయసంప్రదాయమునుబట్టి వివాహములో నాల్గవ రోజు చేయఁదగిన శేషహోమపునస్సంధానమంత్రములను పురోహి తులు కేవలవాచికముగా నేకరువు పెట్టుచుండుట నేఁటికిని భారతదేశ మున సంప్రదాయమై యున్నది. దీనినే "శేషగ్ంసమావేశనేజపేత్" అని ఆపస్తంబుఁడు సూత్రించినాఁడు. పై సూత్రములలోని పరమా ర్థమును బాగుగ గుర్తెఱిఁగిన మన మహాకవి "క్షితివిరచితశయ్యఁ

---

* "సోమః ప్రథమోవివిదే గంధర్వోవివిద ఉత్తరః। తృతీయో అగ్నిష్టేపతిస్తురీయస్తే మనుష్యజాః।...' (మంత్రపన్నము)

కౌతుకాగారమాగాత్” అని వర్ణించి సూరిమహాశయుని ముఖమున మనకుఁ బై విశిష్టధర్మవిషయములను విస్పష్టముచేసినాఁడు. భారతీయ భవ్యసాంప్రదాయ రత్నములకుఁ గాళిదాస కావ్యములు రత్నపేటిక లనుట సమంజసమే కదా!

ఇట్లే మునులు సంధ్యాసమయమున అర్ఘ్యప్రదానము విడిచి రను సందర్భమున మన మహాకవి యిట్లనుచున్నాఁడు.

‘అర్ఘ్యప్రదానసమయములో శాస్త్రజ్ఞులైన మునులు తమ కాలిమడమలు నేలకుఁ దగులకుండఁ బైకెత్తి పవిత్రోదకములుకల దోసిళ్ళతో నర్ఘ్యప్రదానము లిచ్చుచు నక్షత్రోదయమునఱకు గాయత్రినిదమలో జపించుచున్నారు.’ దీని మూల మిట్లున్నది.

‘పార్ష్ణిముక్తవసుధా స్తపస్వినః పావనాంబురచితాంజలిక్రియాః।
బ్రహ్మగూఢమభిసంధ్యమాదృతాః శుద్ధయే విధివిదో గృణంత్యమీ॥’
చూ. (కు. సం. సర్గ 8. శ్లో 47) ఇట మునులు తమ కాలిమడమల లెత్తి యర్ఘ్యప్రక్షేపణ మొనర్చుటకుఁ బ్రమాణముగా శ్రీ సూరి శ్రౌతిస్మృతివాక్యమిట్లున్నది.

“గోశృంగమాత్ర ముద్ధృత్యముక్తపార్ష్ణిః క్షిపేజ్జలం” మఱియు పద్యతృతీయపాదమునకుఁ బ్రమాణమిచ్చుచు సూరి ‘జపన్నాసీత గాయత్రీం ప్రత్యగానక్షత్రోదయాత్” అని చూపినాఁడు. “విధివిదః” అను విశేషణముచే “జ్ఞాత్వాకర్మాణికుర్వీత” అనఁగా మనముచేయు ప్రతికర్మము నర్థవంతముగను ఆదరముతోను జేయవలయుననియు “శుద్ధయే“ అను పదముచే నట్టి యర్థవత్క్రియాచరణమే మానవుని చిత్తశుద్ధికిఁ గారణమై మోక్షప్రదమగుననియు నిటఁబాఠకోత్తములకుఁ దెలుపుచు (కాంతాసమ్మితముగా) నిట్టి కర్మాచరణముతో మోక్షము పొందవలెనని కాళిదాసకవి పాఠకులను బ్రోత్సహించుచున్నాఁడు.

ఇట్లే యీశ్వరుఁడు తాను సంధ్యాకాలములోనే సంధ్యవార్చు టకుఁగల కారణమును దన ప్రాణేశ్వరికిఁ దెలుపుసందర్భమున మన మహాకవి యీశ్వరముఖమున 'ఓ కోమలాంగీ! పూర్వము బ్రహ్మ, అగ్నిష్వాత్త" మున్నగు పితృదేవతలను సృజించిన పిమ్మట తాను విసర్జించిన శరీరమే సంధ్యారూపమై ద్విజులచే సాయంప్రాతస్సమయ ములయందు సేవింపఁబడుచున్నది. ఓ మానినీ! (ఆలోచనలేనిదానా! అని సంబోధనకర్థము) ఈ సంధ్యసాక్షాత్ బ్రహ్మస్వరూపమేమై యుండుటచే నిట్టి సంధ్యయందు నా కింతటి గౌరవముకలదు." చూ. కు. సం. (8-52) ఈ విశిష్ట ధర్మవిషయమునకుఁ గల ప్రమాణమును మనసూరి విద్వన్మణి భవిష్యత్పురాణమునుండి ఇట్లు ఉద్ధరించినాఁడు.

"పితామహః పితౄన్ సృష్ట్వామూర్తిం తాముత్ససర్జహ ।
సా ప్రాతస్సాయ మాగత్య సంధ్యారూపేణ సేవ్యతే ।
ఏతాం సంధ్యాం యతాత్మానో యేతు దీర్ఘముపాసతే ।
దీర్ఘాయుషో భవిష్యంతి నీరుజః పాండునందన ॥"

పై భావమే యీ శ్లోకములో సమముగాఁ జూపఁబడినది.

ఇట్టి ధర్మసూక్ష్మము లీ కుమారసంభవమున నింకను గలవు. ఇఁక నీ కవి రఘువంశకావ్యములోఁ జూపిన ధర్మవిషయములను విలో కింతుదము.

దిలీపమహారాజు భార్యాసమేతుఁడై వసిష్ఠాశ్రమముఁజేరి యట వసిష్ఠుని సందర్శించు సందర్భమున "స్వాహాదేవిచే అగ్నివలె, అరుం ధతీదేవిచే ఆరాధింపఁబడుచున్న వసిష్ఠమహర్షిని, దిలీపుఁ డాతని యను ష్ఠానాంతరకాలమందు సందర్శించెను" అని చెప్పినాఁడు. చూ. రఘు వంశకావ్యము (సర్గ 1. శ్లో 56) ఇట వసిష్ఠుని అనుష్ఠానానంతరమందే రాజామునిని సందర్శించుటకుఁ గల కారణమును జూపుచు సూరి తన సంజీవినిలో

"సమిత్పుష్పకుశాజ్యాంబు మృదన్నాక్షత పాణికః।
జపం హోమంచకుర్వాణో నాభివాద్యోద్విజో భవేత్॥"

"బ్రాహ్మణుఁడు సమిధలనుగాని పుష్పము మొదలైన వానినిగాని చేతఁబట్టి హోమము సేయుచున్నప్పుడును లేక జపము సేయుచున్నప్పుడును వచ్చిన యతిథు లాతని సమస్కరింపఁవలదు." అని యనుష్ఠానమధ్యములో అభివాదన నిషేధమును జెప్పినాఁడు. ఈనిషేధము తెలియని కవి యిట్లు చెప్పఁగలఁడా? తెలిసినవాఁడు కనుకనే కాళిదాసు తదనుష్ఠానమందే రాజు మునిని దర్శించినాఁడని పై ధర్మవిషయమును విశదపఱిచినాఁడు. ఇట్లే వసిష్ఠుఁడు దిలీపునిగూర్చి కుశలప్రశ్న చేయు సందర్భములో "పప్రచ్ఛకుశలం రాజ్యేరాజ్యాశ్రమమునిం మునిః॥ (1-58) "కుశలము" నడిగెను." బ్రాహ్మణుని "కుశలము" అడుగవలెను. ఇట్లే క్షత్రియుని "అనామయమూ" అని యడుగవలెను. ఈ నియమమునుబట్టి యిటక్షత్రియుఁడైన దిలీపుని"అనామయమూ" అనియడుగవలసియుండఁగా రాజుబ్రాహ్మణునకుఁగఁదగినట్లు"కుశలమే" అనియడిగినాఁడు. కారణము 'రాజ్యాశ్రమమునిం' అను విశేషణముచే నట్టి యర్హాత ఈ రాజునకుదగియున్నదని మహాకవి యిట మనకు సూచించినాఁడు.

తనయింటికి వచ్చినవారిలో నేయేవర్ణముల వారి నేయేరీతిగాఁ గుశలప్రశ్నము గావించవలెనో? అనుప్రశ్నకు సమాధానముగా సూరి మనుస్మృతినుండి యీ ప్రమాణముం జూపినాఁడు.

"బ్రాహ్మణం కుశలం పృచ్ఛేత్ క్షత్రబంధుమనామయం।
వైశ్యం క్షేమం సమాగమ్య శూద్రమారోగ్యమేవచ॥"

ఇట్లే దిలీపరాజేంద్రుఁడు వసిష్ఠమహర్షి యొద్దకేగి తన సంతానాభావమునకుఁ గారణమడుగు సందర్భమున వసిష్ఠమహర్షి 'రాజా నీవు పూర్వ మొకసారి దేవేంద్రుని సేవించి తిరిగి భూలోకమునకు వచ్చు సమయమున మార్గమధ్యమునఁ గామధేనువు కల్పవృక్షచ్ఛాయనాశ్రి

యించి యున్నది' (1-75) "ప్రదక్షిణము చేసి నమస్కరింపఁదగిన యా కామధేనువును నీవుపేక్షించితివి. కారణమేమనఁగా ఋతుస్నాతయైయున్న నీ భార్యను కలిసికొననిచో "ధర్మహాని కల్గును" అను నాలోచనలోనున్న నీవా ధేనువును జూడలేదు" (1-76) నన్నిట్లవమాన పఱచితివి గాన నా సంతానమును సేవింపనిదే నీకు సంతానము కలుగకుండుఁగాక" యని యా కామధేనువు నిన్నుశపించెను" (1-77) ఇందు డెబ్బదియాఱవ శ్లోకములో మన కవి మన కెన్నెన్నో ధర్మసూక్ష్మములను దెలిపినాఁడు. ఆ సూక్ష్మములను సూరి మనచేతికి అనఁటిపండు నొలిచియిచ్చినట్లిచ్చినాఁడు. చూడుఁడు. "ఋతుస్నాతయైన భార్యను దప్పక కలిసికొనవలెను అనుటకుఁ బ్రమాణముగా మనుస్మృతినుండి

"ఋతుకాలాఽభిగామీస్యాత్ స్వదారనిరతస్సదా।"

ఇట్లు ఋతుకాలములో భార్యను గలిసికొనని భర్తకుఁ గలుగుదోష మెట్టిదో తెలుపుచు పరాశరస్మృతినుండి

'ఋతుస్నాతాంతుయో భార్యాంస్వస్థస్సన్నాధిగచ్ఛతి।
బాలగోఘ్నాపరాధేనయుజ్యతేనాఽత్రసంశయః॥'

'ఋతుస్నాతయైయున్న భార్యను స్వస్థచిత్తుఁడై కలిసికొననిభర్త బాలహత్యాజనిత పాపముతోఁదుల్యమయినపాపము చేసినవాఁడగును

ఇచ్చటి 'ఋతు' కాలమునుగూర్చి 'కాలామృతము' అను జ్యోతిశ్శాస్త్రగ్రంథములో నిట్లు తెలుపఁబడినది. *

---

* ఈ గ్రంథము వావిళ్ళవారిచేఁ బ్రకటితము. టీకాకారుఁడు వేంకటయజ్వ అనియున్నది. 'ఉత్తరకాలామృతము' అను జ్యోతిశ్శాస్త్రగ్రంథము కాళిదాసకృతమని దాని ముఖపత్రముపైఁగలదు. దానికిది పూర్వమైనచో నీ "కాలామృతము' కూడ కాళిదాసకృతమనవచ్చునుగదా.

'స్త్రీణామార్తవదర్శనాది దినతస్స్యుష్షోడశస్తు క్షపాః ।
పుత్రార్థీవరయేత్సమాసుసుముఖీం తాస్వేవపశ్చాంకృశాః॥'

... ... ... ... ... ... ...

... ... ... (చూ. కాలామృతము ప్రసవబిందువు)

ఈ ఋతురాత్రిలలో సేవనం యోగ్యములు? ఈ ప్రశ్నకు

"ఋతుస్స్వాభావికా స్త్రీణాంరాత్రయష్షోడశస్స్మృతాః ।
తాసామాద్యాశ్చతస్రస్తు నింద్యా ఏకాదశీచయా ।
త్రయోదశీచ శేషాస్తు ప్రశస్తాదశరాత్రయః ॥' (మనువు)

"రజోదర్శనము మొదలు పదునాఱు రాత్రులు స్త్రీలకు ఋతురాత్రులు. అందు మొదటినాల్గురాత్రులు, ఏకాదశీత్రయోదశులు కాక మిగిలిన సమదివసరాత్రులు సంగమార్హములు. గాన ప్రస్తుతములోఁ బైని బేర్కొనిన దశరాత్రులలో దిలీపుఁడు స్వర్గమునుండి తిరిగి వచ్చునని ఒకరోజై యుండవలెను.

దిలీపుఁడు భార్యాసహితముగ వసిష్ఠాశ్రమములో మొదటి రాత్రిని నియమముతోఁ గడపెను. అను సందర్భములో మన కవి కులగురువు చెప్పినశ్లోకార్థమిది. 'దిలీపుఁడు నియమవతియగు భార్యా సహాయముగలవాఁడై గురునిర్దిష్టమైన పర్ణశాలలో దర్భలచాపపైఁ బరుండి వసిష్ఠుని శిష్యులయధ్యయనముచే సూచింపఁబడిన తుదిభాగము కల రాత్రిని గడపెను.'

"......తచ్ఛిష్యాఽధ్యయన నివేదితాఽవసానాం
సంవిష్టః కుశశయనే నిశాంనినాయ' రఘు (1-95)

ఈయపరరాత్రియందలి యధ్యయన సంప్రదాయమునకుఁ బ్రమాణము ను జూపుచు సంజీవనిలో సూరి గౌతమధర్మసూత్రగ్రంథమునుండి

'నచాప్యపరరాత్రాదా బ్రహ్మోఽధీత్యపునస్స్వపేత్''

తెల్లవాఱుజాముున (మూఁడవయామములో) వేదము పఠించినవాఁడు తిరిగి పరుండరాదు. కనుక నిశయొక్క అవసానకాలములో వేదపఠనము మిగిలిన రాత్రిభాగములోఁ దిరిగి నిద్రించకుండుట ధర్మముగాన దిలీపుఁడును వేదపఠనముచే మేల్కాంచి తిరిగి పరుండక యవశిష్టరాత్రిని గడపెనఁట ఇట్లే యీ దిలీపనరేంద్రుఁడు తనభార్య గర్భవతియైన పిమ్మట ఆమెకు 'పుంసవనము' మొదలగు సంస్కారములు జరిపించెను. "...యథాక్రమం పుంసవనాదికాః క్రియాః... సదృశీర్వ్యధత్తసః" (రఘు సర్గ 3 శ్లో 10)
షోడశకర్మల వరుస యిట్టిది.

"గర్భాధానం పుంసవనం సీమంతో జాతకర్మచ । ... అను వరుసనుబట్టి మన మహాకవి యిట పుంసవనము పిమ్మట 'సీమంతము' ను గ్రహించినాఁడని తెలియును. ఈ 'పుంసవనము' స్త్రీలకు 2, 3 మాసములలోఁ జేయఁదగినట్లు 'ద్వితీయే తృతీయే వా మాసి పుంసవనం' అనుస్మృతివాక్యము ప్రమాణము. ఈ పుంసవనము పురుషనక్షత్రముతోఁ జంద్రుఁడు కూడియున్నప్పుడు చేసినచో పురుషసంతతి కలుగునఁట. ఈ సంస్కారనామములోనే యీ విషయమువిలీనమైయున్నది. "పుమాన్ సూయతే అనేనకర్మణా ఇతి పుంసవనం." దీనికిఁ బిమ్మట 'అనవలోభనం' అను సంస్కారాంతరము నాల్గవమాసమున గర్భిణీ స్త్రీకి జరుపఁదగియున్నట్లు 'చతుర్థేఽనవలోభనం' అను ఆశ్వలాయన సూత్రకారుని వాక్యము వ్యక్తము సేయును. ఇఁక "షష్ఠే అష్టమే వా సీమంతోన్నయనం" అను యాజ్ఞవల్క్యమహర్షి వాక్యమునుబట్టి 'సీమంతము' 6, 8 మాసములలోఁ గర్తవ్యము. ఈ స్మృతివిహిత ధర్మములన్నిటిని బాగుగాఁ దెలిసిన మన కవీశ్వరుఁడు సందర్భానుసారముగ మనకుపదేశించుటద్వారమునధర్మరక్షణతోఁలోకరక్షణము చేసి లోకకల్యాణకారకుఁడైనాఁడు "ధర్మోరక్షతి-రక్షితః" అని కదా

సూక్తి. పై సంస్కారములవరుసలో 'సీమంతము' తరువాతది 'జాతకర్మ'.* దీనినిగూర్చి మనమహాకవి "దిలీపునకుఁ" బుత్రుఁడుకలిగెను. అను సందర్భమున ఒక శ్లోకములో "...మణిరాకరోద్భవః ప్రయుక్తసంస్కార ఇవాధికంబభౌ' (3-18) అనెను. ఇఁట నీ కవి "సంస్కార" పదముతో జాతకర్మ సంస్కారమువలన శిశువునకు, కషణాదిసంస్కారమువలన మణికివలె క్రొంగ్రొత్తశక్తులు, ప్రకాశము లగునని సూచించినాఁడు. ఆశ్లోకభావమిది. "దిలీపునకుఁ బుత్రుఁడుదయించినంతనే జాతకర్మ సంస్కారము చేయబడెను. ఈ సంస్కారముచే శిశువు, కషణాది సంస్కారముచే గనినుండి పుట్టిన మణివలె నధికముగఁ బ్రకాశించెను. (రఘు. సర్గ 3. శ్లో 18) ఈ సంస్కారము శిశువులకుబొడ్డుకోయకపూర్వమే చేయఁదగియున్నట్లు "ప్రాఙ్నాభికృంతనాత్పుంసో జాతకర్మవిధీయతే" అను మనుస్మృతి వాక్యమువలన వ్యక్తమగుచున్నది. మఱియు నీ సంస్కారముచే శిశువునకు జన్మకాలమందు సంక్రమించిన బాలారిష్టాదిదోషములుపశమిల్లి, ఆయురారోగ్యైశ్వర్యములు గల్గునని జాతకర్మఫలశ్రుతి యిట్లు తెలుపుచున్నది.

"జాతస్యారిష్టనాశాయనీరోగత్వాయసర్వదా ।
దీర్ఘాయుష్యాయ చాన్యత్ర సర్వసంపత్సమృద్ధయే ।
జన్మన్యశుభయోగానాం వినాశాయ విశేషతః ॥

(బార్హస్పత్య సంహిత)

---

* 'జాతమాత్రేపరికర్తవ్యం కర్మజాతకర్మ'. ఈ సంస్కారములోని విశేషములు, ఎన్నెన్నికలలో దీనికిఁగల సంబంధము మొదలగునవి. నా రచితమైన 'ఉపనయనమంత్రార్థ దర్పణము'లో దర్పణములోవలెఁ జూపఁబడినవి.

ఈ విషయము మన యనుభవములోఁగూడ ప్రత్యక్షమైనదే. పరికింపుఁడు. అభ్యంగనాది సంస్కార విరహితమైన శరీరము మాలిన్య యుతమై క్రమముగ అనారోగ్యభూయిష్ఠమై రోగాణువులచే వ్యాపింపఁ బడి స్వాధీనమునుండి శిథిలమైనట్లు, జాతకర్మాది సంస్కారవిరహితి మైన వాని బుద్ధివృత్తులు, మనస్సు బాలారిష్టాదిగ్రహములచేఁ బీడిత ములై పటుత్వముదప్పి స్వాస్థ్యవిరహితములై ఎండలేనిప్రదేశములోఁ బెరిఁగిన్న మొక్కలవలె వెఱ్ఱితలలువేసి రూపఱియుండుననుట అనుభవ సిద్ధములేకదా! దీనినిబట్టి ద్విజులకు జాతకర్మాది సంస్కారములు మణులకుఁ గషణాది సంస్కారములవలె స్వశక్తిప్రకాశకములై నిజ ప్రాభవములను వెలువరించునని యిట మన కాళిదాసు 'ప్రయుక్త సంస్కార ఇవాధికం బభౌ' అను సందర్భమును బురస్కరించుకొని చక్కఁగ సూచించినాఁడు. ఇఁకఁజౌల సంస్కారమును, ఉపనయన సంస్కారమునుగూడ రఘుకుమారునికి మనమహాకవి జరిపించినాఁడు. చౌలము అనఁగా పుట్టువెంట్రుకలు తీయించుట. ఇది ద్విజబాలునికి మూఁడవయేట చేయఁదగినట్లు "జన్మనోధి తృతీయేవర్షేచౌలం పున ర్వస్వాః" అను ఆపస్తంబసూత్రము సూత్రించినది. మొదటి సంవత్సర ములోఁగూడఁ జేయవచ్చునని మనువుమతము.

'చూడాకార్యా ద్విజాతీనాం సర్వేషామేవధర్మతః ।
ప్రథమేబ్దే తృతీయేవాకర్తవ్యా శ్రుతిచోదనాత్ ॥'

ఇట్లే ఉపనయన సంస్కారమునకుఁగూడ ద్విజబాలురకు గర్భషష్ఠము మొదలు గర్భాష్టమువఱకు యుక్తకాలమైనట్లు "గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయీత। * గర్భైకాదశేషు రాజన్యం, గర్భద్వాద

* శిశువుమాతృగర్భములోనున్న తొమ్మిదిమాసములు కలిపిలెక్కిం చఁగా అనఁగా 7 సంవత్సరముల 3 మాసములకు బాలునికి గర్భా ష్టమవత్సరము మొదలగును. ఇట్లే గర్భషష్ఠాదులుకూడ లెక్కిం చవలెను.

శేషం వైశ్యం ।" అను ఆపస్తంబము సూత్రించుచున్నది. క్షత్రియ వైశ్యులకు వరుసగా గర్భైకాదశ (11) సంవత్సరము, గర్భద్వాదశ వత్సరము ఉపనయనమునకు యుక్తకాలములు (ఇంక గామ్యసంవత్సరములలో నుపనయనము చేయుటనుగూర్చి మనువే "పంచమే బ్రహ్మవర్చసకామం, అష్టమమాయుష్కామం, దశమే అన్నాద్యకామం, ఏకాదశ ఇంద్రియకామం ద్వాదశే పశుకామమితి" "ఆషోడశాద్బ్రాహ్మణస్య అపతితా సావిత్రీ" అని పదునాఱేళ్ళవఱకు ఉపనయనకాలమును బొడిగించి మన మహర్షులు మనకు జాలినంత యవకాశమును గల్పించినను మనము కుమారులకు (బదునాఱవ సంవత్సరములోనైనను ఈ ముఖ్యసంస్కారమును జేయమికిఁ గారణము కిరీటస్థానము నాక్రమించిన (తలకెక్కిన) మన ఉపేక్షాభావమే మూలము అనవలెను గదా. అదనుపదును లేక నాఁటిన విత్తనమువలె సకాలములోఁ జేయని సంస్కారము వ్యర్థమే యగునుగదా!

ఇట్లే ఉపనయనానంతరమున రఘుకుమారుడు తండ్రినుండి అస్త్రవిద్యను నేర్చునపుడు నల్లయిఱ్ఱి చర్మమును ధరించి సమంత్రకముగా అస్త్రవిద్యనభ్యసించుచున్నాఁడని మనమహాకవి "త్వచం స మేధ్యాం పరిధాయ రౌరవీం *

అశిక్షతాస్త్రం గురుణైవ మంత్రవిత్॥ (రఘు 3-31)

(బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు క్రమముగా విద్యాభ్యాసకాలమందు ధరించవలసిన చర్మయజ్ఞోపవీతము లివియని మల్లినాథసూరి మన కెఱుకపఱిచినాఁడు.

'కార్ష్ణరౌరవబాస్తాని చర్మాణి బ్రహ్మచారిణః ।

వసీరన్నానుపూర్వేణ శాణక్షౌమదికానిచ॥ (మనుస్మృతి)

ఈ చర్మయజ్ఞోపవీతధారణము వటువులకు దీర్ఘాయుర్దాయకరమని ఘటీయొక క్షేమవాక్యమిట్లు నుడువుచున్నది.

---

* రురుర్మహాకృష్ణసారః । యాదవ నిఘంటువు.

"అజినోత్తరీయోహి దీక్షాయుర్భవతి"

ఇంకను ఇట్టి ధర్మవిశేషము లీ కాళిదాసకృతులం దెన్నియేనికలవు. రఘువంశము 3-3 లో గోదానవ్రతమునుగూర్చి 3-70 లో వానప్రస్థ ధర్మమునుగూర్చి 4-25 శ్లోకములో యుద్ధయాత్రకు బైలుదేఱుటకు ముందుచేయఁదగిన కృత్యవిశేషములనుగూర్చి ధర్మవిశేషములుకలవు.

పైవిధమునఁ గాళిదాసు తనకావ్యములలో సూత్రప్రాయముగాఁ జెప్పిన విశిష్ట వివిధ ధర్మవిశేషములను మన మల్లినాథసూరి ప్రసిద్ధ ప్రమాణములతో వివరించి తన "సంజీవిని"ని భారతీయ జీవితమునకు సంజీవినిగనే యొనర్చినాఁడు. మానవుఁడు తనజీవిత రక్షణకొఱకు ధర్మరక్షణ చేయుట అగత్యమైయున్నట్లు "ధర్మోరక్షతిరక్షితః" అను సూక్తి సువ్యక్తము చేయునుగదా! ఇట్టి ధర్మములన్నియుఁ బ్రత్యేకముగా నారోగ్యసూత్రమిళితములై మానవునకు అవశ్యానుష్ఠేయములగుచునేయున్నవి. ఇట్టిధర్మమును రక్షించలేని మానవుఁడు తనను దానురక్షించుకొనలేని స్థితిలోనున్నాఁడనియే చెప్పవలెనుగదా! "యతోధర్మస్తతోజయః" అను సూక్తినిబట్టి ధర్మములేనిచోట నెట్టి జయముకలుగదని స్పష్టమగుచున్నది. కనుక మానవునకు సర్వాభ్యుదయ సంధాయకమైనది ధర్మమే యనియు, నిట్టి స్వధర్మాచరణముతో మానవాళి, ఇహపరసౌఖ్యములను బడసి ముక్తిపొందుట యుక్తమనియుఁ గాళిదాసకావ్యలక్ష్మి కాంతాసమ్మితముగ లోకమునకు బోధించి విశ్వకళ్యాణదీక్షతో దీపించుచుః బ్రపంచప్రశస్తిని సంపాదించుకొని కొమరుమిఁగులుచున్నదని నివేదించుచున్నాను.



# రత్నచ్యుతి

—శ్రీ మోచెర్ల రామకృష్ణకవి.

సీ॥ కువలయచక్రమా ఘోషించి కంపించె
న స్తంగమించెనా యాప్తుఁడంచు
దెసలేనివారమైతి మటంచు నాక్రింద
న మొనర్చెనా శాంగనాచయంబు,
పండితుని మోడంద పన్నీరుపూతావు
లిఁకనాకులేవని యేడ్చెగాలి,
నాకసాచివ్యంబునకు ముప్పుగల్గునే
మోయంచుగీష్పతి యుమ్మలించె,

గీ॥ జ్వలనుఁ డనివార్య దుర్యశస్సాధ్వసమున
వివశుఁడగుచు, విలాపించి, విహ్వలించి,
కుమిలె జహ్వరులాలును గూర్చినట్టి
ప్రళయవృత్తాంత సత్వరవ్యాపనమున.

ఉ॥ ఐహికలోక జీవితసమాప్తి సతం డెటసల్పినాఁడొ, యా
గేహముఁజేరి యాసుకృతికిన్ జనులిచ్చిన తర్పణోశ్రు సం
దోహము మానవాళి పదధూళినడంచి కళిందనందినీ
స్నేహముఁ గోరిపోయికలసెన్ విలపించెడి తన్మహానదిన్. 2

చం॥ ప్రకటితశుద్ధసత్త్వయగు భారతరాజ్యరమాలలామ, యా
త్మకుఁ బ్రియమై, తదీయగళమండన మధ్యగమైతనర్చుచున్
సకల జగత్ప్రమోదకర శాంతికళాద్యుతులన్ వెలార్చు, నా
యకమణి రాలిపోయెనకటా! దురతిక్రమకాలవాహినిన్. 3

చ. మృతి మనవంటి మానవుల కే; యమృతుల్ సుకృతుల్;
స్వతంత్ర భా
రతజనతా మహాభ్యుదయ రాజ్యరమా రథచోదకుండు, పం
డిత జవహర్ ప్రధాని; కమనీయతదీయయశశ్శరీర మీ
క్షితిపయి శాశ్వతంబుగ వసించు ఘనూతనకాంతు లీనుచున్. 4

ఉ. ఆ మహనీయమూర్తి విమలాశయదీప్తు లఖండవిశ్వ భ
వ్యామృతమార్గదర్శక దయాకరదీపిక లౌనుగావుతన్
ప్రేమరసస్వరూపు నతనిన్ గికురించిన వారి గెల్చుటన్
బూమెలు మాయుతన్ భరతభూమికి సౌఖ్య జయంబు
లబ్బుతన్. 5



# శ్రీ పీఠికాపురాధీశ్వరుల షష్టిపూర్త్యుత్సవ సందర్భమునఁ జదివిన శ్లోకములు.

ఉభయభాషాప్రవీణ : శ్రీమతి రావూరి వేంకటసుబ్బమ్మ.

1. జయతు జయతు శ్రీమాన్ పీఠికాపుర్యధీశో
జయతు నిఖిలశాస్త్రార్థాత్తసద్బుద్ధిదీప్రః
జయతు జయతు సర్వైస్స్తూయమానో గుణజ్ఞైః
జయతుచ సనితాంతం రావువంశాబ్ధిచంద్రః.

2. కేచిచ్ఛస్త్రనిరూఢశక్తికలితాః కేచిచ్ఛశాస్త్రప్రియాః
కేచిత్సంచితవైభవాః స్వకమభివ్యాప్తార్తదీనావనాః
సంత్యద్యాపిహి తత్ర తత్ర నతు తేసత్వేపి సర్వప్రియాః
త్వం సర్వత్రచ దత్తవైభవనిధిర్జేగీయసే సర్వదః.

3. సాక్షాద్బ్రహ్మసమాజమందిరవరస్త్వద్ జ్ఞానవారాన్నిధేః
నిత్యం పండితమండలీ ప్రవదతి త్వామేవ శాస్త్రప్రియం
దృష్ట్వాచాంగ్లకళావివర్ధనకళాశాలాం భవన్నిర్మితాం
నిమ్నోద్ధారక దక్షకత్వమపి తే మన్యేహ్యపూర్వోపమమ్.

4. శ్రీమత్పీఠపురీ ప్రభుత్వవిభవం త్వాం రామరాయాత్మజం
యస్యాపిస్వకులక్రమాప్త సచివాస్తే సుబ్బరాయాదయః
యస్యాభూన్మహిషీదయాదిమహితా సాధ్వీచ చిన్నాంబికా
తం త్వాం భూషయితుం కవిత్వవిభవే నేయం సమర్థేవకిం.

5. పూర్వోక్తైర్విభవైర్విభూషితవపుర్జేగీయతాం సంతతం
హ్యాచంద్రార్క-వివృద్ధపుత్త్రవిభవస్సత్పౌత్త్రసంపత్పరః
కించానందయతు ద్వితీయమపి తే షష్ట్యుత్సవం తేజనాః
త్వత్సాదృశ్యముపేత్య పాలనపరాస్స్యుర్భారతే పార్థివాః.

---

# శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యము – శిథిలపూరణము.

శ్రీ డాక్టరు బి రామరాజు, ఎం.ఏ, పి.హెచ్.డి.

శ్రీనాథ కవిసార్వభౌముఁడు రచించిన శివరాత్రిమాహాత్మ్యమును ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) వారు చాలసంవత్సరములక్రిందట నొక ప్రకాశనముగాఁ బ్రచురించినారు. లభించిన యేక శిథిలప్రతి యాధారముగా శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు దానిని పరిష్కరించిరి. ఆనాఁడు వారికి లభించినది నాలుగాశ్వాసముల గ్రంథమే కనుక శ్రీనాథుఁ డంతే రచించియుండునని యూహించి తమపీఠికలో నటులే వ్రాసిరి. ఒకటి రెండక్షరములు శిథిలములైన చోటులందుఁ బూరించిరి. మిక్కిలిగా శిథిలములైన తావులందుఁ జుక్కల గుర్తులుంచియు ముద్రించినారు. ఇందుల కాంధ్రసాహిత్యలోక మెంతేనియు వారికి ఋణపడియున్నది.

ఇటీవల శివరాత్రి మాహాత్మ్యము తాళపత్రగ్రంథ మొకటి నాకు మెదకుమండలమున దన్నారముగ్రామమున నొక జంగము దేవరకడ లభించినది. వ్రాయసగాని పేరుగాని వ్రాసికొన్న తేది గాని లేవు. తాటియాకుల స్థితినిబట్టియు, లిపినిబట్టియు ఈ ప్రతి వయస్సు 250-300 ఏండ్లమధ్యన నుండునని యూహించుచున్నాను. వ్రాయసగాని పొరపాటులు కొన్నియున్నను, ఇది మిక్కిలి చక్కని ప్రతి. చక్కనిదేకాక సమగ్రమైన ప్రతికూడ. అనఁగా నిదీ యైదాశ్వాసములుగలప్రతి. దీనిలో నైదాశ్వాసము లుండుటయేకాక ముద్రితములైన నాలుగాశ్వాసములందులేని కొన్నికొ్రొత్తపద్యము లధికములుగాఁగలవు. ముద్రితప్రతిలోని శిథిలభాగములన్నియు దీనిలోఁ జక్కగా భద్రముగా నున్నవి మీఁదుమిక్కిలి దీనిలోఁ గొన్నిపాఠ భేదములున్నవి. ఈ విధముగా నీ తాళపత్రగ్రంథము మిక్కిలి ప్రశస్తమైనది. పైనఁజెప్పిన నాల్గువిషయములు దృష్టియందుంచికొని నాకు

లభించిన యీ క్రొత్తప్రతివైశిష్ట్యమును దిఙ్మాత్రముగాఁ బ్రదర్శిం చుటయే ప్రకృత కర్తవ్యము.

1. పంచమాశ్వాసము :— ముద్రితప్రతిలో నాలుగాశ్వాసములే యున్నవి. సుకుమారుఁడు పరమశివుని యనుగ్రహమునఁ బ్రమథుఁడగుట యందలి వృత్తాంతము. చతుర్థాశ్వాసాంతమున మునులు సూతుని "చిన్నవోయి యముండేమి చేసెఁబిదప" అని యడిగిన ప్రశ్నకు సమాధానము పంచమాశ్వాసమునఁగలదు. పంచమాశ్వాసమున ౭౧ గద్యపద్యములున్నవి. యముఁడు చిత్రగుప్తునితో సంభాషించి తన యశక్తాధికారమునుగూర్చి పరమశివునకే విన్నవింప నిశ్చయించుకొని కైలాసమున కేఁగుట, కైలాసవర్ణనము, శివునిస్తుతించుట, సుకుమారుని పాపకార్యములుచెప్పుట, శివుఁడు యమునకు శివరాత్రిమాహాత్మ్యమును శివభక్తుల లక్షణములును జెప్పుట, యముఁడు తనలోకమునకుఁ దిరిగివచ్చి తన భటులకు శివుఁడు చెప్పినవన్నియు మరలఁజెప్పుట యిందలి వృత్తాంతము. పంచమాశ్వాసము ప్రారంభ పద్య మిట్లున్నది.

క. శ్రీదేవత ప్రియసేవక
భూదివిజాశీర్వివృద్ధభూరిశ్రీ పు
ణ్యోదయ! సమస్తజన సం
మోదన శుభకరవసంత! ముమ్మయ శాంతా!

2. అధికపద్యములు :— ముద్రితప్రతిలో లేనివి ఈ తాళపత్రములలో నధికముగాఁగొన్ని బద్యములున్నవి. అచ్చైనప్రతిలోనుండి తాళపత్రప్రతిలో లేనివానిఁగూర్చి ముందుగా మనవి చేయుదును. అచ్చుప్రతి ప్రథమాశ్వాసమందలి 96వ పద్యమును, ద్వితీయాశ్వాసమందలి 59, 105 పద్యములును, తృతీయాశ్వాసములోని 24, 132 పద్యములును నాకు లభించిన తాళపత్రగ్రంథమునఁ గానరాలేదు.

ఇఁక నధికపద్యముల సంగతి, అచ్చుప్రతిలో ప్రథమాశ్వాసము ౩౦వ పద్యము తరువాత ఐదుపద్యములును ఆశ్వాసాంత గద్యమునకు ముందొక మాలినీవృత్తమును, ద్వితీయాశ్వాసము 102వ పద్యము తరువాత ఐదుగద్యములును, తృతీయాశ్వాసము 43వ పద్యము తరువాత నొకపద్యమును 121వ పద్యము తరువాత నెనిమిది గద్యపద్యములును. చతుర్థాశ్వాసము 9వ పద్యము తరువాత నాఱు గద్యపద్యములును, ఈ తాళపత్రిప్రతిలో నధికముగాఁగలవు ఇట్టి యధికపద్యములం దొండు రెం డుదాహరణములు.

ముద్రితప్రతి ప్రథమాశ్వాసము ౩౦వపద్యము తరువాత తాళపత్రిప్రతిలో వీరభద్రిస్తోత్రి మిట్లున్నది.

క. యుక్తాయుక్త నిరీక్షణ
శక్తుఁడు గాఁడితఁ డన కజస్రము కరుణా
సక్తమతి మమ్ముఁబ్రోవుము
భక్తపరాధీన! వీరభద్రిస్వామీ!

ద్వితీయాశ్వాసమునుండి మఱియొకపద్యము. యజ్ఞదత్తుఁడు సుశీలాదేవి సమక్షమున సుకుమారుని సంభోధించి యిట్లనుచున్నాఁడు.

గీ. అన్న! సుకుమార! యేలయ్య! యనుదినంబు
గొఱకుఁ దనమున ధూర్తులఁగూడి తిరిగె
దకట! మాయమ్మగాంచె నిన్నధికనియతిఁ
గోరి వీరవ్రితంబున గొడ్డు వీఁగి

(పై పద్యము రెండవ పాదము "గోరుకుందనమున ధూర్తులంగూడి తిరిగె" అనికలదు. ఈ పాదములోని మొదటిపదము గోరతనమో లేక గొఱకుఁదనమో తెలియదు. నేను మాత్రము గొఱకుఁదనముగా దిదినాను.)

3. శిథిలపూరణములు :— ముద్రితప్రతిలో శైథిల్యము లనేకములు గలవు. వీని నన్నింటిని ఈ క్రొత్తతాళపత్రప్రతి ద్వారమునఁ బూరించుకొనవచ్చును. ఇట్టివానిలోఁ గొన్ని యుదాహరణములు. శిథిలపూరణములు కుండలీకరణములందుఁ గాంచనగును.

1. ప్రథమాశ్వాసము ప్రథమ పద్యము ప్రథమపాద మిట్లు పూరింపనగును.

   శా. శ్రీ (గౌరీ స్తనగంధసారఘుసృణశ్రీ) వాసితోరస్స్థలీ.

2. షష్ఠ్యంతములందు మొదటిపద్యము పూర్వార్ధ మిట్లు పూరింపనగును.

   క॥ (సత్యహరిశ్చంద్రునకును
   నిత్యాప్రతిమాన) దాన నిర్మలమతికిన్.

3. ప్రథమాశ్వాసము ౧౬వ పద్యము మొదటిపాద మిట్లు పూరింపనగును.

   ఉ॥(ఎక్కడఁబోయెనో ధరణి యిందువిభాకరు) లెం దణంగిరో

4. చతుర్థాశ్వాసము ౫౦వ పద్యము నాల్గవపాద మిట్లు పూరింపనగును.

   రాజు (చెడుట యెఱుఁక) రా మదించి.

4. పాఠాంతరములు :— ముద్రితప్రతితో నీ క్రొత్త తాళపత్రప్రతిని బోల్చిచూడఁగాఁ బాఠభేదము లనేకములు కనఁబడినవి. కొన్నిచోట్ల ముద్రితప్రతి పాఠము లే సమంజసముగా నున్నవి. మఱి కొన్నిచోట్లమాత్రము తాళపత్రప్రతిలోని పాఠములే సమంజసముగా నున్నవి. ఇట్టివానికిఁ గొన్నియుదాహరణములు. అధోరేఖాంకిత పదములకు కుండలీకరణమునందలి పదములు తాళపత్రప్రతిలోని పాఠాంతరముగా గుర్తింపఁ బ్రార్థన.

1. ప్రథమాశ్వాసము 75వ పద్యము.

గీ॥ పాన్పుడిగ్గవు దురవలేపమున నెఱిఁగి. (నీవు)

2. ప్రథమాశ్వాసము 77వ పద్యము.

గీ॥ దంభక్రోడావతార ముద్ధతివహించి. (కోలా)

3. ప్రథమాశ్వాసము 95వ పద్యము.

గీ॥ సంభవించె మహాస్తంభ శంభుమూర్తి. (నలస్తంభ)

4. ప్రథమాశ్వాసము 105 వ పద్యము.

గీ॥ కలదు నీకనపాయంబు కాలకంఠ.

(కలదె నీకు నపాయంబు)

5. ద్వితీయాశ్వాసము 62వ పద్యము.

గీ॥ కట్నమిచ్చె నృపాలుండు కన్నుదనియ (కట్టనిచ్చె)

6. ద్వితీయాశ్వాసము 78వ పద్యము.

ఉ॥ అక్షయ వర్ణితాఖ్యుఁడు గరంబు సువర్ణలతానిబద్ధమున్.

(రక్షకుఁ బుండరీక నఖరంబు)

7. తృతీయాశ్వాసము 133వ పద్యము.

ఉ॥ మంగళగీతవాద్య పరిమండిత మంద్రకరుండలీకళా.

(ముద్రికకుండలీ)

8. చతుర్థాశ్వాసము 3వ పద్యము.

క॥ కలకల వింకల కోమల. (కలవింకంబుల)

9 చతుర్థాశ్వాసము నాల్గవపద్యము.

సీ॥ సమదకాంతార కాసరయూధ సముద్ర్ధ సంభూత

డిండీరశకలవాహి. (రోమంథ)

10. చతుర్థాశ్వాసము 55వ పద్యము.

గీ॥ దానములు పెక్కుఁజేసిన దానఁగాని. (దోసములుఁజేసె)

ఇట్టి పాఠాంతరములింకను పెక్కు గలవు. నాకు లభించిన ఈ తాళ పత్రప్రతి వైశిష్ట్యమును దిఙ్మాత్రముగానైనను ఈ వ్యాసమునఁ బ్రదర్శింపఁ గలిగినాననుకొందును.



# రాజమహేంద్రవర రెడ్డిద్వైరాజ్యము.

శ్రీ కుదూరి ఈశ్వరదత్తు.

శా॥ ఈక్షోణిన్నినుఁ బోలు సత్కవులు లేరీ నేటికాలంబునన్,
దాక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ గంధసార ఘుసృణ ద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించున్ గవిసార్వభౌమ! భవదీయ ప్రౌఢసాహిత్యముల్.

పై పద్యము శ్రీనాథకృత కాశీఖండములోఁ గృతిపతియగు వీరభద్రారెడ్డి శ్రీనాథకవి నుద్దేశించి చెప్పిన ప్రశంసాపద్యము. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు శ్రీనాథకవి జీవితములో నీపద్యము యొక్క భావమును గూర్చి చర్చించి యిట్లు వ్రాసియున్నారు. "ఈ కాశీఖండములోని పద్యముయొక్క భావమేమని యెందఱెందఱు పండితులనో సాహితీ గోష్ఠికలవారి నడిగితిఁగాని యెవ్వరును దృప్తికరముగాఁ జెప్పఁజాలకపోయిరి. కొందఱు ద్వైరాజ్యభారంబనుటకు బదులుగా ద్వైరాజ్యభావంబన వలయుననియు, ద్వైరాజ్యభావంబనఁగా వైరభావంబనియు, 'అధ్యక్షించున్' అనఁగా వహించుననియు నర్థము చెప్పిరి. ద్వైరాజ్యమనఁగా వైరమనునర్థమే నిఘంటువునఁ గలదో చెప్పఁజాలరైరి. మఱికొందఱు రెండురాజ్యముల యొక్క బరువును బరిపాలించునని యర్థము చెప్పుచున్నారు. "ఓ, కవి చక్రవర్తీ!" ఈ నేటికాలమునం దీభూమిలో నీవంటి సత్కవులు లేరు. నీ సంబంధమయిన ప్రౌఢసాహిత్యములు ... ద్రాక్షారామ చళుక్య భీమవరములలో నివసించుచుఁ బాటలయందును ఆటలయందును నేర్పుకలిగియున్న వేశ్యాస్త్రీలయొక్క చనుఁగవల యందలి మంచిగంధము, కుంకుమపువ్వు రెండురాజ్యముల యొక్క బరువును బరిపాలించునని శబ్దార్థము స్ఫురించుచున్నది గాని, భావము విస్పష్టముగ స్ఫురింపనందున నీకాలమునందలి సాహితీమండితులయిన పండితుల కపభ్రమలు కలు

గుటకుఁగారణమగుచున్నది. ఈ పద్యము యొక్క భావమును దెలిసి
కొనవలెనన్న నా కాలము నాఁటి దర్బారుల తీరులెట్టివో, ఆచారము
లలోను, నడవళ్లలోను నేవి దూష్యములు గావో, కవి సాంప్రదాయము
లెట్టివో దేవదాసీప్రతిష్ఠాపనమెట్టిదో నీవిన్నిటి నవగాహనముఁ జేసి
కొన్నమీఁదట సాధ్యపడును గాని, స్థూలదృష్టితోఁ జూచు నీకాలపు వారి
కంతగా బోధపడదు. కవిహృదయమును గ్రహించినగాని వ్యాఖ్య లపహా
స్యభాజనములగును ..ఎట్లు రాజసభల యందు వేశ్యాస్త్రీలయొక్క
వక్షోజద్వయమునందలి గంధసారఘుసృణముల యొక్క సౌరభములు
సభాంతరాళమున నల్లుకొనఁబర్వ సభ్యుల నానందపరవశులం గావిం
చునో, యట్లే వాని నతిశయించి కవిసార్వభౌముని ప్రౌఢసాహిత్య
ములు గూడ సభ్యుల నానందపరవశులఁజేయునని భావమె గాని
యంతకన్న విపరీతభావమేమియు లేదు. ఇట్లు ప్రౌఢముగా ప్రభువుల
సభలలో వక్కాణించుట యాకాలమున గౌరవలోపముగా భావింపఁ
బడకుండుట చేతనే శ్రీనాథ కవిసార్వభౌముఁడు తన్నుఁగూర్చి పలికి
నట్లు ప్రభువునోటఁబలికించినాఁడు" (శ్రీనాథకవి పుటలు 268-269)

## ద్వై రా జ్య మ నఁ గా నే మి?

శ్రీ వీరభద్రరావుగారి పరిశోధనాతత్త్వమునకుఁ బైవిషయ
మొక నిదర్శనము. తమదృష్టికిఁ గనఁబడిన విషయములు తమకుఁ
దెలిసినంతవఱకు చర్చించి, భావిపరిశోధకులకు మార్గదర్శకుఁడౌటయే
చరిత్రకారుని పరమధర్మమని భావించినవారు. శ్రీనాథుఁడా పదమును
వ్యర్థముగ ప్రయోగించెనని భావించుట చిత్తవిక్షేపము. శ్రీనాథుఁ
డద్దానిని బ్రబలభావగర్భితముగాఁ బ్రయోగించినాఁడు. అయ్యది
రెడ్డిరాజ్యాంగ చరిత్రకొక విచ్ఛిత్తిని జేకూర్చిన సుప్రసిద్ధ చరిత్రాం
శము. ద్వైరాజ్యమనఁగా నొకరాజ్యమునే యిద్దఱు ప్రభువులు పరి
పాలించు సంప్రదాయము. దీని బాగోగులను గూర్చి కౌటిల్యుని యర్థ
శాస్త్రమున నిట్లు విశదీకరింపఁబడినది.

"ద్వైరాజ్య వైరాజ్యములలో ద్వైరాజ్యము అన్యోన్య పక్షద్వేషానురాగములచేతను పరస్పర సంఘర్షణముచేతను నశించును. జీవితుఁడగు శత్రువును బలాత్కరించి సంపాదింపబడిన వైరాజ్యవిషయమున దాని ప్రభువు ఇది నాదికాదని తలంచుచుఁ బ్రజలకుఁగర్శనాపహారము (?) లొనర్చును; లేక రాజ్యమును పణ్యముగఁ జేసి లాభ మొందుటకు యత్నించును; లేకజనులు విరక్తులయినచో రాజ్యమును విడిచివెళ్లి పోవును."

వేమవీరభద్రారెడ్ల ద్వైరాజ్యమును ఒడ్య... ...ృములో వ్యక్తపఱచియున్నారు.

రాజమహేంద్రవర రాజ్యము కాటయవేమునికిఁ బురుషసంతానము విచ్ఛిన్నముకాఁగా, వతని కుమార్తె యగు అనితల్లికి సంక్రమించెను. అని తల్లిని వీరభద్రారెడ్డి పెండ్లియాడెను. అట్టి యనితల్లి పట్టపుదేవిగా వీరభద్రారెడ్డి రాజమహేంద్రవర రాజ్యమేలెను. ఈ రాజమహేంద్రవరరాజ్యపీఠమును వీరభద్రారెడ్డి జ్యేష్ఠ సోదరుఁడగు వేమారెడ్డి యవక్రవిక్రమసహాయముచే నధిష్ఠించెను ? శ్రీనాథుఁడు కాశీఖండకృతిలో వర్ణించిన విషయములోను గమనింపవేడుచున్నాను. వీరభద్ర భూపాలుఁడొక్కనాఁడు,

సీ. త్రైలోక్య విజయాభిధంబైన సౌధంబు
చంద్రశాలా ప్రదేశంబునందు
సచివసైన్యాధీశ సామంత నృపవర
సీమంతినీ జనశ్రేణి గొలువ
శాస్త్ర మీమాంసయు సాహిత్య గోష్ఠియు
విద్వత్కవీంద్రులు విస్తరింపఁ
గర్పూర కస్తూరికా సంకుమదగంధ
సార సౌరభము దిక్పూరితముగ

తే. నిజభుజావిక్రమంబున సకల దిశలు
గెలిచి తమరాజ్యపీఠ మెక్కించినట్టి
యన్న వేమేశ్వరునిజాంక మాశ్రయించి
నిండు కొలువుండెఁ గన్నుల పండువగను.

వ. అప్పుడు నన్నుం బిలువం బంచి సముచితాసనంబునం గూర్చుండ నియమించి యున్న యవసరంబున,

తే. రాయవేశ్యాభుజంగ సంగ్రామ పార్థ
గాయగోవాళ వేమనక్ష్మాధవుండు
గూర్మియనుజన్ము హృదయంబు గోర్కి మెఱయ
నర్థి నన్నుఁ జూచి యిట్లని యానతిచ్చె.

సీ. ... ... ... ... ...

తే. నైషధాదిమహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడవనఘ!
యిపుడు చెప్పఁ దొడంగిన యీప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్య పేర.

పై పద్యము తర్వాత "ఈక్షోణిన్ నిన్నుబోలుసత్కవులు" అను పద్యము చెప్పఁబడినది. కాశీఖండమును దెనుఁగుఁగా నొనర్చుటకుఁగల హేతువులలో నొకటిగా మొట్టమొదట

"ఆంధ్రక్షమామండలాఖండలుండైన
వేమభూపతి కృపావీక్షణంబు"

అని శ్రీనాథుఁడు వేమభూపాలుని యెడ గౌరవము స్పష్టపఱచినాఁడు.

పై పద్యములను బట్టి వేమవీరభద్రారెడ్లు రాజమహేంద్రవర రాజ్యము నిద్దఱుఁ గలిసి పరిపాలించునట్లు స్పష్టము. ఇంతకన్నను

వేమూరెడ్డి వేమవరము శాసనము పై విషయమును బ్రిస్ఫుటమును గావించుచున్నది.

వేమవీరభద్రారెడ్ల యన్యోన్యానురాగము వేమూరెడ్డి వేమవరము శాసనము వేనోళ్ల వ్యక్తపఱచుచున్నది. అందు వీరిద్దఱు రామలక్ష్మణులను బోలియుండిరనియు, వీరిద్దఱు రాజమహేంద్రవర రాజ్యమును పాలించుచుండిరనియు విస్పష్టము గావింపఁబడెను. వేమభూపాలుని ప్రశస్తి ప్రత్యేకముగా వర్ణింపఁబడెను.

(1) "వేమశ్చ మానాయకవీరభూపౌ తేషాం ప్రభూతౌ నితరామ భూతాం।
యథావరౌ పంక్తిరథాత్మజానాం గుణోన్నతౌ రాఘవలక్ష్మణౌతౌ।

(2) తరుణసరసిజాస్యౌ తావభూతాం ప్రశస్యౌ
సకలనృపవరేణ్యౌ సజ్జనానాం శరణ్యౌ
రవిహిమకరకల్పౌ రామసౌమిత్రితుల్యౌ
రణశిరసి విభంగౌ రాజవేశ్యాభుజంగౌ.

(3) రాజ్ఞోస్తయో రాజమహేంద్రనామా రామాభిరామాజని రాజధానీ
అనేకమాతంగతురంగపూర్ణా శశాంకసంకాశవిరాజిసౌధా

(4) ధర్మానున్నమయన్ రిపూన్వినమయన్ రాజ్యశ్రియంవర్ధయన్
పాపంసంశమయన్ ప్రజాశ్చరమయన్ విద్వజ్జనాన్స్థాపయన్
కీర్తింసంచరయన్ దిశాసు నిఖిలక్షోణీభృతామాశ్రయో
రాజా రాజమహేంద్రనామనగరే వేమేశ్వరో జృంభతే॥

పై శ్లోకములవల్ల రాజమహేంద్రవర రాజ్యము ద్వైరాజ్యమని నిర్ణయించుట కెట్టి యభ్యంతరమును లేదు. కాఁగా, శ్రీనాథుఁడు వ్యక్తపఱచిన భావమేదియో గ్రహింపఁవలసియున్నది. 'ద్వైరాజ్య

భారము'లోని భారపదమునకు 'కుచభారము' 'నితంబభారము' మొదలగు సమాసములలోని 'భార' పదమున కెట్టి యర్థమో. యిచ్చట నాయర్థమె పొసఁగును. 'అధ్యక్షించు' పదమునకు పరిపాలనము గావించు ననెడి యర్థమును జెప్పికొనినను జెప్పుకొనవచ్చును. లేదా పరిఢవిల్లు ననియు నర్థమును గావింపనొప్పును.

అట్లని యూహించినచో నీ పద్యముయొక్క తాత్పర్య మిట్లుండనగును.

"ఆంధ్రభూమండలమున నేఁటికాలమున నీతో సమానులగు సత్కవీశ్వరులు లేరు. ఓ, కవిసార్వభౌమ! దాక్షారామ, చళుక్యభీమవర వారకామినులవక్షోజద్వయ గంధసారఘుసృణలేపముల సౌరభములచే విరాజిల్లెడు (మా)ద్వైరాజ్యముపై నీ ప్రౌఢసాహిత్యములు పరిఢవిల్లుచున్నవి, లేక ప్రాభవమును వహించుచున్నవి."

పై సమన్వయము సమంజసమో కాదో చెప్పుటకు పండితవరేణ్యులే శరణ్యము. ఇదియొకవిశిష్టమైన విషయము పరిశీలింపఁదగ్గది.

## ఆంధ్రదేశములోని ద్వైరాజ్యములు.

ఆంధ్రదేశములోని ద్వైరాజ్యములనుగూర్చి (Dual Kingship) యిదివఱకు శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులవారు ఆంధ్ర ఇతిహాసక పరిశోధక మండలివారి త్రైమాసిక పత్రికయందొకసారి చర్చించి, కోనహైహయుల శాసనములోని విషయములు పేర్కొని, పిఠాపురము మల్లపదేవుని శాసనముదాహరించి యందు నాల్గుతరముల ద్వైరాజ్యసంస్థాపనమునుగూర్చి చర్చించియుండిరి. వారు రాజమహేంద్రవర ద్వైరాజ్యమునుగూర్చి ప్రస్తావించి యుండలేదు. పేరునకు వీరభద్రారెడ్డిరాజనియు, వాస్తవికముగా, వేమారెడ్డియేరాజనియు మాత్రము చెప్పి యూరకుండిరి. ఈ ద్వైరాజ్యములో ఆంధ్రదేశ ప్రాచీన రాజ్యాంగతంత్రచరిత్రములో నొకవిశిష్ట సన్నివేశము. కొటి

లన్నిఁ డీ ద్వైరాజ్యములు ఆయా రాజ్యముల పరస్పర చిత్తవృత్తుల ననుసరించియుండుననియు, రాజ్య విచ్ఛిత్తికే మూలములనియు నొక్కి వక్కాణించియున్నాఁడు. మన రాజమహేంద్రవర రెడ్డి ద్వైరాజ్య మట్టిదికాదు. వేమవీరభద్రారెడ్లు పరస్పరానురాగములుగల రామలక్ష్మణులను బోలుటచే రాజమహేంద్రవరరాజ్యవైభవ మెంతటి యుచ్ఛస్థితినిగాంచెనో సారస్వతమును, చరిత్రయుఁ జెప్పకచెప్పుచున్నవి. ఆ విషయమిచ్చట వ్రాయుట చర్వితచర్వణము. భీమఖండ కాశీఖండకృతులే పై విషయమునకుఁ బ్రతికృతులు.

<u>గ్రంథపరిశీలన పట్టిక.</u>

(1) కాశీఖండము-శ్రీనాథుఁడు

(2) శ్రీనాథుఁడు-శ్రీ చిలుకూరి వీరభద్రరావు

(3) అర్థశాస్త్రము-కౌటిల్యుఁడు ఆంగ్లానువాదము. పుట 395 (శ్యామశాస్త్రి) (1915)

(4) అర్థశాస్త్రము-కౌటిల్యుఁడు-ఆంధ్రానువాదము పుట 337 (శ్రీ వెంకట రంగయ్య-వెంకటశాస్త్రి) (1923)

(5) ప్రాచీన హిందూ దేశమున ద్వైరాజ్యములు.

(Dual Kingship in Ancient India-Sri P. Srinivasachari, Andhra Historical Research Society, Journal of-Volum XII; Part III; January 1939)

(6) వేమవరము శాసనము. (శా. శ. 1356)

Epigraphia Indica Vol. XIII

పై శాసనము శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు రచించిన "శ్రీనాథ కవితా సమీక్ష" యను గ్రంథములో ననుబంధముగఁ బ్రచురింపఁబడినది.

(7) మాళవికాగ్ని మిత్రము-కాళిదాసు

పంచమాంకము:-

రాజ: మౌద్గల్య-తత్ర భవతో ర్భ్రాత్రో ర్యజ్ఞ సేన మాధవ సేనయో ర్ద్వైరాజ్య మిదానీ మవస్థాపయితు కామోఽస్మి॥

(ద్వైరాజ్యము-ద్వయో రాజ్ఞో ర్భావః కర్మవా)
("ద్వౌ రాజానౌ యత్ర స ద్విరాజో దేశః. తస్యభావః ద్వైరాజ్యం")

(8) ద్వైరాజ్యము (1) A Kingdom divided between two Princes, or Kings.

(Apte; Macdonell; Monier-Williams వారల సంస్కృతాంగ్ల నిఘంటువులలో నిచ్చిన ఆంగ్లపరిభాషికములు)

(2) A rule of a Country by two kings-Shamasastry Ardhasastra.

శ్యామశాస్త్రిగారి ఆంగ్లానువాదము.



# శృంగార నైషధకర్తయగు శ్రీనాథుఁడు
# పల్నాటి వీరచరిత్ర కర్తయగునా.?

(శ్రీ) శిష్టా రామకృష్ణశాస్త్రి.

ద్విపద పల్నాటివీరచరిత్రను శ్రీనాథుఁడు, మల్లయ, కొండ
యాదులు రచించిరని గ్రంథస్థవిషయములనుబట్టి తెలియుచున్నది.
మిగిలినవారివిషయ మెట్లున్నను, శ్రీనాథుఁ డనఁగనే, శృంగారనైషధ
కర్తయు నితఁడు నొకఁడా, వేఱా, యనుమీమాంస బహుకాలము
నుండి చెలరేగి పండితులను గలవరపఱచుచున్నది. ఆంధ్రసారస్వత
విమర్శనమున నది యొక క్లిష్టసమస్యగా పరిణమించినది. యథార్థమున
కాంధ్రనైషధకర్తయే పల్నాటివీరచరిత్రకర్తయైనచో నాంధ్రులు
గర్వింపవలసినకారణమేకాని, న్యూనతపడవలసిన కారణము గాదు.
ఏలన, భారమువంటి పల్నాటివీరచరిత్రకు కర్తయగు శ్రీనాథుఁడు,
వ్యాసునివంటి వాఁడయినాఁడని. కాని శృంగారనైషధకర్తయు పల్నాటి
వీరచరిత్రకర్తయు నొకఁడే యనువాద మెంతప్రబలముగా నున్నదో,
కాదనుమతముగూడ నంతతీవ్రముగనే పండితులలో నుండుటచే, నేది
సత్యమునకు సన్నిహితముగా నున్నదో విచారింపవలసియున్నది. జన
సామాన్యమున కీచర్చతోఁబనిలేదుకాని,సత్యగ్రాహపారీణులగు పండి
తల కిది తప్పక యవసరమే. "సత్యము దేవునికిఁ దెలుసని" తేలికగ
కొట్టివేసిన ప్రయోజనములేదు. ప్రతివిషయమునను సత్యము దేవు
నికిఁ దెలియకపోదు, కాని దేవుఁడుప్రత్యక్షమైయిదమిత్థమని సాక్ష్యము
చెప్పఁడుకదా!మఱియు నీకాలమున దేవునికళ్లలోఁగూడ దుమ్ముకొట్టి,
సత్య మసత్యముగను, నసత్యము సత్యముగనుజేయఁగల మహాను
భావులు బయలుదేరిరి. కాన బాహ్యాంతర ప్రమాణములనుబట్టి,
యేవాదము సత్యసమీపముగనుండునో నిర్ణయింపవలసిన బాధ్యత
పరిశోధకుల కున్నది. పరిశోధనప్రయోజనమే యిది. పరిశోధనలఫలి
తముగా నెన్ని సత్యవిషయములు బయలుపడలేదు? వాదోపవాద

ముల చర్చ నికషమువంటిది. కాని యీచర్చలు సహేతుకముగను, సప్రమాణముగ నుండిన సత్యము తేలఁగలదేకాని, కేవల మూహలపై నాధారపడిచిన నవి, గగనసౌధములుమాత్రమే కాఁగలవు. సత్యాన్వేషణబుద్ధితో, నిర్లిప్తభావముతో, నిష్పక్షపాతముగ, వ్యక్తిగతముగాని వాదవిమర్శతోడ్పడఁగలదేకాని, యేదోయొకమతమునకుఁ గట్టిపెట్టుకొని, దాని కనుగుణముగ వాదము సాగించిన ప్రయోజన ముండదు. "ప్రమాదో ధీమతామపి" యందురుకాన, పూర్వుల వాదము లప్రతిహతము లని భావింపక, పునఃపరిశీలనచేసి, దోషము లున్నచో నూర్చుకొని, సప్రమాణము, సహేతుకమునైన మతము నంగీకరించుట న్యాయ మగును. అందు గుణమున్నచో బాలురయభిప్రాయమైనను పరిగ్రహింపఁ దగినదేకాని పరిహరింపఁదగదు.

ద్విపద పల్నాటివీరచరిత్రభాగమగు 'కల్లుప్రతిష్ఠ' గ్రంథావతరణికనుబట్టి 'కల్లుప్రతిష్ఠ-బాలచంద్రులయుద్ధ' భాగములు కవి సార్వభౌముఁడైన శ్రీనాథుఁడు రచించినాఁడని అకిటిరాజు ఉమాకాంతంగారు నిర్ణయింపఁగా, తా నావాదమునే బలపఱచినాఁడ నని 'విశాలాంధ్ర' ప్రతి పీఠికకర్తయగు పింగళి లక్ష్మీకాంతంగారు పీఠికాంతమునఁ దెలిపిరి. కాన ఉమాకాంతంగారు చేసిన నిర్ణయమందలి యౌచిత్యమును, వి. పీ. కర్త బలపఱచుటలోని సామంజస్యమును పరిశీలింపవలసియున్నది. కల్లు ప్రతిష్ఠకర్తయు, శృంగారనైషధ కర్తయు నొకరా, భిన్నులా యని నిర్ణయించుట కొక కల్లు ప్రతిష్ఠావతరణికనుమాత్రము విచారించినచో సత్యము తేలదు, దానిని శృంగారనైషధ, భీమఖండ, కాశీఖండ, హరవిలాసాది గ్రంథావతరణికలతో జాగ్రత్తగాఁ బోల్చిచూచినఁగాని యథార్థము నిర్ణయింపరాదు. కల్లు ప్రతిష్ఠ గ్రంథావతరణికలోని శ్రీనాథనామము, భారద్వాజగోత్రమును గాంచి, భ్రాంతిచేతనో, లేక తనస్వగ్రామమైన

గుత్తికొండ పల్నాడుసీమలో నుండుటచే నభిమానముచేతనో, శృంగారనైషధకర్తయే యతఁడని భావించి, ఉమాకాంతంగారు, అందలి పేలవత్వాది దోషముల నేదోయొకవిధముగా సమర్థించి, దాని కొక బృహత్పీఠిక వ్రాసి, యతుకులబొంత కొకస్వరూపమును గల్పించినారు. సారస్వతమున వారు పడినపొరపాటులలో నిది యొకటి. వారు పొరపడిన విషయములు. (1) శ్రీనాథుఁడు కర్ణాటుఁడుగాని యాంధ్రుఁడు గాఁడనుట (2) అతఁడు వీరశైవుఁడనుట (3) అతఁడే పల్నాటి వీరచరిత్రను వ్రాసినాఁడనుట (4) "నన్నయానువాదం యెంత యధమమైు ఉత్తమాధికారులకు ఎంత అగ్రాహ్యమైనా, అత డారంభించిన పద్యం ఎంత మురికిలక్షణాలు కలది అయినా" అనిభావించుట (5) నన్నయకూడ కర్ణాటకవియే యనుట. (6) తిక్కన చేసిన ద్రౌపదీ కీచకుల శృంగారవర్ణన దూష్యమనుట మొదలైనవి. "ప్రమాదో ధీమతామపి" అనికదా. అందులో "లోకో భిన్నరుచిః" కూడ కలిసినది. ఉమాకాంతంగా రుద్దోటమైన పండితుఁ డనుటలో సందేహము లేదు. వారు (1)కల్లు ప్రతిష్ఠగ్రంథావతరణికను శృంగార నైషధాది గ్రంథావతరణికలతోఁ బోల్చియు. (2) కల్లు ప్రతిష్ఠావతరణికను ఇతర పల్నాటిచరిత్రభాగముల యవతరణికలతో మిశ్రము చేయకయున్నను, (3) కల్లుప్రతిష్ఠ-బాలచంద్రుల యుద్ధములలోని భావను, శైలిని శృంగారనైషధాది గ్రంథముల భాషాశైలులతో జాగ్రత్తగాఁ బోల్చియున్నను (4) కల్లుప్రతిష్ఠ-బాలచంద్రుని యుద్ధములందలి యనౌచిత్యములను జాగ్రత్తగా పరిశీలించియున్నను నీపొరపా టొనర్చియుండరు. వారిమతమందలి యౌచిత్యానౌచిత్యములను విచారింపకుండ, దానినే బలపఱచిన వి. పీ. కర్త, ఉమాకాంతంగారి యుపపత్తులనే పునరుక్తిచేసి, వానిని సమర్థించుటకు వారి యుదాహ

రణములతోపాటు మఱికొన్ని యసందర్భములను జోడించి పూర్తి చేసిరి. కాన నామతమును పునఃపరీక్షించి యందలిదోషములను పైనఁదెల్పిన నాల్గు మార్గముల విచారించి సత్యమునకు సన్నిహిత మైన విషయమును గ్రహింపవలసియున్నది.

స్థూలదృష్టితో విచారించినపుడు పల్నాటివీరచరిత్రకర్తయు, నాంధ్రనైషధ కర్తయు నొకరు కాఁజాల రనుటకు ముఖ్యముగా మూఁడుకారణములు కనఁబడుచున్నవి. (1) నైషధకర్త శివారాధన పరుఁడు కాఁగా, పల్నాటివీరచరిత్రకర్త వైష్ణవభక్తుఁడుగాఁ దోఁచుచున్నాఁడు, (2) ఆంధ్రనైషధాధికృతుల భాషాశైలులు దీర్ఘసంస్కృత సమాసభూయిష్ఠమైన గంభీరశైలిలో నుండఁగ, వీరచరిత్రభాషాశైలులు తేటతెలుఁగుమాటలతో సరళమైనశైలిలో పేలవముగనున్నవి ఆంధ్రనైషధాది కావ్యములో, మహారాజులకు, వారిమంత్రులకు, ధనవంతులకు నంకితమీయఁబడి. కర్తకు కీర్తి ధనార్జన సాధకములు కాఁగ, వీరచరిత్ర పిచ్చుకకుంటులు పాడుకొనుట కుపయోగపడి, కర్తకు కీర్తి ధనార్జనముల కెంతమాత్ర ముపయోగింపకుండెను. ఇవి కాక మఱికొన్ని యితరకారణములుగూడఁ గలవు. అవి సందర్భానుసారముగ పరామర్శింపఁబడును. ప్రస్తుతము పైమూఁడు కారణము లెంతవఱకు సమంజసముగ నున్నవో పరిశీలింతము.

(1) ఆంధ్రనైషధకర్తయైన "శ్రీనాథుఁ డాచారమునకు వీర శైవుఁడైనను శివుఁడని విష్ణువని పోరాడెడు బుద్ధిమంతులవలెఁగాక, న్యాయశాస్త్రము లభ్యసించి జ్ఞానదృష్టిగలిగిన వేదాంతిగాఁ గనఁబడుచున్నాఁడు" అని అక్కిరాజు ఉమాకాంతంగారు తన పల్నాటి వీరచరిత్ర ప్రథమభూమికలో వ్రాసియున్నారు. (చూ. పుట. 48- 1938వ. సం. ప్రతి.) నా'వీరశైవాంధ్రవాఙ్మయము'ను సమీక్షించిన యొక యనామక ప్రబుద్ధుఁడు ఆంధ్రపత్రిక- (ఆదివారం,

ఆగస్టు 2-1953) లో "శ్రీనాథుడు ఆరాధ్య వీరశైవమును ప్రతిపాదించిన శివకవి" యని వీరశైవ మత సంప్రదాయము తెలియఁగక వ్రాసినాఁడు. వీరశైవులు లింగధారణమొనర్చి, శివేతరదైవములను స్మరింపకుండుటయేకాక, శైవులుగాని వారిదర్శన స్పర్శసంభాషణాదులనుగూడ నెఱపరు. శ్రీనాథుఁ డట్టివాఁడు కాఁడుగనుక వీరశైవుఁడు గాఁడు. ఈతఁడు 'ఈశ్వరార్చన కళాశీలుఁడ'యిన స్మార్తబ్రాహ్మణుఁడు. ఇందువలన నాంధ్ర నైషధకర్తకు విష్ణుభక్తి రెండు కాకపోయినను శివవిష్ణుభేదము పాటింపనివాఁడు. ఆంధ్రనైషధకర్తయే పల్నాటి వీరచరిత్రకర్తయని వాదించుటలోమాత్ర మొకవిప్రతిపత్తి లేకపోలేదు. ఉపాసకుల కితరదైవములందు ద్వేషభావము లేకపోయినను, తమయిష్టదైవమైన యుపాసనాధిదైవము నెక్కువభక్తిశ్రద్ధలతో నారాధించి, వానిమూలముననే తమయిష్టార్థసిద్ధిని పొందుట సంప్రదాయము. ఉపాసకు నాజ్ఞాపించి యేపనినైనను జేయించుకొనుట కుపాసనాదైవమున కున్నశక్తి, యితరులకుండదు. ఇట్టి యుపాసకోపాసనాదైవముల సంబంధముమంత్రశాస్త్రసంప్రదాయము ఒకవ్యక్తి కొక్కయుపాస్యదైవ ముండునే కాని, యనేకు లుండరు. ఇతరదైవములం దుపాసకునికి సామాన్యభక్తిశ్రద్ధ లుండవచ్చును. ఇట్టిచో, 'నీశ్వరార్చనకళాశీలుఁడై'న యాంధ్రనైషధకర్త 'శివభక్తిపరుఁ డ'నుటయేకాక, "మాచెర్ల చెన్నకేశవపాదసేవారతుండ'నని చెప్పికొనుట యెట్లని సందేహము. "చెన్నకేశవుఁడు పల్నాటివీరుల కిష్టదైవముకాన, నాయనను స్మరింపకుండ పల్నాటివీరులకథను వ్రాయుట పొసగద"ని సమర్థింపఁదలఁచినచో, చెన్నకేశవునకు సామాన్యముగా నమస్కారము లర్పించి మాచెర్ల చెన్నుని మదిలోనఁ దలఁచి" అనినఁజాలు. కాని చెన్నకేశవపాదసేవారతుండ" నని తన యిష్టదైవమునుగూర్చి చెప్పికొని నట్లుగా విశేషముగా నుడువుట

పొసగను. "శ్రీనాథుఁడనువాఁడు, శివభక్తిపరుఁడ" ననికదా, తన యిష్టదైవమునుగూర్చి చెప్పికొనినది. మఱియు "శ్రీకంఠు పరమేశు శివు నాత్మఁ దలఁచి" అని యిష్టదేవతాస్మరణముచేసి, మరలఁ దాను 'శివభక్తుఁడే' నని యేల తెల్పవలెను. ఎట్టాపగ్గిష శంభుదాసుఁడైన శివభక్తుఁడకదా. అతఁడు హరివంశరచనకు ముందు హరిస్మరణ చేయనచ్చును. కాని, "హరిభక్తుఁడ" నని, "హరిదాసుఁడ" నని, "హరిపాదసేవారతుఁడ" నని తెల్పుకొనినచో, శంభుదాస్యమునకు, శంభుభక్తికి విశిష్టత్వమే చేకూరదు. ఒకవ్యక్తికిష్టమైన మొకఁడే యుండునుకాని పలువురు ఇష్టదైవము లుండిరనుట సరసముకాదు. కావున శివభక్తుఁడైన శ్రీనాథుఁడు చెన్నకేశవపాదసేవారతుఁడు గాలేఁడు; చెన్నకేశవపాదసేవారతుఁడైన శ్రీనాథుఁడు శివభక్తుఁడు గాలేఁడు. ఇందుచే శివభక్తుఁడైన యాంధ్రనైషధకర్తయగు శ్రీనాథుఁడు వేఱు. పల్నాటివీరచరిత్రకర్తయైన 'చెన్నకేశవపాదసేవారతుఁ డగు శ్రీనాథుఁడు వేఱుకావలెను. కాన, 'శివభక్తిపరుఁడ' యను పాఠముగాని, 'మాచెర్ల చెన్నకేశవపాదసేవారతుఁడ' యనుపాఠము గాని ప్రక్షిప్తముగావలెను. 'శివభక్తిపరుఁడ'యను పాఠమే ప్రక్షిప్త మని వక్ష్యమాణకారణములనుబట్టి నిర్ణయింపఁబడును. పోనీ, యింత చెన్నకేశవస్వామి భక్తుడగు శ్రీనాథుడు పల్నాటిలోని తేళ్ళను, రాళ్ళను, జొన్నకూడును, విధవలను, పురోహితులను వర్ణించిన వాఁడు, మాచెర్లలోని చెన్నకేశవునిమీఁద నొకఁ చిన్నపద్యము నైనఁ జెప్పలేదేమిపాపము? జాతీయకవికదా యతఁడు. పల్నాటి మండలముమీఁద నసహ్యాభావమును, నందలిదేవులమీఁద నిరాదర మును గల శ్రీనాథునికి పల్నాటివీరులమీఁద నభిమానగౌరవము లెకడ నుండి వచ్చినవయ్యా, పిచ్చుకకుంటలకొఱకు పల్నాటివీర చరిత్రను వ్రాయుటకు?

(2) నైషధాదిగ్రంథములలో శ్రీనాథుఁడు ప్రౌఢసారస్వత మున కనుగుణముగనుండుటకై సంస్కృతసమాసములను తీర్చిదిద్దె ననియు, వీరచరిత్రమును పాడుకొనుటకు సామాన్యజనులకు ప్రీతికర ముగా నుండుటకై సులభశైలిలో రచించె ననియు, మఱియు వార్ధక్య మువలనఁ గలిగినబుద్ధి బలహీనతవలన పేలవములో నీరసములో యైనభాగములను శ్రీనాథుఁడు రచించెనని సమర్థనపూర్వకముగ నంగీరింపఁబడినది. ఇట్లు పండితు లంగీరించుచున్నను కొంద రాగ్ర హించి, యది "కొందఱి యభిప్రాయముమాత్రమే" యని యావాద మును సంస్కరింపఁజూచి చివరకు "ఒకకఁ-భాషతకఁ- పల్నాటి వీరచరిత్రకర్తృత్వము;ను శంకింపనకఁ-అలే దనుచున్నారు. ఈభాషా శైలిలోపములను సమర్థించుచు "దీని కిదమిద్ధమని సమాధానము చెప్పుట కష్టము"- "లేక మఱియేదైనను కారణము కావచ్చును" అని యొకవాదమునకు సమాధానముచెప్పుచుండుటలోనే, యది దుర్బలమైన సమాధానమని స్పష్టపడుచున్నదికదా! సమాధానము సకారణమైనదిగను, బలమైగదిగను లేకపోయినచో, పూర్వపక్షమే నిలుచును. ప్రతిభాషలోను ప్రతిసుప్రసిద్ధకవికి నొకవిశిష్టమైన భాషా శైలు లలనడును. ఆయాలక్షణములచేతనే యిది నన్నయశైలి, యిది తికఁ-నది. శ్రీనాథశైలి యిట్లుండును. పోతనశైలిలో విశేషమిది యని నిర్ణయింపఁబడి గుర్తింపఁబడునుకదా. శైలివిషయమునుబట్టి మాఱు చుండినను గూడ నాయావిషయములలో నాప్రత్యేకవ్యక్తిత్వము బుద్ధి శాలురకు గోచరించుచునేయుండును. సామాన్యముగా కవులు శృంగా రరసమును ప్రతిపాదించువిషయములను సరళమైనశైలిలో ప్రసాద గుణముతోను, వీరరౌద్రాదిరసములను ప్రతిపాదించువిషయములను దీర్ఘసంస్కృతసమాసములతోఁ గూడినప్రౌఢశైలిలో రజోగుణము తోడను రచించుట సంప్రదాయము, కాని శ్రీనాథమహాకవి తన

సహజశైలియగు దీర్ఘసమాసభూయిష్ఠమైన ప్రౌఢగంభీరమైనశైలితో శృంగారరసప్రధానమైన నైషధము నాంధ్రీకరించుటయేకాక, తన యితరగ్రంథములనుగూడ నట్టే రచించెను. ఇట్టివాఁడు వీరరౌద్రరస ప్రధానమైన పల్నాటివీరచరిత్రమును తనకు సహజమైనశైలివి పోనాడి, యౌచిత్యమైనను బాటింపక సరళమైనశైలిలో నీరసము, పేలవము నైనరచనను గావించె ననుట విశ్వసనీయముగఁ దోఁపదు. గుత్తకుఁ బుచ్చుకొనినభూమికి సిస్తుకట్టలేక, రాజభటులచే శిక్షపడి క్షోభపడుచున్న మనస్సుతో నవసాన కాలమునఁ జెప్పిన

సీ॥ కవిరాజుకంఠంబుఁ గౌఁగిలించెనుకదా,
పురవీధి నెదురెండఁ బొగడదండ,
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబుపైఁ,
దగిలియుండెనుగదా నిగళయుగము,
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత,
వియ్యమందెనుగదా వెదురుకోడియ
సార్వభౌముని భుజాస్తంభమెక్కెనుగదా
నగరువాకిట నుండునల్లగుండు

గీ॥ కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలుపెసలు
బొడ్డుపల్లెను గొట్టేటి మోసపోతి నెట్లు
చెల్లింతుఁ డంకంబు లేదునూగ్లు.

సీ॥ కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయడిచ్చుఁ?
గైలాసగిరిఁ బంటమైలారువిభుఁ డుండె
దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు?
రంభఁగూడెఁ దెనుంగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు?
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱిహేమ
పాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు?

గీ॥ భాసకరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ,
కలియుగ బున నిక నుండఁ గష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి॥

సీసపద్యములు కూడ ప్రౌఢశైలిలో, నుండి రసవంతముగా నున్నప్పుడు, చెన్నుని కృపచేత చిత్తముప్పొంగి, బాలుని విక్రమ ప్రౌఢియాతయును, విరచించినది పల్నాటి వీరచరిత్ర రచనము నీరసంబుగ పేలవముగ నుండుటకు 'వార్ధక్యమువలనఁ గలిగినబుద్ధి బలహీనత యని యారోపించుట యంతకంటె సమంజసముగాదు. పాలుకురికి సోమనాథుఁడు బసవపురాణపండితారాధ్య చరిత్రములను జనసామాన్యము పాడుకొనుట కొఱకు వ్రాసినాఁడు. ఈ రెండింటిలో పండితారాధ్య చరిత్ర నాతని వార్ధకమున రచింపఁబడినది. పండితారాధ్య చరిత్ర లోని యీ క్రింది రచనలను తిలకింపుఁడు.

రౌద్రము :—"ఈ యసంఖ్యాత మాహేశ్వరోత్థితసమా యత క్రోధోత్కటానలపటలు విరచితజ్వాలల నెలనాటిచోడ, ధరణీతలేశ్వరాధమ పతంగంబు భస్మమయ్యెడును, తద్బంధులు, సుతులు, విస్మయంబున నిష్ఠ భస్మమైపోదు."   మహిమ పుట 57

అద్భుతము :—"అతుల మహాద్భుతోద్యతభక్తి, యుత సమాహిత మహిమోపేతుఁడగుచు, తచ్ఛుఖుర స్త్రిసంధానావధాన, నుచ్చైరువుగ మున్నువుచ్చినయట్లు" మహిమపు 45. "కడలేని నిర్మల గాఢమహత్త్వజడతావిహారి విస్తారోదకములు, నంగీకృతాయతోత్తుంగ శృంగాఘ . ... .....

మంగళతరంగ తరంగ సంఘములు, పటుశైల చూడావిభాసి నీహారపటల ప్రకారవిస్తార ఫేనములు, శైలాగ్ర విహారణాసక్త పరిసుధవిశాల దివ్యవిమాన చయవహిత్రములు, నగసుత తద్విమానధ్వజదండ గురువహిత్రోత్తాల కూపదండకములు, సంచిత

నానావిశాస్థాన చయసమంచిత ద్వీపాంతరానీకములను" (పర్వత పుట 228).

"మానితప్రాసాదమండప గోపు, రానీక, దీపప్రభాభ్యంతర మున, విలసిత వివిధ ననీనాంబరప్ర, కలితమండపమొప్ప గావించి, యందు పరిచితక్రముకరంభా స్తంభముకుర, భరితోత్తరంగ శుంభ ద్ద్వారతతులు నంచిత నీలదృషత్కుట్టిమములు, నంచితోత్పల సమా యత తోరణములు, మానిత బహు వర్ణమహితోపవార్ధి, ఫేనపుంజ ములునుఁ బృథుతరంగములు భర్మాంబురంజిత పటుచిత్రవస్త్ర, నిర్మిత బహుపక్షినివహాతిశయము,అరుణాబ్జ కర్ణికారాశోకర క్త, కరవీరచంపక కైరవా ద్యఖిలసురుచిరప్రసవ నిష్యూతమాలా ప్రకరబంధతత్ప్రవ్యస్త ఘంటికావళులు వారక చీకటి వర్ణితమంద, మారాముదద్దీపమాలికా తరులు, ప్రాసాదగోపుర బహుహేమకలశ, భాసురద్యుతులు, శుంభ ధ్వజదండ ఖచితభాస్వత్ప్రభకలితదీధితులు, ప్రచురప్రభల పేర్మి రాత్రుల్ పగల్లు" (పర్వత 419-422)

పండితారాధ్య చరిత్రయందంతట నిట్టి భాగము లనేకములు కలవు. పై ద్విపదపంక్తులనుబట్టి జనసామాన్యము పాడుకొనుట కను వుగా నుండుటకుఁ గాని, వార్ధకమువలనఁ గాని కవి నీరసమును, పేలవమునగు రచన చేయుననుట సరసముగా నుండదు. ఇాతవఱ కెందులకు 70 సం.లు దాఁటిన వయసులో పింగళి లక్ష్మీకాంతము గారిటీవల రచించిన "తేజోలహరి" పద్యములు సమాసజటిలముగా నుండి ప్రౌఢగంభీరముగా లేవా? కాన వార్ధక వాదము విశ్వస నీయము కాదు.

III శ్రీనాథుఁడు పిచ్చుక కుంట్లు పాడుకొనుటకు సుద్దుల కవి త్వము వ్రాసియుండఁ డనుట కతని స్వభావమును పరీక్షింపవలసి యున్నది. శ్రీనాథుని స్వభావమును గూర్చి కీ. శే. వేటూరి ప్రభా

కర శాస్త్రిగారు తమ శృంగార శ్రీనాథమందు 299 వ పుటలో "శ్రీనాథుఁడు మహాభోగపరాయణుఁడు .. ...శ్రీనాథుఁడు నిర్వ్యాజముగా నొక్క గ్రంథమేని పారలౌకికఫలము నపేక్షించి భగవదంకితము చేసినట్లు కానరాదు. స్వర్ణపాత్రభోజనము, దీనారటంకారముల తీర్థమాడుటలు, జాంబూనదాంబరాభరణ ధారణములు, కస్తూరికా సుగంధాంగరాగానులేపనములు, నుద్యానవిహారములు, శ్రీనాథుఁడపేక్షించెను. తదుపలబ్ధికై గ్రంథముల రచించెను. అతనికి యశోలిప్స యపారము. "కావ్యములు పెక్కు చెప్పియుఁ గాంక్ష చనక, వెండియును గావ్యమొకటి గావింపఁదలఁచి"(భీమఖండము) శ్రీనాథుఁడెక్కడి కరిగినను కవితామహారాజ్య భద్రాసీనుఁడయి, శిష్యసంఘముతో కవితావిజయధ్వజముతో, బయల్వెడలెడివాఁడు" అని వ్రాసిన వాక్యములను ప్రత్యాఖ్యానము చేయువా రుండరు. ఇటువంటి స్వభావముగల శ్రీనాథుఁడు తన భోగములకుఁ గాని, కీర్తికిఁగాని తోడ్పడని సుద్దులకవిత్వమును పిచ్చుకకుంట్ల కొఱకై వ్రాసెననుట యతని స్వభావమునకు విరుద్ధమైన విషయమే కాని, పిచ్చుకకుంట్లపై నతనికసహ్యాభావ మనికాని, గౌరవము లేదనికాని నిర్ణయింపరాదు. భగవంతునికిఁ గాని, పితృదేవతలకుఁ గాని ప్రీత్యర్థము గ్రంథముల వ్రాయనివాఁడు పిచ్చుకకుంట్ల కొఱకు వ్రాయునా, శ్రీనాథునికి పల్నాటి సీమతో ప్రత్యక్ష సంబంధములేదని యెవరనఁగలరు ? అతనికి నాచెర్ల, గురజాల, కార్యంపూడి, చంద్రభాగానదీతీరములు మాత్రమే కావు సుపరిచితములైనవి. అక్కడి తేళ్ళతోడను, రాళ్ళ గుట్టలతోడను, జొన్నన్నముతోడను, పురోహితు లింటికృత్యముల తోడను గూడ నెక్కువ పరిచయము గలదని యాతని చాటుపద్యములు చదివినవారందఱికి సుస్పష్టమే. శ్రీనాథుని యాంధ్రదేశాభిమానము, జాతీయకవిత్వ మితరరచనలను బట్టి యెట్లున్నను, పల్నాటి

దేశాభిమానము మాత్ర మీ చాటువులవలన విశదమగుచున్నది. కాన పల్నాటిదేశాభిమానముచే పల్నాటివీరచరిత్రను మాత్రము శ్రీనాథుడు రచించియుండఁడు.

"అంతకుముందే యీ కథను, ప్రజలు పాడుకొనుచుఁ, వినుచు తన్మయులగుట కన్నులారఁజూచెను. దానిని అట్లే ప్రజలు పాడుకొని యానందింపవలయునని తలంచి, పద్యకావ్యమునకు అట్టి యోగ్యత లేదు కనుక, తాను గూడ, ఆ కథను పదరూపమున సంతరించియుండును" అని వి పీ కర్తచే సమర్థింపఁబడినది. ఇందులో "శ్రీనాథుఁడు అంతకుముందే యీ కథను ప్రజలు పాడుకొనుచు వినుచు తన్మయులగుట కన్నులార చూచెను" అని నిశ్చయించుటకు ప్రమాణమేమి ? శ్రీనాథుని భావమఱఁదియగు దగ్గుపల్లి దుగ్గనగాని, లేక శ్రీనాథుని సమకాలికులుగాని, యెవరైన, యొకరుఁడైన నట్లు తెలిపెనా ? ఎవరును దెల్పనిచో నీయూహ సత్యమని యెట్లు విశ్వసింపనగును. ప్రమాణరహితమైన యీ యూహకు సత్యత్వము, స్థిరత్వమును సిద్ధింపవు. కాన నది నిరాధారమై యంగీకార యోగ్యము గాక యుండును. మఱియు శ్రీనాథుని రచనయని చెప్పఁబడుచున్నఁ కల్లు ప్రతిష్ఠ-బాలచంద్రుని యుద్ధము' లలోనే నీరసములు, పేలవములు నైన భాగములు పిచ్చుకకుంట్ల నోళ్ళలోఁబడి భ్రష్టమైనవని వాదించినపుడు, శ్రీనాథుఁడు గూడ తాను ముందుగా వినిన పల్నాటివీరుల కథగూడ నట్లే పిచ్చుకకుంట్ల నోళ్ళలోఁబడి మూలరూపము భ్రష్టమై యుండునని యూహించి, యికముందు తాను రచించిన దోఁగూడ నట్లే యగునని గ్రహింపలేక పోవునా ? అందుచేఁ దనకు గౌరవహీనమగు నని సంకోచించియుండఁడా ? మఱియు తనకు ముందున్న పల్నాటి వీరుల కథాగేయరూపమే "ప్రజలు పాడుకొనుచుఁ వినుచుఁ తన్మయులగుట కన్నులార చూచి", సంతోషించినవాఁడును "తన్న,"

గూడ నావేశపూరితుని జేసిన "శ్రీనాథుఁడు మూలరూపము" పేలవముగా, నవ్యక్తరూపమున నున్నదనియు, తనకు తృప్తినీయకపోయె' ననియు, కాన నాకథనే మరల" పాడుకొనుటకు, చదువుకొనుటకు వీలుగా, సామాన్య ప్రజలకు ప్రీతికరముగా, సులభశైలిలో బుద్ధిపూర్వకముగా రచించినాఁడని వాదించుటలో నౌచిత్య మేమున్నది ? వ్రాసిన దానినే మరల నట్లే గేయరూపమున వ్రాయుటలో శ్రీనాథుని రచనలో సారస్య మేముండును. అదియుఁగూడఁ గొన్ని భాగములలో పేలవము, నీరసముగ పరిణమించినదికదా, దీనివలన ప్రయోజనమేమి సిద్ధించినది. కాన శ్రీనాథుఁడు గేయరూపమునఁ బూర్వమున్న పల్నాటివీరచరిత్రను–లేదా, బాలుని యుద్ధమును తిరిగి గేయ రూపమున వ్రాయవలసిన యవసరము గానఁబడదు పూర్వగేయ రచన కంటె మేలుగా వ్రాయవలె నని పోటీపడుట నేఁటికాల రచయితలకే పనిగాని, శ్రీనాథునివంటి ప్రతిభాశాలికి తగదు. ఇంగాచే పిచ్చుకకుంట్లకొలకు శ్రీనాథుడు వ్రాసెననుట (1) అతని స్వభావమునకు విరుద్ధమైనపని. (2) అనవసరము ననౌచిత్యము, సారస్యములేని పనికూడ. (3) పూర్వాపరవాక్యములకు పరస్పర విరుద్ధము లైన వాదన ఈసందర్భమున " మొదట పల్నాటిపదమును వ్రాసిన రచయితే యెవరని ప్రశ్నించుట వ్యవధి ప్రశ్న" అని వి. పీ. కర్తవ్రాసెను. కాని యీ ప్రశ్న సామాన్యజనమున కవ్యవధి ప్రశ్నయే కాని, సాహిత్యమీమాంసకులకు పండితులకుఁ గూడ నది యత్యవసరమైన ప్రశ్నయే. వలన, ఇద్దఱొక కావ్యమును వ్రాసినపుడు వానిని తులనాత్మక దృష్టితో పరిశీలించుట సారస్వత విమర్శప్రథమకర్తవ్యముకదా. ఇఁక మిగిలిన విషయములు విచారింపఁబడును.

వినుకొండ వల్లభరాయ కృతిగా చెల్లుచున్న క్రీడాభిరామమున శ్రీనాథుని భాషాశైలు లుండుటచే నది శ్రీనాథుని తోడ్పాటున

రచింపఁబడిన దని భావించి యందుల్లేఖింపఁబడిన పల్నాటి వీరుల గాథను పురస్కరించుకొని, పల్నాటివీరచరిత్ర భాగములైన కల్లు ప్రతిష్ఠ-బాలచంద్రుని యుద్ధము లు శ్రీనాథరచితములుగా పేర్కొనఁ బడుటచే, శృంగారనైషధకర్తయగు శ్రీనాథుఁడే పల్నాటి వీరచరిత్రను తప్పక రచించెనని యూహింపఁబడుచున్నది. కాన క్రీడాభిరామము నకు పల్నాటివీరచరిత్రకుఁ గల సంబంధ మెట్టిదో చిచారింపవలసి యున్నది. రావిపాటి త్రిపురాంతకుఁడు సంస్కృతమున రచించిన ప్రేమాభిరామమను వీథినాటకము చంపూశ్రవ్యకావ్య రూపమున నాంధ్రీకరింపఁబడినది క్రీడాభిరామము. ప్రస్తుతము ప్రేమాభిరా మము కానరాదు. అందలియితివృత్తం. మోరుగల్లునంధబి విషయ ములు గోవిందమంచనశర్మయు నతని చెలికాఁడు టిట్టిభసెట్టియు ముచ్చటించుకొందురు. ఇతివృత్త విషయ ప్రాధాన్యమునుబట్టి పల్నాటి వీరుల ప్రశంసయిందుండుటకు వీలులేదు. ఇందుచే వల్లభరాయఁడో, లేక శ్రీనాథుఁడోదానిని ప్రత్యేకాభిమానముచే రచించి చొప్పించిరని కొందఱును, ఆదిమూలమందే యే ప్రాసంగిక రూపముననో యుండి యుండును. కాన, పల్నాటివీరుల ద్విపదప్రబంధ ప్రశంస, త్రిపురాంత కుని కాలమునకే యుండియుండునని యితరులు నూహించుచున్నారు. ఇంతకు సంస్కృత ప్రేమాభిరామ మిపుడు కానరాదుకాన, నీరెండూ వాలు గూడ నేలవిడిచిచేసిన సాము లేయైనవి. కాన నేవరివాదమును గూడ పురస్కరించుటకుగాని, తిరస్కరించుటకుఁగాని వీలులేదు. కాన పల్నాటివీరచరిత్రకర్తృత్వమును క్రీడాభిరామముపై నాధారపడిచి నిర్ణయించుటమాత్రము ప్రమాదకరమేయగును. ఏలన, మొదట క్రీడాభిరామమునకే శ్రీనాథునకుఁగల సంబంధమే కొంత సందేహాస్ప దము, తర్వాత క్రీడాభిరామములోని విషయములు మఱికొంత సంశ యాస్పదములు కదా, ఇట్టి సందేహాస్పద విషయములపై నాధార

పఱచి పల్నాటివీరచరిత్ర కర్తృత్వము శ్రీనాథుని కారోపించుట సమం
జసముగానుండదు.

(5) వాదమునకొకనూఁఱు శృంగారనైషధకర్తయగు శ్రీనా
థుఁడే పల్నాటివీరుల ప్రశంసను ప్రత్యేకాభిమానముతో రచించి,
క్రీడాభిరామమున చొప్పించెదనని యంగీకరించినను, అతనిమాటలను
బట్టి యప్పటికే యొక "ద్విపద ప్రబంధము వీరానీకమును బాడిన"ది
కలదని స్పష్టమగుచున్నది. కదా ఈ"ద్విపద ప్రబంధమే శ్రీనాథ
రచిత పల్నాటివీరచరిత్ర ద్విపద ప్రబంధమని యెవ్వరైనను వాదిం
తురా ? లేక మఱియొకటియా, యతడు రచించినది. అగుచో, నిక
శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్ర నెప్పుడు రచించియుండునో విచారింప
వలసియున్నది. "రాజావలంబము విఱిగి పోయిన తర్వాతఁ కొండవీటి
వీడికొని పల్నాడుప్రాంతములఁ బర్యటించునపుడక్కడ ప్రజల ప్రార్థ
నముచేతఁగాని, దేశచరిత్రాభిమానముచేతఁగాని శ్రీనాథు డీగ్రంథ
మును (పల్నాటివీరచరిత్రము) రచించియుండును." అని వేటూరి
ప్రభాకర శాస్త్రిగారు తమ శృంగార శ్రీనాథము 240వ పుటలో వ్రాసి
నారు. అక్కిరాజు ఉమాకాంతంగారు తమపల్నాటిచరిత్ర ప్రథమ
భూమిక 58వ పుటలో "ప్రథమమున గౌరవమున పడయకపోయినను,
రానురాను శ్రీనాథుడు పల్నాటివారితో మిక్కిలి మైత్రిపాటించి తన
వార్ధకమంతయు నచ్చటనే గడపెను. పల్నాటివీరచరిత్ర మచ్చట
నుండియే వ్రాసినాఁడు. "69 వ పుటలో" పల్నాటివీరచరిత్రమే
యితడు రచించిన గ్రంథములలో నెల్లఁ జివరిగ్రంథమని చెప్పవల
యును. శైలినిఁబట్టికూడ నిట్లే తలఁపవలసియున్నది. వీరచరిత్రము
తర్వాత నేమియు రచించినట్టు కన్పట్టదు. "మఱియు 94 వ పుటలో"
శ్రీనాథునికిఁ బూర్వము మంజరీకావ్యము రచించినవా రెవరును లేరు.
ఇతడు వ్రాసిన గ్రంథములలో నిది చివరిదియుఁ బరిణామావస్థలో

వ్రాయఁబడినదియుఁ గనుక వ్రాయునాఁటికి లోకానుభవ మధికముగా గలిగినట్లు గనఁబడుచున్నది. అని వ్రాసినారు. ఇక చిలుకూరి వీరభద్ర రావుగారు ఆంధ్రులచరిత్ర మూఁడవభాగములో "శ్రీయుతులైన ఉమాకాంతముగారు ప్రచురించిన పల్నాటివీరచరిత్రభాగము శ్రీనాథ కవి రచితము కాదని తోఁచుచున్నది. ఉమాకాంతముగారు పల్నాటి వీరచరిత్రమును శ్రీనాథుఁడు వార్ధకదశయందు వ్రాసెనని వ్రాయుచు న్నారు. కాని నిక్కముగా నాతఁ డాచరిత్రమును రచించి యుండె నేని బాల్యముననే వ్రాసియుండును. కాని, తప్పులతడిక వార్ధక్య మందు వ్రాసి యుండఁడు. "అని వ్రాసి, తమ శ్రీనాథకవి జీవితమున 138 పుట నధోపీఠికలో ఏపల్నాటి వీరచరిత్రమును శ్రీనాథకృత మని వ్యవరించుచున్నారో అది శ్రీనాథకృతము కాదని నాయభిప్రా యము" అని తెల్పినారు.

కాశీఖండము రచించిన తర్వాత- రాజావలంబము విరిగిపోఁగా శ్రీనాథుఁడు పల్నాటికి పోయెననుటకు తగిన కారణములు లేవు అచట తన్నుపోషించురాజులా, లేరు. వార్ధకమున శాంతముగా సుఖజీవ నము జరుపుకొనుటకు అది తగిన సౌకర్యములు గల ప్రదేశమూ, కాదు. అభిమానమునఁబడిపోవుటకు సరియగు కారణములు కనఁబడవు. వార్ధకము నంతయు నచటనే గడపెనని యుమాకాంతముగారు వ్రాసి నమాటలకు ప్రమాణమేమియుఁ గానరాదు ఈకాలమున శ్రీనాథు నకుఁ గావలసినది ధనార్జనము. అది పల్నాటిలో దొరకుట కవ కాశము లేదు. పల్నాటివీరచరిత్రను వ్రాయుటవలన నందలి జనులు గాని పిచ్చుకకుంటులుగాని యతనికి ధనమును కూర్చిపెట్టరు. చిట్టచివ రకు బొడ్డుపల్లెను గుత్తకు తీసికొని వ్యవసాయము చేయించె ననికదా తెలియుచున్నది. ఈమధ్యకాలములో నతఁడు శ్రీశైలమునకేఁగి కొంత భిక్షావృత్తి వలనఁగొంత ధనము గ్రహించి శివరాత్రిమాహాత్మ్య

మును రచించెను. తత్పూర్వమో తత్పరమునవో యొకినాటిలోని మోపూరును పాలించు వల్లభరాయునికడ కేఁగి క్రీడాభిరామరచనమున నతనికి సాయమొనర్చి శ్రీనాథుఁడు కొంత ధనార్జనముచేసియుండును. కాని నాదరించి పిలుచుటకైనను పల్నాటిలో నెవరు రసికులుగాని, విద్యాభిమానులుగాని లేరని పూర్వానుభవమువలన శ్రీనాథుఁడు గ్రహించినాఁడు. ఇందుచే వార్ధక్యమున నచటికిఁబోవుట కష్టపడుటకేకాన నచటికిఁ బోయెననుటయసంభావ్యము అందుచే, నతఁడప్పుడు పల్నాటి వీరచరిత్ర రచించెననుటయు నసంభావ్యమే. పోనీ, యంతకుఁ బూర్వమే యెప్పుడో రచించియుండునందురా! అట్లే యగుచో క్రీడాభిరామమున సూచింపఁబడిన "వీరానీకమును బాడిన ద్విపదప్రబంధము" శ్రీనాథునిచే రచింపఁబడినదియై యుండుననుట సరసముగా నుండును. కాని యది శ్రీనాథుని దని క్రీడాభిరామమున తెల్పకుండుటచే నదికూడ శ్రీనాథకృతము కాదని, నిర్ణయింపవలసి వచ్చును. ఏలన, శ్రీనాథునిదేయైనచో నది తత్పూర్వ పల్నాటిచరిత్ర గ్రంథములకంటె నెక్కువ రసవంతముగా నుండి శీఘ్రముగ ప్రచారములోనికి వచ్చుటయేకాక, తద్గ్రంథాభిమానముచేతనైన వల్లభరాయఁడుగాని శ్రీనాథుఁడుగాని దానిని తప్పక తత్కర్తృనామనుముతో సహా పేర్కొనియుందురేకాని, కర్తృహీనముగా పేర్కొనియుండరు. అట్టిది లేకుండుటచే నది శ్రీనాథకృతము గాదనవలసియుండును.

భీమేశ్వరపురాణమున మూలమందులేని యాంధ్రదేశ వర్ణనలను శ్రీనాథుఁడు చేసినాఁడు. అట్లే జాతీయకవియైన శ్రీనాథుఁడు జాతీయవీరుల వీరగాథను రచించియుండు నందురు. భీమేశ్వరపురాణమున నొనర్చిన యాంధ్రదేశవర్ణనలకు పల్నాటిచరిత్రరచనకు చాల భేద మున్నది శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమును రచించుట తాను కొండవీటి రాజ్యమునుండి రాజమహేంద్రవరమునకు వచ్చినపుడు జరి

గినది కొండవీటి రెడ్డిరాజులకు రాజమహేంద్రవర రెడ్డిరాజులకు శత్రుత్వముండెను. శత్రురాజులనుండి వచ్చిన శ్రీనాథుఁడు రాజమహేంద్రవర రెడ్డిరాజులను, నచటి ప్రజలను మంచిచేసికొనవలసిన యవసరమెంతేనియు గలదు. అందుచే తాను పూర్వము కొండవీటిని పొగడిన దానికంటె నధికముగ రాజమహేంద్రవరమును తత్ప్రాంతప్రదేశములను పొగడవలసిన యవసరము శ్రీనాథునకు పట్టినది. దీనికిఁ దోడు తాను శివభక్తిపరుఁడగుటచే, దాక్షారామ భీమేశ్వరుని నాచుట్టుపట్లనున్న శివక్షేత్రములను విపులముగా వర్ణించి తన యభిమానమును తీర్చికొనినాడు. అట్టియవసరములు పల్నాటివీరచరిత్ర రచనమునఁ గానరావు. పల్నాటివీరుల సాహసకార్యములను వర్ణించుటయందు శ్రీనాథున కుత్సాహ ముండిన నుండవచ్చును. కాని దానికిఁ దగిన దోహదము లేకపోయినది. మఱియు వార్ధకము వీరరౌద్రరసప్రధాన కావ్యములను రచించుటకుఁ దగినకాలము కాదుకదా. కాన తనకు ధనమవసరముగా నున్నకాలమున, జాతీయాభిమానము చేత, పిచ్చుకుంటలు పాడుకొనుటకుఁగాను సౌకర్య మేమియు లేని పల్నాటికి, సుఖజీవనము చేయవలసిన వార్ధకములో, నతిసుకుమారాభిరుచులనలవఱచుకొనిన శ్రీనాథుఁడు పోయి, నివృత్తితో పల్నాటివీరచరిత్రమును గేయముగా రచించె ననుట యెన్నివిధముల నెంత సహృదయభావముతో విచారించినను సత్యదూరముగా నుండకమానదు. మొట్టమొదట పల్నాటివీరచరిత్రమును ప్రచురించిన శ్రీ అక్కిరాజు ఉమాకాంతమువంటివారు, తమస్వగ్రామము పల్నాడులోనిదగుటచే పల్నాటిమీఁది యభిమానముచే శ్రీనాథుని వార్ధకమున పల్నాటికాహ్వానించి యతనిచే పల్నాటివీరచరిత్రమును వ్రాయింపఁ దలఁచినను వారి కాయనమాత్ర మిచ్చు సమాధానమిది.

క॥ రసికుఁడు పోవఁడు పల్నా
డెసఁ గంగాజంభ మైన నేకులెవడకున్ఁ
వసుధేశుఁడైన దున్నను
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్॥

ఉ॥ అంగడి యూరలేదు, వరియన్నము లేదు, రుచిత్వ మేమి లే
దంగన లింపులేదు, ప్రియమైన వనంబులు లేవు, నీటికై
భంగపడంగఁ బాల్పడు కృపాపరు లెవ్వరు లేరు దాత లె
న్నంగను సున్న గాన పలనాటికి మాటికిఁ బోవ నేఁటికిన్!

అని వ్రాసికొనిన శ్రీనాథుఁడు వార్ధకమున పల్నాటికిఁబోయి పల్నాటిచరిత్రను వ్రాసెననుట కల్ల. బాల్యమున (తత్పూర్వము) గూడ వ్రాసి యుండఁడనుట కా చాటుపద్యములే ప్రమాణమగునుకదా శ్రీ అక్కిరాజు ఉమాకాంతంగారి మీఁద నాకభిమానములేక వ్రాసినది కాదు నేను. ఆయన మా తాతగారు శిష్టా సీతారామశాస్త్రిగారి ప్రియశిష్యులు (చూడుఁడు వారి నేఁటికాలపు కవిత్వము గురుస్తుతి) కాని నాయభిమానము సత్యసన్నిహిత విషయములను గూడ కప్పి పుచ్చునంతగొప్పది మాత్రముగాదు.

(6) శ్రీనాథుఁడు తననైషధాంధ్రీకరణము నొకగొప్ప ప్రజ్ఞగా భావించి, తరువాత రచించిన గ్రంథములం డెల్లెడలను దానిని గర్వముతో పేర్కొనుటయేకాక, యొడ్డెరాజులు తన్ను భూమి సిస్తుకై బాధించినకాలములోఁ గూడ మక్కువతోఁ జెప్పికొనుట మఱవలేదు. చూడుఁడు.

"కల్పించినాఁడవుగాఢపాకంబైన,హర్ష నైషధ కావ్యమాంధ్రభాష'
"నవమరుత్తు చరిత్రంబు, నైషధంబు; సప్తశతి పండితారాధ్య
"చరితమనగ కావ్యములు పెక్కు చెప్పియుఁ గాంతు చనక"

భీమేశ్వరపురాణము I, 24.

" సంతరించితి నిండు జవ్వనంబునయందు, హర్షనైషధ కావ్య
మాంధ్రభాష" కాశీఖండము I, & 13.

"నైషధాది మహాప్రబంధములు పెక్కు చెప్పినాడవు"

"అధ్వర్యు వేదశాఖాధీతి నిష్ణాతుః సంధ్రభాషా నైషధాబ్జ భవుని"
హరవి. (1-8)

శివరాత్రిమాహాత్మ్యమున పీఠికభాగము గ్రంథ పాతములతోఁ గూడియుండుటచే నాంధ్రనైషధమునుగూర్చి శ్రీనాథుఁడు చెప్పికొనిన పద్యము పోయియుండును. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమశృంగార శ్రీనాథము 27వ పుటలో నిట్లువ్రాసిరి. "శివరాత్రిమాహాత్మ్యగ్రంథావతరణిక గ్రంథపాతములతో నున్నది. కావునఁ దెలియఁదగిన విశేషములు కొన్ని మఱుగుపడియున్నవి." కాన నాకు గూడ నాంధ్రనైషధమునుగూర్చి శ్రీనాథుఁడు తప్పక గర్వముతో చెప్పికొనినాఁడని విశ్వసింపవచ్చును. ఇఁక చివరకాలమున చెప్పికొనినపద్యములో "ఆంధ్ర నైషధకరయంఘ్రి యుగ్మంబునఁ దగిలియుండెను కదా సిగళయుగము" అని వాకొనినాఁడుకదా కవిసార్వభౌమత్వమునకు గూడ నతఁడింత మక్కువ పడలేదు. కాన ఇంత గర్వకారణమైన తన యాంధ్ర నైషధమును గూర్చి పల్నాటివీరచరిత్రలోని కల్లుప్రతిష్ఠ-బాలుని యుద్ధముల గ్రంథావతరణికలో నెక్కడైనను చెప్పికొనినాఁడేమో విచారింపుఁడు. ఆంధ్రనైషధకర్తయగు శ్రీనాథుఁడే కల్లుప్రతిష్ట-బాలుచందుని యుద్ధముల" కర్తయేయైనచో నాంధ్రనైషధకావ్యకర్తృకమును గర్వముతో నందుచెప్పికొనఁడా ? అట్లుచేయలేదు. కాన నిద్దఱు శ్రీనాథులొక్కరు గాఁజాలరు. మఱియు తన పూర్వరచిత గ్రంథ మొక్కటైనను చెప్పుకొనకపోవుటయేకాక, "శాశ్వతంబైనట్టి సద్గ్రంథ మొక్కటి, చెప్పఁబూని మనస్సుచెలరేగి యుండ" అని తాను పూర్వమెప్పుడును శాశ్వతముగా నుండఁదగిన గ్రంథము నొకటి

కూడ రచింపలేదేమో యను నభిప్రాయము గూడ కల్గించునట్లు వ్రాసికొనినారు. కల్లుపత్రిష్ఠ కర్త. "కావ్యములు పెక్కు చెప్పియు కాంక్షదనక" అని చెప్పికొనిన భీమఖండకర్తయగు శ్రీనాథుఁడు కల్లుపత్రిష్ఠకర్తవలె చెప్పికొను నాయిదువురు నొక్కఁడైనచో లేక నైషధాది ప్రబంధములు పల్నాటివీరచరిత్రయంత శాశ్వతమైన సద్గ్రంథములు గానని యా? శ్రీనాథునియభిప్రాయ మతఁ డెంత దేశీయకవి యగుయుగ కర్తయైనను, కాన నాంధ్రనైషధకర్తయగు శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రకర్త యెంతమాత్రము కాఁజాలఁడు.

(7) కల్లుపత్రిష్ఠాభాగావ తరణికయందు తత్కర్త యిట్లు చెప్పికొనినాఁడు.

"సంగీతసాహిత్య చాతుర్య కవిత, చెప్ప నేర్చినవాఁడ చెలఁగి మాచెర్ల"

ఇందువలన తత్కర్త సాహిత్యమున నేకాక, సంగీతమునఁ గూడ చక్కని ప్రవేశము గలవాఁడని తెలియుచున్నది. సాహిత్య పండితునకు ఛందోవ్యాకరణాలంకార శాస్త్రములలో విశిగా చక్కని నైదుష్య ముండితీరవలయును కాని నృత్యసంగీతములలో పాండిత్య ముండ నవరము లేదు. గేయకవులకు, యక్షగానకర్తలకు, నటులకు, సంగీత జ్ఞానముతో నవసరముండును. ఆంధ్రనైషధకర్తయైన శ్రీనాథుఁడు సాహిత్యవిషయములలోనే కాక తర్కవ్యాకరణ వేదవేదాంతాది శాస్త్రములలోఁగూడ నిష్ణాతుఁడైనట్లు తెల్పుకొనినాఁడే కాని సంగీతశాస్త్రమందు ప్రవేశ మున్నట్లతని గ్రంథములలో నెక్కడ తెల్పుకొనినట్లు గోచరింపదు. రామరాజభూషణుఁడు మాత్రము సంగీతమునందుఁగూడ తాను పండితుఁడనని తెల్పుకొనినాఁడు పైద్విపద పాదములను పురస్కరించుకొనియే యుమాకాంతముగారు తమపీఠికలో 75 వ పుట "నలగామరాజు సభలో వేశ్యానాట్యసందర్భ

మునఁ జెప్పిన సంగీతరహస్యము లాతఁ డాదియందు" సంగీతసాహిత్య చాతుర్యకవిత, చెప్ప నేర్చినవాఁడ "అని చెప్పుకొన్న విషయమును ధ్రువపఱుచుచున్నది," అని వ్రాయంగ, విశాలాంధ్ర వారి పల్నాటి వీరచరిత్ర పీఠిక 37 పుటలో పింగళి లక్ష్మీకాంతంగారు" ఈ కథా భాగమును (కల్లుప్రతిష్ఠ) రచించినకవి వ్యుత్పన్నుఁడా, లేక, అవ్యుత్పన్నుఁడా అనిపరిశీలించుచో, అతఁడు పరిపూర్ణ విద్యాసంస్కార మున్న వ్యుత్పన్నుఁడని, ఈగ్రంథమునఁ గల పంక్తు లడుగడుగునను ద్ఘోషించుచునే యుండును. ఉదాహరణమునకు నలగామరాజు కొలువులో గాయకులను, నాట్యకత్తెలును నెరపిన కళాప్రదర్శనములు వర్ణింపఁబడిన ఈదిగువపంక్తులను చదువరులు పరిశీలింపఁదగును" అని వ్రాసియున్నారు. నలగామరాజు కొలువులో గాయకులు, నాట్యకత్తెలును నెఱపిన సంగీతనాట్య ప్రదర్శన వర్ణనలో నాట్యసంగీత శాస్త్రపారిభాషిక పదములు, సంప్రదాయములు చక్కగ వెలువరింపఁబడినవి దానిని బట్టి తత్కావ్యకర్తకు నాట్యసంగీతశాస్త్రరహస్యములు మాత్రము చక్కగా తెలియునని, యుచూకాంతముగారు నుడివినట్లు చెప్పవచ్చునుకాని "పరిపూర్ణవిద్యాసంస్కార మున్న వ్యుత్పన్నుఁడ"ని మాత్రము నిర్ణయింపరాదు. నాట్యసంగీత శాస్త్రజ్ఞాన మున్నంతమాత్రముననే" పరిపూర్ణవిద్యాసంస్కార మున్నవ్యుత్పన్నుఁడని దృఢపఱచుట కెట్లుపీలగును. నాటకసంగీత శాస్త్రజ్ఞానము లేనంత మాత్రమున నాంధ్రనైషధకర్త పరిపూర్ణవిద్యాసంస్కారమున్నవ్యుత్పన్నుఁడు గాడనియు నిశ్చయింపలేము. తంజావూరుపతన మను నవలలో తత్కర్త్రి శ్రీమతి మల్లాది వసుంధర యనేకశాస్త్రవిషయ పారిభాషికపదములను వివరించెను. అంతమాత్రమున నామె యాశాస్త్రముల నన్నింటిని నేర్చెనని నిర్ణయింపఁగలమా? ప్రస్తుతము మనకుఁ గావలసినది కల్లుప్రతిష్ఠ-బాలచంద్రుని

యుద్ధములలోని కవిత నైషధాంధ్రీకరణకర్త కవితాశైలివంటిదా, కాదా, యనునదే విచారణీయము. విక్రమార్కచరిత్రమున జక్కన కవి యూర్వశీరంభలనాట్య సంగీత కళాప్రదర్శనము నెట్లు వర్ణించి నాఁడో చూడుఁడు.

సీ॥ కలికి కన్నులసోయగము మించుఁదళుకులు
　　　　చెలఁగెడు మగతాల చెలువునొంద
నభినవస్ఫురణమై నభినయించు కరమ్ము
　　　　లలరుఁగెందమ్ముల ననుకరింప
నిటలంబున నటించు కుటిల కుంతలకాంతి
　　　　కొదమ తుమ్మెదల యొప్పిదముచూపు
వలిపకంచెలలోని వలిచనుంగవ మించి
　　　　జక్కనకవభంగి సంభ్రమింప.

గీ॥ మంజుమంజీర కంకణ శింజితములు
సమదకలహంస కలనినాదముల వెలయ
సరసగతిఁ జూచి సరసులు సరియనంగ
రంభ సురరాజుమోల నర్తనమొనర్చె.

సీ॥ శృంగారమేపార నంగవల్లికయందు
　　　　గీతసామగ్రి యంగీకరించి
కరతలామల కంబుగాఁ గరాంబుజముల
　　　　నర్థ మాద్యంతంబు నభినయించి
భావింప నరుదైన భావమర్మంబులు
　　　　మెఱుగుఁజూపులలోన మేళవించి
తానమానములతోఁ దాళ నిర్ణయలీలఁ
　　　　జరణపల్లవముల సంగ్రహించి.

గీ॥ యఖిలమును మెచ్చఁ బ్రత్యక్షమైనయట్టి
నాట్యవిద్యాధి దేవతనాఁ దనర్చి
భరత శాస్త్ర మర్మజ్ఞతా ప్రౌఢి మెఱసె
నూర్వశీకాంత వేల్పుఁబేరోలగమున॥

పై జక్కనకవి నాట్యసంగీతకళా ప్రదర్శనవర్ణనమున కవితాకళ తొణికిసలాడుచున్నది. కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుల యుద్ధముల కర్త యొనర్చిన నాట్యసంగీతకళా ప్రదర్శన వర్ణనమున శాస్త్రవిషయములు యథాతథముగ పారిభాషికపదములతోసహా సంప్రదాయసిద్ధముగ వివరింపబడినవి. ఇందుకు సందేహము లేదు. ఇందు శాస్త్రవిషయకజ్ఞాన ప్రదర్శనములో నేవిధమైనలోపములేదు, కాని కవితాశక్తిదోషముపడినది. అందుచేతనే సంగీతసాహిత్యచాతుర్య కవిత, చెప్పనేర్చినవాఁడ'నని' సంగీతశాస్త్రములలో తనకున్న నేర్పునుగూడ దెలుపుకొనినాఁడు శ్రీనాథుఁడెక్కడ నెప్పుడును దనకు సంగీతశాస్త్రముతో ప్రవేశమున్నట్లు చెప్పుకొనలేదు అందుచే సంగీతశాస్త్రములోఁగూడ ప్రవేశముగల కల్లుప్రతిష్ఠకర్తయగు శ్రీనాథుఁడ వేఱును, నాంధ్రనైషధకర్తయగు శ్రీనాథుఁడు వేఱును గావలయును, ఆంధ్రనైషధకర్త సంగీతములో ప్రవేశముగలవాఁడేయైనచో తానామాట చెప్పికొనఁడా? ఏగ్రంథమునను జెప్పికొనక, కల్లుప్రతిష్ఠలో మాత్రమే చెప్పికొనునా? అట్లు చేయుటకు కారణముండవలదా? వేశ్యానాట్యవర్ణనమును శ్రీనాథుఁడుగూడ చేయకపోలేదు. చూడుఁడు భీమఖండప్రథమాశ్వాసము నందలి యీక్రిందిపద్యమును.

సీ॥ విరులదండలతోడి వేణికాభారంబు
పొంకంబు పిఱుఁదలఁ జొరలియాడ
మణితులా కోటికోమల ఝుణత్కారంబు
రవళి మట్టెలమ్రోఁత యవఘళింప

గుదురునిండిన చిన్నిగుబ్బచన్నులమీఁద
ముత్యాలత్రిసరంబు మురువుచూప
పలమానతాటంక వజ్రాంకురచ్ఛాయ
లేతవెన్నలఁ బుక్కిలించి యుమియ.

గీ॥ సాని యీశానియై మహోత్సవమునందుఁ
కేలనవచంద్రికాంతపుగిన్నె పూని
వీధి భిక్షాటన మొనర్చువేళఁ జేయు
మురులనృత్యంబు జగముల మరులుగొలుపు.

పై పద్యమందలి నాట్యకళాప్రదర్శన వర్ణనమునకు, కల్లుప్రతిష్ఠలోని నాట్యకళాప్రదర్శవర్ణనమునకు నెట్టిభేదమున్నదో సరసులకుఁ దెలియకపోదు. శ్రీనాథునివర్ణనము జక్కన వర్ణనవిధానములోఁ జేరినది. వీరిద్దఱకు సంగీతశాస్త్రములో నెట్టి ప్రవేశమున్నదో యెవరును చెప్పలేరుకాని, నాట్యమును కవిత్వములో వర్ణింపనిరుపమానులని మాత్ర మంగీకరింపకతప్పదున్నుక కల్లుప్రతిష్ఠకర్త నాట్యసంగీత శాస్త్రసంప్రదాయములను పచ్చిగా వివరింపఁగల్గెనేకాని, వానిని కవితాశిల్పముగా మార్చి వర్ణింప లేకపోయినాఁడు. కాన నతఁడు "కోళ్లపోట్లాట వర్ణించిన మల్లయ, కొమ్మరాజుయుద్ధమును వర్ణించిన కొండయలతో సమానుఁడైన సామాన్యకవియేకాని పరిపూర్ణవిద్యా సంస్కారమున్న వ్యుత్పన్నుఁడని నిర్ణయింపరాదు, నాట్యసంగీత పారిభాషికపదములతో సంప్రదాయానుగుణముగ రచించినంతమాత్ర మున నే పరిపూర్ణవిద్యాసంస్కారముగల వ్యుత్పన్నుఁడైనచో, కూచిపూడి భాగవతులలోని శ్రీ వెంకటి వెంకటనారాయణ, వేదాంతం లక్ష్మీనారాయణగార్లు నాట్యసంగీతశాస్త్రములందు నిష్ణాతులైనాట్య సంగీతములను నిరుపమానమున ప్రదర్శింపఁగల్గి కవితసల్లగలవారని ప్రసిద్ధి. వారుగూడ పరిపూర్ణవిద్యాసంస్కారముగల వ్యుత్పన్ను లన

దగునా? విద్యాసంస్కార వ్యుత్పన్నతకు నాట్యసంగీతశాస్త్రములు చాలవు. ఇటీవల 30,—40 సంపూర్ణ్ణమువఱకు తర్క వ్యాకరణ వేద వేదాంతశాస్త్రములందుఁ జక్కని పాండిత్యమున్నవారిని మాత్రమే విద్యాసంస్కారమున్న వ్యుత్పన్నులుగా గణించి, వారికి, ప్రతిసంవత్సరమును వార్షికములనిచ్చి మహారాజులు సత్కరించెడువారు. ఆంధ్రనైషధకర్తయగు శ్రీనాథుఁడట్టివాఁడు కనుకనే డిండిమభట్టుని వాదములో గెల్చినాఁడు. అట్టిశ్రీనాథుని కల్లుప్రతిష్ఠకర్తతో సమానునిజేయుట యాంధ్రనైషధకర్తకపచారముచేయుటే యగును. ఆంధ్రనైషధకర్త తనవైదుష్యమునుగూర్చి యేమని చెప్పుకొనెనో గనుఁడు.

శా॥ బ్రాహ్మీదత్తర ప్రసాదుఁడఁడ వురుప్రజ్ఞా విశేషోదయా
జిహ్మస్వాంతుఁడ, వీర్వరార్చన కళాశీలుండ నభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే॥ ఆంధ్రనైషధ 1-13

" అఖిల పురాణవిద్యా ప్రవీణు నధ్వర్యు వేదశాఖాధీతి నిష్ణాతు"
హర. వి. 1-8.

" ఆగమజ్ఞాననిధిని తత్త్వార్థఖనిని, బహుపురాణజ్ఞుఁడవు శుభధన్య
మతిని హర. వి. 1-12.

పై రెండు గ్రంథములందుమాత్రమే తనవైదుష్యమునుగూర్చి యతఁడు చెప్పుకొనినాఁడు చెప్పికొనినంతవఱకు నతఁడు సంగీతశాస్త్రనైపుణ్యముగలవానిగ నెప్పుడు చెప్పుకొనలేదు కల్లుప్రతిష్ఠకర్త తాను నఖిలపురాణవేది ననికాని, యధ్వర్యుఁడనని కాని, లేక శాఖాధీతి నిష్ణాతుఁడనని కాని, బ్రహ్మజ్ఞాన కళానిధానుఁడనని కాని, నైషధగ్రంథములో చెప్పినట్లు చెప్పికొనలేదు. కాన నిరువురు శ్రీనాథు

లోకుల రు కాఁజాలరు. ఇఁక తన కవితా ప్రభావమునుగూర్చి హార విలాసములో నిట్లు.

"కవితా మహారాజ్యభద్రాసనాసీనుండు" "ఉభయభాషా కవిత్వ ప్రయోగకుశలుఁడు") అని హరవిలాసము 1-8. లోను.

"వచియింతు వేముఁలవాడ భీమనభంగి" కాశీఖండం I-13
"ఈక్షోణిన్నినుబోలు సత్కవులు లే రీనాఁటికాలంబునన్

♦　　♦　　♦　　♦

కవిసార్వభౌమ! భవదీయ ప్రౌఢసాహిత్యముల్॥ కాశీఖం
1+14.

అని కాశీఖండమందును బహుగర్వముతో బింకముగా చెప్పి కొనిన శ్రీనాథుఁడు "సంగీతసాహిత్య చాతుర్యకవిత చెప్ప నేర్చిన వాఁడ" నని రెండుమాటలతో స్వవిషయమును చెప్పుకొనుట అత జిహ్వాగ్రమునుండి వెలువడునా? తన కవిత్వవిశేషమును గూర్చి శ్రీనాథునకున్న యుత్కర్ష యహంకారము నాత్మవిశ్వాసము నిత రులకు లేదు. అందులకతేఁడరుహుఁడు, అట్టిచో తన కవిత్వమునుగూర్చి "కవిత చెప్ప నేర్చినవాఁడు కవితనల్ల నేర్చినవాడు నని నీరసముగా వ్రాసికొనఁడు కథావిషయమున నెన్నఁడు నిట్లుజరుగదు. కాన కల్లు ప్రతిష్ఠగ్రంథావతరణిక రచనావిధానమే యాంధ్రనైషధకర్త స్వభావ మునకు, విరుద్ధముగా నున్నది. మఱియు నీ "సంగీతసాహిత్య చాతుర్య కవిత, చెప్పచేర్చినవాఁడు" అను రెండు ద్విపదపంక్తులు కొండయ రచించిన కొమ్మరాజుయుద్ధము అవతారికలో యథాతథముగ వాడు కొనఁబడినవి. దీనికారణ మేమైయుండును ? ఇద్దఱునుగూడ "సంగీత సాహిత్యచాతుర్యకవితఁ జెప్పనేర్చినవా ర"నియేనా, అయినను నొకే విధముగా రచించియుందురా? యిద్దఱునుగూడ, లేక యొకరిని జూచి మఱియొకరు వ్రాసికొనియుందురా? లేక సంపాదకు లెవరో తారు

మూరు చేసియుందురా? ఇంతను చాతుర్యకవితయని రెండు చోట్ల వాడఁబడుటలో సారస్యమేమి యని విచారింపవలసియున్నది.

(8) ఆంధ్రనైషధకర్తయైన శ్రీనాథుఁడు నైషధాదిగ్రంధముల ం దెల్లెడలను తన్ను స్పష్టముగా గుర్తించుకొనుటకుఁగాబోలు తనతలి తండ్రులపేరును, తాతపేరును దెలిపికొని గోత్రముతోపాటు తన సూత్రమునుగూడ వివరించుకొనినాఁడు. కాని కేవలము తనపేరును గోత్రమునుమాత్రమే తెల్పుకొనినవాఁడుగాఁడు చూడుఁడు.

శా. భారద్వాజ పవిత్రగోత్రుని, శుభాప స్తంబసత్సూత్రు.........
...... మారయకుఁ బుణ్యాచార భీమాంబకున్
గారామైన తనూజు సన్నఘు శ్రీనాథాఖ్యునిఁబిల్చి నైష1-12.

సీ. కమలనాభుని పౌత్రు............
పౌత్రు; నాపస్తంబసూత్రు భారద్వాజ, గోత్రు.........
భీమాంబికా మారనామాత్యనందను—హరవిలాస 2-8.

మ. కనకక్ష్మాధరధీరు.........
...................మా
యనుగుందాతఁ బ్రదాత శ్రీ కమలనాభామాత్య చూడామణిన్
భీమ 1-10.

వ. అనవుడు నమ్మహీసురాగ్రగణ్యుండు కమలనాభామాత్య పౌత్రుండును, మారయామాత్య పుత్రుండును నగు శ్రీనాథకవివరే ణ్యుండును సంతుష్టమానసుండై"...........శివరాత్రిమా 1-58. కాశీఖండమున నుపోద్ఘాతములోఁ దన తాతతలితండ్రుల పేర్లు చెప్పు కొనకపోయినను తను రచించినగ్రంథములనన్నింటిని వరుసతో పేర్కొని, తన్ను గుర్తింపఁజేసికొనినాఁడు. కాని, యాశ్వాసాంతగద్య లలోమాత్ర మితరగ్రంథము లందన్నింటివలెనే తనతాతతండ్రుల నామములను తనపేరును స్పష్టముగాఁ దెలిపికొనినాఁడు. కానికల్లు

ప్రతిష్ఠకర్త, తాను భారద్వాజవంశవర్ధనుఁడ, కవిసార్వభౌముఁడ ఘనత
గన్నట్టి శ్రీనాథుఁ డనువాఁడ శివభక్తిపరుఁడ' 'నని మాత్రము వ్రాసికొ
నినే కాని యెక్కడను తలిదండ్రులపేరులుగాని, తాతపేరుగాని,
సూత్రము పేరునగాని చెప్పికొనలేదు. అంతియకాదు కొండయగాని,
గ్రంథప్రారంభమున అనుగురాజు-పల్నాటిరాజ్యసంపాదనము' అను
ప్రకరణమును రచించిన యనామకకవి కాని, యతని తాతతలిదండ్రుల
పేరులను చెప్పలేదు. ఇక మల్లయ (కోళ్లపోరు కర్త) శ్రీనాథుని
పేర్కొనె నని, విశాలాంధ్ర పీఠికకర్త 35 వ పుటలో "శ్రీనాథుడు
పల్నాటివీరచరిత్ర రచించినట్లుగా మల్లయయును......తమ కథా
భాగములందు చెప్పుకొనిరి" అని వ్రాసెను. కాని మల్లయగ్రంథావ
తారికలోఁగాని, గ్రంథాంతమందుఁగాని మఱియెక్కడైననుగాని. శ్రీనా
థుని పేరు నుచ్చరింపలేదని యీ గ్రంథము చదివినవారందఱకు స్పష్టము
మల్లన వ్రాసినకథాభాగమున నేపుటలో శ్రీనాథుని పేరు పేర్కొనఁ
బడినదో నెవ్వరైనఁ దెల్పఁగలరా ? ఆభాగగ్రంథావతరణిక గ్రంథ
పాతముతోఁ గూడుకొని మధ్యలో విడువఁబడి గ్రంథపాతమని వ్రాయఁ
బడినది. తర్వాత కథప్రారంభింపఁబడినది. దానిచివరకూడ శ్రీనాథుని
పేరు లేదు. ఇట్టిచో తాను పరిష్కరించిన గ్రంథములను నాలుగు
మూలలనైన జాగ్రత్తగా చూడకుండ నసత్యములతో బూకరింపఁ
జూచుట శోచనీయమైన విషయముగాదా? అట్టి రచనలనే ప్రమాణ
ముగా గ్రహించి యుదాహరించువారి సంగతి నిఁకఁ జెప్పనేల? వి.పి.
కర్త యట్లు వ్రాయుటకుఁ గారణమేమనఁగా, అక్కిరాజు ఉమాకాం
తముగారు దన పల్నాటివీరచరిత్ర ప్రథమముద్రణ పీఠిక 76 వ పుటలో
శ్రీనాథునికిఁ బిమ్మట వీరచరిత్రమును వీరభద్రుఁడు పద్యమయము
గను మల్లయ, బలరామసెట్టికొడుకు కొండయ యనునిరువురు ద్విపద
గాను రచించిరి, కొండయయు, మల్లయ్యయుఁ దమగ్రంథములలో

శ్రీనాథు నుదాహరించియున్నారు. వీరు తమగ్రంథములం జాలవఱకు శ్రీనాథు ననుసరించియే చెప్పిరి." అని వ్రాయుటయే. కాని వి. పీ కర్త ఉమాకాంతముగారి పేరును మాత్రము పేర్కొనలేదు. ఉమాకాంతంగారే లిఖిత ప్రతిని జూచి అట్లు చెప్పిరో తెలియదు. వారా భాగముల నుదాహరించిన బాగుండెడిది కాని, వారు మల్లయ్య కొండయ్యలు రచించిన భాగములను ప్రచురించుట లేదు కాన, వారా భాగముల నుదాహరింపకున్నను నధిక బాధ్యత వారికి లేదు. కాని, మల్లయ్య కొండయ్యలు రచించిన భాగములను గూడ ప్రచురించువారి కాయభిప్రాయ మున్నచో నాయాభాగముల నుదాహరింపవలసిన యావశ్యకత తప్పక యున్నది. లేనిచో వారిది వట్టిబూకరింపనియు నసత్యమనియు మోసమనియు లోకము భావించును గదా.

(b) ఇంతకు, "భారద్వాజగోత్రుడు శ్రీనాథుడు"ని పేర్కొనినం జాలదా, యాంధ్రనైషధకర్త గోత్రము భారద్వాజగోత్రమే కదా, కాన నిద్దఱు నొక్కరే యగుదురని వాదింతురేమో అట్లు కాదు. అంతమాత్రము చాలదు. భారద్వాజ గోత్రులు బ్రాహ్మణులలో నేశాఖవారైనను గావచ్చును. నియోగులలోను, వెలనాడు, తెలగాణ్యము, వేగినాడు, మురికినాడు, కాసలనాడు మొదలైన వైదికుల భేదములలోను, వైష్ణవులలోను, మాధ్వులలోను గూడ నుండవచ్చును. అంతేకాదు, ఆంధ్రబ్రాహ్మణులలోనే కాక, తమిళ, కన్నడ, మళయాళ, మహారాష్ట్రాది బ్రాహ్మణులలోం గూడ భారద్వాజగోత్రులుండవచ్చుననుటలో నాక్షేపము లేదు. కాని వారిలో నాశ్వలాయన సూత్రము వారని బోధాయన సూత్రము వారని, యాపస్తంబసూత్రము వారని మొదలైన భేదము లుండవచ్చును. అందుచేతనే యాంధ్రనైషధకర్త తానాపస్తంబసత్సూత్రుడనని చెప్పికొనినాడు. ఒక్క వంశములో బుట్టినవారి కేక గోత్రమే యుండును గదా. ఒక్కపేరుతో

నుండువా రేకవంశమునఁ గాక వివిధవంశములలోను కులములలోఁ గూడ నుండవచ్చునుగదా, సర్వసామాన్యముగా తాతపేరు మను మనికి పెట్టుకొందురు. మనుమనికి తాతపేరు పెట్టుటలో, పినతండ్రుల బిడ్డలకు, పెదతండ్రులబిడ్డలకుఁ గూడ నభిమానముతో నొక్క తాత పేరే పెట్టుకొందురు. అట్టిస్థితిలో ఒక్కటే పేరుగల తాతమనుమలను, పెదతండ్రి పినతండ్రిబిడ్డలను గుర్తించుట యెట్లు ? ఇది తలిదండ్రు లయు తాతలయు పేరులవలననూత్రమే సాధ్యమగును. అందుచేతనే సందేహనివారణార్థము తనపేరుతోపాటు తాతతండ్రులపేర్లను తల్లి పేరును గోత్రమును సూత్రమునుగూడ ప్రవరగా చెప్పుట యాచా రమైపోయినది. కాన శ్రీనాథుఁడను పేరెంతయుపురూపముగా లోక మున వినఁబడుచున్నను, మఱికొందఱకుఁగూడ నామనోహరమైన నామ ముండవచ్చుననుటలో నసంభావ్యత్వము లేదు. సంస్కృతనైషధ వ్యాఖ్యానకర్తలలో శ్రీనాథనామధేయుఁ డొకఁడు కలఁడని తెలియు చున్నది. అట్లే యాంధ్రకవులలో నందనందన చరిత్ర, వల్లభాభ్యుద యము, కామశాస్త్రముల కర్తలును, ధనంజయ విజయకర్తయు, కాటమరాజుకథకర్తయు శ్రీనాథనామధేయులని తెలియుచున్నది. కదా వీరును నాంధ్రనైషధకర్తయు నొక్కరా? లేక వేఱువేఱా? యని నిర్ణయించుట యెట్లు? వారిగోత్రము మాత్రమే కాక వారి తాత తల్లి దండ్రులపేర్లు గూడ సహాయకారు లగునుగదా. కాన కవి నామగో త్రము లేకమైనంతమాత్రమున నాంధ్రనైషధకర్తయు, పల్నాటివీర చరిత్రకర్తయు నొకరు కాఁజాలరు. కుమార ధూర్జటి తన కృష్ణ రాయవిజయ కావ్యమున దాను పాకనాటార్వేల వంశమును భర ద్వాజగోత్రుండు నాపస్తంబసూత్రుడైనట్లుగ నీక్రీతి దెల్పుకొనినాఁడు:—

"సీ॥ నను భరద్వాజగోత్రుని సదాపస్తంబసూత్రుని బాంధవ స్తోత్ర పాత్రు; పాకనాటార్వేల వంశ ప్రసిద్ధుని ధూర్జటి పౌత్ర" అని చెప్పి

కొనినాఁడు. కాన పల్నాటివీరచరిత్రకర్త ధూర్జటి కవివంశములో నొక్కఁడై శ్రీనాథనామమముతో నుండఁగూడదా? సిద్ధయించు టెట్లు? ఇట్లే మామిడి సింగనమంత్రియు భారద్వాజగోత్రులు. వాఁడు పండి తుఁడుగూడ వానివంశములో నొకఁడు శ్రీనాథనామధేయుఁడై దీనిని రచింపఁగూడదా? కోళ్ల పోరును రచించిన మల్లయ తనగోత్రముతో పాటు తాత తల్లిదండ్రుపేర్లె ట్లు తెలుపుకొనినాఁడో చూడుఁడు.

కొండిన్య గోత్రుఁడా గా. యామాత్యుఁ డసమానుఁ డతనికి
నను గునందనుఁడ
రాజశేఖరపద రాజీవలోల, మధుకరుండైన రామనమంత్రిమణికి
అమలాంబకును పరమానంద సుతుఁడు, మల్లికార్జునస్వామి
మన్ననవాఁడ
మల్లయ యనుపేర మహిపరగువాఁడ,"

అనికదా స్పష్టముగాఁ తెలుపుకొనినాఁడు. ఇక, కొమ్మరాజు యుద్ధమును వ్రాసిన కొండయ తానెట్లు దెలుపుకొనెనో చూడుఁడు. ఫలశ్రుతిలో నిట్లు చెప్పుకొనెను.

"పాండిత్యమహిమల బలరామి శెట్టి. కొండవాహ్వయుండు సద్గురు
కృపాశ్రయుండ"

గ్రంథావతరణికలో నిట్లున్నది.

"శ్రీవిలసిలవెలసిన రామిశెట్టి, సరస్వనార్యసుతుఁడ సత్కవిప్రియుఁడ,
పరసమయ మదగజపంచాననుండ, వరగొండ నాహ్వాయుండన
ధాత్రి వెలసి"

ఈభాగము విశాలాంధ్రవారి ముద్రణమునఁ గానరాదు. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమందలి D. 1141 గ్రంథములోనున్నది. ఇట్లు మల్లయ్య కొండయ్యలే తమతలిదండ్రులపేరులను చెప్పుకొనఁగా శ్రీనాథుఁడు కల్లుపరితిష్ఠలో తన తండ్రిపేరునైన చెప్పు

కొనలేదనుట విచిత్రముగాలేదా? కాన నాంధ్రనైషధకర్త" యు పల్నాటివీరచరిత్రకర్తయు నొక్కరే యని విశ్వసించుటకు వీలులేదు. మఱియు "వలను భారద్వాజ వంశవర్ధనుడ" అని యాంధ్రనైషధకర్త, పడికట్టురాళ్లతో, నిరర్థకపదములతో పద్యరచనముచేయుట కాఁతని జిహ్వాగ్రమునుండి యట్టిమాటలు వెలువడఁగలవా! విశేషించి "భారద్వాజవంశవర్ధనుఁడ"నని గోత్రనామమును వంశనామముగా వాడుకొనునా? ఏక గోత్రము వారు వివిధజాతి బ్రాహ్మణులలోఁ గలరని వెనుకఁజెప్పితినికదా. ప్రస్తుతకాలమందువలె శ్రీనాథునియింటిపేరు (వంశనామము) తెలియదు. తలితండ్రులపేర్లచేతనే యతఁడు గుర్తింపఁదగినవాఁడు. అది స్పష్టముగాఁ దెలియనప్పుడు కల్లుప్రతిష్ఠకర్తయు నాంధ్రనైషధకర్తయు నొక్కఁడే యని నిర్ణయింప వీలులేదు.

(9) కల్లుప్రతిష్ఠకర్తయగు శ్రీనాథుఁడును, నాంధ్రనైషధకర్తయగు శ్రీనాథుఁడును కవిసార్వభౌములని చెప్పఁబడిరి. కాన వారిద్దఱు నొకరేయని వాదింతురేమో, అట్లైనను గూడ నొకరుగానుండుటకు నవకాశము గలదు. ఏలన, నాంధ్రమున కవిసార్వభౌమబిరుదము పలువురకుఁ గలదు. ఒక్కయాంధ్రనైషధకర్తకుమాత్రమే యాబిరుదమున్నచో నాయిద్దఱొకరే యని యంగీకరింపవచ్చును. ఆర్వాచీనులలో కూచిమంచి తిమ్మకవికిని, బాలభాగవతములను చంపూద్విపదలలో రచించిన కోనేరుదోనేరుకవికినిగూడ కవిసార్వభౌమబిరుదు కలదు. నవీనులలో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికిఁ గూడఁ గలదు కదా ఇట్టిచో నేజమీందారునైన నాశ్రయించి కల్లుప్రతిష్ఠకర్తగూడ కవిసార్వభౌమ బిరుదమును సంపాదించుకొనవచ్చునని వాదముకొఱకైనను చెప్పవచ్చును. కాన కవిసార్వభౌమబిరుదముకూడ నాధారపఱచి కల్లుప్రతిష్ఠకర్తయు నాంధ్రనైషధకర్తయు నొక్కరే యని సమర్థించుటకూడఁ దగదు.

కల్లుప్రతిష్ఠగ్రంథావతరణిక ద్విపదపంక్తులను పరిశీలింపఁగా "శివభక్తిపరుఁడ అనుదానివలెనే" "కవిసార్వభౌముఁడు,ఘనత కన్నట్టి శ్రీనాథుడనువాఁడు అనుపాఠముకూడ ప్రక్షిప్తమని తోఁచుచున్నది. ఏలన తద్భాగాంతమున "ఘనుఁడైన శ్రీనాథకవిరాజరాజు" అనియున్నది. రాజరాజు శబ్దముసార్వభౌమపదమునకు పర్యాయపదమైనను నది బిరుదవాచకమగుటచే సంజ్ఞావాచకము. కాన దానికి పర్యాయపదము వాడరాదు. పద్యములో సార్వభౌమపదమును కూర్పలేక దానిపర్యాయపదమును వాడెననుట యాంధ్రనైషధకర్తవంటివానికిఁ దగునా. కాన నాపీఠికకర్తయగు కల్లుప్రతిష్ఠకర్తయు నాంధ్రనైషధ కర్తయు నొకరుకాఁజాలరు, కాన నీపదము లెవరో లేఖకులు భ్రాంతిచే చేర్చియుందురిద్దఱు శ్రీనాథులు నొకరే యనుతలంపుతో శ్రీహర్షునకుఁ జెల్లువిశేషములను శ్రీనాథునకుఁ జెల్లించి, భ్రాంతిఁజెందిన ఏనుగు లక్ష్మణకవి రామేశ్వరమాహాత్మ్య, జాహ్నవీమాహాత్మ్యములలో నెట్లు స్తుతించెనో చూడుడు. గీ॥ మహిత చింతామణీ దివ్యమంత్రసిద్ధ, నైషధాది ప్రబంధసందర్భనిపుణు, సకలవిద్యావిశారదు సత్కవిత్వ, పట్టభద్రు శ్రీనాథునిఁ బ్రస్తుతింతు" అని. వేదము వేంకటరాయశాస్త్రిగారి వంటివారుగూడ సంస్కృతనైషధవ్యాఖ్యాతయగుశ్రీనాథుఁడుశృంగార నైషధకారడేమో యని భ్రాంతిపడి యిట్లు వ్రాసిరి, "కడమ వ్యాఖ్యాతలలో శ్రీనాథుఁడొకఁడని పేర్కొనఁబడియున్నాఁడు. ఆశ్రీనాథుఁడు శృంగారనైషధకారుఁడేయేమో? ఈతఁడే యనుటకు ఈ యాంధ్రీకరణాభిమానము కొంతసాధకము. కాని యితనిగ్రంథములఁ జెప్పుచో నితఁడుగాని, యితరులుగాని యీ వ్యాఖ్యానముం బేర్కొనమి కొంత బాధకము" అని. అట్లే పల్నాటివీరచరిత్ర విషముకూడ.

(10) కల్లుప్రతిష్ఠావతరణికలో.

" విలసిల్లు పలనాటివీరులచరిత, జనులెల్ల భక్తిచే చదువుటకొఱకు
మంజరీద్విపదగా మన్నించి నేను, చెప్పఁబూనితి వచ్చఁశ్రీ మెఱ
యంగ",

అని వ్రాయఁబడినది. దీనినిబట్టి యక్కరాజు ఉమాకాంతము గారు తమ ప్రథమముద్రణభూమిక 74 వ పుటలో శ్రీనాథుపయోగించినదిమంజరీద్విపద......... ...శ్రీనాథునికిఁ బూర్వము మంజరీ కావ్యము రచించినవా రెవరును లేరు. ఇతఁడు వ్రాసినగ్రంథములలో నిది చివరది.'' అనివ్రాసిరి. కాని వేటూరిప్రభాకరశాస్త్రిగారు తమ శృంగారశ్రీనాథము 241 వ పుటలో "శ్రీనాథుఁడు రచించినపల్నాటి వీరచరిత్రము ద్విపదరూపమయియుండవచ్చునని నాతలంపు. క్రీడాభిరామములో నీక్రిందిపద్య మున్నది.

మ॥ ద్రుతతాళంబున వీరగుంభితకథుంధుంధుంకిటాత్కార సం
గతివాయించుచు నాంతరాళిక యతిగ్రామాభిరామంబుగా
యతిగూడన్ ద్విపదప్రబంధమున వీరానీకమం జాడె నొ
క్కతె ప్రత్యేకముగాఁ గుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్॥

ఇందు ద్విపదగ్రంథమే పేర్కొనఁబడినది. మఱియు నాక్రీడాభిరామమునఁ బల్నాటివీరచరిత్రవిషయము హెచ్చుగాఁ గలదు. ఆగ్రంథము శ్రీనాథకృతియే యగునని నేను నిశ్చయించుచున్నాను.''అనియు 244 వ పుటలో, " ద్విపదరూపమున మిక్కిలి సంగ్రహముగా నొక రచనము ప్రాచ్యలిఖితపుస్తకశాలలోనే కలదు. అది మంచిరచనము కలదై చక్కగా నున్నది. శ్రీనాథునిది కావచ్చునని నేను దలంచుచున్నాను. కాని యది సంపూర్ణముగా లేదు" అనివ్రాసి, మఱియు'' వీరచరిత్రమందలి యేకదేశమగు "బాలునికథ"ను శ్రీ యక్కరాజు నుమాకాంతముగారు బృహత్పీఠికతో నీనడుమ ప్రకటించిరి.......... మంజరీరూపమున నున్నగ్రంథమును వారు ప్రకటించిరి. కాని వారి

ముద్రణమున నాకృతియాకృతి చెడినది. గ్రంథావతరణికలో రెండు తెలుఁగులరచనములు కలసిపోయినవి......... ఈగ్రంథసంపాదకులు యథేచ్ఛముగా గ్రంథమును మార్చిరి. కొంత చేర్చిరి. ఆమార్పులో చేర్పులు నన్నియుఁ దిన్నగాఁ దెలుపరయిరి.'' 243 వ పుటలో "శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రమును రచించెను కొన్నిభాగములు నిర్దుష్టరచనములు గలవి కలవు. అట్టివి శ్రీనాథునివిగా నిలువఁ గలవి" అని వ్రాసిరి. పరస్పరవిరుద్ధముగానున్నపై యిద్దరి వాక్యములలో నేవి గ్రహింపఁదగినవో విచారణీయము. వడిప్రాసపద్యగద్యాక్షరాది విష యములలో ప్రాచీనులమార్గమునే శ్రీనాథుఁ డావరించు ననిశివరాత్రి మాహాత్మ్యములో తానిట్లు తెల్పినాఁడు.

ఉ॥ పద్యగద్యాక్షర ప్రకర భావరసార్థగుణా... ... ...
......... శబ్దసదహేతుకలారనసత్క్రియార్థ్యమై
యార్యులు చన్నమార్గమున నావడిప్రాశవిడంబబంధమై
చోద్యముగాఁగఁ జెప్పు కృతి శ్రోత్రసుఖావహ మెల్లచోటులన్॥

I—11.

ఇందు చేప్రాసను విడనాడి, మంజరీద్విపదగా కావ్యమును వ్రాయు పద్ధతి తత్పూర్వము లేదు. కాన శ్రీనాథుఁడానూతన మతమును నంగీక రింపఁడని యూహింపవగును. కాన మంజరీద్విపదలో శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రమును వ్రాసె ననుట విశ్వసింపఁదగినదికాదు. ప్రాస విహీనముగా మంజరీద్విపదలో వ్రాయుటలో ప్రయోజన మేమి? తేలి కగా రచనము సాగుననియా? విషయమిట్లుండఁగా, వి.పి.కర్త. "శ్రీప్రభా కర శాస్త్రిగారు మద్రాసుప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునఁ గల వ్రాఁతప్రతులలో సాధ్యమైనంతవఱకు మేల్తరములని తోఁచినవానిని నాకు సూచింపగా ఆభాగములకు ప్రతులు వ్రాయించుకొంటిని'' పుట XIII—XIV అనివ్రాయుట బహువిచిత్రముగానున్నది. శాస్త్రి

గారు శ్రీనాథకృతమని భావించినది ద్విపదరూపమునకదా యన్న చనిరి, వి.పి.కర్త పరిష్కరించినది మంజరిద్విపదరూపమున నేలయున్నది? అట్లే యగుచో శ్రీనాథునంతటివాని కీప్రాసవడినియములు రచన కడ్డు పెట్టగలవా? మఱియు పాడుకొనుటకు ప్రాసగలద్విపదయే యెక్కువ శోభించును. ప్రాసగలచోట చక్కని లయ కుదురునుగదా. పాల్కురికి సోమనాథాదులు జనసామాన్యముపాడుకొనుటకేకదా ప్రాసద్విపదలో దనకావ్యములను రచించిరి ఈవిధముగా విచారించినను శ్రీనాథుఁడు మంజరీద్విపదలో పల్నాటివీరచరిత్రను వ్రాసియుండఁ డని భావింప వలసివచ్చుచున్నది. ఈద్విపద లక్షణములో, ప్రాసను తొలగించి, పదకర్తలు, రచన మఱికొంత సులువగునట్లుగా మంజరీద్విపదను సృష్టించిరి." వి. పీ. VI పుట. ఇఁక ప్రాసద్విపదలో నైన పల్నాటి వీరచరిత్రము నాంధ్రనైషధకర్త వ్రాసియుండగా,యని ప్రశ్న అతఁడే వ్రాసియున్నచో నభిమానముతోనని పేరొక్కనియుండడా ? అది వల్లభరాయని పేరునాటి నున్నప్పుడు సంకోచించింట కాక్షేపమే ముండును. అట్లు పేరొక్కనఁబడకపోవుటచే ద్విపద పల్నాటివీరచరిత్రను గూడ నతఁడు వ్రాసియుండఁడనియు క్రీడాభిరామమునుబట్టియేమియు నిదమిత్థమని నిర్ణయింపరాదనియు వెనుకనే నిర్ణయింపఁబడినది. పోతే యొకవిషయముమాత్రము నిశ్చయముగాఁ జెప్పవచ్చును. వినుకొండ వల్లభరాయనికాలములో నొక పల్నాటివీరచరిత్ర ద్విపదప్రబంధముగా రచించినదిమాత్ర ముండెనని పై యుదాహృతపద్యమునుండి యూహింప వచ్చును. అది ప్రస్తుతముగానున్న గ్రంథములలో నేదైన కావచ్చును, కాని యది యాంధ్రనైషధకర్త వ్రాసినది యైయుండదు. అది యాంధ్రనైషధకర్తకు పూర్వుడైన యొకకవిచే రచింపబడియుండ వచ్చును. అతఁడు భారద్వాజ గోత్రికుఁడును శ్రీనాథనామధేయుడును గూడ కావచ్చును. ఇంతవఱకు నాక్షేప మేమియు నుండఁగూడదు.

అందుచే నా శ్రీనాథుఁడును నాంధ్రనైషధకర్తయగు శ్రీనాథుడు నొక్కరుమాత్రము గాఁజాలరు. తర్వాత లేఖకులో పాటగాండ్రో భ్రాంతిచే నిద్దరు నొకరేయని భావించి ప్రసిద్ధ శ్రీనాథునకున్న కవి సార్వభౌమబిరుదమును విచక్షణ లేకుండ పల్నాటివీరచరిత్రలోని బాలో గికథా భాగమునకుఁ జేర్చియుందురు. దానివలన నీయవకతవకలు కలిగియుండును. కాన పైనుదాహరించిన క్రీడాభిరామ పద్యమునుబట్టి పల్నాటివీరచరిత్రమును నాంధ్రనైషధకర్తరచించెననికాని,యదిప్రస్తుతము ప్రచురింపఁబడినదే యనికాని విశ్వసించుటకు తగిన ప్రమాణము కనఁబడదు.

(11)ఇఁక ఆంధ్రనైషధకర్తయే కల్లుప్రతిష్ఠకర్త యని వాదించు వారి యుపపత్తిలోనియౌచిత్యమును విచారింతము.

(i)" అతఁడు (కల్లుప్రతిష్ఠకర్త)భగవద్గీతోపనిషత్తులను నిత్య పారాయనచేసి, ముఖస్థము చేసికొనిన నిష్ఠాపరుఁడు. తలంచుకొన్నచో ఆగీతలను చక్కని సరసమైనశైలిలో తెనిగింపఁగల సమర్థుడుకూడ" (అని ప్రత్యక్షముగా తానుచూచినట్లుగా, వి. పి. కర్త వ్రాత)

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకంశరణంవ్రజ
అహంత్వాం సర్వపాపేభ్యో, మోక్షయిష్యామి మాశుచల్,

అని శ్రీకృష్ణుఁ డర్జునునకు చేసిన చరమోపదేశశ్లోకమును ఈ కవి ఎంతసరసముగా తెనిగించెనో చూడుఁడు.

ద్వి॥ సకలధర్మంబులు సమ్మతి విడిచి, నాశరణందితే నను జేర్చుకొందు
వగవకు మదిలోన వద్దు భయంబు, సత్యమిదామాట"॥

అని యుదాహరింపఁబడినది. ఈవాదము కేవల మతిశయోక్తితోఁ గూడినది. భగవద్గీతనంతయు నాంధ్రీకరించిన యొక శ్రేష్ఠి గారు పై శ్లోకము నెంత శ్రేష్ఠముగా తెనిగించిరో చూడుఁడు.

గీ॥ సర్వధర్మములను సంపూర్ణముగ వీడి
నన్నుమాత్ర మీరావు నమ్మికొనుము;
నిన్ను నేను పాపనిచయంబులోనుండి,
ముక్తుఁజేతు; దుఃఖమును త్యజింపు."

ఈ రెంటియాంధ్రీకరణములవ్యత్యాసమును కొంచెము విచారింతము. "అహం త్వాంసర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అను భాగమీశ్లోకమునకాయువుపట్టు. దానిని కల్లుప్రతిష్ఠకర్త" నను జేర్చికొందు అని స్వేచ్ఛగాభావము ననువదింపగ శ్రేష్ఠిగారు" నిన్ను నేను పాపనిచయంబులోనుండి ముక్తుఁజేతు "అని యథామూలముగ నాంధ్రీకరించినారు. అదియుఁగాక పాపములనుండి మోక్షమును పొందుటయు, తన్నుఁ జేర్చుకొనుటయు నొకటి కాదుకద. 'పరిత్యజ్య'అను మూలము నకుఁ 'విడిచి' అని యాంధ్రీకరించినఁగాలు. ఇక'సమ్మతి'అనునది పడి కట్టురాయియే. మా శ్రేష్ఠిగారు "సంపూర్ణముగ వీడి" అనియనువదించి 'త్యజ్య'–'పరిత్యజ్య'లకుఁగలతారతమ్యమును పోషించినారు. "మామేకం శరణంవ్రజ" అనుమూలమునుకల్లుప్రతిష్ఠకర్త"నా శరణందితే"యని యనువదింపఁ శ్రేష్ఠిగారు "నన్నుమాత్రమీరావు నమ్మికొనుము" అని యాంధ్రీకరించినారు.'మామేకం'అను భాగమునకు "నన్ను మాత్రము' అనినిర్దేశించినారు. "శరణంవ్రజ"యనునది మూలములో నాజ్ఞావాచకము (imperative) కాఁగా; 'నాశరణందితే'అనురచన చేదర్థకము (Conditional) లో నున్నది శ్రేష్ఠిగారి యాంధ్రీకరణము గూడ మూలానుగుణముగ ఆదేశార్థమందే కలదు. ఇక'శరణందితే' అనురూప మాంధ్రభాషలో నెట్టివ్యావహారికభాషారూపమో పరిశీలింపఁదగినది. "మాశుచః" అను మూలమును "వగవకు మదిలో అని కల్లుప్రతిష్ఠకర్తయనువాదము కాఁగా, శ్రేష్ఠిగారు "దుఃఖమును త్యజింపు"మని తెనిగించిరి. ఇందుచే కల్లుప్రతిష్ఠకర్తలురచనలోని

"మదిలోన" అను భాగమే కాక మిగిలినభాగమైన "వద్దభయము, సత్య మీమాట" అనువాక్యములు వ్యర్థములును నవసములు పాదపూరణార్థములు కూడ. దీనిని బట్టి కల్లుప్రతిష్ఠకర్త రచనయెంత మూలానుసరణముగను, సరసముగను, మూలార్థవాహకముగనున్నదో సరసులే గ్రహింపగలరు.

భగవద్గీతను వేముగంటిదత్తోజీపండితుడు, గోపీనాథకవి, మాధవకవి, నాదిండ్లగోపన మొదలైనవారు 16వ శతాబ్దమునుండి నాంధ్రీకరించిరి. నవీనులనేకులు శ్రేష్ఠిగారు మొదలైనవారు చేసిరి. కల్లుప్రతిష్ఠ రచయితకంటె శ్రేష్ఠిగారి యాంధ్రీకరణము మేలుగానుండెనని వెనుక గ్రహించితిమి. వారిరచనముకంటె గోపీనాథకవ్యాదుల యనువాదము శ్రేష్ఠముగావచ్చును. అంతకంటెనుత్తమముగా శృంగారనైషధకర్త వ్రాయఁగలఁడనిమనమూహింపఁగలము కదా అట్టిచో కల్లుప్రతిష్ఠకర్త చేసినపై భగవద్గీతాశ్లోకాంధ్రీకరణము 'ఎంతసరసముగా తెలిగించెనో చూడుడ'ని అనివ్రాసిన వి.పీ. కర్తవ్రాతలోని యౌచిత్యమెంతకలదు? దానినాధారముగా చేసికొని "అతఁడు (కల్లుప్రతిష్ఠకర్త) భగవద్గీతోపనిషత్తులను నిత్యపారాయణచేసి ముఖస్థముచేసికొన్న నిష్ఠాపరుండని తాను ప్రత్యక్షముగా చూచినట్లు, కైవారముచేయుటకు ప్రమాణమేమి. వానివిలువయెంత సత్యమెంత ప్రయోజనమెంత? ఇట్టికైవారములు విశ్వసింపనగునా? పైశ్లోకమునునింక" యదాయదాహిధర్మస్యగ్లానిర్భవతి భారత మొదలైనకొన్ని ముఖ్య భగవద్గీతా శ్లోకములు భారతీయుల రసనాగ్రములందు ఇటీవలవఱకునుండెడివి. అంతమాత్రముచే వారందఱును భగవద్గీతను నిత్యపారాయణచేసి ముఖస్థముచేసికొన్న నిష్ఠాపరులభావింపనక్కఱలేదు. పోనీ యిందువలన కల్లుప్రతిష్ఠకర్తనిష్ఠాపరుడై నంతమాత్రమున నతడును శృంగారనైషధకర్తయు నొక్కరేయని ఋజువు చేయదుకదా.

(ii) "తెలుగుకవులలో యుద్ధవర్ణనలుచేయుపట్టున, తిక్కన నన్నెచోడులు ఒకరికి ఒకరు అనుకర్తలుగా పొడగట్టుదురు. వారిద్దఱకును శబ్దార్థభావసన్నిహిత సంబంధమెక్కువ. అనగా యుద్ధములను వర్ణించునెడ ఇరువురికవిత్వమున పోలికలు సాధారణము, శత్రువులను సంహరించుట 'వండతరిగినట్లున్నద'ని వర్ణించుట, యిద్దఱకును చాల ప్రీతి. ఈకవియును దానిని అట్లే ఉపమించెను. ఈతని యుద్ధవర్ణనలను, అందలిపలుకుబడులను పరిశీలించుచో ఇతడు భారతమును కూలంకషముగా పఠించి, యందలిసొగసులను పుణికిపుచ్చుకొన్న గడుసరివలె తోఁచును. తిక్కన తనభారతమున పెక్కుచోట్ల యుద్ధరంగమున ప్రవహించురక్తమును నదీ ప్రవాహముగారూపించి వర్ణించెను. ఈరూపకాలంకారము సర్వప్రాచీన సాధారణము...ఉదా॥ కరికళేబర. (ద్రోణ II.128. )

ఈ కవియును బాలచంద్రునియుద్ధమున కార్యమపూడి యుద్ధక్షేత్రమును ఇట్లే ఉపమించుట అతని ప్రాచీన కావ్యపరిజ్ఞానమును ప్రస్ఫుటీకరించును." అని వి. పీ. 40-41పుటలలో వ్రాయఁబడెను. (ఉదా పుట 470-71....4023.

ప్రాచీనకాలమందలి శబ్దములను, పలుకుబడులను, వర్ణనలను రూపకాద్యలంకారాదుల నన్నింటిని నర్వాచీనులనుకరించుటయు, వారినిబట్టి తిరిగి నవీనులావిషయముల పారంపర్యముగా ననుకరించుట సర్వసామాన్యవిషయము. అట్లుపారంపర్యముగా ననుసరింపకపోయినచో, ప్రాచీనుల కవితాసంప్రదాయములు వీనులకు క్రొత్తగానుండి యర్థమేకాకయుండును. యుద్ధమందలి రక్తప్రవాహముల నదీప్రవాహముగా రూపించుట నవీనార్వాచీనుల కవితలలోఁగూడఁ గాననగును. అంతమాత్రమున బాలచంద్రయుద్ధకర్తశృంగార నైషధకర్తయే యని నిరూపింపఁదగదు.

అతనికి ప్రాచీనకావ్యజ్ఞానము ప్రస్ఫుటముగానుండినను నతఁడును శృంగారనైషధకర్తయు నొక్కరే యని యెట్లునిర్ణయింపనగును? ప్రాచీనకావ్యజ్ఞానముకల కవులెందఱుండరు ? సాధారణముగకవులు ప్రాచీనకావ్యజ్ఞానమైనను లేక కావ్యములురచించుటయెట్లు పొసఁగును. శృంగార నైషధకర్త వ్యుత్పత్తిసాధారణ ప్రాచీన కావ్యజ్ఞానముతోఁ గూడినదిమాత్రమేకాదు. తర్కవ్యాకరణ వేదవేదాంతాది శాస్త్రములందలి పరిపూర్ణపరిజ్ఞానముగలవాఁడుకదా?యతఁడు.అతని ప్రతిభయు నిరుపమానమైనది. కాన సామాన్యమైన ప్రాచీనకావ్యజ్ఞానమునుబట్టి యిర్వురు నొక్కరేయని నిర్ణయింపరాదు. మఱియు బాలచంద్రుని యుద్ధములో నన్నెచోడ తిక్కనలయుద్ధవర్ణనావిధానమును, శబ్దములు, పలుకుబడియుండవచ్చును, కాని శ్రీనాథుని యుద్ధవర్ణనా విధము, శబ్దములు, పలుకుబడులతోనవి యెక్కువ భేదించును. శృంగారనైషధకర్త నాట్యకళనుక విత్వకళగామార్చి నాట్యకళాప్రదర్శనమును వర్ణించు స్వభావముగలవాఁడని వెనుకగమనించితిరి. అట్లే యతఁడు కవిగా యుద్ధవర్ణనలనుచేయుపట్ల, యుద్ధకళను కవిత్వకళగామార్చి వర్ణించు స్వభావముగలవాఁడే కాని, నన్నెచోడ తిక్కనలవలె యుద్ధమును యోధులవలె,యథాతథముగ కనులకుగట్టినట్లుగా వర్ణించుస్వభావము గలవాఁడుకాఁడు. ఉదాహరణమునకు, హరవిలాసమందలి కిరాతార్జునీయకథలో మాయాకిరాతార్జునుల యుద్ధమును గాని కాశీఖండ షష్ఠాశ్వాసమందలి దుర్గామాహాత్మ్యమున దుర్గాసురునితో దాక్షాయణియుద్ధవర్ణనముగాని, భీమఖండమందు త్రిపురాసురులతో నీశ్వరుఁడుచేయు యుద్ధవర్ణనముగాని బాలచంద్రుని యుద్ధరచయిత యుద్ధవర్ణనలతోఁబోల్చిచూడఁదగును. అట్లేరాయబారవిషయములు గూడ పోల్చిచూడఁదగినవి.

(iii) (కల్లుప్రతిష్ఠకర్త) "పూర్వకావ్యపరిజ్ఞానమున్న కవిమాత్రమే కాక, సంస్కృతవ్యాకరణ మర్యాదనాకళించుకొనిన పండితుడని, యతనిసమాసరచనాపద్ధతి నిరూపించుచున్నది.

"పూర్వపర్వతశిరః పూజాగ్రిమంబు, ఘనతరమాణిక్యఖచితసౌవర్ణ కుంభంబువలెనిల్చి గురుతేజమునను, భానుండు దిక్కుల ప్రబలె నావేళ."

సూర్యోదయవర్ణన సర్వకవిసామాన్యమయ్యును, ఇవి కవిసమయములు దెలిసిన కవిమాత్రమే వ్రాయదగినపంక్తులనుటకు సందేహములేదు. ఇందలి దీర్ఘసమాసరచన అపండితుఁడు చేయవలసినది కాదు. అట్లే పగలును రేలును బహుజాగ్రదాత్మకా పాడుడీ మీరెకల వారుమాకు" అనెడి పంక్తులందలి 'జాగ్రదాత్మ' అనుసమాసమును సంస్కృతవ్యాకరణ సంప్రదాయమెఱిగిన పండితుడు మాత్రమే, ఘటింపగలడు. "అని వి పీ. వ్రాత" (పుట 42.)

ఆంధ్రకవులలో సంస్కృతవ్యాకరణ మర్యాదలను, కవిసమయములను నెఱిఁగిన పండితులనేకులర్వాచీనులలోఁగూడఁగలరు. వారు దీర్ఘసమాసరచనచేయఁగల ప్రౌఢులు. అట్టివారందఱు శృంగారనైషధ కర్తవంటివారలేయనుటయతివ్యాప్తిదోషమగును. ఈక్రింది దీర్ఘ సమాసరచన చూడుఁడు.

"ప్రళయ కాలమహోగ్రభయదజీమూతోరుగళ ఘోరగంభీర పెళపెళాభటులలో—ప్రబల నీరంధ్రభజనితగాఢ ధ్వాంత నిబిడహేమంతరాత్రికుంతలములలో— వికృతకూరఱుధాటుభితమృత్యుకఠోర వికట పాండురశుష్క-వదన దంష్ట్రాగ్నిలో—ప్రావృడంభోరస్వామి—నైదాఘతీక్ష్ణభాను భీకరకరానలచ్ఛట—శీతలనిశాప్రశాంత శయ్యాతలాన" ఈరచనమొకనవ్యభావ కవిది. దీనినిబట్టి యితఁడు సంస్కృత

వ్యాకరణ మర్యాద నెఱిఁగిన మహాపండితుఁడనవచ్చునా? "పాత్రివృడం భోధరస్వామి"అను సమాసము సంస్కృతవ్యాకరణసంప్రదాయము మెఱిగిన పండితుఁడుమాత్రి మేఘటింపగలఁడా? పై దీర్ఘసమాస రచనవలన నతఁడు మహాపండితుఁడని నిర్ణయింపఁగలమా? ఇది శ్రుతపాండిత్యము ననుకరణమనిమాత్రిమే చెప్పవలయును చాలఅరుదుగా సమాసముల వాడిన యంతమాత్రిమున కల్లుప్రతిష్ఠకర్తయు శృంగారనైషధకర్తయు నొక్కరుకాఁజాలరు. కల్లుప్రతిష్ఠకర్త, శృగారనైషధకర్తకంటెగూడ నెక్కువ గొప్పపండితుఁడని బుజువైననుగూడ, నిద్దఱు నొక్కరేయని యెట్లు నిర్ణయింపవీలగును. ఇక్కడ కావలసినది పాండిత్యసామ్యము గాదు. వ్యక్తిసామ్యమును, కవిత్వసామ్యమును మాత్రమే. వీరిద్దఱకు రచనాసామ్యమును వారి పలుకుబడి, శబ్దము, సమాసములు మొదలైన వానితో క్రీడాభిరామమందు ప్రభాకరశాస్త్రిగారు విశేషములను చూపినట్లు చూపవలెకాని, సామాన్యవిషయములతోఁబోల్చి ప్రయోజనము లేదు.

(iv) 'స్నానము'నకు 'త'కారముతో యతిచెల్లించినంత మాత్రమున "వైదికమైన యీశబ్దస్వరూపము నెఱిఁగియున్నకవి, గొప్పపండితుఁడై యుండవలెననుట నిస్సందేహము" అనినిర్ణయించుటెట్లు?ఎన్ని వైదిక శబ్దములు లౌకికముగవాడఁబడినపుడు, వాని మూలవర్ణక్రమము శ్రుతపాండిత్యమువలనగ్రహించి ప్రయోగించుట లేదు? ఉభయభాషలలో నెన్నివిశిష్టసంస్కృత శబ్దములను, నిత్యసమాసములను నప్పకవిప్రయోగములను జూపలేదు? వానిని మరల ప్రయోగించిన నవ్యకవులందఱు గొప్పవేదపండితులని నిర్ణయింపవచ్చునా? అట్లే ప్రస్తుత విషయముగూడ.

(v) "శ్రీనాథుడు సంస్కృతకవులవలె, తఱచుగావిశేష్యవిశేషణము లనేకవిభక్తిలోనే నిల్పుచుండును. క్రీడాభిరామము శ్రీనాథ

కృతమేయని ఋజువుచేయుటకు శ్రీప్రభాకరశాస్త్రిగారు, చెప్పిన తిరుగు లేని యుక్తులలో నీవిషయమును చేర్కొనియున్నారు.'' అని. వి.పీ. కర్త వ్రాత, విశేష్యవిశేషణముల నేకవిభక్తిలో నిల్పుట యొక శ్రీనాథుడే కాదు. నన్నయపోతనాదుల నేకులు చేసిరి. చూ. ఆది VI, 62,63, 31,23,17,18,10, భాగవతము VII. 27,22,85 పద్యములు. మఱియు తిరుపతివెంకటకవుల పాండవోద్యోగము పుటలు 4, 5, 3, 13, 14 చూ. ఇందుచేతనే బాల్యకవారణములో చిన్నయ్యసూరి'' విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తి వచనంబులగు'' (కారక పరిచ్ఛేదము—19 వ సూ) అని సాధారణ సూత్రము వ్రాయవలసి వచ్చినది. కాన "నిది శ్రీనాథకృతమేయని ఋజువుచేయుటకు తరుగు లేనియుక్తి'' యేలయైనదో తెలియరాదు. ప్రభాకరశాస్త్రిగారి యుద్దేశము 'తరుచుగా' నని చెప్పుటలోనున్నది. కాని యదితిరుగులేని దనికాదు. ప్రభాకరశాస్త్రిగారి వాక్యములివి "శ్రీనాథుడు తరుచుగా విశేషణవిశేషములనేకవిభక్తిలో నిలుపుచుండును'' (చూ. క్రీడాభిరామ పీఠిక, పుటలో 13-14.) ఇందుచే వి.పీ. కర్తకు బాలవ్యాకరణమెంత క్షుణ్ణముగా తెలియనో స్పష్టమగుచున్నది.

(vi) తెలుగుకవులొక వాక్యమును విశేష్యమునకు విశేషణము చేయవలసినపుడు, విశేషణవాక్యమును సమాపకక్రియతో పూర్తి చేసి, విశేష్యముతో పొందింతురు. కాని శ్రీనాథుడు అసమాపక క్రియలతో, అనేక వాక్యములను మాలగాగ్రుచ్చి, అవిశేష్యమునకు అలంకరించుటకు ముచ్చట పడును'' (వి.పీ.పుట 50). ఇదికూడ పైదానివలెనే సామాన్యవిషయమే కాని, శ్రీనాథుని ప్రత్యేకతగా పేర్కొనదగిన ప్రయోగవిశేషము కాదు. కాన పై కారణములబట్టి కల్లుప్రతిష్ఠ-బాలచంద్రయుద్ధ"కర్తయు శృంగారనైషధకర్తయు నొక్కరేయని ఋజువుచేయరాదు.''

(12) ఇవికాక వి.పీ లోని కొన్ని విపరీతములను పరామర్శిం చుట యీసందర్భమున తగును vi వ పుటలో "ఈద్విపద ఇంగ్లీషులో Couplet వంటిది. దీని పాదమునకు మూడు ఇంద్రగణములు నొక సూర్యగణముండును. నాల్గవగణముయొక్క ప్రథమాక్షరము యతి స్థానము" యథార్థమునకు మూడవగణముయొక్క ప్రథమాక్షరము యతిస్థానము. ఇదిపొరపాటని భావించినను vii వ పుటలో మరల, "ఈగ్రంథమున పాటింపబడిన ఛందస్సుమంజరీ ద్విపద. ఇందుపెక్కు చోట్ల మూడు ఇంద్రగణములు, ఒకసూర్యగణము, నాల్గవగణము యతిస్థానము అనెడి లక్షణముగూడ, ఉల్లంఘింపబడినది. యతిభ్రంశమునకు కారణము రచయితయో. తరువాతివ్రాయసకాండ్రో చెప్ప లేము." అని దీనికి తప్పొప్పులపట్టికకూడ లేదు. ఈలక్షణభ్రంశమునకు కారణమెవరుచెప్పుదురూ? దీనితో వి.పీ కర్త ఛందశ్శాస్త్రప్రావీణ్యము గూడ పూర్తియైనది.

(ii) నిజమునకు, పల్నాటి కథాప్రాధాన్యము కోళ్ళపోరుతోనే ప్రారంభమగును అంతకుముందు కథలో, సారస్యము తక్కువ. అందు చేతనేకాబోలు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో ఆకథాభాగము నకు ' చెందిన ప్రతులు లేవు. అసలు ఈగ్రంథమునకు, ప్రతులు వ్రాయించి, సేకరించిన, ఆంధ్రభాషోద్ధారకుడు, కీ. శే. బ్రౌనుదొర గారు కూడ కోళ్ళపోట్లాటనుండియు, గ్రంథమును సంగ్రహింపఁగల్గిరి." అని, వి. పీ. లోని వ్రాత (చూపుట xi ) ఇది చాల సాహసమైన వాక్యము. అనృతప్రచారము కూడ మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండారమున D 1640 నెంబరు గలది. పల్నాటివీరచరిత్ర ప్రతులలో ఆను పూర్వితో నున్న గ్రంథ మిదియొకటి. ఇందు పల్నాటి యుద్ధమున ప్రసక్తులగు నిరువాగుల వీరుల పూర్వజన్మవృత్తాంతములతో కథారం భముగలదు. ఇందుపల్నాటివీరచరిత్రము కథారంభమునుండి బాలుని

కథలో బాలుఁడు బొంగరాలాటాడి యింటికి వచ్చునందాకకలదు. ఇది ప్రాసద్విపదలోనున్నది. కథాంశములెల్ల నిందు సంగ్రహముగాగలవు. ఇదియితరమంజర ద్విపదరచనములకంటె వేరైనదియు, మేలైనది కూడ. దీనికి D 1153 నెం. రు కల ప్రతినకలు, అని అందు తెలుపఁబడినది. ఈప్రతి ఆంధ్రసాహిత్యపరిషత్ వారి ప్రతికిఁగాని యున్నవ లక్ష్మీ నారాయణగారి ప్రతికిఁగాని సన్నిహితముగానుండవచ్చును. ఏదియెట్లు న్నను" "అనుగురాజు పల్నాటిసంపాదనము—పల్నాటిరాజ్య విభాగము" అనురెండుప్రకరణములలో ప్రాసద్విపద, మంజరీద్విపదలు రెండును కలిసిపోయి సంకరమైనవి. ఇందుచే నివియేక కవికృతములు కావని నిర్ణయింపవచ్చును. చూడుడు. ఇందలి కృత్యాదియంతయు ప్రాసద్విపదలోనున్నది. కథాప్రారంభమున, మొదటి రెండు పంక్తులను ప్రాసద్విపద, మూడవపంక్తి మంజరి, 4-5 పంక్తులు మరల ప్రాసద్విపద, 6,7 పంక్తులు మంజరి, 8,9; 10-11;12-13;14-15; 16-17; మగల ప్రాసద్విపద. తర్వాత 8 పంక్తులు మంజరి, తర్వాత రెండేసిపంక్తులకు ప్రాసద్విపద, మరల కొన్నిపంక్తులు మంజరి. ఇట్లు మొదటి రెండు ప్రకరణములందంతటనున్నవి. ఇందుచేరెండువిధములైన రచనలు కలగలఁపుగానున్నవని యంగీకరింపక తప్పదు. ఇందుచే తనే దీనికర్త నిర్ణయింపఁబడలేదు.

(iii) " తెలుగుకవులలో యుద్ధవర్ణనములు చేయుపట్టున, తిక్కన్న, నన్నెచోడులు ఒకరికి ఒకరు అను కర్తలుగాపాడగట్టుదురు" అని వి,పీ. 40 వ పుటలో వ్రాయబడినది. తిక్కన నన్నెచోడులలో నన్నెచూడుడు పూర్వుఁడు, తిక్కనతర్వాతవాఁడుకదా! కాన తర్వాత కవి పూర్వకవి కనుకర్త కానగునుగాని, యొకరికొకరను కర్తలు కాఁజాలరు. దీనియర్థమేమని యూహింపవలెను?

(iv) క్రీడాభిరామమును వ్రాసి, దానికి వినుకొండ వల్లభా
మాత్యుని పేరుపెట్టి యతనికి తనకీర్తి నిధారపోసిన శ్రీనాథుడు పరిత్యక్తు
డుగా మనకు గనబడుచుండగా, పల్నాటివీరచరిత్రము వంటి రసవద్గ్రం
థము నెవరో రచించి, దానికి శ్రీనాథుని పేరుపెట్టి తనకీర్తిని ధారపో
యుటలో నతనికిఁగల ప్రయోజనమేమని యాకాంక్షించిన వి.పీ. కర్త
వాక్యములలో నౌచిత్యమెట్టిది. శ్రీనాథునకుఁ సిద్ధించిన ప్రయోజ
నమే యతనికిఁగూడ గలుగదా?

XIII (13) కల్లుప్రతిష్ఠ-బాలచంద్రనియుద్ధములలో నుద్దండ
పాండిత్యప్రకర్షకు ప్రలోభపడి, ప్రక్రియాస్వరూపమును విస్మరించు
చేయు రచనలకంటె, ప్రక్రియాస్వరూపమును గుర్తించి, పాండిత్య
ప్రకర్షను ప్రక్కకు నెట్టియౌచిత్య దృష్టిగల కవిత్వముగలదు కాన
నది శృంగారనైషధకర్తకర్తృకమేయని సమర్థింపఁబడినది. దీనిని కొం
చెము విచారింతము. ఇందలి యౌచిత్యానౌచిత్యములను బట్టియే
యది శృంగారనైషధకర్తచే రచింపబడినదో కాదో కూడ నిర్ణయించు
టకు ముఖ్యసాధనము కాఁగలదు.

(i) బాలచంద్రుని పాత్రపోషణమున 'బాలచంద్రునియుద్ధ'
కర్త కొంత యనౌచిత్యమునుచేసెనని గోచరించును. బాలుడయ్యును
బాలచంద్రుడు గొన్ని విషయములను బట్టి ధీరోదాత్తుడుగ
గోచరించును. కాని యతనియందు గొన్నినీచగుణములుగూడ పొడ
గట్టుచున్నవి. సుగుణోపేతుడైన యతడు చిరుతవయస్సులో, బొం
గరములాడుకొనువయస్సులో గొప్పధైర్యసాహస పౌరుషాదులుగల్గి
యుండుట ప్రశంసనీయము. బొంగరముతో దెబ్బతిని నీవైశ్యవనిత
తన్నుదూషింపఁగా నామెను క్షమార్పణవేడుకొనుట యతని పశ్చాత్తా
పహృదయము, నౌదార్యమును దెల్పును. కాని యంత చిరుతవయ
స్సులో తనభార్యయందు విముఖుడై దుష్టవేశ్యాసంపర్కమును పొంది

నట్లుగా కవిచిత్రించుటమాత్ర ముచితముగ లేదు అదియతని యుదాత్త లక్షణమునకు గొప్పలోపము. చరిత్రలో నెట్లున్నను, అనౌచిత్యమును పరిహరింతునని కంకణముగట్టుకొనిన శృంగారనైషధకర్త, తన యాంధ్రీకరణమున మూలమందలి యనౌచిత్యములను గొంతవఱకు పరిహరింపఁదలచినాడుకదా ! అట్లే బాలచంద్రుని యుద్ధకథలో వేశ్యావృత్తాంతమును పరిహరించియుండఁడా? అది యనౌచిత్యముకాదందురేని చూడుఁడు అక్కిరాజు ఉమాకాంతముగారు తనద్వితీయముద్రణ భూమికలో నేమనివ్రాసిరో. వేశ్యామైత్రి ఆకాలములో న్యూనతకు హేతువుకాలేదు. అయినప్పటికి బాలచంద్రయుద్ధములోని వేశ్యాఘట్టమంతా అప్రయుక్తముగా కనబడుతుంది. సత్యభామ శ్రీకృష్ణుని అనుసరించినట్లు, బాలచంద్రునితో నామె యుద్ధభూమికిపోయియుంటే యీ ఘట్టము సంగతముగానుండేది. కానిఆమెఅట్లాపోక, వారిసంగతిశృంగారం తోటే సమాప్తము కావడంవల్ల కృతికర్త దీనిని వదలివేయడమే ఉచితంగానుండేది". (పుట 61-62) దీనినిబట్టి వేశ్యావృత్తాంతము దీనిలో నెంతయనౌచిత్యముగానున్నదో స్పష్టముకదా. శృంగారనైషధకర్తయే దీనికర్తకూడనైనచో తప్పక వేశ్యావృత్తాంతము దీనినుండి తొలగించెడివాఁడేయని నిర్ణయింపవచ్చును. కాన నీవిషయమునుబట్టికూడ దీనికర్తయు నాంధ్రనైషధకర్తయు నొక్కరుగారని నిశ్చయముగాచెప్పవచ్చును.

(ii) సౌందర్యవతియు, సుగుణవతియు, యువతియునగు భార్యను బాలచంద్రు డుపేక్షించుటకుఁదగిన కారణముకనఁబడదు. కలహము లున్నట్లు కనఁబడ వత్తవారితో అకారణముగ భార్యనుపేక్షించి, వేశ్యాలోలుఁడయ్యెననుట యతని శీలము కళంకము పాలుకాలేదా ? ఉచితానుచితములు పాటింపక భార్యనుల్లఘించునట్లుచేయుట కవి యనౌచిత్యమొనర్చుటయేకద. ఇదియనుచితపాత్ర చిత్రణము.

(iii) పోనీ, చారిత్రవిషయములను యథాతథముగ వర్ణింపఁ గోరి వేశ్యావృత్తాంతమును కృతికర్త దానినుండి తొలగింపలేదని వాదించినను, శృంగారనైషధకర్తయే 'బాలచంద్రుని యుద్ధము'నందలి వేశ్యావృత్తాంతమును వర్ణించియున్నచో ప్రస్తుతమున్న దానికంటె ననేకవిధముల మిన్నగ, శృంగారరసమున పాఠకుల నోలలాడించెడి వాఁడు. శృంగారనైషధకర్త శృంగార రసపోషణమున నెంత యుత్సాహపడి, యతివర్ణనలను జేయు స్వభావముగలవాడో ప్రత్యేకముగ చెప్పనక్కఱలేదు. కాశీఖండభీమఖండములందే జగన్మాతలైన పార్వతీ అన్నపూర్ణాదేవులను వర్ణించుపట్లగూడ నతిశృంగార భావములను వ్యక్తీకరించిన శృంగారనైషధకర్త వేశ్యావృత్తాంతమును వర్ణించునపుడు మాంచాల బాలచంద్రులశృంగారమును పల్నాటివీరచరిత్రమందువలె తేలికగా పోనిచ్చువాడా? పోతనగారికి భక్తిపారవశ్యమెంత కలదో శృంగారనైషధకర్తకు శృంగారరసపారవశ్యమంత యధికము దీనినిబట్టికూడ పల్నాటివీరచరిత్రభాగమగు 'బాలచంద్రుని యుద్ధమును శృంగారనైషధకర్తరచించలేదని ఘంటాపథముగనొక్కి చెప్పవచ్చును. అట్టిరచనచేయుట శృంగారనైషధకర్త స్వభావమునకు విరుద్ధమున నౌచిత్యముగూడనగును. శృంగారనైషధకర్త యెట్టి శృంగార రసప్రియుడో యతని వ్రాసిన కవిత్వముననే తెలియును చూఁడుఁడీక్రింది భీమఖండోదాహరణపద్యములను (1) వ్యాసుడుకాశిని శపింపఁబోవు సమయమున నతనికిఁ బ్రత్యక్షమైనవృద్ధాన్నపూర్ణాదేవిని వర్ణించుచు "ఒక్కయింటి మచ్చికంటి పంచాశద్వర్షదేశీయపలితసారంబైన వేణికాభారంబు గైవస, ముదుసలి చక్రవాకంబులతో నెక్కసక్కెంబాడు వ్రేఁగుచన్నుల ప్రేఁగుదనంబునఁ దవతనూవల్లిక జలదరింప, కంకణ ఝుణఝుణాత్కారంబు దోరంబుగాఁ గ్రక్కున గోపురద్వారంబు బోరు తలుపు వాయందట్టి, యందెల రవళితోడంగూడి మట్టియల మ్రోఁతత్రి

భువనంబులునురుజగోనందేరు గడుప యోలం జరణపల్లవంబుఁజాచి, యనంగధ్వజపటశరోరపాఠీనచ్ఛాయా దాయాదంబులైన వెడద కన్నులు తలచుట్టును బలసిపొరయ, కలమధుర వీణాక్వాణపాణింధమం బైన యెలుంగునెత్తి.'' భీమ ఖ. II-110. (2) త్రిపురసంహార సందర్భమున శివుఁడు త్రిపురాసురులపై బాణప్రయోగము చేయనెంచి, జ్యానినాదముచేయువట్టుననిట్లు వర్ణింపఁబడినది. చూడుఁడు.

కం॥ ముక్కంటిమేరు చాపం,
బెక్కిడి సారించెఁ బన్నగేంద్రిగుణంబున్
మక్కువ హిమగిరికన్యక
క్రిక్కిఱిసిన కుచముల లముఁగేఁబందమ్మున్॥ భీమఖ. IV-131.

(3) శివుఁడుదక్షారామమును ప్రవేశించు సందర్భమున నెట్లు వర్ణింపఁబడినదో చూడుఁడు.

తే॥ దాక్షప్రాసాదదేహళి దర్పకారి
ధరణీధరరాజ పుత్రికై దండయొసఁగ
నమ్మహాదేవి కుచమండలమ్మునోకి
యంగకంబులఁబులకంబులంకురింప॥ భీమ III-43.

(4) సప్తమునులు శివుని స్తోత్రముచేయు సందర్భమునఁ గూడ శ్రీనాథుడు తన రసికత్వమును జూపకపోలేదు. చూడుఁడు.

సీ.గీ॥ అంబికాకుచ కుంభద్వయాంగరాగఁ
పరిమళాసారవాసిత బాహుమధ్య!
దక్షిణాపథ కాశ కాంతర్విహార !
గిరిశ! శ్రీభీమనాథ! రక్షింపుమమ్ము॥ భీమ. V - 169.

(5) ఇఁకవసంతర్తువర్ణనముచేయుపట్ల దాక్షారామవర్ణనవైఖరిని శ్రీనాథుడెట్లు తనశృంగార రసాభిమానమును జూపెనో తిలకింపుడు.

శా॥ వేమాఱుంగల శీతనూభవవధూవేశీ భరాతః పస్మా

నామోదగ్రిహ యోళువుల్ పొలసె దక్షారామ మధ్యంబునన్॥
భీమ V. 95

సంవర్ణ్యాసందర్భములనుగూడ లెక్కచేయక తనశృంగార రసాభిమానమును జూపగ శృంగారనైషధకర్త, మాంచాలా బాలచంద్రులంతఃపురంబున క్రీడించిన విధానము నెంత నిగ్రహముతో వర్ణించెనో తత్కర్త తిలకింపుఁడు.

"తరువాత మాంచాల తన భర్తయైన, బాలచంద్రునితోడ భాదముప్పొంగ మేడమీఁదికిఁబోయి మేలైనయట్టి,చిత్తరువులఁజూపుచు చిలుకలచదువు వినిపించి, శృంగారవిపినంబుజూపి, పెద్దలు తనమీద ప్రియముమీరంగ ప్రొద్దుపోవుటకునై పొందించినట్టి, ధర్మపాంచాలికా వ్రాతముజూపి యందులో నొకబొమ్మనాడంగఁజేసె; అందుకాతఁడు కరమానందమొందె, అటుమీద నిద్దరు నధిక మోహమున, చిత్తరువు మేడకుఁజేర బాలుండు హంసతూలికపాన్పునందుపరుండె, ప్రియురాలు ముత్యాలపీటపైనుండి తాంబూలమిచ్చుచు తనమదిలోన, బాలునిభావంబు బాగుగనెరిగి ఆయత్తపడివత్తునని మొక్కి లేచి, జననియొద్దకుఁబోయి జలకంబులాడి" పంక్తులు-3370-3390.

పై వర్ణనమును శృంగారనైషధమందలి నలదమయంతుల యంతఃపుర విహారముతోఁబోల్చిచూచినచో పై మాంచాలా బాలచంద్రుల విహారవర్ణనము శృంగారనైషదకర్త రచనాతత్వమునకు విరోధమైనదని యెవరికేని తేలికగా గోచరింపగలదు.. ఇందుచే పల్నాటివీర చరితమును, శృంగారనైషధకర్త యెంతమాత్రము రచించి యుండడని నిశ్చయింపవచ్చును.

(iii) అలరాజును ద్రోహముచేసి చంపిన నరసింగరాజును యుద్ధములో తలనఱికి పగతీర్చుకొందునని ప్రతినపట్టిన బాలచంద్రు నాశీర్వదించి, రని ధర్మములుపదేశించి బ్రహ్మనాయఁడు పంపగా

నతఁడు, యుద్ధభూమి కేగి భ్రాంతిచే వేరొక శిరస్సునునరికి తండ్రికర్పించెను. అంతబాలచంద్రుడు తనపొరపాటును తెలిసికొని మరల యుద్ధమున కేగి నరసింగుని తలమునిమి,

"అలరాజుఁజంపిన ఆపగవీర్పు..............కత్తితో తల గోసి కరములపట్టి. ఒకచేతత్రేవులనొయ్యనెత్తి......తన తండ్రి తావులకు తలగొనిపోయె''...అంతబ్రహ్మనాయుడు, విచారముతో నాతనికృత్యమును మందలించుచు, "నాయుడాతని కూర్మికనందను జూచి, రమ్మని నినుపిల్వరాజంపలేదు, వచ్చియూరకయున్నవాడవు కావు, చూరకొంటివో సేన శూరుడువగుచు, చెల్లెబోనీవిట్లు చేసిన క్రమము, విభువకుసేవకు విధ్యైనెతికద.'' అని తిరస్కరింపగా, బాలచంద్రుడు తండ్రినిట్లుదూషించును.

" అనిపల్కవిని బాలుడతుల రౌద్రమున
పలికెనందరు వినబ్రహ్మన్నతోడ,
వెడవెడ యేడ్పులువేగ చాలింపు
కొల్వులో మామామకొమ్మ భూపతికి
అలరాజు పగకయి నప్పగించితివి,
నీస్వభావంబింక నేవివరింతు.
పోగొట్టితివి కోడిపోరువ భూమి;
నిను నమ్మివచ్చిన నేమేనమరిది,
ప్రాణంబు కొన్నట్టి పాపాత్ముడవు;
చెలువు చూడగ పంచి చెవులరాయనను
చండకమ్మడవయి చంపించితీవు;
ఘను లెంకజోదును కలనికిబంపి
మందలోఁ జంపితి మాయయొనర్చి;
యిటువంటి నీచేష్టలెన్నివర్ణింతు "
"అనిన మాటలు బ్రహ్మ కలుగులైతోఁచి"

ఇట్లు బాలచంద్రుడు తండ్రిని దూషించుటయెంత సరసముగ నున్నది? ఇది యతని శీలమున లోపముగ లేదా! ఇట్లు పాత్రపోషణము చేయుట యౌచిత్యముతో గూడియున్నదా? శృంగారనైషధకర్తయే పల్నాటివీరచరిత్రకర్తయైనచో నిట్టి యనౌచిత్యములను చేయడు. కాన తత్కర్తలొక్కరు కాజాలరు. శృంగారనైషధకర్తయగు శ్రీనాథుని కవిత్వభాషాశైలు అను నతని స్వభావ తత్త్వమును పూర్తిగ గ్రహించిన వారెవరును పల్నాటివీరచరిత్ర మతనికృతియని యంగీకరింపలేరు.

XII (14) పైయుపపత్తులనుబట్టి శృంగారనైషధకర్తయగు శ్రీనాథుడు పల్నాటివీరచరిత్రకర్త గాడని స్పష్టపడినదికదా. ఈదృష్టితో నితర స్వల్పకారణములను గూడ పరిశీలించి సంతృప్తి పడుప వలసియున్నది.

(i) శ్రీనాథుడు పదకవిత్వమును సిరసించుచు చెప్పిన చాటు పద్యమగు

క॥ ముదివిటులు విధవలంజలు, పదకవితలు మూరుబాస బాపనివారల్
చదువని పండితవర్యులు, కదనార్భటి వీకవరులు కడిదిపురమునన్.॥

అను పద్యము శ్రీనాథునిదేయని జనశ్రుతి. చాటు పద్యములకు సామాన్యముగ నింతకంటె ప్రమాణముండదు. కాని పల్నాటివీరచరిత్ర ద్విపద కావ్యమే కాని పదకవిత్వము కాదనియు నది మాత్రాగణచ్ఛందస్సంబంధియనియు, పాల్కురికి సోమనాథాదులు పేర్కొనిన తుమ్మెదపదములు వెన్నెలపదములు మొదలైనవి మాత్రమే పద కవిత్వమునకు జేరుననియు, ద్విపద కావ్యమసలు మాత్రాచ్ఛంద స్సంబంధియైనను శ్రీనాథునికాలమునకు ముందే గణచ్ఛందస్సంబంధియైన దనియు, ద్విపదలోనిపద శబ్దమునకు అర్థము పాదము కాని, పదము కాదు అనియు రెండుపాదముల నాలుగుగణముల ద్విపదలు విడిగా పద కవిత్వము కావచ్చును కాని, ద్విపదకావ్యము పద కవిత్వము కాం

దలు వ్రాసిరి. కాని వి.పీ. కర్త పల్నాటివీరచరిత్రపద కవిత్వమనియే సోపపత్తికముగ నిర్ణయించెను. కదా. ఆద్విపద కావ్యమునే పాటగా పాడిరని క్రీడాభిరామమునఁ దెలుపఁబడెనుకదా. కాన పల్నాటివీర చరిత్ర ద్విపదకావ్యము పద కవిత్వమనుటలో విప్రతిపత్తి యేమున్నది. అట్టి పదకవిత్వమును "గర్హించినశ్రీనాథుడే పల్నాటివీరచరిత్ర ద్విపద కావ్యపదమును వ్రాసెననుట పరస్పరవిరుద్ధము, నాత్మవాక్య వ్యాఘాతముకాదా? కాన పదకవిత్వమును గర్హించిన శ్రీనాథుఁడు వేరు, పల్నాటివీరచరిత్ర ద్విపద కావ్యపదమును వ్రాసిన శ్రీనాథుఁడు వేరును నై యుండవలెను. పాల్కురికి సోమనాథుని, పండితారాధ్యచరిత్ర మను ద్విపదకావ్యమునకు, ద్విపదపంక్తులను పద్యములలో గూర్చిన శ్రీనాథుడు ప్రత్యేకద్విపదకావ్యమును వ్రాయుటయు సాధ్యము కాదు. శ్రీనాథుడు పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర ద్విపద పంక్తులల్లేదిద్ది తీర్చుటచేనతనికి ద్విపద రచనపై గల యభిమానమని కొందఱు వాదించిరి. కాని ద్విపదరూపముననున్న పండితారాధ్య చరిత్రను పద్యగద్యరూపముగా వ్రాయుటకు శ్రీనాథునకు ద్విపదరచనపైఁగల యసహ్యాభావమే యని యేల భావింపరాదు? ద్విపదరచనపై శ్రీనాథున కభిమానమే యుండినచో దానిరూపమును మార్చ నేల? పాల్కురి సోమనాథునిపై నసహ్యాభావముచేతనా? కాదుగదా! పాల్కురికి సోమనాథుని భాషపైనను, ద్విపదరచనపైనను గౌరవభావము లేకయే దానిని గద్యపద్యములలో వ్రాసియుండునని స్పష్టముగా చెప్పవచ్చును. పాల్కురికి సోమనాథుని బసవపురాణమును గద్యపద్యములుగా వ్రాసిన పిడపర్తి సోమనాథాదుల విషయము వేరు. వారు వీరశైవమతాభిమానులై పాల్కురికి సోమన మీఁదిగౌరవ ప్రపత్తులచే వ్రాసిరి. శ్రీనాథుఁడు వీరశైవుఁడుగాఁడు. పాల్కురికిసోమన భాషా వ్యాకరణపద్ధతులుఁగూడ నాతనికిన చ్చలేదు. అందుచేతనే యతని

నెక్కడును పూర్వకవులస్తుతులలో స్తుతించ లేదు. హారవిలాసమున సిరియాళచరిత్రను ప్రథమువనే వ్రాయుట, పాల్కురికి సోమన యందు కాని, వీరశైవమతమందు కాని, ద్విపదరచనయందుగాని కలయభిమానముచేతకాదు. కృతికర్తయగు తిప్పయ శెట్టిని పంతోషపెట్టుటకు. కాన శ్రీనాథునకు ద్విపదపై నభిమానమునియు, నందుచేతనే పల్నాటి వీరచరిత్రమును ద్విపదలోరచించెనని వాదించుట మాత్రము సమంజసము కాదు.

(ii) ఆంధ్రసాహిత్యపరిషత్తునందున్న పల్నాటివీరచరిత్ర ప్రాంభ పీఠికలోనే తత్కర్తయగు శ్రీనాథుడు భారద్వాజగోత్రుడనిని యోగివంశోద్భవుడైనట్లు నుత్తమపురుషలో తానే యిట్లు వ్రాసికొనినాడు.

(a) "సిరిగల్గు మాచర్ల చెన్నుని కృపను,
వరమున నియోగివంశోద్భవుండ
భరద్వాజగోత్రమునఁ బరగినయట్టి,
భువియందు శ్రీనాథ పుణ్యుఁడన్వాడ
ప్రవిమలంబగ నొక్క పరిదినమందు."........
కలలోన చెన్నుడు గ్రక్కునవచ్చి,
వినుము శ్రీనాథుడ విశ్వంబునందు"

అని, ఇఁక అక్కిరాజు వారి ముద్రణమున బాలచంద్రుని యుద్ధభాగపీఠికలోగూడ నిట్లుత్తమపురుషలోనేయున్నది.

(b) "వలను భారద్వాజ వంశ వర్ధనుడ,
కవిసార్వభౌముడ ఘనత గన్నట్టి,
శ్రీనాథుడనువాడ శివభక్తిపరుడ"............
చేకొన్న మాచెర్ల చెన్నకేశవుడు,
నాకలలోన వచ్చినయ మొప్పఁబలికె.
వినవోయి సత్కవివేడ్క నామాట" అనికలదు.

(c) ఇఁక విశాలాంధ్ర ప్రతియందు,

"వర భరద్వాజుని వంశానఁబుట్టి,
ధరణి శ్రీనాథుడన్ ధన్యుండు మహిమ
విలసిల్లు పలనాటి వీరచరితము,

సలలితమ్ముగ జనుల్ చదువుటకొఱకు,
సంజాతనవరస సంభృతి యొప్ప,
మంజరి ద్విపదగా మన్నించిచేసె"

అని ప్రసద్విపదలోఁ జెప్పఁబడెను.

(d) మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండార మందలి D.1139 నెంబరుగల పల్నాటివీరచరిత్ర—బాలుని కథలో పీఠిక యందిట్లున్నది.

" భూమి శ్రీనాథుఁడు పుణ్యుడోయనఁగ.

వలను భరద్వాజ వంశవర్ధనుడు, పలుమారు చెన్నునిభక్తి ప్రార్థించి,
పలనాటి వీరుల భాగవతంబు, లలిమీరగాఁ గుశలత్వంబు తోడ,
ననయంబుగాదననొగాకయనుచు, దెనుగునద్విపద గాఁదెలగొప్పఁజేసె
అనిప్రాస ద్విపదలోను, చిట్ట చివర గ్రంథాంతమున,

"ఘనుడైన శ్రీనాథ కవిరాజరాజు,
చెన్నుని కృపచేతఁ జిత్తముప్పొంగి,
బాలుని విక్రమ ప్రౌడినంతయును
విరచించె జనులకు విదితంబుగాను."

అనియుఁగలదు. ఈచివరిభాగము అక్కిరాజువారి ప్రతిలో గూడ చివరనున్నది.

(e) మఱియు, ప్రాచ్యలిఖిత పుస్తక భాండారముననే యొకా నొకప్రతిలో కన్నమనేని యుద్ధాంతభాగమున నిట్లుత్తమ పురుషలో నున్నది.

"వలను భరద్వాజవంశవర్ధనుఁడ, మారయపుణ్యాభిమాంబకడ్పునను, స్థిరముగాఁగలిగిన తేజంబుఘనుడ, గారవంబైనట్టి ఘనుడ శ్రీనాథు చేపట్టివీరుల చరితమంతయును, తగఁజెప్పె నాచంద్రతారార్కముగను."

అనియున్నది. మల్లయరచించిన 'కోళ్లపోరు, గాపుమరణము, కన్నమనేనియుద్ధమును కలిసియున్నవి. వీనిలో కన్నమనేని యుద్ధాంత మున పైరీతిగ నుత్తమపురుషలో, శ్రీనాథుడు రచించినట్లుగా నుండుట విచిత్రముగానున్నది. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార ప్రతిలో శ్రీనా థకృతమనియుండుట పొరపాటనియు, నదికూడ మల్లయ్యకృతంబై యుండునని సవరణసూచింపఁబడినది. అట్లేయగుచో నందలి యుత్తమ పురుషాంత పదములను ప్రథమపురుషాంతములుగా

" వలను భరద్వాజ వంశవర్ధనుడు,
మారయపుణ్యభీమాంబ కడ్పునను
స్థిరముగాఁగలిగిన తేజంబుఘనుడు,
గారవంబైనట్టి ఘనుడు శ్రీనాథు
చేపట్టి వీరుల చరితమంతయును,
తగఁజెప్పె నాచంద్రతారార్కముగను"

అని మార్పవలసియుండును. దీనిని బట్టి శ్రీనాథుని సాయ ముతో తానురచించెనని యర్థమగుచున్నది. కనుక పీఠికలోని రచన

ప్రథమపురుషనుండి యుత్తమపురుషలోనికి, నుత్తమపురుషలోనుండి ప్రథమపురుషలోనికి తేలికగామార్చుటకు వీలుగానున్నది. కాన, లేఖకులుగాని సంపాదకులుగాని పాటగాండ్రుగాని యెట్టిమార్పుల నైన చేసియుందురేమోయను సంకోచమున కవకాశమిచ్చుచున్నవి. ఇందుచే, నేపాఠము యదార్థమైనదో నిర్ణయించుట కష్టమైనది. కను కనే విశాలాంధ్రప్రతి పీఠికకర్త.

"శ్రీనాథుడన్ ధన్యుఁడ" అనుదానికి "శ్రీనాథుఁడను ధన్యుండు" అని తేలికగా వ్యాఖ్యానింపగలిగెను. కాన నీపాఠములలో నేది యదార్థమైనదో చెప్పుటయేకష్టము. మఱియు నాంధ్ర సాహిత్యపరిషత్తు ప్రతియు, అక్కిరాజు ఉమాకాంతముగారిపాఠమునుత్తమ పురుషలో మాత్రమే యుండినను, రెంఁడురచనలలో భిన్నముగా నుండుటచేత నీరెండింటిలో నేది శ్రీనాథకృతమో నిర్ణయించుటెట్లు? వీనిలో ప్రక్షిప్తములేవియో చేరియుండక తప్పదని మాత్రము చెప్పకతప్పదు. పై వానిలోఁ గొన్నింటిలోఁ గొన్నిపాదములు యథాతథముగా సమానముగానున్నవి. కొన్ని కొలఁదిమార్పులతో సమానమగుచున్నవి. సాహిత్యపరిషత్తు ప్రతిలో "మంజరీ ద్విపదలో" వ్రాయుదునని చెప్పఁబడినను, రచన మాత్రము ప్రాసద్విపదలోనే సాగినది. ఒక్క అక్కిరాజు వారి పాఠమునందు తప్ప "కవిసార్వభౌమ" బిరుదపద మితర పీఠికలలోఁగానరాదు. విశాలాంధ్రప్రతిలో ప్రారంభ పీఠికయందు శ్రీనాథుని పేర్కొనిన కర్తనామము తెలియకపోవుట మఱియు విచిత్రముగానున్నవి. ఈయవకతవకలవలన శృంగార నైషధకర్తయే పల్నాటివీరచరిత్ర కర్తయని యెంతమాత్రము నిశ్చయముగా చెప్పలేము.

అయితే యీపల్నాటివీరచరిత్రకర్తయగు శ్రీనాథుఁడెక్కడి వాఁడని విచారణ. కాటమరాజుకథను ద్విపదగా రచించిన పినయల్లన యనుకవి తనకుఁబూర్వమే శ్రీనాథుఁడను కవివ్రాసిన కాటమరాజు చరిత్ర ననుసరించి, తాను ద్విపదగా వ్రాయుచున్నానని యాగ్రంథమున నిట్లు చెప్పుకొనినాఁడు.

ద్వి॥ గురుతైన కొమనాల గోత్రాబ్ధి చంద్రుఁ
డరయంగ గంగులమల్లయసూర్కి
తనయుండు సర్వన తగుసహోదరుడు.
పినయల్లయనువాడు ప్రియముతోజనుల
వలనొప్ప శ్రీనాథువచనపద్ధతిని
సలిపెను యదు శాస్త్ర్ర వరిశమంత యును
వినిపింతు యాదవ వీరులచరిత?

ఈగ్రంథమును వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరింపఁగా వారు గతించిన తర్వాత, మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయము వారు మల్లంపల్లి సోమశేఖరశర్మగారి తోడ్పాటుతో ప్రచురించిరి. ఈకాటమరాజు కథనే చంపూరూపముగా రచించిన మఱియొక కవి కూడ, తనకుఁ బూర్వమే శ్రీనాథుఁడను కవి ద్విపదరూపమున దీనిని రచించెనని తన గ్రంథమున నీక్రిందిరీతిగ తెలుపుకొనినాఁడు.

సీ॥ ఒక శుభదినమున నొగి శుభమతి శౌరి,
పూజావిధానంబు పొందుపఱచి
హరికథ వినివిని యారాత్రి నిద్రింప
శ్రీనివాసుండిట్లు చెప్పెఁగలను

శ్రీనాథుఁడను కవి శ్రేష్ఠుండు ద్విపదగా
రచియించె కాటమరాజు చరిత
మదినిపు నా పేర నంకితముగఁ బద్య
గద్యాత్మకంబుగా మనతను నీవు

గీ॥ మని వచించి తిరోహితుఁడయ్యె నంత
నేను మేల్కాంచి యాస్వామి నెంచిమదిని
కాలకృత్యములను దీర్చి కడకులిర్చి
పండితావళిఁ గనుగొని భక్తి పెఱయ॥

దీనిని బట్టి "సంగీతసాహిత్య చాతుర్యకవిత, చెప్పినేర్చిన వాఁడు శ్రీనాథనాముఁడు మఱియొకఁడు. గేయకవిత్వమును వ్రాయ నేర్చినవాఁడాంధ్ర కవిలోకమున నుండెననియు, వాఁడే ద్విపదలో కాటమరాజుకథను, పల్నాటివీరచరిత్రను వ్రాసెననియు విశ్వసింపవలయును ఈతడు యుద్ధాత్మక కథలను ద్విపదలుగా పాడుకొనుటకు వీలుగా వ్రాయు స్వభావముగలవాఁడనియు మనము గ్రహింపవలసియున్నది పల్నాటి వీరయుద్ధము క్రీ.శ. 1178–82 సం॥ ల మధ్యకాలమున జరుగగా, సుమారొక నంద సం॥ల తర్వాత, కాటమరాజునకు మనుమసిద్ధితో యుద్ధము జరిగియుండును. కాన ద్విపద కవియగు శ్రీనాథుఁడు క్రీ.శ. 1275. తర్వాత కాలము వాఁడైయుండును. ఈతఁడు రచించిన పల్నాటివీర ద్విపదగ్రంథమునే వల్లభరాయఁడు క్రీడాభిరామమున పేర్కొనియుండును, వల్లభరాయఁడు క్రీ.శ 1450 ప్రాంతము వాఁడగుటచే, ద్విపద కవియగు శ్రీనాథుఁడు క్రీ.శ 1275–1450 మధ్యకాలములో జీవించియుండును. తరువాత కొంతకాలమున కిప్పుడు మనము కూడ భ్రాంతిపడినట్లే శ్రీనాథుఁడనఁగ సుప్రసిద్ధుఁడైన శృంగార నైషధ

కర్తయే యనుకొని కొందఱు లేఖకులో, పాటగాండ్రో శ్రీనాథునకుఁ గల కవిసార్వభౌమ బిరుదమును కవిరాజరాజనియు, నాతనిగోత్రమగు భారద్వాజగోత్రమును కలిపియుందురు. ఒకవేళ నీ శ్రీనాథుడుగూడ భారద్వాజ గోత్రజుఁడైనను కావచ్చును. అందుచే పాఠకుల భ్రాంతి యినుమడింపవచ్చును. ఇది నాదృఢవిశ్వాసము. అంతేకాని, శృంగార నైషధకర్తయు, పల్నాటివీరచరిత్ర కర్తయు నెప్పటికి నొకఁడు కాఁజాలఁడు.

# శ్రీ నాథుఁడు — పూర్వకవితా చర్వణము

శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి. ఎమ్. ఏ.

శ్రీనాథుఁడు సకలవిద్యాసనాథుఁడు. ఆతని కృతులలో ఆసకల విద్యల సౌరభమును అలవోకగా గుబాళించును. ఆ గుబాళింపు మొగము మొత్తునదికాదు, మనసు హత్తునది. అందు "పూర్వకవి ముఖ్యవిరచితా పూర్వకావ్య భావరస సుధాచర్వణ ప్రౌఢత" ఒకటి. అది సంస్కృతాంధ్రకవులకు సమామ్నాత పూర్వమే. ఆంధ్ర సాహిత్యమున "ఆదిని. శబ్దశాసన మహాకవి"యే అందుకు మార్గదర్శి.

"అశోకనిర్భర్త్సిత పద్మరాగ మాకృష్టహేమద్యుతి కర్ణికారమ్
ముక్తాకలాపీకృత సిన్దువారం వసన్త పుష్పాభరణం వహన్తీ,"

ఇది పరమేశ్వరుని తపోభంగమునకు ప్రాతిపదికగా పార్వతికి. కాళిదాసు సంతరించ్చిన శృంగార నైపథ్యము. మఱి, పాండురాజు వ్రత భంగమునకు ప్రాతిపదికగా మాద్రికి, నన్నయ సంతరించిన శృంగార నైపథ్యమును ఇదే.

"చారు సువర్ణహాసి నవ చంపక భూషయు సిందువారము
క్తా రమణీయయున్ వకుళదామవతంసయునై యపూర్వ శృం
గార విలాసలీల మెసఁగం దన ముందటనున్న మాద్రి నం
భోరుహనేత్రఁజూచి కురు పుంగవుఁడం గజరాగమత్తుఁడై"

నన్నయ అలంకరించిన చారుసువర్ణమును హసించు నవ చంపకములు, కాళిదాసు సృజించిన పద్మరాగములను ప్రతిఘటించు అశోక సుమములకు; సువర్ణ కాంతిని చూఱగొన్న కర్ణికారములకు సయిదోడులు ముక్తా కలాపీకృత సిందువారమే సిందువారముక్తారమణీయము. ఇఁక వకుళదామవతంసము ఒకవసంతపుష్పాభరణమే కదా! కనుకనిది కాళిదాస కవితాచర్వణమున నన్నయ రసోద్గారము. ఒక్క నన్నయమాత్రమే కాదు, తిక్కనాది పూర్వాంధ్ర కవులందఱును పూర్వకవితా చర్వణ ప్రవీణులే అందు శ్రీనాథునికి అగ్రతాంబూలము.

విద్వద్రాజపథమును సేవించు నెడ. శ్రీనాథుఁడు చర్వణ మొనర్చిన రసగుళికలు వేలు. శ్రీహర్షుని నైషధీయచరితమున నలునికి పట్టువడిన హంస ఒనరించిన పరిదేవనము ఒకకరుణరస నిర్భరమైన కవితాఘట్టము ఆశ్లోకములను శ్రీనాథుఁడు అట్లే తెనిఁగింపలేదు. ఎంతో స్వతంత్రత ప్రకటించెను. స్వీయకవితను చిలికెను. కరుణారసపోషణమున పరాకాష్ఠ నందెను. అంతేకాదు – కరుణరసమనఁగానే "ఏకోరసః కరుణ ఏవ" అని కంఠమెత్తి ఉద్ఘాటించు భవభూతి ఉత్తరరామచరిత్రకు కవితా వందనము కావించెను.

అనిర్భిన్నో గభీరత్వాదన్తర్గూఢ ఘనవ్యథః
పుటపాక ప్రతీకాశో రామస్య కరుణోరసః"

ఇది సీతావియోగమువలని శ్రీరాముని శోకము మురళిచే భవభూతి పరికించిన శ్లోకము దీనిని శ్రీనాథుఁడు సఖులవియోగమువలని హంసశోకమునకు అందిపుచ్చుకొన్నాఁడు.

"సఖులార! యేప్రకారంబునంబుటపాక ప్రతీకాశంబైన కరుణ రసంబునఁ బురపుఁరం బొక్కెదరు?"

ఇది వచనము కాదు. శ్రీనాథునిరచనము ఇందు శ్లోకపూర్వ భాగమునకు అర్థానుసరణము, ఉత్తరభాగమునకు శబ్దానుసరణము కలదు. పూర్వభాగమునందలి శబ్దమునందలి అట్లే అనుసరించిన శక్తి మంతముగ ఉండదు. ఉత్తరభాగమునందలి శబ్దములను అట్లే అనుసరింపకున్న శక్తిమంతముగ ఉండదు. "గభీరత్వమున అంతర్గూఢమైన గురువ్యథ" అనుటవలనకంటె "పురపురపొక్కుట" అనుటవలన ఆభావము ప్రస్ఫుటమగుచున్నది. "పుటపాక ప్రతీకాశంబైన కరుణరసంబు" అటులే అనవలసినది. శబ్దశక్తి అట్టిది. ఇది శ్రీనాథుని తెనుఁగుసేత లోని తేజోరేఖ ఈ శ్రీనాథునివాక్యము చెంత, ఇటీవలి నాటకానువాదములందలి పద్యములు దివిటీ ముందటి దివ్వెలు.

ఇంతకు శ్రీనాథుఁడు బ్రాహ్మీదత్తవర ప్రసాదుఁడుకదా! ఆ వాగీశ్వరి నైషధమున ఒక పాత్ర దమయంతి స్వయంవరమునకు దశ దిశలనుండి రాజకుమారులువచ్చిరి. వారందఱివైభవములు స్వయం వరవధూటికి వక్కాణింపఁగలవారెవ్వరు?-భీమరాజు విష్ణువునుస్తుతింపు. ఆవిష్ణువుపంపగాఁ అందుకు సరస్వతివచ్చినట్లు శ్రీహర్షుని నైషధీయ చరి తమునకలదు. ఆసందర్భమున శ్రీహర్షుఁడుచేసిన సరస్వతీవర్ణన అద్భు తము. కాని అనర్ఘముకాలేదు. అద్భుతమైన వాగ్దేవతావర్ణనము; అనర్ఘమైన సరస్వతీస్తోత్రమగుటయే బ్రాహ్మీదత్త వరప్రసాదునికి అభిమతము. అస్తోత్రమునకును దేవభాషలో ఉన్నమహిమ దేశభా షలో వచ్చునది. కాదు. అందుకే శ్రీహర్షుని వర్ణనశ్లోకములను శ్రీనాథుఁడు స్తోత్రదండకముగ మలఁచెను. అంతేకాదు. సంస్కృత శ్లోకములను తెనిఁగించుటకు బదులు సంస్కృతభాషలోనేఆదండకము నంతరించెను. ఇదిగమనార్హమైనది. ఇందుకు మూలమునందలి ముం దున్న విష్ణుస్తోత్రమును శ్రీనాథుఁడు విడిచిపెట్టెను. స్తోత్రముపై స్తోత్రము వ్రాసిన గంటము పందెములో గెలుచునేకాని, కావ్యము బంధములో నిలువదుకదా! ఇఁకసరస్వతిని సంస్తుతించినచో, సరస్వతి స్వయముగనే సాక్షాత్కారము కావలెను. అదేస్తోత్రమహిమ. అంతే గాని విష్ణువుపంపుటకాదు. అందుకు మూలమునందలి విష్ణుప్రసక్తిని శ్రీనాథుఁడు విడిచిపెట్టెను. ఇందుకు హేతువు, ముదిరిన వీరశైవము కాదు. కుదిరిన బ్రాహ్మీదత్త వరప్రసాదమే అంతేకాదు అది శ్రీనా థుని ఔచిత్యదృష్టి. అందువలన శ్రీహర్షుని అద్భుతవర్ణన శ్రీనాథుని లేఖినిలో అనర్ఘస్తోత్రమేఅయినది. నైషధాంధ్రీకరణమున సంస్కృత దండకము సంతరించుటలోని రహస్యమిది. వాగ్దేవి వాత్సల్యమునకు శ్రీనాథునికృతజ్ఞత ఇట్టిది. ఇట్టి శ్రీనాథుఁడు ప్రసిద్ధమైన శారదాస్త వము కన్నుల కద్దుకొనకతప్పదు.

"యా కున్దేన్దు తుషారహార ధవళా యాశుభ్రవస్త్రాన్వితా
యా వీణా వరదణ్డ మణ్డితకరా యా శ్వేత పద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిర్దేవైస్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా"

ఇది సుప్రసిద్ధమైన శ్లోకము స్వయంవరసభలో సాక్షాత్కార మైన సరస్వతి, ఆవ్యవహారము చక్కబెట్టి నలదమయంతులను వర ప్రదానము సేయునెడ, మానుషాకారము మాని దివ్యరూపము ధరిం చినదని అమూలకమైన ఒక అపూర్వకల్పనచేసి అందు శ్రీనాథుడు ఈశ్లోకమును స్మరించెను.

"భారతీదేవి .........వీణా పుస్తకపాణియు రోహిణీరమణ చూడామణియును గుందేందు తుషార హార ధవళంబును నగు దివ్య రూపంబు ధరియించె."

ఇందు భారతీదేవి పాణిని వీణతోపాటు పుస్తకమును అలంక రించుట విశేషము. మఱి "కుందేందు తుషారహారధవళము" కేవలము శ్లోకపునశ్చరణమే. ఇదొక చిహ్నపతాక.

ఇఁక సరస్వతీదేవి నలునికి చింతామణీమంత్రమును ఉపదేశించు సందర్భమునవ్యాసభారతమునందలి నలోపాఖ్యానములోని ముఖ్యమైన శ్లోకమొకటి గ్రహించి, సరస్వతి అన్నట్లు శ్రీనాథుఁడు స్వతంత్రముగ కల్పించెను. ఆ శ్లోకమిది.

"కర్కోటకస్య నాగస్య దమయన్త్యా నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్"

ఇది నన్నయభట్టోపాధ్యాయుఁడు తెనిఁగింపలేదు. ఇది కని పెట్టియే కాబోలు శ్రీనాథభట్ట శిష్యుఁడు సందర్భౌచిత్యమెఱిఁగి సంత రించెను. ఆ పద్యమిది.

"నిను దమయంతిని ఋతుప
ర్ణుని గర్కోటకుని నెవ్వరు దలంతురు మే
ల్కను నప్పు డుషః కాలం
బున నృప! కలికల్మషములు వొందవు వారిన్"

కీర్తనమాత్రముననే కలినాశనమని వ్యాసప్రోక్తము "మేల్కను నప్పుడుషః కాలంబున" అని శ్రీనాథుని ప్రశ్లోకనిబంధన సూత్రప్రాయమున శ్లోకమునెడ కూడ శ్రీనాథునికి స్వతంత్రతయే ఇంతకు నిది, "తతః పుణ్యశ్లోకః క్షితిభువనలోకస్యభవితా భవానాఖ్యాతః సత్కలికలుషహారీ హరిరివ" అనుమూలమునకు అనువాదమైన "హరియుంబోలెఁ గలికలుషహారిగుణ సంకీర్తనుండవు పుణ్యశ్లోకుండవు నగుము" అను సరస్వతి ఆశిషమునకు చక్కని అవతారిక.

నలదమయంతుల వివాహము జరిగినది. నాలుగుదినములు గడిచినవి దమయంతిని అత్తవారింటికి పంపవలసివచ్చినది భీమరాజు అదొక హృదయాంతస్స్నాయువులను కదలించు అనూచానమైన కరుణరసఘట్టము. అత్తవారింటికి పయనమై, అశ్రుధారలు వర్షింప, తలవంచియున్న తనయను జూచినతండ్రి హృదయము శతధాభిన్నము కాక తప్పదు. కణ్వుడంతటి మహర్షికి — కన్నకూఁతురు, కాదు పెంచినకూఁతురు—శకుంతలను పంపునపుడు అట్లైనది. అంత దుఃఖమునకు అత్తింటికేఁగు అనుఁగు తనయకు ఆమెసుఖము కోరి ముఖ్యమైన హితోక్తులు చెప్పకతప్పదు. అదొక క్లేశము. అట్లుభీమరాజు దమయంతికి చెప్పినట్లు అంతో ఇంతో శ్రీహర్షుని నైషధీయచరితమున లేకపోలేదు. కాని, అది "రసమును పోషించు" శ్రీనాథునికి సంతృప్తి నిచ్చునది కాదు. కణ్వమహర్షి శకుంతలకు చెప్పినట్లు కాళిదాసు రచించిన శ్లోకమే శ్రీనాథుని పరిణానికమున ప్రకాశించినది.

"శుశ్రూషస్వగురూన్ కురుప్రియ సఖీవృత్తిం సపత్నీజనే
భర్తుర్విప్రకృతాపి రోషణతయా మాస్మప్రతీపంగమః
భూయిష్ఠం భవ దక్షిణాపరిజనే భాగ్యేష్వను త్సేకినీ
యాన్త్యేవం గృహిణీపదం యువతయో వామాః
కులస్యాధయః"

కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలమునందలి ఈ శ్లోకమునకు శ్రీనాథుని ఆంధ్రీకరణమిది.

"పాటించి కొలువుము భవనదైవతముల
సవతులఁ గొనియాడు సఖులఁ జోలి
యారాధనము సేయు మత్తమామల నెప్డుఁ
బరిజనంబుల మీఁదఁ గరుణగలుగు
మలుగకు కోపించినపుడు నాథునితోడ
మదిలోన నుబ్బకు మన్ననలకుఁ
దోడి కోడండ్రతోఁ గూడి మాడి చరింపు
దాసీజనముఁ బ్రోవు తల్లి కరణి
బ్రాహ్మణులయందు గురులందు బంధులందు
భక్తి విశ్వాస సౌహార్ద పరత నెఱపు
భవ్యపతి దేవతాచార పరమపుణ్య
ధర్మమే మఱకుండు మీ తల్లి కాన !"

ఇది " కన్నుల బాష్పాంబు కణంబులురలఁ బ్రణామంబు సేసి తలవాంచియున్న" దమయంతిని "కౌఁగిలించుకొని గద్గదస్వరంబున" భీమరాజు అన్నది కాళిదాసు శ్లోకమునకు శ్రీనాథుని ఆంధ్రీకరణము ఆంధ్రీకరణమనగా ఇది ఒక్క-పదమును కృతకము కాదు. ఒక్క-పాదము కూడ కుంటువడలేదు. ఎక్కడను గీర్వాణము బలియలేదు. అంతటను తెనుఁగుఁదనము తేజరిల్లినది. స్వీయకవితవలె పరిఢవిల్లినది. అంతే

కాదు, 'శుశ్రూషస్వ గురూన్' అను మూలమునకు "పాటించి కొలువుము భవనదైవతముల" అను ఉపక్రమణిక సువర్ణ పీఠిక. "యాన్త్యేవంగృహిణీపదం... ... ..." అను కాళిదాసు సూత్రమునకు "భవ్యపతిదేవతాచార పరమపుణ్యాధర్మమే చుఱకుండుమీ" అను శ్రీనాథుని భాష్యము రత్నకిరీటము. అందు "తల్లి కాన!" అను సంబుద్ధి వజ్రపదకము ఇది కాళిదాసునకు శ్రీనాథుని కవితా పట్టాభిషేకము.

అభిజ్ఞాన శాకుంతలమును రూపకముగ శ్రీనాథుఁడు ఆంధ్రీకరింపని ఆంధ్రసరస్వతి ఎంత దురదృష్టవతి !—ఈ పద్యమొకటి తన్నిదర్శనము. ఆధునికములైన శాకుంతల నాటకానువాదముల వఱకును అక్కఱలేదు పైకి శ్రీనాథుని అధిక్షేపించిన ప్రతీతినంది, లోన శ్రీనాథుని అనుపదము అనుకరించిన ఆనాఁటి పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడే పిల్లి మొగ్గలు వేసెను. కాని మల్లి మొగ్గలు తొడగ లేదు.

"అత్తమామలకు నీయప నేని (?) వెట్టుచు
గనుసన్నఁ జేయుమీ పనులెఱింగి
ప్రాణమిత్రములుగా భావించి యేప్రొద్దు
సవరింపుమీ ప్రేమ సవతులందు
భర్త యొక్కొక్క వేళ బహుమాన మొనరింపఁ
గదియరా నీకు మీగర్వరేఖ
పతిచిత్తమెఱిఁగి తత్పరి జనంబులమీఁదఁ
సేయుమా మిగుల దాక్షిణ్యగరిమ
కలక నొందకు మీధవుఁడలిగి నపుడు
పలుకులను జేరనీకు మా పరుసదనము
వీని వెలిగాఁగఁ దిరుగునే వెలఁదియైనఁ
గులమునకు నాధియగుఁజుమీ కూఁతుఁగుఱ్ఱ."

ఇది పిన వీరభద్రుని తెనిఁగింపు. ఇందు కాళిదాసు శ్లోకమునకు విధేయత్వమె గాక, శ్రీనాథుని సీసమునకు శిష్యత్వమును గలదు. కాని ఆ రెండును కలిసిరాలేదు. "భర్తుర్విప్రకృతాపి రోషణ తయా మాస్మ ప్రతీపం గమః అను వానికి, "అలుగకు కోపించిన పుడు నాథునితోడ" అని సారము పిండి, అంతతో ఆగక - శ్రీనాథుఁడు, ఆ వెంటనే "మదిలోన నుబ్బకు మన్ననలకు" అని మఱొక అవసరమైన హెచ్చరిక స్వీయముగ పలికించెను. ఈ యుగపద్భావమే భావబంధురమైనది. అది వీరభద్రుని అనుసరణమున విజ్ఞోమపడినది. ముందు వెనుకలు మాఱినవి. హెచ్చుతగ్గులు వచ్చినవి. అంతేకాదు. తీర్థమునకు తీర్థము,ప్రసాదమునకు ప్రసాదము అయినది. పరిజనముల మీఁద దాక్షిణ్యము ప్రకటించుటకు పిల్లలమఱ్ఱి కల్పించిన "పతి చిత్త మెఱుఁగుట" అను ప్రత్యేకనిబంధన ఆ ప్రయోజనమును సంకుచితపఱచునది శ్రీనాథుని హితమైన "కరుణ కలుగుట" సువిశాల హృదయ సూచకము. ఇఁక పిన వీరభద్రుని "కూఁతుఁగుఱ్ఱ" అను సంబుద్ధి, శ్రీనాథుని "తల్లి కాన !" అను సంబుద్ధికి కూఁతుఁగుఱ్ఱయే అయినను "తల్లి కాన" అను నుడికారములోని వాత్సల్యరేఖా శబలితమైన కారుణ్యస్ఫూర్తి "కూఁతుఁగుఱ్ఱ" అను కూర్పులో మూర్తి కట్టునది కాదు. మఱి శ్రీనాథుని సీసపద్యమునందలి ఆద్యంతములు పిన వీరభద్రునికి అందని ఫలములే అయినవి. అసలు శ్రీనాథుని ఆంధ్రీకరణములోని ప్రత్యేకతయెల్ల అక్కడే ఉన్నది. అది శ్రీనాథుని ఆంధ్రీకరణములోని అనితర సాధ్యమైన అధ్యాపకవాణి.

ఒకరి భావలతకు దోహదప్రక్రియ సేయుటేకాదు. క్రొత్త అంటులు త్రొక్కుట కూడ శ్రీనాథుని కవితా లీల

"వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసి కోవా విజ్ఞాతుమర్హతి ?"

ఇది భవభూతి శ్లోకము. సీతాదేవిని పరిత్యజించిన శ్రీరాముని గుఱించి వనదేవత వాసంతి అడిగినది. "అశ్వమేధయాగము చేయ నారంభించెను". అని చెప్పినది తాపసవనిత ఆత్రేయి. వెంటనే "హా! మఱల పెండ్లి కూడ చేసికొనెనా ?" అని దిగ్భ్రమచెందినది వాసంతి. "పాపము శమించుగాక" అని పలికినది ఆత్రేయి "అయిన యజ్ఞము నందాతనికి సహధర్మచారిణి యెవరు ?" అని ప్రశ్నించినది వన దేవత "స్వర్ణ సీత" అని సమాధాన మిచ్చినది తాపసవనిత. అప్పుడన్నది. వాసంతి ఆశ్చర్యచకితయై ! "వజ్రముల కంటె కఠినములు, కుసుమ ముల కంటె మృదులములు అయిన లోకోత్తరుల అంతరంగములు తెలిసికొనుటకు అర్హులెవరు ?" అని. అది శ్రీనాథుని ఆంధ్రీకరణమున రూపాంతరము నందినది. ఎంత అన్యథాప్రకల్పనమో !

"ఉపలముల కంటెఁ గఠినంబు లొక్కవేళఁ
గుసుమముల కంటె నొకవేళఁ గోమలములు
గాన లజ్జాభయంబులు గలవొ లేవొ !
పువ్వుబోఁడుల హృదయంబు లెవ్వఁ డెఱుఁగు"

ఇది నలదమయంతుల నవసమాగమవేళ, అనురాగమునిండిన దమయంతి అంతరంగమునందలి లజ్జాభయముల గుఱించి శ్రీనాథుని అస్తినాస్తి విచికిత్స. భవభూతి భావనలోని లోకోత్తరులు శ్రీనా థుని చిత్రణలో పువ్వుబోఁడులు ! లోకోత్తరుల చిత్తములు వజ్ర ముల కంటె కఠినములైన, పువ్వుబోఁడుల హృదయములు ఉపలముల కంటె కఠినములు. వజ్రము లెంత కఠినములో అంత స్వచ్ఛములు. మహాత్ముల హృదయము లెంత కఠినములో అంత స్వచ్ఛములే. పువ్వు బోఁడుల హృదయములెంత కఠినములో అంత స్వచ్ఛములగుట అసా ధారణము. కనుక ఉపలములనుట. ఇది శ్రీనాథుని రూపాంతరీకరణ ములోని మెలఁకువ. ఇఁక ఆంధ్రీకరణము సరే. అగ్రేసర భాసమానము

"చేతాంసి కోహి విజ్ఞాతు మర్హతి" అను సంస్కృత వాక్కు ఎంత స్ఫూర్తిమంతమో, "హృదయంబు లెవ్వఁ డెఱుఁగు ?" అను తెలుఁగు పలుకు అంత శక్తిమంతము. ఆంధ్రీకరణమునకిది జీవలక్షణము. ఆధునికములైన ఉత్తర రామచరిత్ర నాటకానువాదములందలి పద్యములలో ఈ జీవనాడి మందకొడిగా వినిపించునది మాత్రమే. కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలము, భవభూతి ఉత్తర రామచరితము నాటకములుగ శ్రీనాథుఁడు కైసేయుని ఆంధ్రసరస్వతి నిజముగ దురదృష్టవతియే అనుటకిది మఱొక నిదర్శనము

శ్రీహర్షుని కృతి నైషధీయ చరితము: శ్రీనాథుని ఆంధ్రీకృతి శృంగారనైషధము. ఇందలి శృంగార విశేషణమునకు ఇంకొక విధముగ శృంగగ్రహణము సేయుట ఒక పరిపాటి అయినది. కాని శ్రీహర్షుని నైషధీయచరితమే శృంగార కావ్యము.' కవి కులాదృష్టాధ్వపాంథుండొనర్చిన నైషధ శృంగార కావ్యంబు" అని శ్రీనాథుఁడు అనుటయే కాదు, "శృఙ్గారభఙ్గ్యామహాకావ్యే చారుణి నైషధీయ చరితే'' అని శ్రీహర్షుని కంఠోక్తియే అంతేకాదు. శ్రీహర్షుని నైషధీయ చరితమునందలి శృంగారము ముందు, శ్రీనాథుని శృంగార నైషధమునందలి శృంగారము నామమాత్రము. మూలమునందలి శ్రుతిమించిన శృంగారమునెడ మూగఁవోయిన శ్రీనాథుఁడు ముక్తకము నందలి మితిమీఱని శృంగారమును మూదలించెను.

"క్వచిత్తామ్బూలాక్తః క్వచిదగురు పఙ్కాఙ్కమలినః
క్వచిచ్చూర్ణోద్గారీ క్వచిదపిచ సాలక్తకపదః
వళీ భఙ్గాభోగై రలక పతితై శ్శీర్ణ కుసుమైః
స్త్రియా నానావస్థం ప్రథయతి రతం ప్రచ్ఛదపటః"

ఇది శృంగారమునకు ఇంద్రభవనమైన అమరు కావ్యమునందలి శ్లోకము. ఇందు కామశాస్త్రము దిఙ్మాత్రముగ సూచింపఁబడినది.

నలదమయంతుల శృంగారమునెడ శ్రీహర్షుని వర్ణన కామశాస్త్రము నకు మహాభాష్యముగ సాగినది. అతివేలమైన ఆ ఘట్టమెల్ల వదలి అధ్యాహారముగ శ్రీనాథుఁడు అందిచ్చినది ఈ అమరు శ్లోకము.

"కేళీ విశేషంబులఁ గుచకుంకుమ పంకంబు చేతను నున్నంగు వల చిన్ని పువ్వుల చేతను నఖగు నెత్తమ్ముల క్రొత్తలత్తుక చేతను బింబాధరంపుఁ దాంబూలరస రాగంబులచే తనుం బర్యంక భాగంబు దేటపఱుప—"

నలదమయంతుల శృంగారము నైషధీయచరితమున శృంగాటక విరాఘాటము; శృంగార నైషధమున నికుంజనిబిడము.

ఇఁక హరవిలాసము. ఇది శ్రీనాథుని కవితావిలాసము ఇందు గౌరీ కల్యాణము కాళిదాసు కుమారసంభవమునకు ఆంధ్రీకరణము. అందు మాఘునికి శ్రీనాథుని మర్యాద. కాళిదాసు కుమారసంభవమున తారకాసురుని వృత్తాంతములో వాయువు స్థితి ఇట్లు వర్ణింపఁబడినది.

"వ్యావృత్తగతి రుద్యానే కుసుమస్తేయ సాధ్వసాత్
నవాతి వాయుస్తత్పార్శ్వే తాళవృన్తానిలాధికమ్"

వాయుదేవుఁడు పుష్పాసహరణ ప్రమాదము రాకుండ ఉద్యానవనమున ప్రవేశింపక, తారకాసురుని పార్శ్వమునందుండి తాళవృంతానిలము కంటె అధికము కాకుండ వీచునఁట. ఇది శ్రీనాథునికి సంతృప్తి గొలుపలేదు. మాఘుని శిశుపాలనధమున రావణాసురుని వృత్తాంతములో వాయువుస్థితి ఇట్లు వర్ణింపఁబడినది.

"నిశాన్త నారీ పరిధాన ధూనన
స్ఫుటాగసా ప్యూరుషు లోల చక్షుష॥
ప్రియేణ తస్యాన పరాధ బాధితాః
ప్రకమ్పనే నామచకమ్పిరే సురాః"

ఇది శ్రీనాథుని మనోవీథిలో తళుక్కుమన్నది. ఇట్లు తెనిఁగించెను.

"నిరపరాధ బాధితులగు నిర్జరులకు
బంధమోక్షంబుఁ గావించు గంధవహుఁడు
సతులపయ్యెద లెడలించి చన్నులలమి
తప్పుసేసియు దైత్యు చిత్తంబు వడసి."

శ్లోకమునందలి పరిధానమే పద్యమునందలి పయ్యెద. చౌరీ విలోల చక్షు విశేషమును వదలుట గమనింపఁదగినది. పవన సుకుమారుని పరిధాపధూనన ప్రక్రియ శ్రీహర్షుని నైషధీయ చరితము నందును గలదు

"పశ్యైక సతస్మైక మరుతాపితపాన్య స్ననా పరిపస్పుముహ్ప వాస్త వస్త్రా
అత్వాన్త పళాన్త మృగాజ మాస్యం దధారతిర్యగ్వలితంవిలక్షః"

ఈ శ్లోకమునకు శ్రీనాథుని ఆంధ్రీకరణమిది.

"సోరణగండ్ల సూర్గమునఁ జొచ్చిన సన్నని గాలి యొక్క యం
భోరుహ పత్ర నేత్ర నునుఁ బొంకపుఁ జన్నుల మీఁది సన్నపుం
జీర చెఱంగు వాయగిలఁ జేసిన పిశ్వధరాతలేశ్వరుం
డోర యొనర్చెఁ బాపభయమొందె నిజావన చంద్రబింబమున్."

ఇంతకు శ్రీనాథుని గౌరీ కల్యాణము కాళీదాసు కుమార సంభవమునకు అస్వతంత్రాంధ్రీకరణము కాదు. అసలు కుమార సంభవ కృత్యాదిని గల హిమాలయ వర్ణన గౌరీ కల్యాణమున తెనిఁగింపలేదు. అని చెప్పి హరవిలాసమున అసలు విడిచిపెట్టలేదు. కుమారసంభవాంధ్రీకరణమున గాక, దేవదారువనవిహారపురాణ కథావిలాసమున పుణికిపుచ్చుకొనెను.

"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయోనామనగాధిరాజః పూర్వాపరౌ వారినిధీ విగాహ్య స్థితః పృథివ్యా ఇవమానదణ్డః"

అను కాళిదాసు ఆరంభశ్లోకమే ఒకఁ అందిన ఫలము.

"మహీమండలమునకు మానదండము మేను
పూర్వాపరాబ్ధులు పొరుగుటిండ్లు"

ఇందు హిమాలయము విగాహించు పూర్వాపరాబ్ధులు పొరుగుటిండ్లయినవి. అందుకు హేతువు, "వృద్ధకచ్ఛపరాజు వీపం(ఘ్రిపీఠంబు సురతరంగిణి వెల్ల శిరసుపాగ" ఇత్యాదిగ హిమవంతునికి, శ్రీనాథుఁడు పర్వతసార్వభౌమత్వము పట్టము గట్టుటయే. యత్తదుచితము జౌచిత్యము.

"యత్రాంశుకాక్షేప విలజ్జితానాం యదృచ్ఛయా కింపురుషాఙ్గనానామ్ దరీ గృహద్వార విలమ్బి బిమ్బాస్తిరస్కరిణ్యో జలదా భవన్తి" ఇది కాళిదాసు మఱొక శ్లోకము. ఇందు హిమవత్పర్వత గుహలను గృహములకు మేఘపంక్తులు గుమ్మము తెరలగుట కలదు. ఆ తెరలకు ప్రయోజనము కాళిదాసు చెప్పినది స్పష్టము. అది గూఢముగ, అంతకంటె గాఢముగ, యవని కాభ్యంతరమున ఓలమాసగొన్నది శ్రీనాథుని భావసుందరి.

"ఎంచి నుతింప శక్యమె యహీశ్వరు కంతటి వానికైన ర
త్నాంచిత రోచిరుద్గను నిరస్త రవీందు మరీచి జాలమున్
గాంచన కందరా యవనికాయిత వారిధరాంతరాళ ని
ర్వంచిత దేవతా మిథున వాంఛిత మూలము శీశైలమున్."

ఈ పద్యమును ఇట్లే—ఒక్క అక్షరమైన వ్యత్యాసము లేకుండ—పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుఁడు శృంగార శాకుంతలమున శృంగారించుకొన్నాఁడు. ఇట్టి వీరభద్రుఁడు అట్టి శ్రీనాథుని ఆక్షేపించెననుట ఎట్టి కింవదంతి! వీరభద్రుని పద్యము ప్రక్షిప్తమనుటకు వీలులేదు. అసలీ పద్యమే కాదు, ఆ ప్రకరణమంతయు పినవీరభద్రుని కావ్యమున శ్రీనాథ కవితా శిష్యత్వ ఫలశ్రుతియే. హిమాలయవర్ణనము శ్రీనాథుఁడు సీసపద్యముతో మొదలిడెను. పిన వీరభద్రుఁడును సీసపద్యముతోనే

మొదలిడెను. శ్రీనాథుఁడు వచనములో ముగించెను. పిన వీరభద్రుఁడును వచనములోనే ముగించెను. అంతేకాదు. కాళిదాసు కుమారసంభవమునుండి శ్రీనాథుఁడు గ్రహించిన మూఁడు శ్లోకములకును పిన వీరభద్రుఁడు ముచ్చటపడెను. మొదటి శ్లోకమును శ్రీనాథుఁడు స్వతంత్రముగ సంతరించిన, పిన వీరభద్రుఁడు మూలవిధేయముగ, తెనిఁగించెను. రెండవ శ్లోకము ప్రకృత వృత్తమే. కాళిదాసు శ్లోకమును కాదని శ్రీనాథుని పద్యమునే పిన వీరభద్రుఁడు కన్నుల కద్దుకొనుట గమనార్హము. ఇఁక మూఁడవ శ్లోకము.

"యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే
భాస్వన్తి రత్నాని మహౌషధీశ్చ పృథూపదిష్టాం దుదుహుర్ధరిత్రీమ్"

ఇది కాళిదాసు కుమారసంభవమున రెండవశ్లోకము. పూర్వోదాహృత శ్లోకము పదునాల్గవది. పదునాల్గవ శ్లోకము ముందు, రెండవ శ్లోకము వెనుక శ్రీనాథుని ఆంధ్రీకరణమును. ఈ పూర్వోత్తర క్రమనిరపేక్ష శ్లోక స్వీకారము శ్రీనాథునికి సార్వత్రికము. అది సైతము పిన వీరభద్రుని అనుసరణమైనది. ఆంధ్రీకరణము శిష్యప్రాయమే.

"హేమ శైలంబు దోగ్ధగా భూమిసురభి
నఖిల రత్నౌషధులును గల్పాదియందుఁ
బృథు మహారాజు పంపునఁ బితికె వేఁగ
పెయ్యఁగాఁ దన్నుఁ దివ్వటఁ గల్పించిగిరుల"

ఇది శ్రీనాథుని ఒకపడి.

" భూధరములెల్ల దనువత్సముగ నొనర్పఁ
బృథునృపాలో పదిష్టమై ప్రియము మీఱ
నఖిల రత్నౌషధులను జన్నవిసిపిదికె
నమరశైలంబు దోగ్ధగా నవని సురభి"

ఇది పినవీరభద్రుని దిద్దుబడి.

ఇందు శ్రీనాథుని ప్రథమచరణమే అలంతి భేదమున పినవీరభద్రుని అంతిమచరణమైనది. కాళిదాసు శ్లోకముతోపాటు శ్రీనాథుని పద్యమును పినవీరభద్రునికి ఆదర్శమే.

అసలు మురారి పదచింతనము శ్రీనాథునికి ఆత్మీయము. అపూర్వముగ శ్రీనాథుఁడు బహుధా ప్రయోగించు "పాణింధమ" పదబాధము, భట్టమురారి అనర్ఘరాఘవమునందలి అనర్ఘమణియే. "నవ భవద్గీర్వాణ పాణింధమా పన్థానో దివి సంకుచన్తి" అభిధార్థమునకు మురారి ముచ్చట గౌణార్థమునకు శ్రీనాథుని శ్రీకారము. ఇంక శ్రీనాథుని హిమాలయ వర్ణనమునందలి శబరకాంతల విశేషణమునకు మూదల మురారియే.

"తీర్త్వాభూతేశమౌళి స్రజమమరధునీ మాత్మనా సౌత్రృతీయః
తస్మై సౌమిత్రి మైత్రీమయముపహృతవా నాతరమ్నావికాయ
వ్యామ గ్రాహ్యస్తనీభిశ్శబరయువతిభిః కౌతుకోదంచదక్షయే
కృచ్ఛ్రాదన్వీయ మానఃక్షణమచలమసౌచిత్రకూటమ్ప్రతస్థే"

ఈశ్వరుని మౌళిప్రజమైన గంగానదిని తాను, సీత, లక్ష్మణుఁడు దాటి, నావికునకు సోదరప్రేమ కేవుగా ఇచ్చి, శబరకాంతలు అనుసరింప, వారితో శ్రీరాముఁడు చిత్రకూటమున కేఁగెనని తాత్పర్యము ఇందలి శబరకాంతల విశేషణము శ్రీనాథుఁడు గ్రహించినది.

"ఆమోదంబున వేఁటలాడుదురు నీహారాద్రి కాంతారరే
ఖామధ్యంబునఁ జూపటంకృతులతో గంధద్విపశ్రేణులన్
క్షామక్షామ మనోజ్ఞమధ్యలురుగుంజా భూషణాలంకృతల్
వ్యామగ్రాహ్యపయోధరల్ శబర సేనాధీశ సీమంతినుల్."

అది రామాయణము కనుక అచటి శబరకాంతలు అరణ్యవాసులైన సీతారామలక్ష్మణులకు అనుయాయులు. ఇది హిమాలయము

కనుక ఇచటి శబరికాంతలు అరణ్యమధ్యమునందలి గంధగజములను వేటలాడుచుందురు. ఎచటి శబరిగాంతలును ఒకటేతీరు కనుక ఈవిశేష ణము. కాశీఖండమునందును శబరికాంతలకు శ్రీనాథుని విశేష ణము ఇదే.

"అమితాగ్రవరుణాంశ సంభవుని వింధ్యాటోప విధ్వంసిలో
పాముద్రా సహితుం గనుంగొనరి యుత్పన్న ప్రమోదంబునన్
వ్యామ గ్రాహ్యపయోధరల్ కుటిలనీలాగ్రాలకల్ తధ్యమి
ధ్యామధ్యస్థితమధ్య లాటవిక సేనాధీశ సీమంతినుల్"

సీతారామలక్ష్మణులను చిత్రకూటమువఱకు అనుసరించినశబరి యువతులకు, లోపాముద్రాగస్త్యులను శ్రీశైలమున కనుగొన్న ఆట విక సేనాధీశ సీమంతినులు తోఁబుట్టువులే.

హారవిలాసమున మఱొక విలాసము కిరాతార్జునీయము అది భారతకథను అనుసరించిన శ్రీనాథుని స్వతంత్రరచన అందును భట్ట మురారి శ్లోకములకు అనుశ్రుతులుకలవు.

లక్ష్మ్యా వాలినిబర్హణ ప్రశమిత ద్వైరాజ్యవైరాగ్యయా
కిష్కిన్ధాయతనైక దైవతమయం తారాపతిర్దీప్యతే
సప్తారం యువరాజ మఙ్గదమపి శ్రుత్వాతి హర్షాదభూత్
అస్రామ్భః పృషతౌఘ మౌక్తికమయో గుచ్ఛస్య హాస్త్రసేక్షణః"

ఇది సుగ్రీవ పట్టాభిషేకము తదుపరి అంగదుని యౌవరాజ్యా భిషేకము జరుగునెడ నైషధ్యభాషితము వాలివధవలన ద్వైరాజ్య వైరాగ్యము తొలఁగిన రాజ్యలక్ష్మిచే కిష్కింధాయతనైక దైవత మైన తారాపతి ప్రకాశించుచున్నాఁడు. మనుమఁడైన అంగదుఁడు యువరాజగుట విన్న ఇంద్రునికి వేకముల హర్షమువలన అశ్రువులు ఆణిముత్యములయినవి. అని తాత్పర్యము ఇందు వాలి సుగ్రీవుల

ద్వైరాజ్యమునెడ రాజ్యలక్ష్మికి వైరాగ్యము కలుగుట అనుభావము విలక్షణమైనది. అది శ్రీనాథుని అనుపల్లవి.

"భాగ్యముగాదె యత్రమును పన్నగ కంకణుచేఁ దపఃక్రియా
యోగ్యతఁజేసి విశ్వభువనోపకృతి ప్రతిపాదనైక సౌ
భాగ్య ధురంధరంబయిన పాశుపతాస్త్రముగాంచితింక వై
రాగ్యము పుట్టుఁగాక కురురాజు పయిన్నిజరాజ్యలక్ష్మికిన్"

ఇందు కురురాజుపై నిజరాజ్యలక్ష్మికి వైరాగ్యముపుట్టుట మురారి ప్రభావము అంతేకాదు. మురారిశ్లోకమునందలి ద్వైరాజ్య శబ్దమును శ్రీనాథునికి ముదావహము అసలీశబ్దము శ్రీహర్షుని నైషధీయ చరితమునందే ప్రయుక్తమైనది. ఆస్థలమున శ్రీనాథుఁడు అనుసరింపలేదు. శృంగారనైషధమున శ్రీనాథుఁడు ప్రయోగించిన స్థలమున మూలశ్లోకమున ఆశబ్దములేదు. అందువలన శ్రీహర్షుని ప్రయోగమునకు అజ్ఞాతవాసముకలిగినది.

"చరచ్చిరం శైశవయౌవనీయ ద్వైరాజ్యభాజిత్వయిఘేనమే తి
తేషాంరుచశ్చారుతరేణచిత్తంపఞ్చషుణాలుణ్ఠితధైర్యవిత్తమ్."

అని నలదౌత్యఘట్టమునందే శ్రీహర్షుని ప్రయోగము ఇట "పంచేషులుంఠితధైర్యవిత్తంబులగు తమచిత్తంబులంగల వృత్తాంతంబులంతయుందెలియఁజెప్పి" అనిమాత్రమే శ్రీనాథుని అనుసరణము. ఇంతకు, ద్వైరాజ్యశబ్దమునకు "ద్వైరాజ్య ఇతి టచి భావేష్యఞ్" అని నారాయణపండితుని, "ద్వయో రాజ్ఞోః (కర్మ) బ్రాహ్మణాదిత్వాత్ ష్యఞ్ ప్రత్యయః" అని మల్లినాథసూరి వివరణములు నైషధ వ్యాఖ్యానములందుగలవు. ఇకఅనర్ఘరాఘవనాటక వ్యాఖ్యానములందు. "ద్వౌరాజానౌ...యస్యాస్సాద్విరాజా తస్యాః భావో ద్వైరాజ్యం" అని పరిగ్రీవమైన అర్థవివరణములుకలవు అయినా ఆకరములు తెలియవు ద్వైరాజ్యశబ్దమునకు అర్థగ్రహణము సేయుటలో

ఇతఃపూర్వము బహుభంగులు వెలసినవి. అవియెల్లయుఁ గూడ అవిచారిత రమణీయములే. పయి ప్రయోగవివరణములనుబట్టి ద్విరాజభావము ద్వైరాజ్యమని నిర్ధారకము.

ఇఁక శ్రీనాథుని మఱొక శబ్దబహూకృవాసనము.

"ఉద్దామద్యుమణిద్యుతివ్యతికర ప్రక్రీడ దర్కోపల
జ్వాలాజాల జటాల జాఙ్గలతటీ నిష్కూజ కోయష్టయః
భ్రామోష్మప్లవమాన సూనకిరణ క్రూర ప్రకారాదృశో
రాయష్కర్మనమాపయన్తి ధిగమూర్యథ్యాహ్నశూన్యాదిశః"

ఇది అనర్ఘరాఘవమున లక్ష్మణుని ముఖతః అందిచ్చిన భట్టముదారి మధ్యాహ్నవర్ణన. సుప్రసిద్ధము. ఇందువిషయము గ్రీష్మాత పథాటీసూచన విన్యాసము. గిరినిర్ఝరగ్రీవాభంగధారాసేచన. అద్వైరాజ్యభారమును అధ్యక్షించినది. శ్రీనాథుని సాహితీ పౌఢిమ.

"వరాళింగోపాళి సంఘటించిన క్రియన్ మధ్యాహ్నవేళన్ మహా
కాలంబైన నభోవిభాగమున వీఁకంగాసె బీఱెండ యా
ప్రాలేయాహిత సంప్రదీప్త కిరణ ప్రక్రీడ దర్కోపల
జ్వాలాజాల జటాల జాంగల తటీ వాచాల కోయష్టియై".

ఇందు పూర్వార్థము శ్రీనాథుని పురస్కారము. ఉత్తరార్థము భట్టమురారికి ఉట్టంకనము. ప్రక్రీడతో ప్రత్యక్షరము ప్రత్యక్షమైనది. ఒక్క "వాచాల" శబ్దము వినా. అది "నిష్కూజ" శబ్దముకంటె భిన్నము. అర్థవిరుద్ధము. నిష్కూజ శబ్దమునకు నిశ్శబ్దమనియే అనర్ఘవ్యాఖ్యాతల అర్థనిర్ణయము.

"తత్ర నిష్కూజాః ప్రకృష్ట వాతాతపాతిరేక జనిత
తృష్ణాభరేణ శుష్యత్కణ్ఠత్వేన కలకలాది శబ్దరహితాః"
—ఇషార్థకల్పవల్లి. రామానందయోగి.

" నిష్కూజాః నిశ్శబ్దా స్తపాతిరేకాకాత్ "

—సంచిక. విష్ణుభట్టు.

" నిష్కూజాః నిశ్శబ్దా ఇత్యర్థః"

—హరిహర దీక్షితీయము. హరిహరదీక్షితులు.

పయివ్యాఖ్యల ప్రకారము, నిష్కూజ శబ్దమునకు నిశ్చితార్థము నిశ్శబ్దమే. కాని అధికశబ్దమును అవకాశమే ఉభయకుశలమైనది. "నిః" ఉపవర్గము. అందువలన శ్రీనాథుఁడు అట్లు గ్రహింపవచ్చును. అంతేకాదు. అత్యధికమైన ఆతపాతిరేకమున నిశ్శబ్దత, తత్క్రాంచి దూనమైన ఆతపాతిరేకమున వాచాలత కూడ వాస్తవికమే. అంతర మరియు శ్రీనాథుని అంతర్యము కావచ్చును. అందుకు సంస్కృతాంధ్ర కవుల స్వస్థలములు సహకరించునవి. కనుక నిది యతిమైత్రి ప్రలోభమే కానక్కఱలేదు. ఇంతకు మురారి సమాసప్రక్రియ ముగ్ధమోహనము శ్రీనాథుని సమానప్రసక్రియ స్నిగ్ధమందరము. ఏవం విధమైన శబ్దానుసృష్టికి శ్రీనాథుని "వాళింగోహాళి సంఘటింప"వలసిన దే.

శృంగారనైషధము శ్రీహర్షుని నైషధీయ చరితమునకు ఆంధ్రీకరణము. అందు కాళిదాసు భవభూతి ప్రభృతుల శ్లోకములకు ఆరాధన! హరవిలాసమునందలి గౌరీకల్యాణము కాళిదాసు కుమార సంభవమునకు తెనుఁగుసేఁత. అందు మాఘశ్లోకమునకు ఆదరము ! చారువన విహారము పురాణమూలకము. అందుమఱల కుమార సంభవమునకు కుతూహలము! కిరాతార్జునీయము భారత కథానుసారము అందు మురారి శ్లోకములకు ముచ్చట!—ఇవి శ్రీనాథుని రసోద్గారములైన గీర్వాణవాణీ నఖముఖముఖరిత వీణానిక్వాణములు. ఇతర కృతులందలి ఈదృశవిశేషములు మఱొకసారి.

---

శ్రీ చిలకమర్తివారి

# సంగ్రహరామాయణము

శ్రీ "సాయినాథశాస్త్రి"

ఆదికవి వాల్మీకి యే సుప్రభాతమున రామాయణ మహా కావ్య రచన కుపక్రమించినాడో తెలియదు గాని, యానాటి నుం డియు దాని ననుసరించి యనేకములగు సాహిత్య ప్రక్రియల కితివృత్త భిక్ష లభించినది. ప్రాచీనఅర్వాచీన ఋషితుల్యులనేకుల కిహ పర సాధకమైనది ఎందఱెన్ని విధముల వ్రాసినను, ఆంధ్రభారత, భాగ వత గ్రంథములవలె ఆ చంద్ర తారార్కము నిలువదగిన దొక్కటియు గానరాదు. కొద్దియో గొప్పయో పేరును సంపాదించుకొనిన వానిలో భాస్కరరామాయణ, రంగనాథ రామాయణము లేమిన్నయన వచ్చును.

ఆధునికు లనేకులు రామాయణ రచన యొనర్చిరి. అట్టి వారిలో నొకరు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు. కాలము క్రీ. శ. 1867-1945. వీరు వేంకనార్య తనూభవులు; అశ్వలాయన సూత్రులు, కాశ్యపగోత్రులు.

వీరనేకములగు నవలలు, నాటకములు మొదలగునవి రచిం చిరి. వీరి నవలలో ముఖ్యములు : రామచంద్ర విజయము, హేమ లత, అహల్యాబాయి, కర్పూరమంజరి, సౌందర్య తిలక మున్నగునవి. నాటకములలో ముఖ్యములు: గయోపాఖ్యానము, ద్రౌపదీ పరిణ యము, కీచక వధ, పారిజాతాపహరణము, నలచరిత్ర, సీతాకల్యాణ ములు. వీరి కావ్యములలో ముఖ్యములు రామాయణము, ధర్మ విజయములు. వీరు స్వతంత్రముగా నాటక రచన యొనర్చుటే కాక, సంస్కృతమునందలి వాని ననువదించిరి కూడ.

ప్రస్తుతము వీరు రచించిన సంగ్రహ రామాయణమను కావ్య మును పరిశీలింతము. శ్రీ చిలకమర్తి వారు తమ గ్రంథమునకు

మూలము "చెన్నపురమందలి న్యాయవాదులలో నగ్రగణ్యుఁడై, కొంత కాలము "హైకోర్టు" లో న్యాయమూర్తియై, పిమ్మట చెన్నపురి గవర్నరుగారి నిర్వాహక సభలో సభ్యుఁడై కుశాగ్రబుద్ధియని మహావ్యక్తి యని పేరు గాంచిన గౌరవనీయులై కీర్తిశేషులైన వి. కృష్ణస్వామి అయ్యరుగారు, పురాణేతిహాసములలోని కొన్ని కథలను సంగ్రహముగా నెత్తి సంస్కృతమున వ్రాయించి "ఆర్య చరితము" అను పేర నొక గ్రంథమును నాగరాక్షరములతో బ్రకటించిరి. ఈ యార్యచరితములో రామాయణము సంగ్రహముగా రమారమి యేను వందల శ్లోకములలోఁ దెల్పఁబడినది."

ఈ సంగ్రహ రామాయణము నాంధ్రీకరించుటకు శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారి ప్రోత్సాహమే కారణమట. పేరునకు దగినట్టు లిది సంగ్రహముగానే గ్రహింపఁబడినది.

ఇందలి యితివృత్తము ప్రసిద్ధము. ఏతత్కృతి ప్రత్యేకతలలో నెన్నఁదగినవి కొన్ని గలవు. సామాన్యముగా ప్రతికృతికిని కృతిభర్తయు, కృతికర్త, కృతిభర్తృ వంశవర్ణములును, షష్ఠ్యంతములు నుండక తప్పవు. కాని యీ కృతి కట్టి దేమియు లేవు. అంతియేగాదు - పూర్వకవి స్తుతియేగాదు, కనీస మిష్టదేవతాస్తుతియేనియు గానరాదు. స్వల్పముగా బ్రతికాండము చివరియందా శ్వాసాంత గద్య వంటి గద్య కలదు. కావ్యము శ్రీకారముతో మొదలై శ్రీకారముతో ముగియవలయు నను ప్రాచీన సంప్రదాయ పరాయణత్వమును గానరాదు.

ఈకావ్యమే 'సంగ్రహ రామాయణము' గనుకయితే వృత్తము సూటిగా నత్తుకొనబడినది. అదియు సంక్షిప్తముగనేయున్నది.

"తనరున్ గోసలయని యెడు

జనపదము విశాలమైన సరయూ తీర

మున్నన శోభానిలయంబై
ధనధాన్య సమృద్ధి గలిగి ధరణికిఁ దొడవై''

ఆ రాజ్యమునకు రాజధాని యయోధ్యయనియు, దశరథుఁడు ప్రభువనియు, పుత్రులులేమి కాతఁడు మిగుల విచారించుచుండె ననియు, దానిని పోగొట్ట నమకట్టి వసిష్ఠాదులు ఋష్యశృంగునిఁ గొని వచ్చి దశరథునిచేత పుత్రకామేష్టి చేయించిరనియు నిట్లు త్వర త్వరగా సాగిపోయినదే గాని కథాగతి కుంటుపడలేదు. ఇదియే మఱియొక రైన విపుల వర్ణనలతో విసుపు పుట్టింతురు.

కుమారోదయావసరము నందయోధ్య యందలి వేడుకలు నిజమునకు వర్ణింపనలవి కాని విధముగ నుండియుండును. ఆయా వేడుకలను వర్ణింపనలయునన్న కవికి కావలసినంత యవకాశముండును. అట్టి యెడల నీకవి.

''అపుడయోధ్యా పురంబున నఖిల జనులు
సంతసింపఁగ గొప్పయుత్సవములయ్యె''

ననిమాత్రమే చెప్పినాఁడు. 'గొప్ప యుత్సవము' లని చెప్పుట చేత నెవరియూహ కందినంతవఱకు వారాయుత్సవముల గొప్పదనము నూహించుకొనవచ్చును. నిజమున కీపద్ధతియే మంచిదిగా గన్పట్టును. ఉత్సవ విశేషము లెన్ని వర్ణించినను కొన్నిమిగిలినటులే కనుపట్టును. ఇప్పుడా బాధయేమియు లేదు గదా! ఉత్సవముల పరమ ప్రయోజనము జనులు సంతసించుట. అఖిల జనులు సంతసించిరట.

కుమారులు క్రమక్రమముగా బెరిగి పెద్దవారైరి. సకల విద్యాసంపన్నులైరి. ఒకనాఁడు దశరథ ధరణీపతి కొలువుకూటమునకు, కౌశిక మునీంద్రుఁ డరుదెంచి, తానారంభించిన యజ్ఞ రక్షణమునకై రామచంద్రునంపుమని కోరినాఁడు. దశరథుఁడందులకు ముదమంది వెంటనే యాతని వెంట రామలక్ష్మణుల నిరువురను బంపినాఁడు

మిగిలిన వానియందువలె నిందు దశరథుఁడు రామలక్ష్మణులను విశ్వామిత్రుని వెంట నంపుటకు ఏచారించినట్లు లేదు. అటు తరువాత వారు కౌశికుని యాగసంరక్షణ మొనర్చుట, రాక్షస సంహారము అహల్యాశాప విమోచనము, శివధనుర్భంగము, పరశురామగర్వ భంగము, అయోధ్యానగర ప్రవేశములు వరుసగా నడచినవి. అహల్యా సంక్రందన ఘట్టము సంక్షేపింపఁబడినది. మేనకావిశ్వామిత్ర ఘట్ట మూపేక్షింపబడినది. రామాయణమునందలి యితరములగు చిన్ని చిన్ని యితి వృత్తములు విడువబడినవి (ఉదా॥ :—శబరి కబంధ వధ మొ॥)

ఈసంగ్రహరామాయణ మంతయు నించుమించుగా గీతపద్యములందును, కందపద్యములందును వ్రాయఁబడినది. అట్లనివృత్తములు లేవనికాదు, వాని సంఖ్య మిక్కిలి యల్పమని మిక్కిలి సరళము గానుండి యెల్లరకు తెల్లరుగు ధోరణిలోనే వ్రాయఁబడుట యొక విశేషము కేవల కఠినపద భూయిష్ఠమైన శబ్దాడంబరమే కనుపట్టదు. అల్పాక్షరముల ననల్పార్థరచన, మాటుమాటలపదములు మచ్చునకేనియుఁ గానరావు.

పాత్ర మనోభావములను, చేష్టలను కన్నులకుఁగట్టింపగలవిట్టి. దశరథుఁడు విశ్వామిత్రుని యిచ్చవచ్చినకోరిక కోరుకొమ్మని తన సమ్మతిని తెలుపును ఆమాటలను వినినంతనే విశ్వామిత్రుని మనోభావములెట్లున్నవో పరికింతము—

> "అద్భుతానహమైనట్టి యానృపాలు
> పలుకులాలించి నెమ్మేను పులకరింప
> మనమలరఁగ విశ్వామిత్ర మానివరుఁడు
> నృపవరేణ్యునితో మెల్ల నిట్టులనియె"

అగునో కాదోయను సందియంబునొందక కోరుకొమ్మని దశరథుండనుట నిజముగా నద్భుతావహము. తనశక్తికిమించిన కోరికయైనను నెఱవేర్చుటకు సంసిద్ధుం డన్నమాట' అతని పలుకులు విననంతనే విశ్వామిత్రునిమేను పులకరించినదఁట. అందులకు కారణము సంతోష పారవశ్యము. ఆసంతోషమునకు మూలము—విశ్వామిత్రుఁడు తన వెంట రామలక్ష్మణులనుబంపి తనయాగము నిర్విఘ్నముగా బరిసమాప్తి యగుటకుఁ దోడ్పడవలసినదిగా దశరథుని నడుగుట కేతెంచినాఁడు. తనకోరిక బయల్పరచినను,అందులకుదశరథుడంగీకరింపకపోవచ్చును. లేకలేకకల్గిన కుమారులుగదా! వారిని విడిచియుండుట కాతఁడిచ్చగించకపోవచ్చును. కాన తనకోరిక నెఱవేఱునో లేదో యనెడు సందేహము సహజము: అట్టియెడ దశరథుడే తనను గోరికో వలసినదిగా ప్రార్థించుటచే కలిగిన యమితసంతోషము కారణముగా శరీరముపులకరించినది. మనస్సునందు సంతోషముండుటచే మనోవికసనము సంభవించినది. విశ్వామిత్రుఁడు మౌనివరుఁడగుట మెల్లగా మాటాడుటసహజమే. దానికిఁదోడు సంతోషము తలమునకలుగా నుండుటచే గాద్గద్యముకలిగి కూడ మెల్లగా మాటలాడియుండును. ఇంతచక్కఁగాఁ బద్యమున్నపుడితివృత్తములోని పాత్రలు పఠితహృదయమున బ్రత్యక్షము కాక మానవు.

పాత్రలస్వరూపస్వభావములు గూడ మూలమునకు వ్యతిరేకముగాలేవనియేచెప్పవచ్చును. ఆయా పాత్రలప్రవృత్తులు, కార్యములు కూడ స్వభావోచితముగనేయున్నవి. ఇందలి కైకపాత్రయందుదాత్తతయేమియుఁగన్పట్టదు. లోకములో కైకియేకైకి దానవివోలె ప్రసిద్ధి నొందినది. ఇందుసైతమట్లే కన్పట్టు.

కావ్యమునందష్టాదశ వర్ణనలుండవలెనను నియమముల ననుసరింపక, వర్ణనలను వీలైనంతవఱకు వదలివైచెను. 'అసలు' వర్ణనలు

కథా గమనము నడ్డిపెట్టును. కథాసూత్రము తెగిపోవుటచే పఠితల యాత్మసౌఖ్యమునకు భంగముకలుగును. తన్మూలమున కావ్యము నంద నాదరముకలుగుటసంభవింపవచ్చును. అందును బాలురకు సైత మందు బాటులోనుండు విధమున రచించుచు, వర్ణనలఁజొప్పించిన విసువు గొలుపునని యూహతోఁగాబోలు వీనిని పరిహరించెను. కాని సుం దరకాండము నందొకచో చంద్రునివర్ణనయున్నది. అదియైనను సంగ్రహముగానే. అందులకు కారణమరయుదము.

" కపికులేశ్వరుఁడబ్ధిలు గడలి దాఁటి
రజని చరసార్వభౌముని రాజధాని
జొచ్చునప్పటి కపరాబ్ధిఁ జొచ్చెనినుఁడు
రాత్రియయ్యె వానరు మనోరథముదీఱ!"

హనుమంతుఁడు లంకాపురిని బ్రవేశించునప్పటికి రాత్రియైన దఁట. రాత్రియగుటచే హనుమంతుని పురప్రవేశముగాని యాతని ప్రతిగృహపరిశోధనముగాని యడ్డుకొనువారుండరు. అందువలన వాని మనోరథముతీఱును. రాత్రిసమయము నందాతఁడా పట్టణమును బరి శీలించుటకు చీకటిరాత్రులైనకుదురదు. నిజమునకా రాత్రి వెన్నెల రాత్రియే. ఆవెన్నెలవెలుఁగు మసకమసకగా లేదనియు షోడశకళా విలసితతమనియు సూచించుటకై యీవర్ణన యొనర్పఁబడినది.

సుందరకాండమునందే సీతాదేవి యాకారవర్ణన యొకచోట కలదు. ఆమె యెట్లున్నదో పఠికింతము

" మలిన వస్త్రముఁదాలిచి మఱుఁగుదాని
దానవీపరివృతయయితలఁకుదాని
నెన్నోయుపవాసములఁ జిక్కియున్నదానిఁ
గరముదీన భావమ్మును గలుగుదాని."

" వెచ్చవెచ్చని నిట్టూర్పు విడుచుదాని
శుక్లపక్షపుఁ బాడ్యమి సొబగుమీఱు
చంద్రరేఖయుఁబోలె స్వచ్ఛమగుదాని
కాంత నొక్కర్తుఁ గన్గొని కన్నులలర."

సీత మలినవస్త్రధారిణి. దానవీపరివృత, కృతోపవాస శుష్క శరీర. ప్రకటిత దీనభావభాసుర, భర్తృవిరహవేదనాదోదూయమానమానస, స్వచ్ఛశరీరమైయున్నదఁట. సీతయిట్లున్నదని వర్ణింపకున్న, నంతకుమున్నెన్నఁడును జూచియెఱుఁగని హనుమంతుఁడామెను నెట్లుగుర్తింపగలిగె?నను ప్రశ్నయుదయింపకమానదు. కాన నిది యవసరమైనది.

ఇందు. నీత్యుపదేశములునైతమున్నవి. నీత్యుపదేశములను ప్రభు, సుహృత్సమ్మితములుగా, కన్నకాంతాసమ్మితముగ నొనర్చిన మనోహరముగానుండును. కావ్యము కాంతా సమ్మితము. ఇందలినీతులన్నియు సన్మార్గప్రవర్తనకు దోహదకారులనుట నిశ్చయము.

రామాయణకథనంతయు స్పష్టముగా సులభమగు శైలిలో సంగ్రహముగా రచించి శ్రీ లక్ష్మీనరసింహముగారు లోకమునందనేకుల కుపకారమొనర్చి సూక్ష్మములో మోక్షమును సంపాదించు మార్గమును జూపిరి. నేఁటికిని రామాయణగాథ నెఱుఁగని వారనేకులుగలరు. అట్టివారికిది మిక్కిలి యుపయోగదాయకము కాఁగలదు. విద్యార్థులకు మహాకావ్యములను పఠించుటకు ముందుగాఁ బ్రాథమికావస్థయం దిట్టి గావ్యపఠనమొనర్చిన కావ్యపఠనము నందాసక్తి హెచ్చి, మేలుచేకూరుననుట నిస్సంశయము.

---

# శ్రీ అష్టోత్తర శతనామగద్యము

(పాలకురికి సోమనాథ మహాకవి కృతము)

ఉత్పలము.

చిత్కళాబలీకృతాంగ[1]భవ! చిన్మయ, చిత్సుఖ, చిన్తుభావ! సం
చిత్కమలాకర, చిద్ఘన, చిదాత్మ, చిదద్వయ, చిద్విశేష,సం
చిత్కృత, చిద్విశిష్ట, చిదఖండ, చిదోఘ. చిదంత, చిత్సుకృ
చిత్ప్రకాశనశాంగ, చిద్రస, లసద్బసవేశ, మహేశ[2] పాహిమాం

| | | | |
|---|---|---|---|
| శ్రీమద్గురు బసవేశ | నమస్తే | కోహంభ్రమ[5] నిర్ముక్త | నమస్తే |
| నాయమ [2A] భవ నిర్నాశ | ,, | జహదజహద్వ విశుద్ధ | ,, |
| పరిపూర్ణ ప్రీతి భాతి | ,, | సహజ భరిత సంసిద్ధ | ,, |
| సురుచిర ప్రణవజ్యోతి | ,, | ఘటపటగత చిద్గగన | ,, |
| విద్యుత్కోటినిభాంగ | ,, | పటురవ దృశ్య విహీన | ,, |
| చిద్విశ్రాంతి శుభాంగ | ,, | జ్యోతిర్లింగాకార | ,, |
| చిత్ప్రకర ప్రకటాఖ్య | ,, | వీతసకల సంసార | ,, |
| స్వప్రకార శుభసౌఖ్య | ,, | అణవాది మలదూర | ,, |
| స్వానుభావ సంజీవ | ,, | త్రాణప్రాణాధార | ,, |
| మానసాధి వనదావ | ,, | విశ్వవిలేపితగాత్ర | ,, |
| సత్యజ్ఞానానంద | ,, | శాశ్వత భాస్వన్నేత్ర | ,, |
| ప్రత్యగ్బోధా[3]మంద | ,, | సదసత్సాక్షి విలక్ష | ,, |
| త్రిపదార్థ ప్రతిపాద్య | ,, | చిదచిద్ద్వంద్వ విపక్ష | ,, |
| కుపథ మతా ప్రతిభేద్య | ,, | వ్యపగత కర్మద్వంద్వ | ,, |
| చిద్రసభరితోల్లాస | ,, | స్వపదత్రయ సంపాద్య | ,, |
| క్షుద్రోప్ర ద్రవనాశ | ,, | హానోపాదానాయ | ,, |
| ఘటదీప[4] ఇవాన్యోన్య | ,, | హీనప్రకృతి నిరాస | ,, |
| పటుతర పరమాన్యోన్య | ,, | సోయం శబ్దవిలక్ష | ,, |
| దేహాదివ్యతిరిక్త | ,, | కోయం బ్రహ్మాసు సూక్ష్మ | ,, |

1. జయ 2. సంతతమ్ 2A. భయనిర్నామ 3 సంధ 4. మిః
5. నిర్ణిక్త,

| | | | |
|---|---|---|---|
| బింబ సమస్తాపూర్ణ | నమస్తే | చిత్కృత చిత్కమలార్క- | నమస్తే |
| కుంభస్తంభ విశీర్ణ | ,, | సత్కృత శాస్త్ర వితర్క | ,, |
| తత్త్వమసీతి పదాంత | ,, | స్థావర జంగమరూప | ,, |
| వ్యస్తసమస్త[6] నిశాంత | ,, | జీవభావనిర్లేప | ,, |
| అప్రధ్వంసవ భావ | ,, | విహితషడంగషడర్థ | ,, |
| సంప్రధితామర దేవ | ,, | సహజ భరిత సంహార్త | ,, |
| చిల్లహరీ హరిదశ్వ | ,, | అంతర్గత నిఖిలాండ | ,, |
| [7]ప్రోల్ల సత్సకల విశ్వ | ,, | సంతత విశ్వవిభాండ | ,, |
| కృతహిత గతిగత భూత | ,, | సచ్చిత్సుఖదాలాప | ,, |
| మతి మథనము ఖాతీత | ,, | స్వచ్ఛపరమనిజరూప | ,, |
| అక్షయ మహిమాపార | ,, | చిద్గగనాంకితదేహ | ,, |
| కుక్షి జగత్త్రయ పూర | ,, | [10]ఉద్గగుణాది సమూహ | ,, |
| సాక్షి పరాపర గోత్ర | ,, | వాచక వాచ్య విపక్ష | ,, |
| సూక్ష్మసూక్ష్మ[8] సుగాత్ర | ,, | సూచిక బంధ విమోక్ష | ,, |
| గమనవి సర్గానంద | ,, | ఆనత విశ్వకుటుంబ | ,, |
| విమలాచలచిత్కంద | ,, | స్వానుభవాంతర్బింబ | ,, |
| కర్మత్రయ నిర్ముక్త | ,, | భ్రమ షట్పదహితపీఠ | ,, |
| నిర్మల నిజబోధార్క | ,, | క్రమపద పాళి[11]త్రాత | ,, |
| ఓతప్రోత సమస్త | ,, | గతహేయోపాదేయ | ,, |
| వీతక్లేశ వితస్త | ,, | శ్రుతిశ్రుత్యంతనికాయ | ,, |
| సునిహిత విశ్వకళత్ర | ,, | అకుటిల భక్తిసు [12] వేద్య | ,, |
| అనిహత ప్రకృతి స్వతంత్ర | ,, | ప్రకటిత విశ్వారాధ్య | ,, |
| నిర్మిత విశ్వకులాంగ | ,, | సకలశక్తి చైతన్య | ,, |
| శర్మసమగ్రాపాంగ | ,, | నిఖిలజగజ్జనమాన్య | ,, |
| త్రిపుట ఘటోపరిసిద్ధ | ,, | ఐక్యాద్యంగాధ్యస్త | ,, |
| క్షపిత మహామయ శుద్ధ | ,, | సౌఖ్యన్యస్తసమస్త | ,, |

6. నిజాంత 7. ప్రోల్లసనర్గపరాస్య, 8. విధాత్ర 9. ద్విందు 10 ఉద్ఘ
11 వ్రాత 12 భేద్య

నవగుణ జాలనిహార నమస్తే
అవయవ పంచకసార ,,
[13] పూర్వాంగ త్రియపూర్ణ ,,
పూర్వాం శాంత్యవిశీర్ణ ,,
త్యాగభోగ యోగాంగ ,,
యోగచతుష్కాష్టాంగ ,,
భక్తమనోవనచైత్ర ,,
ముక్త్యానంద కళత్ర ,,
వపురవయవసువసాన్య ,,
విపుల కలాప్రమాణ్య ,,
ఆద్యనమస్తే వేద్య ,,
తత్త్వ నమస్తే సత్త్వ ,,

భావ నమస్తే భావి[14] నమస్తే
సద్గురు బసవేశాయ ,,
సద్గురు బసవేంద్రాయ ,,
సద్గురు బసవస్వామి ,,
ఉద్గత సద్గుణ భూమి ,,
నమోనమస్తే నమోనమస్తే

కం॥ [15] సరస నమస్కృతిగద్యా
కరపగమణి ఖచిత వాక్సు
వర్ణాబ్జాష్టో
త్తర శతనామాంగ బస
వరనంగర్పిసిద పాల్కురికి
సోమాంకం

పాల్కురికి సోమనాథుని లఘుకృతులగు పంచప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య, అక్షరాంకపద్యములు, బసవరగడ అనునవి ఆంధ్రపత్రిక ప్రజోత్పత్తి, ఆంగీరస, శ్రీముఖ, భావ, యువసంవత్సరాది సంచికలలో నాపీఠికలతోఁ బ్రకటించి యుంటిని అటుతరువాత 1962 సంవత్సరమున "పాలకురికి సోమనాథకవి లఘుకృతులు" అను పేర 21 లఘుకృతులను ప్రత్యేక పుస్తకరూపమునఁ బ్రకటించియుంటిని. అప్పటికి సోమనాథుని అష్టోత్తర శతనామగద్యము సమగ్రముగ లభింపమిచే నందలి యాద్యంతపాదములు కొన్ని మాత్రము శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి బసవపురాణ పీఠికలోనియాధారములను బట్టి పయిగ్రంథము చివర ననుబంధములోఁ బ్రకటించితిని. ఇప్పుడీగద్యసంపూర్ణముగ మహబూబునగరమునందలి యున్నతపాఠశాలలోఁ బండితులుగానున్న మిత్రులు శివశ్రీమన్న బాద నాగలింగ శివయోగిగారి తాళపత్రగ్రంథ సంచయమునుండి సేకరించి యీసంచి

---

13 పూర్వాంశ 14 భావ్య 15 బసవ

కలోఁ బ్రకటించినాను. ఈగద్యము నాలుగేసి మాత్రలుగల నాల్గు గణములతో మొత్తము పదునాఱు మాత్రలుగల మాత్రాగణము లతోఁ గూర్పబడినది. కొన్ని పాదములలో మొదటి రెండు గణములు కలిపి యెనిమిది మాత్రలుగఁ గూర్పఁబడినవి. ఇందుచే నీగద్యఛందో లక్షణములో కన్నడమందలి మందానిలరగడకును, తెలుఁగునందలి మధుర గతి రగడకును సరిపోవునని పాఠకులు గ్రహింపఁ గలరు ద్విపదలలోవలె నిందు రెండేసిపాదములకొక ప్రాసాక్షరము వాడఁ బడినది. మూఁడవగణములో జాలవఱకు నంత్యానుప్రాసము పాటిం పఁబడినది.కన్నడభాషామర్యాద ననుసరించి కొన్నిచోట్ల శాంతప్రాసలు (వర్గాక్షరములు వేనినైనఁ బ్రాసలోఁ గ్రకొనుట) వాడఁబడినది. గద్యారంభమున సంస్కృత భాషలో ఉత్పల వృత్త శ్లోకము రచింపఁ బడినది. అంతమున కన్నడకంద పద్యముగూర్పఁబడినవి. అర్థము సరిగా గ్రాహ్యముగాని తావుల నేనిందుఁగొన్నిపదములను బరిష్కరించి తాళ పత్ర ప్రతిలోని వాని మూలపాఠములను సంఖ్యలతో నధోజ్ఞాపిక యందుదాహరించితిని. చదువరులు తమకుచితములని తోఁచిన పాఠములనుగ్రహింపఁదగును. తాళపత్రప్రతిలో 105 పాదములు మాత్రమేయున్నవి. అందుచేఁ జివరి మూఁడు పాదములు నేను గూర్చి యిందుఁజేర్చినాఁడను. విజ్ఞులు క్షమింతురుగాక.

ఇట్లు
బండారు తమ్మయ్య
పరిషదధ్యక్షుఁడు.

## గ్రంథ స్వీకారము–సమీక్ష

(శ్రీ బండారు తమ్మయ్య.)

1. చిన్నయసూరి జీవితము; హిందూధర్మ శాస్త్రసంగ్రహము– క్రొన్ను పుటలు 104+136 వెల రు 3–0–0.

2. ఆంధ్రకర్నాటసారస్వతములు; పరస్పర ప్రభావము. క్రౌను పుటలు 164 వెల రు 3–0–0.

కర్త—విద్యారత్న, పరిశోధనా పరమేశ్వర. శ్రీనిడుదవోలు వేంకటరావుగారు M A

మదరాసు విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులు. (రిటైర్డు)

ప్రతులు దొరకుచోటు:- కృతికర్త–3–6–668 హిమాయత్ నగరు హైదరాబాదు.

1. మిత్రులు శ్రీవేంకటరావుగారి బాషాసేవచిరవిశ్రుతమయినది. మదరాసు విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులుగా పనిచేసిన కాలములో వీరు గావించిన పరిశ్రమ, ప్రకటించినగ్రంథములు మఱింత యమూల్యమయినవి. అట్టి గ్రంథములలో నొకటి చిన్నయసూరి జీవిత చరిత్ర– బాలవ్యాకరణము, నీతిచంద్రిక మున్నగు ప్రశస్త గ్రంథముల రచయితగా చిన్నయసూరి యాంధ్రులకెల్లఁ జిరస్మరణీయుఁడయి యజరామరకీర్తినందిన మహనీయ పండితచక్రవర్తి. ఆ మహా పురుషుని జీవితచరిత్ర శ్రీ వేంకటరావుగారి లేఖినినుండి వెలువడుట మనయాంధ్రభాషకు మహాభాగ్యము–అజ్ఞాతములయిన పెక్కు విషయము లీగ్రంథమూలమున వెలువడుట యొక విశేషము–తలిదండ్రులకు లేకలేక కలిగి గారాబముతోఁ బెరిగినకుమారుఁడవుటచేఁ జిన్నయ్యకుఁ బదునాఱేండ్లవయస్సు వచ్చువఱకు నేమాత్రము విద్యాసక్తిలేక వృథాగాకాలము గడచెననుట, యొక యద్భుత విషయము. అటు తర్వాతఁ దండ్రిగారి మిత్రులు కంచి రామానుజాచార్యులుగారిచే నుద్బోధితుఁడయి వారివలననే యక్షరాభ్యాసాది సం

స్కారముల నొంది శ్రీగ్రహో వారిసద్దను దనతండ్రిగారియొద్దను విద్యల నభ్యసించి పదునాలుగేండ్లలో ననఁగా ముప్పదేండ్ల వయస్సు వచ్చునరికి మహాపండితుఁ డయ్యెనఁట. "ప్రవేదిరేప్రాక్తన జన్మ విద్యాః" అనుసూక్తి యాతనియందు సార్థకమయ్యెను. బాలవ్యాకరణమునకు లక్ష్యలక్షణసమన్వయముగ చిన్నయసూరి నీతి చంద్రిక రచన మొనర్చుటకు మున్ను ఆంధ్రమున వెలసిన వచనరచనలు, అవి క్రమముగా నొందిన పరిణతులనుగూర్చి వేంకటరావుగారు పెక్కు విషయములను జక్కఁగావివరించిరి. క్రీ॥ శ॥ 1300 ప్రాంతమున కాక తీయ రెండవ ప్రతాపరుద్రునికాలమున కృష్ణమాచార్యులు రచించిన సింహగిరి నరహరి వచనములు, శఠకోపవిన్నపములు ప్రాథమిక వచనరచనలని వీరువెలువరించిన దొక యపూర్వవిషయము. బాల వ్యాకరణమునకు ముందు వేదము పట్టాభిరామశాస్త్రి, రావిపాటి గురుమూర్తిశాస్త్రి మున్నగు పండితులురచించిన వ్యాకరణములఁ గూర్చిన వివరములుగూడఁజక్కఁగా నిందు వివృతములయినవి. మొత్తముమీఁద సూరి రచించిన యావత్తు గ్రంథములు- ముద్రితాముద్రితములు- గూర్చిన వివరములిందుఁగలవు ఈగ్రంథము నాంధ్రులెల్లరుఁ దప్పక చదివి యెన్నియో యుపయుక్తవిషయములను గ్రహించుటయుక్తము.

చిన్నయసూరి ఆంగ్లమున తామస్ లండనస్ స్ట్రేంజి దొర గారు రచించిన(Elements of Hindu Law) అను న్యాయశాస్త్ర గ్రంథమునకనువాదముగారచించిన 'హిందూధర్మశాస్త్రసంగ్రహము' ప్రప్రథమముగ వేంకటరావుగారిందు ప్రకటించుట ముదావహము. లోకోపకారకము. విద్యార్థులకు వచనరచనా పాటవ ములవడుటకయి పాఠ్యగ్రంథముగా సూరి రచించిన నీతిచంద్రికయొుక్క శైలి, భాష ఆంధ్రులకు సుపరిచితములు. అట్టి శైలిలోఁ గాక యీ న్యాయ శాస్త్ర గ్రంథమును సూరి గ్రాంథికభాషయందే సరళమగు శైలిలో

రచించియుండుట గమనింపఁదగినది. ఇవి వ్యావహారిక భాషావాదులకు గుణపాఠము కాఁదగినది. మచ్చునకు కొన్ని భాగములు.

(1) చాకలి, గొల్ల, యీడిగ, గాండ్ల, నట్టువుల యందును. వీరివంటి కర్మోపజీవులయందును. కుటుంబసంరక్షణ కుపకరించు స్త్రీలొడంబడికలు చేయవచ్చును. అవి కుటుంబనిమిత్తమయి యుండవలెను. ఆయొడంబడికలకు భర్త కట్టుపడవలసినది. "స్మృతి చంద్రిక యందలి యాజ్ఞవల్క్య నారద వచనములు. (పుట 46)

(2) శూద్రజాతియందుఁ బుత్రులకు మాతృసంఖ్యఁబట్టి విభాగమని యెంతురుగాని యీయభిప్రాయము సరిగాదు. పుత్రులకందఱికి సమభాగవిధి యెల్లవర్ణములు వారికి సమానమైయుండును. (పుట 76.)

(స. అ. ౧౮౭౭ అ. నం. ౨౦ లో తీర్పు)

(దాయాధికారము) అవిభక్తకుటుంబములందు దాయమువచ్చుక్రమము.

అవిభక్తులయిన సోదరుల యొక్క దాయము పొందువారి పరంపర, విభక్తుని దాయము పొందువారి పరంపరకంటెఁ గొన్ని విషయములందు భిన్నమైయుండును. ఆయాసోదరునకు గావలసిన భాగముక్రమముగా వానివానిపుత్రపౌత్రప్రపౌత్రులకు విభక్తద్రవ్యమట్లు చేరును. వీరు లేనిపక్షమందు వాని భాగము వానిసోదరులకు సమానముగాఁ జేరును. గతించిన సోదరునియొక్క భాగము తన తండ్రికిఁగాని తాతకుఁగాని సంక్రమింపనిది ప్రపౌత్రపుత్రునికి రానేరదు. సోదరులకువచ్చిన భాగము వారి సంతతియందు ప్రపౌత్రునివఱకు వచ్చును. ఆసంతతివారు లేనిపక్షమందు వారిలోఁ గడపట గతించిన వానియొక్క భార్యకు వచ్చును. ముందుగతించిన వారి భార్యలకు భాగము రాదు. అవిభక్తులయిన సోదరుల యొక్క పుత్రపరంపరయందు దూరితములయిన యవిభక్తజ్ఞాతులవఱకు నాభాగము చేరును. వీరందఱు లేనిపక్షమందుఁ గడపట గతించిన వాని భార్యకుఁజేరవలసినది. అదిలేని పక్షమందు విభక్తులకుఁజెందును. (పుటలు 10'-1(3)

ఊర్ధ్వపుండ్రాంకితపదవముతోడి చిన్నయ్యసూరిగంభీరచిత్రము ముఖపత్రముపయి విలసిల్లి. ముదువుగొలుపుచున్నది.

[2] "జననిసంస్కృతంబు సకలభాషలకును", అనుసూక్తి ననుసరించి ఆద్యప్రకృతియగు సంస్కృతముతోడను ద్వితీయప్రకృతియగు ప్రాకృతముతోడను, దక్షిణ దేశభాషలకుఁగల సంబంధముమాట యెట్లున్నను నివి ద్రావిడభాషాకుటుంబమునకుఁ జెందిన స్వతంత్ర సోదర భాషలనియు, సంస్కృతప్రాకృతభాషా జన్యములు కావనియుఁ బలువురు భాషాభిజ్ఞులయభిప్రాయము. ఇందుకుఁ బ్రతిపదిక వేసిన మహనీయుఁడు Bishop Caldwell అను నాంగ్లపండితుఁడు. ఇందుఁ గూర్చి దేశభాషలలోఁగూడఁ బలుగ్రంథములు రానురాను వెలసినవి. ద్రావిడభాషాకుటుంబమునకుఁ జెందిన తమిళము,మళయాళము, తుళు, కన్నడము, తెలుఁగు అను నయిదు దేశభాషలలోఁ జివరిరెండును మిక్కిలి సన్నిహితమయినవి. వీనికి లిపి సామ్యముకూడ చాల హెచ్చు. రెండింటికిఁగలిపి యొకే లిపిని నెలకొలిపెడి వాద మిటీవల బయలుదేఱియుండుట పలువురెఱిఁగినదే. "ఆంధ్రకర్ణాట సారస్వతములు; పరస్పర ప్రభావ"మును గూర్చి శ్రీవేంకటరావుగారి గ్రంథమును ఆంధ్రప్రదేశసాహిత్యఎకాడమీ వారియాదేశానుసారము రచించి వారిబహుమతినిగూడ గ్రహించియున్నారు. ఈగ్రంథరచనమునకు వారు సర్వవిధముల నర్హులు. సమర్థులునని చెప్పుటయనవసరము. అవతారిక, లిపి, భాష, వ్యాకరణము, ఛందస్సు, సాహిత్యసంప్రదాయములు, తెలుఁగువాఙ్మయము, నన్నయ పూర్వయుగము, నన్నయ యుగము, శివకవియుగము, తిక్కనయుగము, శ్రీనాథయుగము, శ్రీకృష్ణదేవరాయులయుగము, దక్షిణాంధ్రయుగము, నవీనయుగము, అను 12 ప్రకరణములుగానిది విభక్తమయినది. ఆంధ్రకర్ణాటకముల సంబంధమనాదిదైనది. ఈ భాషలందలి తొల్లింటికవు లుభయభాషలను

కూలంకషముగ నేర్చిన పండితప్రకాండులు, ఆంధ్రమహాభారత రచనను
కుపక్రమించిన నన్నయభట్టు తన సహాధ్యాయుడైన నారాయణభట్టు
సాహాయ్యముతోడ నీయాయుద్యమమునకుఁగడంగినట్లు గ్రంథావతా
రికలోనే తెలిసికొనియున్నాఁడు. నన్నయ, నారాయణభట్టు లిరువురు
జన్మతః కర్ణాటులేయని యూహించుటకుఁగూడ నాధారములున్నవి,
కన్నడములో భారతమురచించి యాదికవియని పేర్వడసినపంపకవితా
నాంధ్రదేశమందలి వేఁగినాఁటివాఁడనని యే చెప్పుకొనినాఁడు కన్నడ
కవిత్రయములోని రన్నపొన్నకవులుఁగూడ నిట్టివారే. ఇఁకనాంధ్రమున
శైవకవులలోఁ గణనగాంచిన మల్లికార్జున పండితారాధ్య పాలకురికి
సోమనాథాదులుగూడ కర్ణాటాంధ్రముల రెంటనుగూడఁ గృతులు
రచించియున్నారు. పండితారాధ్యుఁడు తన శివతత్త్వసారమును రెండు
భాషలలోఁగూడ రచించినాఁడు. సోమనాథుడు బసవస్తోత్రపదములుగ
రచించిన గద్యకృతులు కన్నడులకు తెలుఁగువారికిఁగూడ సమముగ
నుపకరించునవి. దేశిచ్ఛందములలో పొత్తమునంతటిని బూర్తిగా
రచించుట యీరెండుభాషలందునుగానగును కన్నడమున రగడ,
షట్పదులలోవెలసిన గ్రంథముల సంఖ్యాకములు. తెలుఁగులో రంగ
నాథుఁడు, సోమనాథుఁడు తమ ప్రధానకావ్యములను ద్విపదలో వెల
యించుట యందఱకు సువిదితమే. ఇట్లు లెన్నోవిధముల కర్ణాటాం
ధ్రములు రెండు మొదటినుండియు సమానధర్మములతో సోదరులవలె
వెలసిన విధానములను వేంకటరావుగారు తమగ్రంథమునఁ జక్కఁగా
వివరించియున్నారు అన్యోన్యము వీనిలో నొకదానినుండి మఱొకదాని
కనువదింపఁబడిన గ్రంథములు పెక్కులున్నవి. ఆంధ్రులు, కన్నడులు
గూడ నీగ్రంథము నామూలాగ్రముగఁజదివి యుభయ సారస్వతముల
పరస్పర ప్రభావమును లెస్సగా గుర్తించి జాతీయైక్యమునకయి పాటు
పడుట పరమావశ్యకము బహుముఖముల శ్రీ వేంకటరావుగారి సోదర

భాషల సౌందర్యమును జక్కఁగా నిరూపించియున్నాయి. గ్రంథాంతమున నుభయభాషలందలిసమానార్థక ధాతుపదములనుజాలవఱకకారాదిగ నొసంగుటయేగాక, తెనుఁగుఁకన్నడములలోని సాటి సామెతలనుగూడఁ బెక్కింటిన కారాదిగఁ గూర్చి శ్రీవేంకటరావుగారు పాఠకులకు మహో పకారమొనర్చినారు. ఆంధ్రకర్నాట సోదరులీయుత్తమ గ్రంథమునకు సుస్వాగతమొసంగి తత్ప్రచారమునకు విశేషముగఁ దోడ్పడెదరుగాక యని యాశించుచున్నారము.

ప్రణుత్తాయాః తుతాయాః గజతాయా గజసమూహస్య కాని శిరాంసి "కంశిరోంజనో రితి. యాదవః. తేభ్య ఆలీఢాని ముక్తా ఫలాని యస్యా స్తాం చంచత్ఖడ్గలతాం పశ్యంతః పరిపంథిభూవరభటా శ్శత్రుభటా స్సంగ్రామకేళౌ ఉద్భాటాం చండాం దంష్ట్రాకోటిభి ర్దష్ట్రాంచలైః కరాళం భయావహం వక్త్రకుహరం యస్యా స్తా ముద్భ్రమాం స్వచ్ఛందచారిణీం కాళీం స్మరంతి యోజయతి. అత్రేతి కాళీఖడ్గలతయో రుపమాధ్వనిః స్మరణేన ప్రతీయతే.

పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థమూలోఽ లంకారేణ వస్తుధ్వని ర్యథా

శ్లో. సంగ్రామోద్యతసూర్యరాయవిభుసేనాక్షోదసంఛాదితే
ష్వభ్యర్ణభ్రమదబ్జనిర్యదమృతోత్సిక్తేషు విద్వేషిణామ్
సౌధాగ్రే ష్వభితః ప్రరూఢహరితే ష్వాగత్య నక్తందివమ్
నర్ద త్యంధకవైరిణ స్సమధికక్షీబో మహోక్షో ముహుః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర పర్యాయాలంకారే నక్తందివ మితి పదేన శత్రూణా మతిచిరకాలప్రవాసప్రవృత్తిరూపం వస్తు వ్యజ్యతే.

ఉదాహరతి సంగ్రామేతి. సంగ్రామోద్యతస్య యుద్ధసన్నద్ధస్య సూర్యరాయవిభో స్సేనాయాః క్షోదై ర్ధూళిభి రాచ్ఛాదితేషు అభ్యర్ణే సమీపే భ్రమత స్సంచరతో ఽబ్జా చ్చంద్రా న్నిర్యతా ఽమృతేన ఉత్సిక్తే ష్వభిత స్సమంతా త్ప్రరూఢహరితేషు సముద్గత శగ్రుషు విద్వేషిణాం సౌధాగ్రేషు నక్తందివం ముహు రాగత్య అంధకవైరిణో హరస్య సమధికక్షీబోఽత్యంతపీవరః మహోక్షః వృషభః 'అచతురేత్యాదినా' నిపాతనా దకారాంతత్వం నర్దతి గర్దతి. నర్దగర్దశబ్దతిధాతో ర్లటి పరస్మైపదం యోజయతి. అత్రేతి ఏకత్రా నేకాధేయవర్ణనం పర్యాయాలంకారః.

వాక్యగత స్స యథా

శ్లో. శ్రీసూర్యరాయేంద్రయశోంబురాశేః
కేషాం చి దేవం ప్రతిభాతి బుద్ధిః
న్యాసేషు దేశేషు సురాపగేతి
సుధాపయోరాశి రితీందుభేతి.

వ్యాఖ్యానమ్ :—

అత్ర ఉల్లేఖాలంకారేణ యశసో మందాకిన్యాదిభ్యో వ్యాధిక్యం వ్యజ్యతే. వాక్యగత ముదాహరతి శ్రీసూర్యరాయేంద్రేతి. సురాపగా మందాకినీ ఇందుభా చంద్రికా యోజయతి అత్రేతి. ఏకస్య యశసో బహుధోల్లేఖన ముల్లేఖాలంకారః.

ఉభయశక్తిమూలో యథా

శ్లో. సారస్వతగుణై రమ్య స్సూర్యరాయమహీపతిః
విధృతాశేషభువనో నిద్రాణం తనుతే హరిమ్.

వ్యాఖ్యానమ్ .—

అత్ర నిద్రాణం హరిం తనుత ఇత్యర్థశక్తిమూలతా సూర్య రాయవిభుసుధాసాగరయో రౌపమ్యధ్వనిః. న సుకవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాః ప్రబంధగతాః కి మితి న పరిగణితా ఇతిచే న్న. కవిప్రౌఢోక్తి ష్వేవ తేషా మంతర్భావాత్. అన్యథా కవినిబద్ధవక్తృప్రౌఢోక్తయోపి కిమితి న సిద్ధ్యేయుః. ఏవం చ ప్రబం ధాదిగతత్వేన యథాసంభవ ముదాహరణా న్యన్యత్ర ద్రష్టవ్యాని. విస్తరభయా దిహ నోదాహృతాని.

ఉభయశక్తిమూల ముదాహరతి సారస్వతేతి. సరస్వత్యా భారత్యా ఇమే సారస్వతాః. యద్వా సరస్వాం త్సముద్రః తస్యేమే గుణాః సారస్వతాః గాంభీర్యాదయః. "సరోఽనిరే తటాకే చ, సరస్వతీ

స్యాత్ స్త్రీరత్నే నద్యాం నద్యంతరే గవి, సరస్వతీ నదీభేదే గోవాగ్దే వతయో ర్గిరి స్త్రీరత్నే ధనదే పుంసి సరస్వా న్రసికే బుధ" ఇతి రుద్రాజయ్య్రప్రతాపాః భువనం లోకః భువనాని జలాని "భువనం ఖేఽప్సు విష్టప" ఇతి కవిదర్పణే. యోజయతి అత్రేతి. కవినిబద్ధవక్తృ ప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలానాం ప్రబంధగతానా మనుదాహరణే కిం నిమిత్త మిత్యాశంక్య సంగమయతి నన్విత్యాదినా.

అసంలక్ష్యక్రమవ్యంగ్యంరసాదిధ్వనిః తదగ్రే వక్ష్యతే అసంలక్ష్యేతి ఏతదగ్రే వక్ష్య ఇతి నిగమయతి.

## గుణీభూతవ్యంగ్యం నిరూప్యతే

మూ. గుణీభూతవ్యంగ్యం మధ్యమం కావ్యం. వాచ్యాద్రమ్య తయా శబ్దై ర్నిగుహ్య వివక్షితస్యైవ వ్యంగస్య ప్రాధాన్యం. ధ్వనౌ తదితరత్వం వ్యంగ్యస్య గుణీభావః.

వ్యాఖ్యానమ్ :—

ఏవం ధ్వనిప్రధాన ముత్తమకావ్యం నిరూప్య గుణీభూత వ్యంగ్యం మధ్యమకావ్యం నిరూపయతి గుణీభూతవ్యంగ్య మితి వ్యాఖ్యాతం ప్రాక్.

## తదష్ట విధమ్

శ్లో. అగూఢ మపరస్యాంగం
వాచ్యసిద్ధ్యంగమస్ఫుటమ్
సంధిగ్ధతుల్యప్రాధాన్యే
కాక్వాక్షిప్త మసుందరమ్
గూఢమేవ చమత్కారి
కర్నాటీకుచకుంభవత్.

వ్యాఖ్యానమ్ :—

మధ్యమకావ్యస్య ఉక్తలక్షణత్వాద్ ద్విభాగ మాహ అగూఢ మితి. వ్యంగ్యస్య (ద్రాక్ప్ర)తీతా వగూఢత్వం మధ్యప్రతీతౌ గూఢత్వం విలంబితప్రతీతా వస్ఫుటత్వ మితి వివేకః.

అర్థాంతరసంక్రమితవాచ్య మగూఢం యథా

శ్లో. భూయా దభీక్ష్ణం గగనే హిమాంశు
స్సజ్జం శరాసం మదనో దధాతు
స్వైరం చ యోషాస్మి కరగ్రహేణ
శ్రీసూర్యరాయక్షితిపాలమౌళేః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర యోషాశబ్ద శ్చంద్రాద్యుత్సవాదియోషాధర్మవిశిష్ట యోషాలక్షకః. తే నైతావత్పర్యంత మితి కర్తవ్యతాజడత్వ మంగీకృత మితి సూచితవస్త్వగూఢం. అస్య లోకపరంపరాప్రాప్తే రగూఢతా.

అగూఢ ముదాహరతి భూయా దితి. హిమాంశు శ్చంద్రః గగనే వ్యోమ్ని అభీక్ష్ణం సదా నతు తదా తదా భూయాత్ తిష్ఠతు. ఉదయ మస్తమయం చ హిత్వా తిష్ఠ త్విత్యర్థః. మదనో మార శ్చ సజ్జ మాకృష్టం శరాసం ధనుః స్వైరం దధాతు. అస్మి అహం శ్రీసూర్యరాయక్షితిపాలమౌళేః కరగ్రహణయోషా యుమిశ్రేణ ఇతి ధాతో స్సూర్యరాయసార్వభౌమకరగ్రహణేన యోషా భవామీ త్యవగంతవ్యం యోజయతి అత్రేతి. సుగమమ్.

అత్యంతతిరస్కృత మగూఢం యథా

శ్లో. వ్రీడం విముంచ మహిళే! వలనేన చాక్ష్ణో
రంగీకురుష్వ సహసా సఖి! సూర్యరాయమ్

చక్రాంగనా నిజసఖస్య తనోతి హర్ష
మైంద్రీం దిశం ప్రణయతః పరిరంభతే ఽర్కః.

వ్యాఖ్యానమ్ :—

అత్ర పరిరంభత ఇతి పదస్య స్వార్థతిరస్కారేణ ప్రాగ్భార సంబంధలక్షకత్వం. తేన ప్రాచీదిక్సూర్యయో ర్నాయికానాయకత్వం వ్యంగ్యం. తచ్చ కవిప్రయోగపరంపరాగతత్వా దగూఢమ్.

అత్యంతతిరస్కృత మగూఢ ముదాహరతి వ్రీడ మితి. హే మహిళే! కాంతే! వ్రీడం లజ్జాం విముంచ. అత్ర "మందాక్షం హ్రీ స్త్రపా వ్రీడా లజ్జే" త్యమరసింహేన వ్రీడేతి స్త్రీలింగ ఉక్తః. తథాపి "వ్రీడాదివాభ్యాశగతై ర్విలిల్యే" ఇతి మాఘేన పుంలింగత్వ ముక్తం. తస్మా న్నాత్ర పుంలింగత్వదోషః. సూర్యరాయం వేంకట మహీపతిసూర్యరాయసార్వభౌమం సహసా అతర్కితం యథా తథా "అతర్కితేతు సహసే" త్యమరః. అక్ష్ణో ర్దృష్ట్యో ర్వలనేన అంగీకురుష్వ. చక్రాంగనా చక్రవాకాంగనా "చక్రం కోకే వ్రజే పుంసి క్లీబం సైన్యరథాంగయోః, గ్రామజాలే కుంభకారభాండే చాపత్యరాష్ట్రయో" రితి ప్రతాపః. నిజసఖస్య చక్రవాకస్య హర్షం తనోతి. అర్క స్సూర్యః. అర్కో మఘోని స్ఫటికే. జ్యేష్ఠే భ్రాతరి భాస్కర" ఇతి యాదవః. ప్రణయత స్స్నేహాత్ ఐంద్రీం దిశం ప్రాచీం దిశం పరిరంభతే ఆలింగతి. పరిపూర్వకరభధాతో రాలింగన మర్థః. "పరిరంభః పరిష్వంగ స్సంశ్లేష ఉపగూహన" మిత్యమరః. కృతినాయికస్య నవోఢాం నాయికాం ప్రతి సఖీవచన మేతత్. వ్యాకరోతి అత్రేతి. ప్రాగ్భార ఉదయాద్రిశిఖరే "ప్రాగ్భారః పుంసి శైలాగ్రభాగాతిశయయో ర్మత" ఇతి కోశః.

## శబ్దశక్తిమూల మగూఢం యథా

శ్లో. సూర్యరాయమహీపాలో
యువాయం నలినాంబకః
రతిప్రియమనాః కోఽపి
రంజయ త్యఖిలా వధూః.

వ్యాఖ్యానమ్ :-

అత్ర సూర్యరాయవిభో ర్మదనౌపమ్యం వ్యంగ్య మగూఢమ్. శబ్దశక్తిమూల మగూఢ ముదాహరతి సూర్యరాయమహీపాల ఇతి. నలినం పద్మమి వాంబకే నేత్రే యస్య సః అన్యత్ర కుసుమేషుః "అంబకం నేత్రశరయోః" రితి కవిదర్పణే. రతౌ బాహ్యాభ్యంతర సంభోగే ప్రియమనో యస్య సః. రతిప్రియ శ్చ. యోజయతి అత్రేతి. నలినాంబకరతిప్రియప్రభృతిశబ్దానాంకవిప్రయోగబాహుళ్యాదగూఢ. మి త్యన్వేయమ్.

## అర్థశక్తిమూల మగూఢం యథా

శ్లో. యే నాసీ దరిమండలం చ నిఖిలం విధ్వస్తబాహాబలం
యేన క్వాపి చ దీనదుర్గతిభరో లీనః పరం భీతవత్
విశ్రాంతా భుజమండలే వసుమతీ యస్య స్వయం శైశవే
క స్తోతుం పటుధీ స్సుధీ ర్జగతి తం శ్రీసూర్యరాయాధిపమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర శైశవే సర్వశత్రువిజయగుణశ్చే ద్యౌవనే కిము వక్తవ్య మితి అర్థాపత్తిగూఢా వ్యజ్యతే.

అర్థశక్తిమూల మగూఢ ముదాహరతి యేనేతి. నిఖిల మరి మండలం శత్రుమండలం యేన వేంకటమహీపతిసూర్యరాయసార్వ భౌమేన శైశవే బాల్య ఏవ విధ్వస్తం బాహాబలం యస్య తదాసీ

దభూత్. శైశవ ఇతి సర్వత్ర యోజ్యః. దీనదుర్గతిభర శ్చ దీనజన దారిద్ర్యాతిశయ శ్చ యేన పరం భీతవ త్యాఽపి క్వావా లీనః. వసుమతీ సువర్ణపుష్టా పృథివీ చ స్వయం యస్య భుజమండలే విశ్రాంతా సుఖే నాభూత్ తం తాదృశం శ్రీసూర్యరాయాధిపం స్తోతుం గుణా న్వర్ణయితు మిత్యర్థః. జగతి క స్సుధీః పటుధీః ప్రజ్ఞావాన్. న కోఽపీత్యర్థః. అర్థశక్తిమూలత్వం యోజయతి అత్రేతి.

## అపరాంగమ్

శ్లో. వ్యంగ్యాంగ మితి వాచ్యాంగ మపరాగం ద్విధా మతమ్.

వ్యాఖ్యానమ్ :—

అపరాంగం విభజతే వ్యంగ్యాంగ మితి స్పష్టమ్.

## వ్యంగ్యాంగం యథా

శ్లో. శ్రీసూర్యరాయవిభుయోధభుజాకృపాణీ
ధారావిలోలహృదయారిమహీపతీనామ్.
సంస్తంభయంతి హృదయాని వివర్ణయంతి
గాత్రాణి నేత్రయుగళీ మపి ఘూర్ణయంతి.

వ్యాఖ్యానమ్ :—

వ్యంగ్యాంగపరాంగ ముదాహరతి శ్రీసూర్యరాయేతి. యోజయతి అత్రేతి. యత్ర రసాదే రసాదిరంగం భవతి తదపి గుణీభూత వ్యంగ్య మేవ భయానకరసస్య వ్యంగ్యభూతశృంగారరసాంగత్వా ద్వ్యంగ్యాంగ మిత్యనుసంధేయమ్.

## వాచ్యాంగమ్

శ్లో. శబ్దార్థశక్తిమూలత్వా ద్వాచ్యాంగం ద్వివిధం మతమ్.

వ్యాఖ్యానమ్ :—

వాచ్యాంగం విభజ్యతే శబ్దేతి శబ్దశక్తిమూల మర్థశక్తిమూలం

### శబ్దశక్తిమూల మగూఢం యథా

శ్లో. సూర్యరాయమహీపాలో
యువాయం నలినాంబకః
రతిప్రియమనాః కోఽపి
రంజయ త్యఖిలా వధూః.

వ్యాఖ్యానమ్ :-

అత్ర సూర్యరాయవిభో ర్మదనౌపమ్యం వ్యంగ్య మగూఢమ్. శబ్దశక్తిమూల మగూఢ ముదాహరతి సూర్యరాయమహీపాల ఇతి. నలినం పద్మమి వాంబకే నేత్రే యస్య సః అన్యత్ర కుసుమేషుః "అంబకం నేత్రశరయోః" రితి కవిదర్పణే. రతౌ బాహ్యాభ్యంతర సంభోగే ప్రియమనో యస్య సః. రతిప్రియ శ్చ. యోజయతి అత్రేతి. నలినాంబకరతిప్రియప్రభృతిశబ్దానాంకవిప్రయోగబాహుళ్యాదగూఢ. మి త్యన్వేయమ్.

### అర్థశక్తిమూల మగూఢం యథా

శ్లో. యే నాసీ దరిమండలం చ నిఖిలం విధ్వస్తబాహాబలం
యేన క్వాపి చ దీనదుర్గతిభరో లీనః పరం భీతవత్
విశ్రాంతా భుజమండలే వసుమతీ యస్య స్వయం శైశవే
క స్తోతుం పటుధీ స్సుధీ ర్జగతి తం శ్రీసూర్యరాయాధిపమ్.

వ్యాఖ్యానమ్ :—

అత్ర శైశవే సర్వశత్రువిజయగుణశ్చే ద్యౌవనే కిము వక్తవ్య మితి అర్థాపత్తిగూఢా వ్యజ్యతే.

అర్థశక్తిమూల మగూఢ ముదాహరతి యేనేతి. నిఖిల మరి మండలం శత్రుమండలం యేన వేంకటమహీపతిసూర్యరాయసార్వ భౌమేన శైశవే బాల్య ఏవ విధ్వస్తం బాహాబలం యస్య తదాసీ

గీ. ప్రసవశరుదంతికరము లీపడఁతితొడలు
చిత్తజునికాహళంబు లీచెలియజంఘ
లనుచుఁ బొగడుచుఁ దత్పదాయత్తచిత్తు
లైరి యాదరమునఁ గొంద ఱధిపసుతులు. 37

సీ. ఒకఁడు చేవంకిపై నొప్పుతామరకెంపు
ముగుదమోవి యటంచు ముద్దుఁగొనియె
నొకఁడు సౌవర్ణకందుక మిందువదనచ
న్గవఁ బోలు నని యక్కునను ఘటించె
నొకఁడు లీలాబ్జంబు ముకురాస్యమోముతోఁ
దులరా దనుచు గోరఁ ద్రుంచివైచె
నొకఁడు తాఁ బెంచినశుకి తలోదరిపల్కు
జాడఁ బల్కునఁ జేయి చాఁచి పిలిచె

గీ. క్షితిపతులు వేడ్క నిటు చమత్కృతుల నలరి
యొకరొకరు తత్ప్రియాహితోద్యోగు లయిరి
లలితచేష్టావిలాసలీలావిభూతి
నవ్వరారోహఁ జూచిన యాక్షణంబ. 38

వ. మఱియును; 39

మ. నను నానందముతోడఁ జూచినది యీనాళీకపత్రాక్షి యిం
కను నన్నే వరియించు నీయబల వేడ్క న్నాదెసం బ్రేమ చే
సిన దీయింతి యటంచు రాకొమరు లక్షీణాశులై యుండఁగాఁ
గని యమ్మానినితోఁ గళావతి వివేకస్ఫూర్తితో నిట్లనున్. 40

మ. వనితా చూడుము రాజసూనులను సౌవర్ణాసనాసీనులన్
ఘనతేజోజితభానులన్ ద్రిజగతీఖ్యాతోల్లసద్దానులన్
వనజాక్షప్రతిమానుల న్నిఖిలవిద్యాధేయసుజ్ఞానులన్
వినమత్కల్పసమానుల న్నిఖిలపృథ్వీజానుల న్వేడుకన్. 41

వ. అని మఱియు సవిశేషంబుగా నెఱింగించం దొడంగె. 42

సీ. ధృతిరసాతల మేలుచతురుం డహీనాఖ్యఁ
దగుమహాభోగి యీధార్మికుండు
ధనదుండు వరపుణ్యజనరక్షకుఁడు శంక
రప్రియువాది యీరాజరాజు
కుంభినీప్రియకారి గంభీరవేది మా
నవకుంజరుం డీజనప్రభుండు
నుతలోకహితజీవనుఁడు మణిచాపరా
జతుఁ డీఘనుండు విశేషరసుఁడు

గీ. ప్రతిభ వెలయించి వాహినీపతులఁ బెంచి
ప్రబలె సర్వజ్ఞమౌళి యీప్రభువరుండు
సారసహితప్రకాశుఁడై జగతి నెగడె
లోకబాంధవుఁ డీమేటి లోలనయన. 43

కం. లలనా యితండు మలయా
చల మేలునృపాలుఁ డితనిసాంగత్యమునన్
గల వెన్నఁ జందనద్రుమ
చలకిసలచ్ఛాయఁ గ్రీడ సలుపుట లెప్పుడున్. 44

వ. మఱియును గల ఫలంబు, 45

కం. ఏలాలతాంతడోలా
ఖేలా లీలావిహారకృతపుణ్యఫల
వ్యాలోలచందనాచల
బాలానిలసేవ గలదు పంకజనయనా. 46

ఉ. ఈతఁడు సింధునామకుఁ డహీనబలోన్నతజీవనప్రథా
[illegible]ఖ్యాతగభీరతాఁ దార్యవిదితాధికసత్త్వుఁడు వాహినీవిభుం

డాతతభూమిభృద్వరసమాశ్రయుఁ డెన్నఁగ వీనిమైత్రిచే
నోతరుణీ లభించు నిఁక నూర్జితసౌఖ్యము లిచ్చఁ గోరినన్. 47

కం. కేళీమనోజ్ఞనవకం
కేళీకోరకితనారికేళీవిలస
త్తాళీతరుతలముల ముదిఁ
దాళీ విహరించు దర్పితాళీడితవై. 48

సీ. ఈరాజశేఖరుఁ జేరఁగోరితివేని
యతనువిభూతిసౌఖ్యంబు దొరకు
నీధరేశునిచెల్మి కిచ్చగించితివేని
కులగోత్రహితగుణోజ్జ్వలత వెలయు
నీవాహినీనాథుపై వాంఛ యగునేని
గాంభీర్యలావణ్యగరిమ యలరు
నీసార్వభౌమున కాసఁ జెందితివేని
ధనదప్రియోన్నతిఁ గనుట సులభ
గీ. మీద్విజప్రభుకౌఁగిట నెనయుదేని
కలవు నీతోడు సుప్రభాగౌరవంబు
లిమ్మహాసేనుఁ గామింప నిచ్చయేని
గలుగుఁ జంద్రకిరీటానంబు కంజవదన. 49

గీ. అని కళావతి రాజనందనులఁ జూపి
వారివిధములు దెలుప నవ్వారిజాక్షి
విని వినని రీతిఁ జూచి చూడని తెఱఁగున
జనియె సందెవ్వనిని గుఱి సలుపదయ్యె. 50

కం. అంత నృపాలాత్మజుల
య్యుంతిమనం బెఱిఁగి యుండ్లకేఁగిరి లజ్జా

తాంతానను లై కంతు ల
తాంతశరాసారమునకు సగ్గం బగుచున్. 51

ఉ. వాసవదత్తయు న్నిజనివాసముఁ జొచ్చి సఖు ల్భజింపఁగా
నాసమయమ్మునందు హృదయప్రభుఁ డెవ్వఁ డొకో ప్రసూనబా
ణాసనమూర్తియై నను దయ న్వరియించుఘనుం డటంచుఁ బే
రాసల నిద్రఁ బోవఁ గలఁ గన్నిశ సమ్మదిరాక్షిముంపటన్. 52

సీ. సంపూర్ణపూర్ణిమాశశి హసింపఁగఁజాలు
మొలకనవ్వులముద్దుమోము వాఁడు
దళదరవిందసౌందర్యనిధానంబు
లగువాలుఁజూపులసొగసువాఁడు
రథవజ్రరాజిపైఁ బొదలెడుసిందూర
ముద్రవోలిక నొప్పుమోవివాఁడు
కౌస్తుభనిభమణి గ్రైవేయరుచులఁ జొ
క్కపుఁజెంద మన మించుగళమువాఁడు

గీ. తలిరుటాకులఁ బోలుపాదములవాఁడు
శ్యామసుందర మగుమేనిచాయవాఁడు
ధరణిపతిసూతి యొకఁడు ప్రత్యక్ష మయినఁ
గన్నులలర విలోకించెఁ గలికి యపుడు. 53

వ. కని చింతామణిరాజరాజసుతుఁడో కందర్పకేతుప్రభుం
డని సైరంధ్రులు దెల్పి రంచు మదిలో నారూఢి భావించి మే
ల్కని స్వప్నస్థితి నిక్కమానుచుఁ దత్కంజాతపత్రాక్షి యి
ట్లని వర్ణింపఁదొడంగెఁ జిత్తభవబాణాసారమగ్నాంగియై. 54

చ. మరుఁడో జయంతుఁడో నలుఁడో మాధవుఁడో ద్విజరాజో కిన్నరే
శ్వరసుతుఁడో గణింప నరవర్యుల కెందు లభించు నిట్టిసుం

దరత వివరించి యెంచి ప్రమదావహరూపసుచారువిభ్రమ
స్ఫురణముకల్మి నొక్కెడం జూపఁదలంచి యొనర్చె నాతనిన్.

సీ. సోముఁడో పూర్ణిమాసోముఁడో సురసార్వ
భౌముఁడో యామహీపాలవరుఁడు
మారుఁడో గిరిజాకుమారుఁడో దనుజసం
హారుఁడో యాసద్గుణాకరుండు
రాముఁడో భార్గవరాముఁడో రేవతీ
రాముఁడో యామహోద్దామయశుఁడు
మిత్రుఁడో నిటలాక్షమిత్రుఁడో వాణీక
ళత్రుఁడో యానిశ్చలస్వభావుఁ

గీ. డహహ తాదృశరూపరేఖాతిశయము
గలుగనేరదు సాధారణులకు నిజము
గరుడ గంధర్వ యక్ష కింపురుష సిద్ధ
సాధ్యవరులకునైన నిస్సంశయముగ. 56

సీ. మతిఁ గోరునే యిందుమతి యజక్ష్మాపాలు
నతనిఁ గన్గొనుభాగ్య మబ్బియున్న
రంభ కౌబేరిఁ జేరంగ నూహించునే
యతనిఁ గన్గొనుభాగ్య మబ్బియున్నఁ
బౌలోమి దేవతాప్రభునిఁ గామించునే
యతనిఁ గన్గొనుభాగ్య మబ్బియున్న
దమయంతి నలుని బాంధవము లెక్కించునే
యతనిఁ గన్గొనుభాగ్య మబ్బియున్న

గీ. ననుదినంబును మది ముదం బావహిల్ల
నతనికౌఁగిట నుండు పద్మాయతాక్షి

యదియె మరుచేతిపూబంతి యదియె యింతి
యదియె బుధనుత గుణధన్య యదియె కన్య. 57

మ. అని చింతింపుచు నాలతాంగి స్మరచాపావిర్భవద్బాణవే
దన సైరింపక యద్ధరావరుని హృత్పద్మంబులో నిల్పి యో
గినిరీతి న్మననం బొనర్చును విలోకించు న్దిశ ల్మాటికిం
దనచెల్కత్తియలం గణించియలుగుం దైన్యంబునొందున్నగున్. 
వ. అయ్యవసరంబున. 59

సీ. అస్తాచలాగ్రభాగారూఢమందార
జాతప్రసూనగుచ్ఛం బనంగ
జరఠంగవిసరవాసరతామ్రచూడచూ
డాచక్రలోహితరోచి యనంగ
సంధ్యాంగనాకుచాంచలచారుమకరికా
పత్రయావకరసభ్రమ యనంగ
గంధివల్లభబాలికావేలికాగృహ
ప్రాగ్రరత్నదర్పణ మనంగ

గీ. దరళతరవీచికాపరిస్ఫురితచరమ
సలిలనిధితీరవిద్రుమసాల మనఁగఁ
బ్రబలనక్తంచరౌఘనిర్దళితదక్ష
సమయహరిచక్ర మనఁగ భాస్వంతుఁ డలరె. 60

సీ. సుమశరస్యందనసూత్యతమాంజిష్ఠరా
గధ్వజపటవిభ్రాంతి యనఁగ
గగనమహాతటాకప్రాంతసముదిత
కోకనదప్రభానీక మనఁగఁ
బశ్చిమాశావిభుప్రాసాదలంబిచా
మీకరయవనికాలోక మనఁగ

వారుణీమత్తదృగ్వారుణీగండమం
డితమణీకుండలద్యుతి యనంగఁ

గీ. గాలకరవాలవిదళితఘస్రమహిష
రుధిరధారాప్రవాహసంరూఢి నలరె
నినుఁడు చరమాంబునిధిఁ గ్రుంకు వెనుక వెనుక
డంబు మీఱంగ సాంధ్యరాగంబు మెఱసె 61

చ. దళితతమాలజాలముల దాయ నిశాచరకోటి మేలు క
జ్జలరుచితోడు ధూమవిభుసారథి రేయెలనాగచూర్ణకుం
తలతతి రాజు నొల్లక వెతం బకుపద్మినిశాపమూర్తి ది
క్కులఁ బచరించెఁ జీకటి యకుంఠితలీల నిలాతలంబునన్. 62

సీ. తర్కించి చూడ నందనవని గాఁబోలు
గణనీయకౌశికాకలన నొప్పె
మది నెంచ దుర్జనహృదయంబు గాఁబోలు
దోషానుబంధసంతుష్టిఁ గనియెఁ
బ్రకటింప వైశ్వానరస్ఫూర్తి గాఁబోలు
నఖిలకాష్ఠాపహారాఖ్యఁ దనరె
గణుతింప దైత్యలోకప్రజ్ఞ గాఁబోలుఁ
బ్రకటితతారకప్రతిభఁ గాంచె

గీ. నన విజృంభించెఁ దిమిర మత్యలఘులీలఁ
ద్రిపురహరకంఠకాళిమఁ దెగడి కమల
వనివిదూరమధువ్రతవ్రాతదేహ
దీధితుల గేలి సేయుచు దిక్కులందు. 63

సీ. నిరతాధ్వజశ్రమోద్ధురభానుహయముఖో
ద్గతఫేనఖండశంకావహములు

తాండవోచ్చలదుమాధవజటాకటనట
ద్గంగాంబుకణవిభాసంగతములు
ధారుణీభరభుగ్నదంతావళోద్గీర్ణ
కరశీకరచ్ఛటాసురుచిరములు
వియదిందిరాకుచవితతహారావళీ
ప్రచురముక్తాఫలరుచియుతములు

గీ. కాలయోగీంద్ర విలిఖితగగనఫలక
సురుచిరప్రణవాక్షరశోభితములు
తిమిరదైతేయదంతపంక్తిస్ఫుటములు
చుక్కలంబరపదమునఁ జూడనయ్యె. 64

శా. ధ్వాంతశ్యామలధూమభూమహితసంధ్యారాగవహ్నిప్రభా
క్రాంతాకాశశరావమధ్యరజనీకాంతాకరాంతోద్ధతా
త్యంతప్రస్ఫుటలాజవిభ్రమదశుభ్రాకారసందీపితా
శాంతంబై కనుపట్టె ఋక్షనివహం బక్షీణదృగ్వ్యాపృతమై. 65

సీ. క్షణదాంగనాకరోచ్చలితప్రవాళకం
దుక మంగభవహేమముకుర మదయ
శైలమందారగుచ్ఛము నభశ్శ్రీశ్రుతి
మణికుండలము శతమన్యుదిగ్వ
ధూఫాలనిహితబంధూకప్రసూనమం
జులబిందుతిలక మస్తోకఘుసృణ
రసలిప్తసంధ్యాఖ్యబిసరుహాలోచనా
స్తనకలశము శచీసౌధశిఖర

గీ. భాసమానసువర్ణకుంభంబు బాల
చంద్రబింబంబు లోహితచ్ఛవిని మెఱసెఁ

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

అ ధ్య క్షు లు
విమర్శకాగ్రేసర, ఐతిహాసిక సమ్రాట్టు
శ్రీ బండారు తమ్మయ్య

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి
అభినవభోజ
శ్రీ దంటు భాస్కరరావు

సహాయ కార్యదర్శి
శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి

కార్యనిర్వాహకవర్గ సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ
7. డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
8. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు
9. శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.
10. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, ఎమ్. ఏ. (ఆనర్సు)
11. శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)
12. శ్రీ కావలి శ్రీరామమూర్తి, బి. ఏ. బి ఎల్.

పత్రికా సంపాదకుఁడు
శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | |
|---|---|
| 5వ సంపుటము | రు. 15—00 |
| 6వ సంపుటము | 15—00 |
| 7వ సంపుటము | 15—00 |

1—4 సంపుటములు పునర్ముద్రణములు గావింపబడనున్నవి.

ప్రతియొక్కటికి వెల రు 15 లు

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కుపాఠభేదములతోఁ గూడిన వెనకటి విషయ మంతయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణ పీఠికతో ముద్రితమైనది వెల రు 1—50.

## మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము. కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము మూల్యము రు. 2—50

ఆంధ్రసాహిత్యపరిషత్తు,

కాకినాడ.

Printed by J. Gopalam, B.A. L.T., at Republic Pess, Kakinada.
Edited by K. ISWARADUTT
Published by Andhra Sahitya Parishat, Kakinada.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

విశ్వావసు

శ్రావణ-భాద్రపదములు

సంపుటము ౫౪ సంచిక 3



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

**Journal of the Telugu Academy**

**KAKINADA**

Vol. 54 Part 3

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

వ్యవస్థాపకులు:

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు:

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు:

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు



# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

విశ్వావసు శ్రావణ భాద్రపద మాసములు.

సంపుటము 54. : : సంచిక 3.

సంపాదకుఁడు : శ్రీ కుందూరి ఈశ్వరదత్తు.

## విషయసూచిక

## సంపాదకీయము

అప్రకటితములు, అలభ్యములునగు ప్రాచీనాంధ్రకృతులను ప్రకటించు నుద్దేశముతో సారస్వతకృషిసల్పు పరిశోధకుల సహాయమున ఎప్పటికప్పుడు మా పత్రికయందట్టి కృతులం బ్రకటించుచున్నాము. ఈ సంచికయందు శ్రీ బిరుదరాజు రామరాజుగారు, శ్రీ బండారు తమ్మయ్యగారు పండితారాధ్యుని లఘుకృతుల సంపాదించి, పరిషత్పత్రికలోఁ బ్రచురించుట కవకాశమును గల్పించినందులకు వారికి మా కృతజ్ఞత. శ్రీ రామరాజుగారు వ్రాసినట్లు ఇట్టి కృతులెన్నియో మన ఆంధ్రప్రదేశమునందు ముఖ్యముగా తెలంగాణ ప్రాంతములందు లభింపఁగలవు.

### రాజరాజు కోరుమిల్లి శాసనము

ఈ శాసనము ప్రతిబింబ సహితముగా కీర్తిశేషులు ఫ్లీటు (Dr Fleet) దొరగారు క్రీ. శ. 1885 సంవత్సరము ఇండియన్ ఆంటిక్వేరీ సంపుటము XIV లోఁ బ్రకటించియున్నారు. ఆసంపుటము సులభముగా లభ్యముకాదు. చరిత్ర సారస్వత పరిశోధకుల కుపయోగార్థము—ప్రకటింపఁబడినది

### తాళపత్రగ్రంథ సేకరణము-ప్రభుత్వము

ప్రభుత్వము వారట్టి గ్రంథముల సేకరించి, భద్రపఱచుటకు నిశ్చయించినారని పత్రికాప్రకటనలవల్లఁ దెలియుచున్నది. అట్టి ప్రతుల సేకరించినమాత్రాన కార్యసాఫల్యము కలుగదు. వానిని ప్రకటించవలసిన బాధ్యతయు నెంతేని కలదు.

### ముద్రణ స్ఖాలిత్యములు

"పండితారాధ్యోదాహరణము" అనుటకు మారుగా "పండితారాధ్యోహరణము", అను శీర్షిక వ్యాసముఖమునఁ బ్రకటింపఁబడినది. పంప్రెండవపుటలో "చెన్నబసవరగడ - శ్రీ బండారు తమ్మయ్యగారు" అను శీర్షిక వదలి చదువవలెనని ప్రార్థన.

# గ్రంథసమీక్షకు వచ్చిన గ్రంథములు

1. కవిశిరోభూషణము.
2. రమణీయము - శ్రీ దువ్వూరి రమణశాస్త్రిగారు
3. వసుచరిత్రము - సంస్కృతము - కాలహస్తికవికృతము.
   సంపాదకులు - శ్రీ బిరుదరాజు రామరాజుగారు
4. గొడగూచి, గ్రంథకర్త-శ్రీ వేదాంతము కాశీనాథముగారు.
5. శ్రీ రామకృష్ణశతకము - గ్రంథకర్త - డి. గోపాలకృష్ణ.
6. విజయనగర సంస్థానము - ఆంధ్రవాఙ్మయ పోషణము
   గ్రంథకర్త - శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు.
7. సంక్రాంతి సంచిక.

పై గ్రంథముల సమీక్షలు రాబోవు సంచికలో వెలువడును.

# పాల్కురికి సోమనాథుని పండితారాధ్యోదాహరణము

డా॥ బిరుదరాజు రామరాజు, ఎం. ఎ.

ఉస్మానియా విశ్వవిద్యాలయము.

మహాపండితుఁడును మహాకవియు నగు పాల్కురికి సోమనాథుఁడు బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, సోమనాథభాష్యము రుద్రభాష్యము మున్నగు బృహద్గ్రంథములే కాక పెక్కు లఘుకృతులు రచించినాఁడు. ఆలఘుకృతులలోఁ గొన్నింటిని శ్రీ బండారు తమ్మయ్య గారొక సంపుటమున నిటీవల బ్రకటించియున్నారు. పిడుపర్తి సోమనాథుఁడు పాల్కురికి సోమనాథుఁడు "ఉదాహరణ యుగ్మము" రచించినట్లు పేర్కొన్నాఁడు. సోమనాథుని బసవోదాహరణము తెలుగులోను సంస్కృతములోను లభించుటవలన ఇన్నాళ్ళు పండితలోకము ఉదాహరణ యుగ్మ మనగా బసవోదాహరణ యుగ్మమనియే భావించినది. కరీము నగరము మండలమున నాకొక తాళపత్ర గ్రంథము లభించినది. దానిలో సోమనాథభాష్యముతోపాటు పాల్కురికి సోమనాథుడు రచించిన పెక్కు లఘుకృతులున్నవి. వానిలో నీ పండితారాధ్యోదాహరణ మొకటి. ఈకృతి యున్నట్లు ఇంతవరకు ఆంధ్రసాహిత్య ప్రపంచమునకు దెలియదు. తమ్మయ్యగారిసంపుటములో నిది చేరలేదు. మొదటి సారిగా దీనిని బ్రకటించు భాగ్యము కలిగినందుకు మిక్కిలి సంతోషించుచున్నాను. వ్రాయసకాఁడు తాళపత్రగ్రంథము వ్రాసికొన్నది నందన సంవత్సర వైశాఖ బహుళ త్రయోదశి శుక్రవారము. ఇది క్రీ. శ. 3-5-1532 తేదికి సరిపోవుచున్నది. ఇతరాంధ్రప్రాంతములందువలెఁ దెలంగాణమునఁ దాళపత్రగ్రంథములను సేకరించుట భద్రపరచుట జరుగలేదు. ప్రభుత్వము వారేమాత్రము మీవిషయమున శ్రద్ధగైకొనలేదు. చిన్నచిన్న సంస్థలవద్ద కొందఱు వ్యక్తులవద్ద కొన్ని తాళపత్రగ్రంథములున్నవి. ఏయే మారుమూలలం దింకనెట్టి యనర్ఘరత్నములు మాటుమణఁగి యున్నవో తెలియదు. ఇరుగు పొరుగు రాష్ట్రములందు

ప్రాచ్యపరిశోధనాలయము లున్నవి. వేలకొలది తాళపత్రము లిప్పటికిని దెలంగాణమున లభించును. వాని నన్నింటిని ప్రోగుచేసి ఆంధ్రదేశ ప్రభుత్వమువారును మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము వంటిదాని నొకటి స్థాపించి పరిశోధనలు చేయించినఁ దెలుఁగు సంస్కృతికిని తెలుఁగు సాహిత్యమునకును మేలుచేసినవా రగుదురు. ఆలస్యము చేసినచో ఆతాళపత్రగ్రంథము లెక్కడివక్కడనే జీర్ణించిపోవును. అప్పుడు "నదీనాం సాగరో గతిః"

శ్రీ మల్లికార్జున పండితోదాహరణము :

ఇకనీ యుదాహరణమును జిత్తగింపుఁడు.

శ్లో. అద్వైతోద్ధత కుంభికుంభదళనోద్యద్రౌద్రపంచాననో
గర్వోదంచితపాంచరాత్ర నిబిడప్రోద్యచ్చండద్యుతిః,
పాషండాబ్జమహాగజో విజయతే బౌద్ధాద్రిఘోరాశనిః
శ్రీమత్పండిత మల్లికార్జునగురు ర్విద్వత్సభాపూజితః. ౧

శ్లో. పండితారాధ్యనామేతి పంచాక్షరసముద్భవమ్
సకృ[త్] స్మరంతి యే భక్తా స్తే జనాః పుణ్యకారిణః. ౨

మాలిని. శివకర శివసౌఖ్యా శిష్టభక్త్యైకముఖ్యా !
వివిధపరమశీలా వేదశాస్త్రానుపాలా !
ప్రవిమలపరభావా పండితారాధ్య దేవా !
తవిలి మిము భజింతున్ దగ్గయుం బ్రస్తుతింతున్. ౩

శా. శ్రీమన్ శైవవరమ్మావరున్ [1]వినమిత శ్రీచెన్నమల్లేశ్వరున్
ధీమంతున్ నిగమాగమ శ్రుతిమతోద్గీతార్థవేత్తన్ బుధ
స్తోమస్థున్ బ్రభు మూర్ధ్వనేతుఁ డగు నాథ్యున్ బండితారాధ్యులన్
గామింతున్ నుతియింతుఁ గొల్తుఁ దలఁతున్ గామ్యార్థసంసిద్ధికిన్ ౪

---

1. నియమిత.

## శ్రీ మల్లికార్జున పండితారాధ్యోదాహరణము

### —: ప్రథమా విభక్తి :—

శా. శ్రీమత్పండితమల్లికార్జునుఁడు వైశిష్ట్యోల్లసచ్చర్యుఁడు
ద్దామప్రోద్ధతవీరభక్తినిధి నిత్యశ్లోకుఁ డుద్యన్ముని
స్తోమస్తోత్రుఁ డగణ్యపుణ్యుఁడతి తేజోరాశి సమ్యగ్దయా
ధాముం డీవుత మాకు భక్తియుఁ బ్రసాదార్థక్రియాసక్తియున్

మధురగతిరగడ

కళిక :— [2]మఱి శుద్ధశైవమార్గమండనుఁడు
తుఱవణించు భవ ♦ దుర్గఖండనుఁడు
చిరతరప్రణవ ♦ సిద్ధమాంత్రికుఁడు
పరమభక్తిరవిని ♦ బద్ధతాంత్రికుఁడు
మునిగణ ప్రచయ♦ ముఖ్యవందితుఁడు
జనితచిన్మయసు ♦ సౌఖ్యవందితుఁడు
అలఘుసంచితశి ♦ వైక్యభావనుఁడు
ఎలమి సర్వజగ ♦ దేకపావనుఁడు

ఉత్కళిక :—తన విభుత్వమును
ఘనమహత్త్వమును
ధరణి నింపుమని
హరుడు పంపఁబని
[4]వడసి చెన్నమర
నొడలు గొన్న పర
మముదయాతనుఁడు
దమితయాతనుఁడు.

---

2. మఱియు. 3. వినీత. 4. వడసెఁ

—: ద్వితీయా విభక్తి :—

శా. ఆర్యుండై ప్రమథానుసారకలితుండై వీరమాహేశ్వరా
చార్యుండై వరభక్తిముక్తిసుమహాత్సౌఖ్యప్రదుండై మహై
శ్వర్యుండై భవరోగవైద్యుఁడయి భాస్వన్మూర్తియై సద్గుణ
స్థైర్యుండై చను మల్లికార్జును యథాశక్తిన్ బ్రశంసించెదన్ ౮

మధురగతిరగడ

కళిక:—మఱియును భువనస ♦ మూజస్తుత్యుని
నెఱసిన మహిమా ♦ న్వితపాండిత్యుని
అతిశయనుతబా ♦ హ్యాంతరశుద్ధుని
హితశివగణవిర ♦ హితజనబాద్ధుని
శివయోగసుఖ ♦ శ్రీసాన్నిధ్యుని
సవిశేషాఖిల ♦ జగదారాధ్యుని
సంచిత విమల ♦ జ్ఞానసముద్రుని
నంచితనరచ ♦ ర్మావృతరుద్రుని. ౯

ఉత్కళిక:— హారు నుపకరణము
లోరసిన చరణము
లలగక పెఱికిన
యలుగుల నఱికిన
మన మహాదేవయ
కును కాళ్ళున్ దయఁ
బడసిన వీరుని
జడతా దూరుని. ౧౦

5. జిన

—: తృతీయా విభక్తి :—

శా. ఆజ్ఞారాధనపాత్రుచే విధినిషేధాదిక్రియానీతుచే
సజ్ఞానాబ్ధివిహిత్రుచేఁ బరమయోగానందుచే భక్తిస
మ్యజ్ఞానాశ్రియణీయుచే ననఘుచే మా పండితారాధ్యుచే
నాజ్ఞాసిద్ధియుఁ జిత్తశుద్ధియు సముద్యత్ప్రీతిమైఁ బొందెదన్. ౧౧

ద్విరదగతి రగడ

కళిక :- మఱియు భవిజనరహిత ♦ మహితైకశీలుచే
నురుపురాతనగణో ♦ ద్యుక్తవాగ్జాలుచే
ప్రకటితాష్టాదశపు ♦ రాణనిర్ణేతచే
సకలశాస్త్రార్థవి ♦ జ్ఞానసంధాతచే
వేదాంతసిద్ధాంతవిషయప్రవర్తిచే
నాదిమార్గప్రతిష్ఠాచార్యమూర్తిచే
శివతత్త్వభావసంచితయోగమధనుచే
శివతత్త్వసారసంచితపుణ్యకధనుచే. ౧౨

ఉత్కళిక :- గురునాజ్ఞఁ దలమోచి
యరసి శ్రుతులను జూచి
శివు ప్రసాదము గొనిన
భవము మఱి లేదనిన
దని జగంబులఁ జాటి
మును ప్రసాదము సాటి
చేసిన ప్రసిద్ధుచే
నా శుభసముద్రుచే. ౧౩

—: చతుర్థీ విభక్తి :—

శా. భక్తుం డీశ్వరుఁ డగ్రగణ్యుఁడు మహాభాగుండు తత్త్వార్థసం
యుక్తస్వాంతుఁడు దేశికోత్తముఁడు నిత్యోల్లాసవంతుండు ప్ర
వ్యక్తుండంచు గణించి జంగమసముద్యత్పాదపద్మార్చనా
సక్తిన్ బేర్కొను మల్లికార్జునుఁడు సద్భక్తి నాటించెదన్. ౧౪

ద్విరదగతి రగడ

కళిక :- మఱియును బునర్జనన ♦ మరణదూరునకునై
వఱలు నపగతభయా ♦ వరణ కరణునకునై
గహనాంగసంగతవి ♦ కారదూరునకునై
సహజైకయోగప్ర ♦ చారధీరునకునై
కమనీయభక్తిశ్రం ♦ గార పాత్రునకునై
సముదితాంచితశివా ♦ చారపూర్ణునకునై
అతులసంవిత్సుఖా ♦ యత్తచిత్తునకునై
అతివినిర్మలమహో ♦ దాత్తవృత్తునకునై ౧౫

ఉత్కళిక :- లింగార్చనావేళ
జంగమము సల్లీలఁ
(గడువడినిదనకడకు)
నెడ తేర శివపూజ
గొని భక్తుఁడే లింగ
మని భజించిన జంగ
మప్రాణపదునకై
విప్రసమ్మదునకై ౧౬

—: పంచమీ విభక్తి :—

శా. ఆఖ్యాతప్రమథానుకీర్తివలనన్ స్వాత్మావబోధోల్లస
త్సౌ(ఖ్యోపా)యజనప్రకాశువలనన్ శంభుప్రసాదాగమ
[6]వ్యాఖ్యాతాచరణప్రవీణమతి భాస్వత్పండితారాధ్యనా
మాఖ్యాతాంచితపుణ్యమూర్తివలనన్ మా కిష్టముల్ చేకురున్ ౧౭

---

6. వ్యాఖ్యాయా

(ద్విరదగతి రగడ)

కళిక :- మఱియు ననదృశశివ ♦ మయసముచితునివలన
గురుఁ బొనరుచుఁ దనరు ♦ గుణగణాయతువలన
శరణగణవరచరణ ♦ సరసిరుహావశువలన
సరస [7] వరమునినికర ♦ సతతనుతయశువలన
పరమపరవిమలతర ♦ పరమసుఖకరువలన
నిరతిశయదురితచయ ♦ నిఖిలభయహారువలన
శ్రుతినియతమతసహిత ♦ సురచిరసహితువలన
వితతయమనియమసమ ♦ విలసచ్చరితువలన ౧౨

ఉత్కళిక :- శివుని పంపున వచ్చి
తవిలి కనుగవ నిచ్చి
ముమ్మాటికిని జడయు
నమ్మకున్నను దడయు
కెడ నిడుదలగు కన్ను
లడరఁ బడసిన చెన్ను
నివుడు ధన్యునిఁ గలన
భువనమాన్యునివలన ౧౯

—: షష్ఠీ విభక్తి :—

శా. పాపాత్ముం వెలనాటిచోడనృపతిన్ బ్రాహ్మత్వసంగాధముం
శాపోద్రేకవిజృంభితాగ్నిశిఖలన్ (జయ్యన్ వినాశంబుగాఁ
బాపోద్వేగఫలంబునప్పుడెగసన్) భస్మంబుగా నుగ్రుఁడై
యాపాదించిన మల్లికార్జునకిఁ బ్రార్థింతు నా చిత్తమున్ ౨౦

---

7. శుక

## తురగవల్గన రగడ

కళిక :- మఱియు మెఱయఁ జెప్పనొప్పు ♦ మహితనిహితవర్తనునకు
నెఱవు నిరవుఁ జూపనోపు ♦ నిత్యసత్యకీర్తనునకు
ప్రాపుదాపు దానయైన ♦ భక్తియుక్తికారణునకు
పాపకోపరాగరోగ ♦ భవనిచయనివారణునకు
సతతవితతకర్మమర్మ ♦ జాలమూలకృంతనునకు
నతివిహితవిచారసార ♦ సాంగలింగచింతనునకు
ఆద్యహృద్యరచితనిచిత ♦ యజనభజనమండితునకు
గద్యపద్యనవ్యకావ్య ♦ కథనమథన పండితునకు ౨౧

ఉత్కలిక :- ఇల సమస్తవాద వేద
మూలఁ ప్రమాణజాలమూల
మున శివుండ మేటి పోటి
యని గుఱించి జ్ఞానహీన
సమయసమితిఁ ద్రుంచి మించి
యమితవిమలభక్తియుక్తిఁ
బరగు తత్త్వచేతనునకు
భరితభక్తిబీజమునకు ౨౨

—: సప్తమీ విభక్తి :—

శా. లింగాత్మోద్భవ శేశునామ యను బల్మిన్ జీరి మార్కొన్న గ
ర్వాంగద్రోహిని బానుగఁటి యుడయస్త్మాధీశుఁ దత్సంతతిన్
ద్రుంగంగా శపియించి మించి జగదుత్తుంగప్రతాపోదయా
శినంగధ్వంసకు మల్లికార్జునునియం దాసక్తిమైఁ గొల్చెదన్ ౨౩

8. దాంగీకారుఁడు

(మధురగతి రగడ)

కళిక :- మఱియును సజ్జన ♦ మండలునందుఁ
గొఱలు శ్రుతిస్మృతి ♦ కుండలునందుఁ
దురితసముత్కర ♦ దూరగునందుఁ
బరమపరాత్పర ♦ పారగునందుఁ
సరసజగజ్జన ♦ సన్నుతునందుఁ
ఉరుతరకీర్తిస ♦ మున్నతునందుఁ
పరిమితసూనృత ♦ భాషణునందుఁ
స్ఫురితదయారస ♦ భూషణునందుఁ ౨౮

ఉత్కళిక :- హరు కృపయూటల
కిరవగు చోటుల
కనువగు మాటల
వినుతుల తేటల
పదముల పాటల
ముదమగు నాటల
గల గురునందు
మలహరునందు. ౨౯

—: సంబోధన :—

శా. శాంతస్ఫూర్జితనందినాథ భవపాశచ్ఛేదనోగ్రాక్ష సి
ద్ధాంతప్రోద్ధతవాదగీతమయవిద్యాతీత భృంగీశదు
ర్వాంతోద్యద్బల వీరభద్ర నిను నేఁ బ్రార్థింతు విజ్ఞాతవే
దాంతా! పండితమల్లికార్జున! త్రిలోకారాధ్య! రక్షిం [పుమా] ౩౦

(తుగగవల్గన రగడ)

కళిక :- మఱియు సంయమీశ్వరోక్త ♫ మార్గసంతతప్రచార
మెఱియు హృదయకమలమధ్య ♫ మిళితశుద్ధతత్వపూర
దురితచరితజననమరణ ♫ దుఃఖసంకటాతిదూర
హరసమయసుఖార్ధవర్ధ ♫ నాభికల్పితప్రకార
ప్రకటతరభవాంధకార ♫ పటలవిఘటనప్రదీప
సుకృతజనహితోపదేశ ♫ సులభసద్గురుస్వరూప
విస్మయాభిజననహేతు ♫ వీరభక్తియోగసార
అస్మదీయచెన్నమల్లి ♫ కార్జునాపరాపతార ౨౭

ఉత్కళిక :- అమర తనువు సత్క్రియావ
రము ధనముగాని వేద
నము మనము భక్తిభావ
నమున సమయలింగసావ
ధానలీన పరమయోగ
మానితానురాగభోగ
జనితనిర్వికల్పసౌఖ్య
వినుతనిఖిలశరణముఖ్య ౨౮

—: సా ర్వ వి భ క్తి క ము :—

శా॥ నీవార్యుండవు నిన్నుభజించుజగముల్ నీచే భవంబెందు నీ
కై వర్తిల్లు యశంబు నీవలన సౌఖ్యావాప్తి నీకుం బ్రసా
దావిస్ఫార సభోత్సవంబడరు నీయం దావహింతున్ మదిన్.
దేవా! పండితమల్లి కార్జున! జగద్దీపప్రభావోదయా! ౨౯

శా॥ ఆరూఢాంచితలింగజంగమ కృపాయత్త ప్రసాదోదయా
పారోక్తిన్ జనునీయుదాహరణముల్ పాల్కుర్కి సోముండు లో
కారాధ్యుండగు మల్లికార్జునునకి ట్లర్పించె సద్భక్తి నిం
డారంగాఁ బఠియించినన్ వినినఁ గామ్యార్థంబిలన్ జేకుఱున్. ౩౦

# చెన్న బసవ రగడ

## పాల్కురికి సోమనాథ మహాకవి కృతము.

శ్రీ బండారు తమ్మయ్యగారు.

మిత్రులు శ్రీరామరాజుగారు సోమనాథునికృతులలో నశ్రుత పూర్వము నలభ్యమునగు నీ యుదాహరణకృతిని సేకరించి ప్రకటించి నందుకు మా ధన్యవాదములు. అర్థలక్షణములు సంగతములుగా లేక సందేహాస్పదములుగా నున్న కొలఁది తావు లందు నేనించుక సవరణలు చేసి వానికి 1, 2 మున్నగు గుఱుతులుంచి యసలు పాఠములను బుటలయడుగునఁ జూపితిని. అసలు ప్రతిలో లుప్తములవుటచే శ్రీరామరాజుగారు ............ గుఱుతులుంచిన తావులను నేను కథానుసందర్భమున కనుగుణముగా పూరించి కుండలీకరణములలోఁ జూపితిని. పద్యములక్రిందికళికలు ఛందోలక్షణ మనుసరించియే యే రగడలకు సరిపోవునో సూచించితిని. ఉత్కళికయనఁగాఁ గళికలో నర్థభాగమని తెలియనగును.

ప్రథమావిభక్తి పద్యముక్రింది కళికను 5+3 ఎనిమిదేసి మాత్రలుగల రెండుభాగములుగాఁ గూర్చి కవి యెనిమిదవమాత్ర మీఁద యతిని పాటించినట్లు కాన్పించును. అందుచే నిది మొత్తము పాదమునకుఁ బదునాఱుమాత్రలుగల మధురగతిరగడకు సరిపోవును. అసలు ప్రతిలోని పాఠములు 1, 4 పాదముల ప్రథమభాగములో నందుకు సరిపడుటలేదు. అందుచే "మతియుశుద్ధ," "పరమ భక్తి వినీత" అనువానిని "మతిశుద్ధ" "పరమవిని" అని మార్చితిని.

ఇట్లు
బండారు తమ్మయ్య
ఉపాధ్యక్షుఁడు.

# చెన్నబసవరగడ

(శ్రీ పాల్కురికి సోమనాథ మహాకవి కృతము)

కం. శ్రీమంతన బసవగురు
శ్రీమంతన నాంపొగళ్వే జంగమలింగ
శ్రీమంతన సుజ్ఞాన
శ్రీమంతన [1] మహితభక్తి యింబసవేశా!

(ఉత్సవ రగడ) = తురగవల్గన రగడ.

శ్రీ బసవ వృషభకుమార వరకుమార — చెన్నబసవ
శ్రీ బసవ చిదనల హాతరమా కుమార ,,
బసవ గురువచోవ్య పగత వృజనపంక ,,
బసవ పురభిదపగత త్రిపుర కలంక ,,
బసవ పశుపవిదళిత పశుపాశ వరణ ,,
బసవ మలహరతక్షపిత మల ప్రసరణ ,,
బసవ భానునిర్గళిత భవాంధకార ,,
బసవ వీరభద్ర వీరభద్రసార ,,
బసవ గురువరాధరీకృతాధి శిష్య ,,
బసవ భావజనిత లింగసుకలి శిష్య ,,
బసవ విషయజప్రసాద [2] సౌఖ్యలోల ,,
బసవ పాదజనిత వినుత భక్తిశీల ,,
బసవ పారిషద గణైక పథవిహార ,,
బసవ రుద్రగణ నిజాపరావతార ,,
బసవ మాంత్రికోపలబ్ధ రాజమంత్ర ,,
బసవ తాంత్రికోపదేశ వీరతంత్ర ,,
బసవ పద సరోజపూజ నార్హహస్త ,,
బసవ పద సరోజనత సమాజ [3] శస్త ,,

---

1 నాశము 1 విషయ 3 హస్త

బసవ పదకమల పరాగ పటీరతిలక — చెన్నబసవ
బసవ పద కమలనుతి ప్రహర్ష పులక — ,,
బసవ పద నఖాంశుకౌముదీచకోర — ,,
బసవ పాదనఖర ముకుర సుఖశరీర — ,,
బసవ పదరవింద గతమరందసిక్త — ,,
బసవ పదరవింద కాంత కాంతియుక్త — ,,
బసవ పాద తళమరాళ [4] జాలకల్ప — ,,
బసవ సద్గుణ స్మరణ చణావికల్ప — ,,
బసవ పాదకమల విమల సదనవాస — ,,
బసవ పాదభక్తి వాసనా విలాస — ,,
బసవ పదవిశేష భక్తి వేషభూష — ,,
బసవ పాదభక్తి పల్లవిత మనీష — ,,
బసవ పాద ఘననినాద వనమయూర — ,,
బసవ పాద కంజ పంజరోయకీర — ,,
బసవ గీత జాత నీత [5] సారగర్భ — ,,
బసవ పారిజాత పోత కలితగర్భ — ,,
బసవ కల్ప మహిజ మూలికాదిసిద్ధ — ,,
బసవ కల్ప వల్లరీ వితాన బద్ధ — ,,
బసవ కల్ప భూమహోరు చారుశాఖ — ,,
బసవ దివిజ భూజవర శిఖామయూఖ — ,,
బసవ కల్ప కుజనవాంకు [6] రానుకూల — ,,
బసవ కల్పవృక్ష పల్లవాంశు జాల — ,,
బసవ గురు మరుత్తరు ప్రచుర శలాటు — ,,
బసవ గురు మరుత్తరు ప్రసూనవలయ — ,,

---

4 కూళ 5 జపవ 6 రయుతుశాల

బసవ కల్పపాద ఫల విఫులసార — చెన్నబసవ
బసవ కామధుక్పయః ప్రవాహపూర ,,
బసవ ధుగ్యరస్త వాలవాల ,,
బసవ కామ ధుఙ్ముఖారవింద గంధ ,,
బసవ కామ ధుగ్ప్రపుష్కలానుబంధ ,,
బసవ సత్కృపాపయః పయోధిఫేన ,,
బసవ ఘన ఘృణావియన్నదీవిలీన ,,
బసవ రస రసాయనైక పాత్రి భూత ,,
బసవ నిధినిధానలబ్ధ భాగ్యజాత ,,
బసవ శాతకుంభకుధర కోటిరోచి ,,
బసవరోహణాచల ద్యుమణి మరీచి ,,
బసవ రజత శైల సార్వభౌమ భూమ ,,
బసవ హిమవదచల భూమి కాభిరామ ,,
బసవ కులనగాగ్రి [7] కనక కలశధామ ,,
బసవ దిగిభ దివ్యనిటల తటలలామ ,,
జసవ బప్రిధావవర్ణ బహుళశోభి ,,
బసవ సద్వితీయ వర్ణ సహజతేజ ,,
బసవ సత్తృతీయ వర్ణ ముఖ్యసౌఖ్య ,,
బసవ తదసమాక్షర స్ఫురన్మనస్క ,,
బసవ తదసమాక్షరాంకల సదురస్క ,,
బసవ తద సమాక్షరోప మానగాన ,,
బసవ తద సమాక్షరామృత రసపాన ,,
బసవ తదసమాక్ష రమణిగణాకరండ ,,

---

7 కలన

| | |
|---|---|
| బసవ తప సమాక్ష రనిచితాబ్జ జాంఘ | చెన్నబసవ |
| బసవ వర్ణ లిఖిత పుస్తకైక రసన | ,, |
| బసవ వర్ణ వస్తు పీఠికాంగ వసన | ,, |
| బసవ వర్ణ కర్ణ పూర్ణ కుండలాంక | ,, |
| బసవ వర్ణ నూత్నరత్న [8] శోభితాంగ | ,, |
| బసవ లింగసేవనార్చనావిధేయ | ,, |
| బసవ జంగమాంఘ్రి పూజనానపాయ | ,, |
| బసవ సద్గురుప్రసాద భరితపాత్ర | ,, |
| బసవ నిజగుణ ప్రసాద కర్ణసూత్ర | ,, |
| బసవ తదుభయ ప్రసాదఘ్రాణవిషయ | ,, |
| బసవ సుప్రసాద రస విషయరసజ్ఞ | ,, |
| బసవ సుప్రసాద సంస్కరణ మనోజ్ఞ | ,, |
| బసవ సుప్రసాద విషయ సర్వసంగ | ,, |
| బసవ సుప్రసాద [9]లసదపాంగసంగ | ,, |
| బసవ పాద కంకణాంకితోత్తమాంగ | ,, |
| బసవ మజ్జనోదకస్నపిత తదంగ | ,, |
| బసవ ప్రసాద లీలపూర్ణకుంభ | ,, |
| బసవ సర్వవిఘుస సౌఖ్యవిషయకుంభ | ,, |
| బసవ గురుదదీయ గురుతరాధ్వపధిక | ,, |
| బసవలింగ భక్తలింగ సుగుణకధక | ,, |
| బసవ సశివపాదభక్త పాదభక్త | ,, |
| బసవ సత్యశరణయుక్తపదనియుక్త | ,, |
| బసవ కేవల ప్రజాద సుప్రసాద | ,, |
| బసవ నిజశివైక్య ప్రీత శివైక్యమోద | ,, |

8 చోడికాంక 9 లసదు

| | |
|---|---|
| బసవ వృత్త బసవచిత్త బసవకర్త | చెన్నబస |
| బసవ సూక్త బసవశక్త బసవయుక్త | ,, |
| బసవ నిరత బసవ చరిత బసవభరిత | ,, |
| బసవ కామ్య బసవగమ్య బసవసౌమ్య | ,, |
| బసవ నామ బసవసీమ బసవనేమ | ,, |
| బసవ పుత్రి బసవసూత్రి బసవగాత్రి | ,, |
| బసవ పుత్రి నిమ్మపుత్రి నానలయ్య | ,, |
| బసవ గోత్రి నిమ్మగోత్రి నానలయ్య | ,, |
| బసవ భృత్య నిమ్మభృత్య నానలయ్య | ,, |
| బసవ భక్త నిమ్మభక్త నానలయ్య | ,, |
| బసవ శిష్య నిమ్మశిష్య నానలయ్య | ,, |
| బసవ భావ నామభావ కావుదెన్న | ,, |
| బసవ సేవ సప్రిభావ కావుదెన్న | ,, |
| బసవ లక్షణైకరక్షణ గళిసెన్న | ,, |
| బసవ రక్షతా సమూక్ష రక్షిసెన్న | ,, |
| బసవ లోల తరసులీల పాలిసెన్న | ,, |
| బసవ మేళ నాతిశీల పాలిసెన్న | ,, |
| బసవ చిత్సముద్రి ఉద్ధరిసువుదెన్న | ,, |
| బసవ సత్ప్రిబుద్ధి ఉద్ధరి సువుదెన్న | ,, |
| బసవ కరణ నిహితకరణ కరుణిసెన్న | ,, |
| బసవ కరణ దేహావరణ కరుణిసెన్న | ,, |
| బసవ చరణ నిమ్మచరణ శరణరెనగె | ,, |
| బసవ చరణ నిమ్మచరణ హారణరెనగె | ,, |
| బసవ మూర్తి చెన్నబసవ లసితకీర్తి | ,, |
| బసవ సూను చెన్నబసవ పశలూన | ,, |

బసవ సిద్ధ చెన్నబసవ బసవసుద్ధ చెన్నబసవ
బసవ పురుష చెన్నబసవ బసవపురుష ,,
బసవ రూప చెన్నబసవ బసవజాప ,,
బసవ గోప చెన్నబసవ భక్తిదీప ,,
బసవ గణ్య చెన్నబసవ బహుళపుణ్య ,,
బసవ శరణు చెన్నబసవ నిమ్మశరణు ,,
బసవ రిశద శరణు చెన్నబసవ శరణు ,,

కం. చెన్నబసవణ బల్లల

బణ్ణిసలా బసవ మహిమెయం బల్లనవం
చెన్నబసవణ భక్తియ
నిన్నొబ్బరి...బసవేశా !

కం. ............చెన్నబసవ
స్తుతి మహోత్సాహ జగళెయం పరసిదొడం
స్తుతిసిదొడికేళి దొడమభి
మత లిసువడు చెన్నబసవం బసవం !

చెన్నబసవేశ్వరుఁడు వీరశైవమతోద్ధారకుఁడును బసవేశ్వరుని మేనల్లుడు చెన్నబసవేశ్వరుఁడు కుమారస్వామి యవతారమని వీరశైవుల విశ్వాసము. సోమనాథుని లఘుకృతులలోని ఈ చెన్నబసవ రగడ యాతని శిష్యుడైన పిడపర్తి సోమనాథకవి పద్యములు బసవపురాణావతారికయందలి పద్యములలో నుదాహృతములయిన వానిలోఁ జేరి యుండలేదు. ఇదియు సోమనాథవిరచితమే యనుటకు సందియము లేదు.

నామిత్రులు మహబూబు నగరోన్నత పాఠశాలా పండితులు నగు శ్రీహన్నబాదా నాగలింగ శివయోగిగారి తాళపత్రగ్రంథ సం

చయమునుండి సేకరించి దీనినిందు బ్రకటించుచున్నాను. ఇది మూఁడేసి మాత్రలుగల 8 గణములతో మొత్త మిరువదినాల్గు మాత్రలు గలిగి కన్నడమందలి యుత్సవరగడకు, తెలుగునందలి తురగవల్గనరగడ లక్షణమునకు సరిపోవుచున్నది. అర్థము సంగతముగను సులభముగను ద్యోతకముకాని కొలఁదితావులలో నేను గొన్నిసవరణలుచేసి యసలు ప్రతియందలి వానిమూలపాఠములను బుటలయడుగునఁ జూపితిని.

బండారు తమ్మయ్య,
పరిషదధ్యక్షుఁడు.

— ———

# లక్షణసార సంగ్రహము

శ్రీ తేకుమళ్ల కామేశ్వరరావు, బి. ఏ., బి. ఇడి.

లింగమగుంట తిమ్మకవి రచించిన లక్షణసారసంగ్రహమను పేరుగల సులక్షణసారము యొక్క తాళపత్ర ప్రతిదొరికిన విధమును మొదటఁ గొంత చెప్పవలసియున్నది. గుడియాత్తములో నొకరి వద్ద నొకచిన్నతాళపత్రముల కట్టయున్నదని విని యతని నొకయేఁడా దిగా వేడితిని ఎట్టకేలకు దానిని నాకతఁడిచ్చెను. అతనికి నాతాటాకుల కట్టలో నేమి కలదో తెలియదు కాని దానిని నాచేతఁబెట్టిన మఱు క్షణమునుండి, తిరిగి యిచ్చివేయుమని ప్రాణముఁ దీసినాఁడు. అంతట వానిలో ముఖ్యమైన వానిని గ్రహించి తక్కిన తునుకలను వానికి నిచ్చి వేసితిని. తనకట్ట తనకుఁ జేరినదని బ్రహ్మానంద భరితుఁడైనాఁడు. నాకునిచ్చునప్పటికే వాని కట్టలోఁ గొన్నిటి నెలుకలు, పురుగులు కొట్టివేసినవి. తక్కినవాని గతికూడ నంతియే. ఇట్టికారణములచే నతఁడు తనపేరు నిప్పట్టునఁ బ్రకటింపఁబడు భాగ్యమునుఁ గోల్పో యినాఁడు.

నేను చేఁజిక్కించుకొన్న కట్టలో సులక్షణసార భాగమేగాక, కవిరాజు వేంకటరాజు అను నతని సూర్యచ్ఛందము - దీనికి మొదలు లేదు-కవిగజాంకుశము; కవివాగ్బంధము గలవు. వీనిలో సూర్యచ్ఛం దము క్రొత్తగ్రంథము.

నేను 1921 లో వెలుఁగుఁదెచ్చిన సులక్షణసారము మీఁద వెల్లంకి తాతంభట్టు రచితమనియే కలదు. అదినిజముగా విచారింపఁ దగిన విషయము. ఏలయన, శ్రీ కందుకూరి వీరేశలింగముగారు 1899 లో నచ్చువేసిన కవుల చరిత్రములో సులక్షణసారము తిమ్మ కవి కృతమని స్పష్టముగా వ్రాసినారు. వావిళ్లవారును పిమ్మటనైనను తాము చేసినలోపమును గ్రహించి సవరించుకొన్నారు. నేనీ లక్షణ గ్రంథభాగమును సవరించుటలో వావిళ్ళవారు 1955 లో నచ్చువేసిన

సులక్షణసారమునుండియే అధోజ్ఞాపికలలో నెన్నెడలనుఁ బద్యసంఖ్యలఁ జూపినాను.

లింగమగుంట తిమ్మకవి కవిపండిత వంశమునకుఁ జెందినవాఁడు. నెల్లూరు జిల్లాలోని గుండ్లకమ్మ (కుండికానది) యేటితీరమున లింగమగుంట గ్రామమున్నది. ఇందునివసించుటచే నీవంశము వారికి లింగమగుంట యింటిపేరైనది. వీరివంశవృక్షము—




(రామకవి వ్రాసిన చతుర్వాటికా మాహాత్మ్యములోని తిమ్మకవి వ్రాసిన సులక్షణసారములోని వంశవర్ణన పద్యములనుండి పై వంశవృక్షము వ్రాయఁబడినది. రెండు పుస్తకములలోఁ జెప్పఁబడిన వానిలో స్వల్పభేదములు లేకపోలేదు. రామకవి తన తండ్రిపేరు,

రామయని జెప్పగా, తిమ్మకవి లక్ష్మణ యని చెప్పినాఁడు. మొత్తము మీఁద నివి విశేష ప్రమాదకరమైన భేదములై, సిద్ధాంతములను దాఱుమాఱుచేయునవి గాకుండుటచేఁ బ్రస్తుతము విడువబడినవి.)

పై వంశములోని వారిలో -

(1) సర్వకవి కవిసార్వభౌముఁడని వర్ణింపఁబడినాఁడు. ఇతఁడు క్రీ. శ. 1500 ప్రాంతపువాఁడు కావచ్చును. రచించిన గ్రంథము లేవో తెలియవు.

(2) రామకవి క్రీ. శ. 1550 ప్రాంతపువాఁడు కావచ్చును. ఆనందకానన మాహాత్మ్యము, చతుర్వాటికా మాహాత్మ్యము, వేంకట మాహాత్మ్యము, మత్స్యపురాణము, వామనపురాణమునను గ్రంథములను రచించెను. వీనిలోఁ జివరి మూఁడు లభించుటలేదు. ఇతఁడు సుప్రసిద్ధకవియైన తెనాలి రామలింగని యల్లుఁడు.

(3) తిమ్మకవి క్రీ. శ. 1560 ప్రాంతపువాఁడు. అన్నదమ్ము లిరువురునుఁ జిక్కంభట్టుయొక్క శిష్యులు. ఇతఁడు రామభక్తుఁడు. తిమ్మన సులక్షణసారమును రచించెను. బాలబోధయను మఱియొక లక్షణగ్రంథమునకుఁగూడఁ గర్తయని పండితులుగొందఱు చెప్పు చున్నారు. దీనిని గుఱించి కొంచె మిక్కడ వివరించెదను.

"బాలబోధ ఛందస్సుకర్తపేరెఱుంగరాదు. అందు బహు ప్రాచీన గ్రంథము లుదాహృతములయ్యెను. ప్రాచ్యలిఖిత పుస్తక శాలలోఁ గొంత, మానవల్లి రామకృష్ణకవిగారి దగ్గఱఁ గొంతకలద"ని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చెప్పిరి. మానవల్లి రామకృష్ణకవిగారు దీనికి బాలబోధమనియు, గవిసంజీవినియనియు సందిగ్ధనామములుగల వని వ్రాసియున్నారు. "లింగనుగుంట తిమ్మన బాలబోధచ్ఛం దస్సును వ్రాసినట్లు పాకనాఁటియందుగల కొలూరి యాంజనేయ కవి తనసుకవి కర్ణామృతమను లక్షణ గ్రంథమున నుడివియున్నా"

దని శ్రీ నిడదవోలు వేంకటరావుగారు వ్రాసియున్నారు. * ఈలక్షణ గ్రంథమింతవఱకు ముద్రణ భాగ్యమును నోచుకొనలేదు గాన దీనిని గుఱించి యధికముగా జెప్పుటకు వీలులేదు.

లక్షణ గ్రంథములలో కెల్ల లింగముగుంట తిమ్మనవ్రాసిన సులక్షణసారమునకు మిక్కిలి జనత (పాప్యులారిటి) గలదు. కాని యాజనతయంతయు గణములు, యతులు, ప్రాసలు దెలుపు భాగమునకే, కాని మిగత దానికిఁగాదు. కావున నాగణాదుల భాగమే క్రీ. శ. 1862 లో ముద్రణకెక్కినది.

సులక్షణ సారములోఁ గొంతభాగమే యచ్చున కెక్కినదని ముద్రాపకులు, పండితులు క్రమక్రమముగా గ్రహించిరి. మిగత భాగమునకై కొందఱు శ్రమపడినారు. కాని లాభించలేదు. ఇతర గ్రంథములలో నుదహరింపఁబడిన పద్యములను మాత్రమే యొక చోటఁజేర్చి తృప్తినొందవలసివచ్చినది.

శ్రీ వీరేశలింగముగారు తమ కవులచరిత్రలోఁ జెప్పిన సులక్షణసారము చిన్నది కాదు. వారి కంటఁబడిన పుస్తకము పెద్దదియే. కాని యదియేలకో యచ్చునకు రాలేదు. దానిగతియేమైనదో కూడ తెలియదు. ఇప్పుడు నాకుదొరకిన పుస్తక భాగములో వారుదాహరించిన కవులపేరులు, పద్యములు చాలవఱకు గలవు.

నాకు దొరకిన పుస్తకములోఁ దిమ్మకవి తన వంశాదికమును గుఱించి చెప్పికొన్న పద్యములకుఁ బిమ్మట నక్షరముల, గణముల యొక్క యాధ్యాత్మిక ప్రభావము (స్పిరిచ్యువాలిటి) గలదు. ఈమాత్రము గ్రంథమైనను లభించినదే!

నాకులభించిన పుస్తకము లింగముగుంట తిమ్మన రచించిన సులక్షణసార మౌనా, కాదా యను ప్రశ్నయుత్తరమును గోరు

* చాగంటి శేషయ్యగారి యాంధ్రకవి తరంగిణి సం 9. పుట 185.

చున్నది. అట్టిపనికిన్ని దగిన కారణము లేకపోలేదు. సాధారణముగా శాస్త్రగ్రంథములలో ననేక ముఖ్యకవుల గ్రంథములనుండి భాగముల నెత్తి యొకచోట వ్రాసికొను నాచారముగలదు. ఇట్టివి సంకలన గ్రంథములు. నాకు లభించిన పుస్తకము గూడ నొక సంకలన గ్రంథమేనా?

తిమ్మకవి తనవంశాదికమును గుఱించి చెప్పుకొన్న మీఁదట గ్రంథరచనకుఁ దొడంగినాఁడు. ఈగ్రంథములో నున్న పద్యములే మిగత లక్షణగ్రంథములలోఁ దిమ్మకవి గ్రంథములోనివి యని యుదాహరింపఁబడినవి. సులక్షణసారములోనివని వీరేశలింగముగారు తమ కవులచరిత్రలో నెత్తి చూపించిన కవుల నామములు, పద్యములు నాగ్రంథములోఁ గలవు. తిమ్మకవి క్రీ. శ. 1560 ప్రాంతపువాఁడు. ఈగ్రంథభాగములో నుదాహరింపఁబడిన కవుల నామములు గ్రంథములు క్రీ. శ. 1560 కి పూర్వపువెగాని తర్వాతివి కాఁజాలవు కదా! కావున నిది సులక్షణసార భాగమేగాని వేఱొండు కాదని ఖండితముగాఁ జెప్పవచ్చును. ఈభాగ మొక పూర్తిప్రకరణమైనను గాకుండుటచే నిది గద్యకైనను నోచుకొనలేదు.

లింగమగుంట తిమ్మకవి కాలమును గుఱించి వాదోపవాదములు లేవు. ఇతఁడు క్రీ. శ. 1560 ప్రాంతపువాఁడనియె పెక్కుమంది యుద్దేశము. ఇతనికిఁ గొంచెముగా ముందువెనుకలనున్న లక్షణకవుల నామములనుఁ దెలిసికొనవచ్చును.

| | | | |
|---|---|---|---|
| వెల్లఁకి తాతంభట్టు | క్రీ. శ. | 1480 | ప్రాంతము |
| చిత్రకవి పెద్దన్న | ,, | 1550 | ,, |
| ముద్దరాజు రామన | ,, | 1550 | ,, |
| లింగమగుంట తిమ్మకవి | ,, | 1560 | ,, |

తిమ్మకవి వ్రాసిన లక్షణగ్రంథమునకు సులక్షణసారమను పేరొక్కటియె గలదా, లేక మఱియొక పేరు గూడ నున్నదా? నాకు దొరకిన తాళపత్రప్రతిలో ప్రారంభ పద్యమునందు మున్న లక్షణ సార సంగ్రహమనియే కలదు, కాని వేఱొకటి లేదు. కావున దీని ముఖ్యనామము లక్షణసారసంగ్రహమనియు, సులక్షణసారమనునది రెండవ పేరనియు గ్రహింపవచ్చును. ఈపుస్తకముయొక్క అసలు పేరు లక్షణసార సంగ్రహమని దెలియక పోవుటచేఁ బెక్కుచిక్కు లేర్పడినవి.

తిమ్మకవి కంటె నించుక పూర్వుఁడైన చిత్రకవి పెద్దన్న యొక లక్షణసారసంగ్రహమును రచించియున్నాఁడు. ఇట్లు వీరిరువురు రచించిన గ్రంథములకు నొకేపేరుండుటచేఁ జిక్కులు ప్రాప్తించుటలో చిత్రము లేదు. కాఁబట్టి దీని రెండవ పేరైన సులక్షణసారము ప్రచా రములోనికి వచ్చినది.

మానవల్లి రామకృష్ణకవిగారు కొన్నిచోట్ల లక్షణసార సంగ్రహమనియు, దానికర్త పెద్దన్న లేఁక చిత్రకవి పెద్దనయనియుఁ జెప్పుచు, నందుహరింపఁబడిన కవులను, కావ్యములను, గుఱించి చెప్పిరి. చిత్రకవి పెద్దన్న వ్రాసిన లక్షణసార సంగ్రహము మనకు లభించినది; ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిరి. కాని మానవల్లి రామకృష్ణకవిగారు చెప్పిన కవుల నామములు గ్రంథములు నందు మచ్చునకైనఁ గన్పింపవు. లక్షణసారసంగ్రహమును చిత్రకవి పెద్దన వ్రాసెనను విషయ మెఱిఁగిన రామకృష్ణకవిగారికి మొదలు తుదలు లేని లక్షణసారసంగ్రహ ప్రతియొకదియో లభింపఁగా, దానిని వారు చూచి యది చిత్రకవి పెద్దన రచించిన గ్రంథముగా భావించి, పైవిధముగా వ్రాసియున్నారనియు, వారికి దొరికినప్రతి పెద్దన విర చితము కాదనియు, నిప్పుడు స్పష్టమగుచున్నది. తిమ్మకవిమాత్రమే

తన లక్షణసారసంగ్రహములో నితరకవులను, కావ్యముల నెన్నింటి
నైన నుదాహరించియున్నాఁడు. పెద్దనయట్టిపనినిఁ దలపెట్టలేదు.
కాబట్టి యుదాహృత పద్యములుగల పెద్దపుస్తకమేదో పెద్దనవ్రాసినది
గలదని మనము భావింపనక్కఱలేదు. పెద్దన తనగ్రంథమున లక్ష్య
ములనన్నింటిని దానేవ్రాయుటచేతఁగాఁబోలు తిమ్మన యితరుల
లక్ష్యములను జూపుపుస్తకమును వ్రాయుటకు దొరకొని, దానికిఁగూడ
నదియేపేరుఁ పెట్టినాఁడు. పెద్దన తిమ్మనలు వ్రాసిన పుస్తకముల
పేరొక్కటియే యగుటచేత నింతగజిబిజిపుట్టినది. తిమ్మన తనపుస్త
కమునకు లక్షణసారసంగ్రమనిపేరు పెట్టుకొని, దానిని మంచిలక్షణ
సారముగాఁ జేసెదనని ప్రతిజ్ఞ చేసినాఁడు.

క. లక్షణశాస్త్రము లెల్లఁ బ
రీక్షించుటఁ గొంతకొంత యెఱిఁగిన వాఁడన్
లాక్షిణికా నుగ్రహతసు
లక్షణసారం బొనర్తు లక్ష్యము లమరన్.

పుస్తకతత్త్వమును దెల్పుమాటయే తర్వాత దానికిఁ బేరై
వెలసినది. పేర్లలోని గజిబిజిని లోకులు సులక్షణసారమును పేరిడి
తీర్చినారు.

లక్షణసారసంగ్రహమను మఱియొక A Triennial catalogue
of Manuscripts 1913-14 to 1915-16. R No. 235
పుట 691 పుస్తకమున్నది. ఇది సంకలన గ్రంథము. కూర్ప
రిపేరు దంతి యప్పకవియని భావింపబడు చున్నది. ఇది సమ
గ్రముగానున్నది. దీనిలో సులక్షణసారము, కవి జనాశ్రియము.
అనంతచ్ఛందము, వాదాంగచూడామణి, కవిసర్ప గారుడము
మున్నగు గ్రంథముల భాగములుగలవు. ఇందలి ప్రారంభ పద్యము
సులక్షణసార పద్యముకంటె వేఱుగానున్నది. ఇది తిమ్మకవి కృత
మగు సులక్షణసారముకంటె వేఱు.

లక్షణసారసంగ్రహము నామమునకు ముందొకపదమునుఁ జేర్చి పేరుమార్చిన లక్షణశాస్త్రజ్ఞులు గొందఱున్నారు. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమును, ఉప్పులూరి వేంకటరెడ్డి సకల లక్షణసారసంగ్రహమును గూర్చిరి.

తిమ్మకవికృత లక్షణసార సంగ్రహము కొంత చిత్రముగా నున్నది. సంస్కృత గ్రంథములనుండియు, తెలుఁగు పుస్తకముల నుండియు నుద్ధృతముల నెత్తి కనఁబఱచుటయే గాక గ్రంథాదుల నామాదులను సంస్కృత భాషలోనే యిట్లు తెలియఁజేసినాఁడు. ఉదాహరణములు:—

'ఆంధ్ర భాషాయామ్- అథర్వణఛందసి' 'కవి సర్పగారుడే' 'మగణస్య' ఇత్యాదులు.

ఇట్లు కవి తనకుఁగల సంస్కృతభాషాభి మానమును వెల్లడి చేసికొన్నాఁడు. లేఖకుల ప్రమాదము వలననే అక్కడక్కడ నట్టి సందర్భములలోఁ దెలుఁగు పదములు దొర్లినవి అట్టివానిని నేను మార్చలేదు.

లక్షణగ్రంథములను రచించుటలోఁ బ్రాచీను లొక్కొక్క రొక్క పద్ధతినవలంబించినట్లు తోఁచుచున్నది. కొందఱు అక్షరాదుల యాధ్యాత్మిక పరిభావము (స్పిరిచ్యుయాలిటి)నకుఁ బ్రాముఖ్యము నిచ్చి రచించినారు-కవివాగ్బంధము, కవి రాజ గజాంకుశమునిట్టివియే. మఱియుఁ గొందఱు గణయతి ప్రాసవృత్తాదులను బ్రధానముగా నెంచినారు- అనంతుని ఛందస్సు, ముద్దరాజు రామనకవిసంజీవిని, మొదలగునవి. ఇంకను గొందఱు వ్యాకారణాద్యలంకారములఁగూడ నదనముగా జేర్చినారు- కావ్యాలంకారచూడామణి, అప్పకవీయము వంటివి.

ఇప్పుడు దొరకిన యీసులక్షణసార భాగములో నగగణా దుల దివ్యత్వము చెప్పఁబడినది. తిమ్మకవి వ్రాసిన పూర్తిగ్రంథ మెట్లుండునో మనమూహించుకొనుటకుఁగూడ నొక చక్కని మార్గ మున్నది. ఈకవిగ్రంథమును సన్నిహితముగా ననుసరించి గ్రంథరచన చేసినవాఁడు కస్తూరిరంగకవి. అతని గ్రంథము పేరు ఆనందరంగ రాట్ఛందము. సులక్షణసారము పోయినను కస్తూరిరంగకవి గ్రంథము మిగిలిన యెడల సులక్షణసారము నూటికి దొంబది పాళ్లు మిగిలిన దనియే చెప్పవచ్చును. కాఁబట్టి మనకు దొరకనిభాగము రంగకవి యొక్క ఆనందరంగ రాట్ఛందములోని తక్కినభాగమువలె నుండునని యూహింపవచ్చును.

లక్షణసారసంగ్రహములో ననేక కవుల నామములు కావ్య ములు నుద్ధరింపబడినవి. వాని నిక్కడ సంస్కృతమునకునుఁ, తెలుఁగు నకును వేఱువేఱుగా వర్గీకరించి చూపెదను.

**సంస్కృత లక్షణ గ్రంథములు**

1 అలంకార చూడామణి
2 అలంకార సంగ్రహము
3 కవికంఠపాశము
4 కవిరాక్షసుఁడు.
5 గోకర్ణచ్ఛందస్సు (ఋషి ప్రోక్తి)
6 చమత్కార చంద్రిక
7 నానాలంకారము
8 లక్షణాదినికాయము (వీరాద్యుఁడు)
9 వృత్తరత్నాకరము (కేదారకవి)
10 సాహిత్యచంద్రోదయము
11 సాహిత్య చూడామణి
12 సాహిత్య రత్నాలయము
13 సాహిత్య రత్నాకరము

**సంస్కృతోదాహృత గ్రంథములు**

1 అమరుకము
2 ఉత్తరరామాయణము
3 ఏకావళి
4 కాలనిధానము
5 కుమార సంభవము (కాళిదాసు)
6 కుసుమాయుధ వ్యాకరణము.
7 కృష్ణజయము (కృష్ణభట్టు)

8 కేదారకవి
(వృత్తరత్నాకరమా?)
9 గణితశాస్త్రము
10 ఛప్పన్నము
11 తర్కభాష
12 నలోదయము
13 భారవి
14 భోజరాజీయము
15 మంత్రిదర్పణము
((శంకరాచార్యులు)
16 మణిదర్పణము
17 మాఘము
18 రఘువంశము
19 వామనశకునము
20 శివభద్రము
21 శ్యామలా దండకము
22 సార్వభౌమకవి
23 సాహసాంకము
(పృథ్వీధరాచార్యులు)
24 సూర్యసిద్ధాంతము.

ఆంధ్ర లక్షణగ్రంథములు

1 అథర్వణ ఛందస్సు
2 అనంతుని ఛందస్సు
3 ఉత్తమగండ ఛందస్సు
4 కవిరాజగజాంకుశము
5 కవి సర్పగారుడము
6 కావ్య చింతామణి
(తాతంభట్టు
7 కావ్యాలంకారచూడామణి
(విన్నకోట పెద్దరాజు)
8 గోకర్ణచ్ఛందము
9 వాదాంగచూడామణి
10 విశ్వేశ్వరచ్ఛందము
11 వేములవాడ భీమకవి
(పుస్తకము పేరు లేదు)
12 శ్రీధరచ్ఛందస్సు.

ఆంధ్రోదాహృతగ్రంథము

1 అరణ్యపర్వము
(ప్రబంధ పరమేశ్వరుఁడు)
2 ఆదిపర్వము
(శబ్దశాసనుఁడు)
3 కల్పవల్లరి
4 త్రిస్థలిదండకము
(నంది తిమ్మన)
5 ద్వితీయ స్కంధము
(భాగవతము)
6 యుద్ధకాండము
(రామాయణము)
7 విరాటపర్వము
(ఉభయకవిమిత్రుఁడు)
8 శరభాంకుఁడు

పై వానిలోఁ గొన్ని నూతనములు. కల్పవల్లరి క్రొత్తపేరు. సర్వత్రిహదాంగచూడామణి యనియే పేరుగలదు; షడాంగచూడా మణి మొదలగు పేరుమార్పులలోఁ గానరాదు. ఇది మల్లన్న కృత మని యితరలక్షణ గ్రంథములనుండి దెలియుచున్నది.

కవిరాజగజాంకుశము పేరొకతూరియైనఁ జెప్ప . శివనిగాని కవి వాగ్బంధము పేరు స్మరింపఁబడనైనలేదు. కాఁబట్టి తిక్కన సోమయాజికృతమని చెప్పబడెడు నీగ్రంథము నిజముగా తిక్కనదిగాక అతని పేరున వేరెవరో కూర్చినదని దృఢముగ జెప్పవచ్చును భీమకవి యాది కవిగాఁ బేర్కొనఁబడినాఁడు. అతని పుస్తకము పేరు మాత్రము చెప్పఁబడలేదు. అళ్లే రేచని పేరెత్తఁబడలేదు. అట్లనే కవిజనాశ్రయము పేరు గూడలేదు. ఇందుఁ బేర్కొనఁబడిన లక్షణ గ్రంథములలోఁ గొన్ని ఇతర లక్షణగ్రంథములలో మాత్రమె గుర్తింపఁబడుచున్నవి; విడిగ్రంథములు దొరకుటలేదు, పై జెప్పఁబడిన గ్రంథములలో, మనకుఁదెలిసినంతవట్టుకు నొకటిఁ గూడ క్రీ.శ. 1550 దాఁటివచ్చునది లేదను విషయమును గుర్తింపవచ్చును.

ఈలక్షణసార సంగ్రహమును కస్తూరిరంగకవి చాలవఱకు ననుసరించి నాఁడని ముందే చెప్పియుంటిని. కాని కేవలము గుడ్డిగా నను కరించలేదు. ఒక్కొక్కయెడమూలములోని యంశములను విడిచిపెట్టి నాఁడు. ఒక పెద్దభేదమునుఁ జెప్పెదను. తిమ్మకవి యక్షరమాలలోని యేఁబదియక్షరములయొక్క తాత్త్విక పరిభావము నేఁబదిపద్యము లలో వ్రాసినాఁడు. ఇవిచాలవఱకు సంస్కృతమునకుఁ దెలుఁగే. సం స్కృతములో దీనిని పాణిని వ్రాసినాఁడని కవిరాజు వేంకటరాజ కృతసూర్యచ్ఛందమునుండి తెలియుచున్నది. ఆయేఁబదిపద్యముల

లోని భావమును రంగకవి రెండుమూఁడు పద్యములలోఁ జక్కఁగ నిమిర్చినాఁడు. కాబట్టి రంగకవి కొన్నిపట్టులలోఁ గొంతస్వతంత్రించి నాఁడని చెప్పవలసియున్నది

సులక్షణసారములో నక్కడక్కడ టీకావివరణలుగలవు. ఇవి వ్యావహారిక భాషలోనున్నవి. తిమ్మకవియే వీనినిరచించియుండునని వేఱుగఁ జెప్పనవసరములేదు. కస్తూరి రంగకవి వీనిలోఁ గొన్నిటిఁ గ్రాంథికములోనికి మార్చినాఁడు ఉదాహరణము:-

తిమ్మకవి టీక:-శ్రీకారం బెటువలెనంటె- శవర్ణ, రేఫ, ఈకారములు కూడగా శ్రీకారమాయెను. అందు శవర్ణరేఫలకు గ్రహంచంద్రుడు. కనుక ఈకారానకు గ్రహం సూర్యుడు. వారిద్దరి కన్యోన్యమైత్రి, కనుక శవర్ణ ఈకారములకధి దేవత లక్ష్మి. రేఫకు అగ్నిదేవత. అయితేనేమి అగ్ని లక్ష్మిప్రియుండు. ఇందుకు సమ్మతి- (లక్షణ. నా వ 220).

కస్తూరి రంగకవి-

శవర్ణమును ఈకారమును రేఫయును గూడిన శ్రీకారమయ్యెను. అందు శవర్ణ రేఫలకుఁ జంద్రుఁడుగ్రహము. ఈకారమునకు సూర్యుఁడు గ్రహము, గనుక వారికిద్దఱికి నన్యోన్యమైత్రి. ఈకారశవర్ణముల కధి దేవత లక్ష్మిదేవి, రేఫ కధిపతియగ్ని-

(ఆనం రం. ఛం. వ 142)

ఈలక్షణసారసంగ్రహభాగములో 248 గద్యపద్యములున్నవి. వీనిలో 48 వఱకు వావిళ్ల వారు ప్రకటించిన సులక్షణసార ప్రతిలోఁ గన్పడుచున్నవి ఆగ్రంథపరిష్కర్తలు మిగులశ్రమపడి, యితర లక్షణ గ్రంథములను బరిశీలించి, వానిని జేర్చినారు. వారుపడిన శ్రమ

బహు ప్రశంసనీయము. వారిచే నితరగ్రంథములనుండి సేకరింపఁబడి నట్టి యాపద్యములు మూలగ్రంథమైన లక్షణసారసంగ్రహములో నేక్రమములో నున్నవో యిప్పుడు పరిశీలింపవచ్చును. ఈపుస్తకములోఁ బాఠాంతరముల నట్లేయుంచితిని. దీనిలోని పద్యములకు సంఖ్యలను నేనిచ్చితిని.

పీఠికను ముగించుటకు ముందీ తాళపత్ర ప్రతినిగుఱించి మఱియొక మాటచెప్పవలసియున్నది దీనిని వ్రాసినలేఖకుఁడు నావలెనే పండితుడు గాఁడు. ఉత్సాహవంతుఁడు. అతని యుత్సాహమువలననే మనకీ పుస్తకభాగ్యముదక్కినది. కాని పాండిత్యము లేకపోవుటచేఁ బాక్తియొక్కంటికిఁ బదితప్పులకుఁ దక్కువలేనిపంక్తి యీగ్రంథములో లేదు. ఇతరగ్రంథముల సహాయమున దీనిలో నొకమార్గమును గనుఁగొనఁగలిగితిని. అట్టిసహాయములేనిచోట్ల సంస్కరణముఁ దగ్గించితిని, ఉన్నబాధలకుఁదోడు మఱియొకటికలదు. తాళపత్రప్రతిలో అరసున్నలన్నియు నిండుసున్నలుగానుండును వానిసంస్కరణ వేఱొక పని. ఇట్టిది బహుబాధకరమైన కార్యమైనది. శక్తివంచనలేక కృషి చేసితిని.

(సశేషము)

# రాజరాజు కోరుమిల్లి శాసనము

శ్లో. శ్రీధామ్నః పురుషోత్తమస్య మహతో నారాయణస్య ప్రభో
ర్నాభీ పంకరుహాద్బభూవ జగతస్స్రష్టా స్వయంభూ స్తతః
జజ్ఞే మానససూను రత్రిరితి య స్తస్మాన్మునేరత్రి త
స్సోమో వంశకరః సుధాంశు రుదిత శ్శ్రీకంఠచూడామణిః.

శ్లో. తస్మాదాసీత్సుధాసూతేర్బుధో బుధనుత స్తతః
జాతః పురూరవా నామ చక్రవర్తీ సవిక్రమః

తస్మాదాయురాయుషో నహుషః తతో యయాతిచక్రవర్తీ వంశ
కర్తా తతః పురు రితిచక్రవర్తీ తతో జనమేజయోశ్వమేధ త్రితయస్య
కర్తా తతః ప్రాచీశః తస్మా త్సైన్యయాతిః తతో హయపతిః తత
స్సార్వభౌమః తతః జయసేనః తతో మహాభౌమః తస్మా ద్దేశా
నకః తతః క్రోధానకః తతో దేవకిః దేవకీరిభుకః తస్మాదృక్షుకః
తతో మతివరస్సత్రియాగయాజి సరస్వతీనదీ నాథః తతః కాత్యాయనః
కాత్యాయనా న్నీలహః తతో దుష్యంతః తతార్యోగంగా యమునా
తీరేయదవచ్ఛిన్నాన్నిఖాయ యూపానక్రమశః కృత్వా తథాశ్వమే
ధాన్నామ మహాకర్మ భరత ఇతి యోలభత తతో ద్భరతాద్భూ
మన్యుః తస్మా త్సుహోత్రః తతో హస్తీ తతో విరోచనః తస్మాద
జమిలః తత స్సంవరణః తస్యచ తపనసుతాయా స్తపత్యాశ్చసుధన్వా
తతః పరీక్షిత్ తతో భీమసేనః తతః ప్రదీపనః తస్మా చ్ఛంతనుః తతో
విచిత్రవీర్యః తతఃపాండురాజః ఆర్యాపుత్రా స్తస్యచ ధర్మజ భీమార్జున
నకుల సహదేవః పంచేంద్రియవత్ పంచస్యుర్విషయగ్రహణా స్తత్ర.

శ్లో. యేనాదాహి విజిత్య కాండవమతే గాండీవినా వజ్రిణం
యుద్ధే పాశుపతాస్త్ర మధాంధకరిపోశ్చాలాభిదైత్యాన్బ
హూనింద్రాసన మధ్యరోహి జయినా యత్కాలకేయాదికాన్
హత్వా స్వైరమ కారివంశ విపినచ్ఛేదః కురూణాంవిభోః

తతోర్జునాదభిమన్యుః తతః పరీక్షిత్ తతో జనమేజయః తతః

క్షేముఖః తతో నరవాహనః తత స్సతానీకః తస్మాదుదయనః తతః పరం
తత్ప్రభృతిష్వవచ్ఛిన్నసంతానేష్వయోధ్యాసింహాసనాసీనే ష్వేకేన
షష్టి చక్రవర్తిషు తద్వంశ్యో విజయాదిత్యోనామ రాజా విజిగీష్య
దక్షిణాపథం గత్వా త్రిలోచనపల్లవ మధిక్షిప్య దైవదుర్విపాకా
ల్లోకాంతరమగమత్ తస్మిన్నంకులే పురోహితేన సార్ధమంతర్వత్నీ
తస్య మహాదేవీ ముడివేము నామాగ్రహారం కతిపయాభి రంతఃపుర
కాంతాభిః కంచుకిభిశ్చ సహోపగమ్య తద్వాస్తవ్యేన విష్ణుభట్ట
సోమయాజినా దుహితృనిర్విశేషమభిరక్షితా సతీ విష్ణువర్ధననందన
మసూత సా తస్య చ కుమారకస్య మానవ్యసగోత్ర హారితీపుత్ర
ద్విపక్షగోత్రక్రమోచితాని కర్మాణి కారయిత్వా తమ వర్ధయత్ స చ
మాతృవినిత వృత్తాంత స్సన్నిర్గత్య చలుక్యగిరౌ నందాం భగవతీం
గౌరీమారాధ్య కుమారనారాయణ మాతృగణాంశ్చ సంతర్ప్య శ్వేతా
తపత్రైక శంఖ పంచమహాశబ్ద పాలికేతన ప్రతిఢక్కా వరాహలాంఛన
పింఛ కుంత సింహాసన మకరతోరణ కనకదండ గంగా యమునాదీని
స్వకుల క్రమాగతాని నిక్షిప్తానీవ సాంమ్రాజ్యచిహ్నాని సమాదాయ
కదంబ గంగాది భూమిపా న్నిర్జిత్య సేతు నర్మదామధ్యం సార్ధ సప్త
లక్షం దక్షిణాపథం పాలయామాస

శ్లో. తస్యాసీద్విజయాదిత్యో విష్ణువర్ధనభూపతేః
పల్లవాన్వయజాతాయా మహాదేవ్యాశ్చనందనః

తత్సుతః పొలకేశివల్లభః తత్పుత్రః కీర్తివర్మా తస్య తనయః
స్వస్తిశ్రీమతాం సకలభువన సంస్తూయమాన మానవ్యసగోత్రాణాం
హారీతిపుత్రాణాం కౌశికీలబ్ధ రాజ్యానాం మాతృగణ పరిపాలితానాం
స్వామిమహాసేన పదానుధ్యాతానాం భగవన్నారాయణ ప్రసాద
సమాసాదిత వర వరాహలాంఛనానేక క్షణక్షణ వశీకృతారాతి
మండలానామశ్వమేధావభృతస్నాన పవిత్రీకృత వపుషాం చాలు

క్యానాం కులమలంకరిష్ణోస్సత్యాశ్రియవల్లభేంద్రస్య భ్రాతా కుబ్జవిష్ణు
వర్ధనోష్టాదశవర్షాణి వేంగీదేశమపాలయత్. తదాత్మజో జయసింహ
వల్లభస్త్రయస్త్రింశతం తదనుజేంద్రరాజనందనస్సప్తదినాని తత్సుతో
విష్ణువర్ధనో నవవర్షాణి తత్సూనుర్మంగియువరాజః పంచవింశతిం
తత్పుత్రో జయసింహస్త్రయోదశ తదవరజః కొక్కిలి షణ్మాసాన్
తస్య జ్యేష్ఠో భ్రాతా విష్ణువర్ధనస్తం ముచ్చాట్య సప్తత్రింశతమబ్దాన్
తత్పుత్రో విజయాదిత్యభట్టారకోష్టాదశ తత్తనుజో విష్ణువర్ధనష్షట్త్రిం
శతం తత్సూనుర్విజయాదిత్యనరేంద్రమృగరాజశ్చతు చత్వారింశతం
తత్సుతః కలివిష్ణువర్ధనోద్యర్ధవర్షం తత్సుతో గుణగవిజయాదిత్య శ్చతు
శ్చత్వారింశతం తద్భ్రాతు ర్విక్రమాదిత్య భూపతే స్తనయ శ్చాలుక్య
భీమస్త్రింశతం తత్సుతః కొల్లభిగండ విజయాదిత్య షణ్మాసాన్
తత్సూను రమ్మరాజస్సప్తవర్షాణి తత్సుతం విజయాదిత్యం బాల
ముచ్చాట్య తాడపో మాసమేకం తంజిత్వా చాలుక్య భీమ తనయో
విక్రమాదిత్య ఏకాదశ మాసాన్ తత్తాడపరాజసుతో యుద్ధమల్లస్స
ప్తవర్షాణి అమ్మరాజానుజో రాజాభీమాబ్దాన్ ద్వాదశాఘునక్ యుద్ధే
యుద్ధమల్లస్తం ధాట్యా నిర్ఘాట్య ధారుణీసుతామ్మభూపః (?) త్సామ్మం
పంచవింశతిం వర్షాణ్యపాతత్ ద్వైమాతురోమ్మ రాజస్య దానార్ణ
వాయితిస్మృతః చతుస్సష్టికలాభిజ్ఞాస్సమాతిశ్రోభునగ్భువం తతః పరం
పతిం లక్ష్మ్మమనుపూప (?) మనాయకంసప్తవింశతి వర్షాణి చ చ్ఛా
వేవతపఃక్షమాం అథ దానార్ణవాజ్జాతః కలావాన్ మృదితః కరైః
రాజాచాలుక్య చంద్రోదయః క్షమాతాపమపాకరోత్ సత్యే ప్రతి
ష్ఠాలోక ఇతి సత్యంవచోయతః సర్వలోకాశ్రియే యస్మిన్సత్యరాజే
స్థితాంజగత్.

శ్లో. నిర్వక్రం వసుధాచక్ర మరక్షత్ క్షపితాహితః
న్యాయ్యే ఽధి నృపై రాద్యై స్స ద్వా దశసమాస్సమః
విమలాదిత్యదేవాఖ్య స్తత స్తస్యానుజో ఽభవత్
మహీమండలసామ్రాజ్యం విజిత్య విజయారిపూన్॥

శ్లో. యస్య ప్రజ్వలిత ప్రతాపదహనం సోఢుం న్నశక్తా భయాన్
గత్వా కానన మంబుధిం చ తరసా విద్వేషిణో విహ్వలాః
ద్వార్వాగ్నిపదేన తత్ర చ ప్రనస్తై, నైవ సంతాపితాః
శ్రీపాదామరపాదపస్య మహతీం ఛాయాంసమాశ్రియన్ ॥

అపిచ

శ్లో. సూర్యాన్వయే సురపతి ప్రతిమః ప్రభావైః
శ్రీరాజరాజ ఇతి యో జగతివ్యరాజత
న్నాథ సమ స్తనరనాధ కిరీట కోటి
రత్నప్రభా పటల పాటల పాదపీఠః॥

శ్లో. జాతి స్తత స్తతయశో జితరాజతేజా
రాజేంద్ర చోడనృపతి నృపచక్రవర్తీ
డంబం ప్రచండ మదదంతి కపోల నిర్యా
ద్దానావిలామరసరిత్సలిలప్రవాహః॥

శ్లో. సద్వీపాంచ పయోంబురాశి పరిఖాం విశ్వంభరాంలీలయా
దండేనైవ విజిత్య చ ప్రతిదిశం యోతిష్ఠిపత్సర్వతః
సైన్వరో ద్భ్రాంతి నివారణాయ విజయ స్తంభం స్వనామాంకితో
నాలానానివ బద్ధు మంధమనసా దర్పేణ దిగ్దంతినః॥

శ్లో. తస్యానుజం సురూపామనురూపం కుండవామ్మహాదేవీం
స ఉపాయత కృతకృత్యో విమలాదిత్యో జనస్తుత్యః॥

శ్లో. సముద్రరశనాం పృథ్వీం పృథ్వీం సభుజ విక్రమాతత్
సమరక్షత్సమాస ప్తస ప్త సమ స్సమః॥

శ్లో. తస్మాచ్చాలుక్యచూడామణిరథ విమలాదిత్యదేవాన్మహీశ
చ్చోడక్ష్మాపాలలక్ష్మ్యేవ రచితతనోః కుండవాయాశ్చదేవ్యాః
జాత శ్రీరాజరాజో రజనికరకుల శ్రీమదంబోధిరాజో
రాజద్రాజన్యసేవ్యాంఘ్రి భుజబలాద్రాజలక్ష్మ్యా పృధివ్యా॥

శ్లో. యో రక్షితుం వసుమతీం శకవత్సరేషు
వేదాంబురాశి నిధి వర్తిషు సింహగేర్కే
కృష్ణద్వితీయ దివసోత్తర భద్రికాయాం
వారే గురోర్వణిజిలగ్నవరేభిషిక్తః॥

శ్లో. యస్యోత్తమాంగం పట్టేన సమబంధి మహీయసా
భర్తుం విశ్వంభరాభారం జ్యేష్ఠేనారాపితం చిరం.॥

శ్లో. పృథ్వీమిమాం యత్ర పృథుప్రభావే
రక్ష్యత్యవర్గం క్షపితారివర్గే
దూరీకృతావగ్రహ చోర రోగాః
ప్రజాలభంతే సఫలం త్రివర్గం.॥

శ్లో. శౌర్యోదార్యమానాద్యగణితగుణజన్మానురక్తా మహిమ్నా
ప్రఖ్యాతేనాతికృష్ణ శశధరధవలా సజ్జనానాంగణేన
పీతా ప్రీతేన కర్ణాంజలిభి రభినవా భాతిదిగ్దేవతానాం
నానావర్ణాం వితానశ్రియ మతనుతరా తన్వతీయస్య కీర్తిః.

శ్లో. పిత్రోర్వంశగురూబభూవతు రలం యస్యస్ఫురత్తేజసా
సూర్యాచ్చంద్రమసౌ నిరస్తతమసౌ దేవౌ జగచ్చక్షుషీ
దంష్ట్రాగ్రకోటి సముద్ధృతాఖిలమహీచక్ర మ్మహత్క్రీడయా
విష్ణోరాదివరాహరూప మభవద్యచ్ఛాసనే లాంఛనం.
స సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజాధిరాజ పరమేశ్వర
పరమభట్టారక పరమబ్రహ్మణ్యః మాతాపితృపాదానుధ్యాతః

త్యాగసింహాసనాసీనః చండికా పరిలబ్ధ సాంబ్రాజ్యచిహ్నః
గుద్దవాదివిషయ నివాసినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినః
సర్వాన్ సమాహూయ మంత్రి పురోహిత సేనాపతి యువరాజ
దౌవారిక ప్రధానా ధ్యక్షానిత్యాదిశతి॥

శ్లో. ఆద్యంతాత్యంతదూరా త్సమజని జగతాం జ్యోతిషాంజన్మహేతు
ర్బ్రహ్మధామపద్మజానామభవదథతతః కాశ్యపోనామవేధాః
భారద్వాజ స్తతో భూన్మని రధిక తప స్తస్యగోత్రే పవిత్రే
తత్రాప స్తంబసూత్రే శ్రుతినిధి రుదగా చ్చోడమూర్యఃక్రమేణ

శ్లో. రాజ్ఞామర్చితవర్చసస్సముదితైర్యజ్ఞైర్విధూమోత్సం ఘసో
యజ్ఞోనామసుత స్తతః కృతధియోజజ్ఞే కృతజ్ఞః కృతీ
విజ్ఞాతా ఖిల వేదశాస్త్రసమయః ప్రజ్ఞా స్సదాపోషిత
జ్ఞాతిర్జ్ఞానిధి ర్గురుజ్ఞ సదృశో నీతిజ్ఞతాయాం భువి

శ్లో. యథావసిష్టోవిధుషాంవరిష్టోనిరుంధతీందోషమరుంధతీం
సతథానురూపామభిరూప రూపస్సతీంముపాయచ్చతమాక

వాఖ్యాం

శ్లో. పుత్ర స్తయోరదితికశ్యపోరివాభూదభ స్వా
నపాకృతతమః ఖలుచోడమూర్యః
యోవేదశాస్త్రసకలశ్రుతిరశ్మిజాలై
శిష్యానాంబురుహా బోధకరోగరీయాన్.॥

శ్లో. నిత్యాభీష్ట ఫలప్రదాన రుచిరం లక్ష్మీనివాసప్పదం
బిభ్రాణం గురుతాం ప్రబుద్ధసుమనః సంపూర్ణశాఖాన్వితం
చ్ఛాయాసంతతి మశ్రితైశ్చ విబుధై సంస్తూయమానం సదా
సోపీత్వాసుఖమాశ్రితే ద్విజవరై రయ్యం విప్రకల్పద్రుమం॥

శ్లో. యద్గేహఃసుచిరం విభాతిపరతాం పుణ్యైరశేషాణాంపటు
వ్యావృత్యావిరతం క్రియామాత్మ్సమపదేహామర్త్యఃజుష్టోషకై
స్నాయంప్రాతరుపాహితం హుతిహృతస్వాహాపిప్రియపోచ్ఛల
ద్ధామైశ్చాపిసఃసంతతః కలిమలం ప్రోత్సార్యద్ధారతః

తస్మైసమస్తజనతావిశేషణాయ రై సుతర్పిత మహీదేవ దేవ గణాయ విప్రాన్వయాబ్ధి శశభృత్ప్రతిచంద్రాయ విద్వజ్జనాంగీకృత విస్ఫూర్తా నందాయ జన్మప్రభృతి గీత వేదార్థ తత్వాయ సన్మనో వసతి వాస్తవ్యాత్మ సత్వాయ లంబిత సంశిత్వ పరిలాలిత చరిత్రాయ శుంభిత మది స్వసిత జీవభృశపుత్రాయ సిద్ధ నిజవాధ కృతిసేవిత మనీషాయ శుద్ధమతి దూషిత సమస్త జనదోషాయ సంతతారాధిత నిజస్వామిపాదాయ చింతిత మనస్థ సుఖదాభూత సుపాదాయ హోమ ధూమ వినిర్గతామిత కలంకాయ ధీమత్ప్రగీత రుచిరస్థిర స్వనామాం కాయ సకల మునిగణ నుతాపస్తంబ సూత్రాయ తత్రిసంగీత భార ద్వాజగోత్రాయ సప్తతంతు కృత యూపస్తంభ శోభాయ సప్తా శ్వరూప సదృశాత్మ తనులాభాయ నిత్యజనతోచిత సుసత్యగుణ యుక్తాయ పత్యభిలాషిత కార్యనిఃపత్తిసక్తాయ పరమపురుషార్థ సంపా దన పటిష్టాయ పరమేశ్వర స్మరణ పాలన వరిష్టాయ సకలార్థశాస్త్ర పరినిశ్చిత వినోదాయ సుకుమారతాధిక సరోజ నిభపాదాయ ధారా కరేణాగ్రహారీకృతః కోరుమెల్లి నామగ్రామ ఇందూపరాగే దత్తో మయాచంద్రతారకం హి తిష్ఠే తస్యావధి వ్యక్తిరేషచ్యతేద్య పూర్వతః కుడకు నియ్యార్యి కిమట్టికాలియసీమా ఆగ్నేయతః ముణ్ణ కాలియ సీమా దక్షిణతఃహానపల్లియు సంపతనియాయు మూమస్థాలియు సీకైమైవసీమా నైరృత్యతః గోదావరియ సీమా పశ్చిమతః బూమప్ర

చాగ్గు సీమా వాయవ్యతః వెనెతియు మాసరయు సీమైవసీమా ఉత్తరతః మాసరపొన్నబుడువయు ఖిల్లోడ్డికాలియుసీమా ఈశానతః ఎఱువంకయ- ఉత్తర్త మున కడలిభాటిసీవగా అస్యోపరిన కేనచిద్బ్రాహ్మ కరణీయయః కరోతి స పంచమహాపాతకైర్యుక్తోభవతి తథాచోక్తం భగవతా వ్యాసాది మహర్షి ప్రకరేణాపి

శ్లో॥ స్వదత్తం పరదత్తంవా యోహరేత వసుంధరాం
షష్టిం వర్షసహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః

శ్లో॥ బహుభిర్వసుధాదత్తా బహుభిశ్చానుపాలితా
యస్య యస్య యదా భూమి స్తస్య తస్య తదాఫలం

శ్లో॥ ఆజ్ఞప్తిః కటకేశోరాచియపెద్దేరి భీమనామక్షమాజః
కర్తాచేతనభట్టఃకావ్యానాం లేఖకోస్యగండాచార్యః
అస్మిన్గ్రామే ప్రతివర్షం భూపసిద్ధాయగ్రహణాం
పంచవింశతి నిష్కాణి శతద్వయసహితాని
పంచాశద్ధాన్యఖండకాని చ॥

---

వ్యా:- అత్ర క్ష్వేళశ్యామలకంధరాదివిశేషణ వ్యజ్యమాన మాలిన్యం నైర్మల్యోల్లక్ష్మీగుణానా మీశ్వరాదివిసర్జనరూపవాచ్య స్యాంగమ్.

ఉదాహరతి క్ష్వేళేతి. క్ష్వేళశ్యామలకంధరం శితినీలకంఠం మధ్యే కళంకో యస్య తం విధుం చంద్రం తే తవ శిష్టం స్పష్టం యోజయతి. అత్రేతి.

వాచ్యసిద్ధ్యంగం యథా

శ్లో. భీకర సూర్యరాయేంద్ర
కాక్షేయకఘనాఘనః
ద్విషా ముగ్రం ప్రతాపాగ్నిమ్
ధారయా శమయ త్యహో!

వ్యా:— అత్రజలధారావ్యంగ్యా సా చ కౌక్షేయకఘనా ఘన ఇత్యస్య వాచ్య స్వరూపకస్య సిద్ధికృ దితి గుణీభూతవ్యంగ్యమ్.

వాచ్యసిద్ధ్యంగ ముదాహరతి భీకర ఇతి. సూర్యరాయేంద్రస్య కౌక్షేయకః ఖడ్గ ఏవ ఘనాఘనః వర్షుకమేఘః. ద్విషాం శత్రూణాం ఉగ్రం ప్రతాప మేవాగ్నిం ధారయా నిశితప్రాంతేన జలధారయా చ యోజయతి అత్రేతి. జలధారావ్యంగ్యా అభిధాయాః ప్రకరణా త్ఖడ్గ ధారాయా మేవ నియంత్రణా దితి భావః.

అస్ఫుటం యథా

శ్లో. శ్రీసూర్యరాయాధిపరాజమౌళే
జ్ఞానాతి గాంభీర్య మసౌ సముద్రః
ధైర్యం సమస్తం ఖలు రత్నసాను
రౌదార్యసారం న చ పారిజాతః.

వ్యాఖ్యానమ్:—

అత్ర సముద్రసదృశం గాంభీర్యం సుమేరుసదృశం ధైర్యం

పారిజాతసదృశ మౌదార్యం చేత్యలంకారస్య కవిసంరంభగోచరత్వేన అస్ఫుటత్వమ్.

అస్ఫుట ముదాహరతి శ్రీసూర్యరాయేతి. యోజయతి అత్రేతి వ్యతిరేకస్య ప్రతీతే రస్ఫుట మిత్యవగంతవ్యమ్.

సంధిగ్ధప్రాధాన్యం యథా

శ్లో. సూర్యరాయమహీజానే
రథాంగసరణిః పరమ్
కల్హారయష్టివ త్సక్తా
కాంతాగురుకుచద్వయే.

వ్యాఖ్యానమ్:—

అత్రాలింగనేచ్ఛారూపవ్యంగ్యస్య చమత్క్రియాకారిత్వా త్ప్రాధాన్యం ఉత కాంతాగురుకుచావలోకనరూపవాచ్యస్య వేతి సందేహా త్సంధిగ్ధ ప్రాధాన్యం సంధిగ్ధప్రాధాన్య ముదాహరతి సూర్యరాయమహీజానే రితి. కల్హారయష్టివ ద్రక్తోత్పలమాలేవ సక్తా లగ్నా యోజయతి. అత్రేతి స్పష్టమ్.

సమప్రాధాన్యం యథా

శ్లో. సూర్యరాయేంద్రపాదాబ్జే
సేవధ్వం క్షితిపాలకాః
యద్వాస్య హృదయం భద్రమ్
ప్రసన్నం కర్కశాయతే.

వ్యాఖ్యానమ్:—

అత్ర సూర్యరాయసార్వభౌమపాదపద్మసేవా యది త్యజ్యతే తదానీం గృహేషు వాసో దుష్కర ఇతి వ్యంగ్యస్య వాచ్యస్య తుల్యం ప్రాధాన్యం.

తుల్యప్రాధాన్య ముదాహరతి సూర్యరాయేంద్రేతి. హే క్షితి పాలకాః అకర్కశ మక్రూరం కర్కశం భవతీతి కర్కశాయతే. లోహితాదిత్వాత్ క్యప్రత్యయః. వాక్యస్య ఇత్యాత్మనేపదం. సర్వత్ర కవినా వ్యంజనైకప్రవణేన భావ్యం అత్ర తు వాచ్యస్య వ్యంగ్యేన సహ సమప్రాధాన్యసంపాదనా ద్గుణీభావః ప్రాధాన్యస్య సందేహ సాదృశ్యయో స్సహృదయ ఏవ ప్రమాణం ఉద్ధతై రన్యథాతి వక్తుం శక్యత్వా దిత్యుక్తం భట్టగోపాలేన.

## కాక్వాక్షిప్తం యథా

శ్లో. మత్తోవదాధికాకాంతే
వాణీ లక్ష్మీ ర్వసుంధరా
సూర్యరాయవిభుం ప్రాజ్ఞో
గుణీయాం బహుమన్యతే.

వ్యాఖ్యానమ్:—

అత్ర వసుంధరా మదధికేతి కాకుకల్పనయా న భవతీతి వ్యంగ్యం. కాక్వాక్షిప్త ముదాహరతి మత్త ఇతి. యోజయతి అత్రేతి కాకుయోజనాయాం సర్వత్ర గుణీభూతవ్యంగ్యత్వే వేతి లోచనే గుణీభావా నౌచిత్యేన ప్రాధాన్యాద్ధ్వనిత్వ మితి కావ్యప్రకాశ కారః. ఆధిక్యనిషేధస్య వాచకాభావా త్కేవలవాచ్యసామర్థ్యలభ్య త్వేన వ్యంగ్యత్వం తస్య కాకుసంస్పర్శా ద్గూఢత్వాకృతచారుత్వాతి శయభంగేన గుణీభూతత్వ మేవే త్యవగంతవ్యమ్.

## అసుందరం యథా

శ్లో. సైన్యామోదితసూర్యరాయనృపతే సాటోపత్వహాస్త్రార్పితై
రుష్ణైషై ర్వసనై ర్విచిత్రవలయై రాకల్పితా స్స్వాః పురీః
భూయః క్ష్మాపతయః ప్రపద్య సచివై స్సార్థం సభా మాస్థితాః
సభ్యా స్స్వాత్సమితేః కథాభి రధికం విస్మేరయం త్యహో హామ్.

వ్యాఖ్యానమ్:—

అత్ర సాక్షా త్స్వహస్తార్పితై రిత్యనేన రాజసు సూర్యరాయ మహారాజానుగ్రహాతిశయసంపాదనం వ్యజ్యతే. తస్య చ పరరాజ సేవాగతత్వేన భూపాలానా మనుత్కర్షరూపత్వా ద్వాచ్యాపేక్షయా అసుందరత్వ మితి గుణీభూతవ్యంగ్యనిరూపణమ్.

అష్టమం భేద ముదాహరతి సైన్యేతి. సైన్య రామోదిత ప్తస్య సంబుద్ధిః హే సూర్యరాయనృపతే! సాక్షా త్త్వత్యక్షేణ స్వహస్తార్పితై స్స్వత్కరదత్తై రుష్ణీషై శ్శిరోవేష్టనైః ఆకల్పితా భూషితాః స్వాః పురీః నిజపురాణి ప్రపద్య యోజయతి. అత్రేతి.

## చిత్రమ్

మూ. చిత్రం తు శబ్దాలంకారచిత్రతయా బహువిధమ్
త త్ప్రపంచ స్త్వలంకారప్రకరణే భవిష్యతి.

ఏవం మధ్యమకావ్యం చ నిరూప్య చిత్రకావ్యనిరూపణాయ సంగతి మాహ చిత్ర మితి. చిత్రాలంకారనిరూపణస్య అలంకార ప్రకరణేఽ వసరత్వా న్నాత్ర నిరూప్య ఇత్యర్థః.

## అథ కైశిక్యాదయో నిరూప్యంతే

అథ సంగ్రహకారికోద్దేశక్రమప్రాప్తగుణదోషాదీ నుపేక్ష్య సూచీకటాహన్యాయేన వృత్తిత్వసామ్యాత్ శబ్దవృత్తినిరూపణానంత రంకైశిక్యాదినిరూపణం ప్రతిజానీతే. అథేతి.

## కైశికీ

శ్లో. అత్యంతసుకుమారార్థాసందర్భా కైశికీ మతా.

వ్యాఖ్యానమ్:—

కైశికీం లక్షయతి అత్యంతేతి స్పష్టమ్.

యథా

శ్లో. మధురగుణనికాయం కోవిదానాం విధేయమ్
రసికజనకులాయం రాజ్యలక్ష్మ్యా స్సహాయమ్
లలితమృదులకాయం సూర్యరాయం విలోక్య
స్మరశరవికృతాంగీ కాచి దానేల్లతాంగీ.

వ్యాఖ్యానమ్:—

కైశికీ ముదాహరతి మధురేతి. మధురాణాం గుణానాం నికాయం నిలయం. కోవిదానాం పండితానాం విధేయం. పండిత ప్రభుత్వా దితి భావః. రసికజనకుల మయతీతి తథోక్తం. అత్రలోకో త్తరరూపయౌవనరాసిక్యాద్యుద్దీపనవిభావై స్సూర్యరాయం కాచి దితి చాలంబనవిభావాభ్యాం స్మరశరనికృతాంగీత్యాదినాభివ్యజ్యవ్యభి చారీభావేన చ సంయుక్తః కోమలవర్ణసందర్భసహకృతైః ప్రతీయ మానో రససార్వభౌమ శ్శృంగారః మధురగుణనికాయ మిత్యాది వేంకటమహీపతి సూర్యరాయసార్వభౌమ విశేషణోచితతత్తద్గుణగరిమ గంభీరచతురలరనాయకవిషయతయా పరిపోషాతిభూమి మనుభవతీ త్యత్రేయం కైశికీ.

ఆ ర భ టీ

శ్లో. అత్యుద్ధతార్థసందర్భా వృత్తి రారభటీ స్మృతా.

ఆరభటీం లక్షయతి అత్యుద్ధతేతి.

యథా

(స్రగ్ధరావృత్తమ్) ఆకర్ణాకృష్టధన్వచ్యుతశితవిశిఖవ్రాతదాతాభియాతి
క్షుద్రక్ష్మాపాలవర్గై ర్ద్విదళితవపుషం మూర్ఛితం చిత్రభానుమ్
ఉద్బోధం ప్రాపయంతి ప్రతిభటకరిణస్సూర్యరాయేంద్రభిన్నా
ఘావంత స్సంప్రహారాత్సరభసవిచలత్కర్ణతాళానిలేన.

వ్యాఖ్యానమ్:—

ఆరభటీ ముదాహరతి ఆకర్ణేతి. ఆకర్ణం కర్ణపర్యంతం "ఆ ఙ్మర్యాదాభివిధ్యో" రిత్యవ్యయీభావః. ఆకృష్టం య ద్ధన్వచాపః తస్మాత్ చ్యుతశితవిశిఖవ్రాతేన ద్రాక్ ఛిన్నై రభియాతిక్షుద్ర భూపాలవర్గైః విదళితం వపు శ్శరీరం యస్య తం. అతఏవ మూర్ఛితం చిత్రభానుం సూర్యం "ద్వా విమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదినౌ పరివ్రా డ్యోగయుక్త శ్చ రణే చాపి హతో నృప" ఇతి స్మరణా దితి భావః. సూర్యరాయేంద్రభిన్నాః ప్రతిభటకరిణ స్సంప్ర హారా ద్ధావంత స్సంతః సరభసవిచలత్కర్ణతాళానిలేన కరణేన ఉద్బోధం ప్రాపయంతి నయంతి. అత్ర పురుషవర్ణవికటబంధేన రౌద్రబీభత్స రసాభివ్యక్తి రితీయ మారభటీ.

భా ర తీ

శ్లో. ఈషన్మృద్వర్థసందర్భా భారతీవృత్తి రిష్యతే.

భారతీవృత్తిం లక్షయతి ఈషదితి.

యథా

శ్లో. ప్రజ్ఞాయాం ధిషణో బలేఽనిలసుతో ధైర్యే సువర్ణాచలః
గాంభీర్యే సరితాంపతీ రిపుమదచ్ఛేదే పున ర్భార్గవః
సౌందర్యే సుమసాయక స్సురతరు ర్యాచ్ఞాగతార్థివ్రజే
శ్రీమద్వేంకటబసూర్యరాయనృపతి స్తస్మా న్న ధన్యో పరః.

వ్యాఖ్యానమ్:—

ఉదాహరతి ప్రజ్ఞాయా మితి. ధిషణో బ్రహ్మ బృహస్పతి ర్వా ధిషణౌ గురుధాతారా వితి భాస్కరః అనిలసుతో హనుమాన్ భీమసేనో వా సువర్ణాచలో మేరుః కైలాసో వా. "సువర్ణ కాంచనే రాష్యే కర్షమాత్రే ధనేఽపి" చేతి రుద్రః సరితాంపతి సముద్రః

వరుణో వా. భార్గవః పరశురామః మహాసేనో వా "భృగు ర్దైత్య గురౌ శంభౌ జమదగ్నిప్రపౌత్రయో" రితి రత్నమాలా. అత్ర మృదు వర్ణబంధేన అద్భుతరస ప్రతిపాదనా దియం భారతీ.

## సాత్వతీ

శ్లో. ఈష త్ప్రౌఢార్థసందర్భా సాత్వతీవృత్తి రుచ్యతే.
సాత్వతీం లక్షయతి ఈష దితి.

యథా

శ్లో. శ్రీమద్వేంకటసూర్యరాయవిభుసేనోదగ్రభీమధ్వన
ద్భేరీభాంకృతితర్జితా రిపునృపాః ప్రస్ఫీతకర్ణజ్వరాః
ధావంతో౽తిజవేన నష్టిభి రలం దుర్గే వనే కంటకై
రాకృష్టాంశుక కేశికా రిపుధియా సంప్రార్థయంతే తరూన్.

వ్యాఖ్యానమ్ —

ఉదాహరతి శ్రీమదితి. శ్రీమద్వేంకటసూర్యరాయవిభో స్సేనాయాంఉదగ్రభీమధ్వనద్భేరీభాంకృతిభీస్తర్జితాః ప్రస్ఫీతకర్ణజ్వరాః రిపునృపాస్సష్టిభి ర్నష్టై రల మతిజవేన ధావంత స్సంతః దుర్గే గంతు మశక్యేవనే కంటకై రాకృష్టా అంశుక కేశికా వసనశిఖా యేషాం తే తథోక్తాస్సంతః రిపుధియా శత్రవ ఇతి బుద్ధ్యా తరూన్ కంటకతరూన్ అలం ప్రార్థయంతే. అత్ర అవికటబంధపరుషవర్ణసందర్భేణ భయాన కప్రతిపాదనా దియం సాత్వతీ.

## మధ్యమకైశికీ మధ్యమారభటీ

శ్లో. మృద్వర్థే౽ప్యవతిప్రౌఢబంధా మధ్యమకైశికీ
మధ్యమారభటీ ప్రౌఢేప్యర్థేనాతిమృదుక్రమా.

వ్యాఖ్యానమ్:—

భంగ్యంతరేణ సర్వరససాధారణం వృత్తిద్వయ మాహ మృద్వి

త్యాదినా. అనయోః క్రమేణ శేషతోఽమలేషత్ప్రౌఢయో రతిప్రౌఢాతికోమలరసానుప్రవేశో న విరోధాయ భవతి.

### మధ్యమకైశికీ యథా

శ్లో. నేతా వేంకటసూర్యారాట్త్వన మమాప్యేతాదృశైస్సంభ్రమై
రన్యా అప్యనురంజయత్యనుదినం భూయః ప్రియంభావుకః
శౌర్యే తే కిమిదం మదేన మహతాలాపే కిముజ్జృంభసే
త్వం మాం పశ్యసి తాదృశీతి కలహోఽయం తేఽఖిలామయః.

వ్యాఖ్యానమ్:—

మధ్యమకైశికీముదాహరతి నేతేతి. ప్రియో భవతీతి ప్రియంభావుకః "కర్తరిభువ" ఇతి ఖుకఞ్ప్రత్యయే ముమాగమః. అత్ర ఈషత్ప్రౌఢసందర్భేణ శృంగారసంకీర్ణకరుణో రసః ప్రతిపాద్యత ఇతీయం మధ్యమకైశికీ.

### మధ్యమారభటీ యథా

శ్లో. ఆజానేయఖురక్షుణ్ణక్షోదరజోభరః
సూర్యరాయవిభో స్సప్త పంకిలా న్యకరోత్తేఽంబునీన్.

వ్యాఖ్యానమ్:—

మధ్యమారభటీ ముదాహరతి. ఆజానేయేతి. ఆజానేయా మహాకులప్రసూతా వాజినః. "ఆజానేయాః కులీనా స్స్యు" రిత్యమరః. అత్ర ఈషన్మృదుసందర్భేణ బీభత్సో వర్ణిత ఇతీయం మధ్యమారభటీ.

### అథ మత్ర వివేకః

మూలమ్:—

వైదర్భ్యాదీనాం శబ్దగుణాశ్రితానామర్థవిశేషనిరపేక్షతయా కేవలసందర్భ సౌకుమార్యప్రౌఢత్వమాత్రవిషయత్వాత్కైశిక్యాదినో

తిమిరములు జాఱ దిక్కులఁ దెలివి చేరఁ
గుముదములు నిక్క మదచకోరములు సొక్క. 66

సీ. గగనతాపసవరాగ్రప్రతిష్ఠితసుభా
కరగురుస్ఫటికలింగం బనంగ
వ్యోమసౌధవిటంకసీమాంతరాధిష్ఠి
తశ్వేతపారావతం బనంగ
నంతరిక్షసుధార్ణవాభ్యంతరోద్ధశా
శ్వేతదక్షిణావర్తశంఖ మనఁగ
నాకాశధాతువారారూఢబుద్ధిమ
జ్జటిలాత్తనవరసఘుటిక యనఁగ

గీ. నభ్రదర్వీకరప్రభూతాండ మనఁగ
నరుణరుచి వాసి యుదయాచలాగ్రశిఖర
సితమణిద్యుతితో నొప్పె శీతకరుఁడు
చిఱుతవెన్నెల దిక్కులఁ జెంగలింప. 67

చ. స్మరుధవళాతపత్రమొ నిశాయమునాపులినంబొ ప్రాగ్దిశా
సరసిజలోచనాకరవిసారిసితాంబురుహంబొ నిర్జరే
శ్వరగజరాజకుంభమొ ప్రశంస యొనర్పఁగ నంచు భూజనుల్
సరసిజవైరిఁ గాంచి మది సంతస మందుచు నుండి రయ్యెడన్. 68

గీ. అంక మొప్ప నిశాకరుం డపుడు మెఱసెఁ
జెలఁగి మన్మథపట్టాభిషేకమునకుఁ
బ్రచురరుచిఁ బొల్చు దూర్వాంకురములతోడ
నమరు కలధౌతపూర్ణకుంభమొ యనంగ. 69

చ. విరహకృశానుశాప్యకృతవృత్తము మన్మథబాణఘర్షణ
స్ఫురదురువజ్రశాణము విశుద్ధమనుష్యమనోమరాళసం

చరణమనోజ్ఞసైకతము సాధునిరీక్షణపుష్పలిట్సితాం
బురుహము చంద్రబింబము సముజ్జ్వలవైఖరి నొప్పె నయ్యెడన్. 70

లయగ్రాహి.
తోరమగుసమ్మదముతో రమణుఁ గూడి తమ
కోరికలు దీఱఁగ జకోరిక లభీష్టా
హారములు గైకొని విహారములు సల్పఁ దని
వారనితమి న్విటుల వారయువతీశ్రం
గారములఁ జెన్నగు నగారములపొంతలకుఁ
దార మకరధ్వజుఁ డుదారగతి బాణా
సారములు గూర్పఁగ రసారమణిమేన సొబ
గై రజతశాటి యనఁ గైరవి చెలంగెన్. 71

వ. ఆసమయంబున. 72

సీ. అతులార్కమణిశిఖచితానర్ఘతరతప్త
హాటకచషకాంతరార్పితంబు
పానగోష్ఠీరతమానినీతనులతా
ప్రాకామ్యదత్తసౌరభగుణంబు
కలశపారావారగర్భసంభూతసు
ధారసదాయాదతానుతంబు
పుంభావరతికళారంభజృంభితసుద
తీజనమన్మథోద్దీపనంబు

గీ. నగుచుఁ జేరెన్ని కైన దివ్యాసవంబు
సమయ మిది కొనుఁ డనుచును సఖులు దెచ్చి
మదిని భయమును భక్తియుఁ గదుర నెదుర
నిడినఁ జేకొని త్రావుచు నింపుముఖులు. 73

మ. ఇది కర్పూరసుగంధబంధురము భోగేచ్ఛానుకూలంబు ను
న్మదకాంతాపురుషాయితోల్లసనకృన్మారప్రతాపస్థిరా
భ్యుదయప్రాప్తధనంబు సుమ్మనుచుఁ దామున్ద్రాఁడుచుం గాంతునిం
గదియం జేరి యొసంగి రామదిర వేడ్కన్నెచ్చెలు ల్పాచ్చెడఁగన్.

కం. మది ముద మొదవఁగ మదిరా
మదకారణజనితమత్తమత్తదృగంచ
ద్వదనారవింద యగు నొక
మదవతి పతియెదుర నిలిచె మాద్యద్విభతోన్. 76

ఉ. కన్నులు చుట్టు వైదువులకై వడిఁ ద్రిప్పుచు గొప్పకప్రపుం
దిన్నెలఁ జిన్నిపాదములు దీకొన నాడుచు సన్నసన్నఁగా
బన్నసరంబు లూఁగ వెడపాటలు పాడుచు నుండ నొక్కకాం
త నన్నరుఁ డొక్కరుండు ప్రమదంబునఁ గాఁగిటఁ జేర్చె నత్తఱిన్.

వ. వెండియుం బండువెన్నెలలు పుండరీకభవాండంబు నిండి కుండలి
కుండ లాఖండల వేదండ సితాండజ డిండీర పాండు రాఖండరుచి
మండితంబు లై దిక్కాంతాకుంతలాంత నితాంత సంక్రాంత
మల్లీలతాంత కాంతికాంతంబు లై సాయంతన నటనాచటుల
చిరంతన జటిల జటాపటలఘటిత మందాకినీవాఃపూరంబులకై వడిఁ
గైరవబంధు బంధురకర పరిస్రవత్సుధాసారాకారంబున ధారుణీ
భాగంబు గప్పెనో యన నలరుచు యామినీభామినికి సమయవిధి
వశసంప్రాప్తం బగు చీకటిసోఁకు దయ్యంబు విడుచుటకు రాజ
మహాయోగి నభఃపత్రంబునఁ గర్పూరగౌరనక్షత్రాక్షరచక్రంబు
వ్రాసి యభిమంత్రితభూతి దెసలం జల్లఁ బెల్లెగసి దివి నల్లు
కొనెనో యన వెల్లివిరియుచు మానవతుల మానధనంబు కొల్లగొన
నుల్లంబున నుద్యోగించి చంచరీకఝుంకారగుణధ్వనులు మొఱయఁ
దుంటవిల్తుంటపూవింటం దూపు లొనఁగూర్చి పేర్చి యార్చి

విజృంభించి జగజ్జయంబు గాంచుట నుద్భవించిన జయోందర మంద
స్మితకందళంబులచందంబున నందంబులై మెఱయుచుఁ గుంద
బృంద చందన మందార సంపెంగవనీలతానికుంజంబులం బ్రియులం
దామ కందర్పక్రీడల నభినందించుచుఁ జంచలాక్షుల కుచాంచలం
బుల కంచితకర్పూరసుగంధచర్చలై పొడలుచు సాంద్రతరచంద్ర
కాంతకుట్టిమాట్టాలకసౌధవీథులం జాణలు హాలాలోలలీలల స్ఫేలు
తఱి హేలావతులచేలంబు లూడిసిన బేలతనంబున నుండు నబ్బా
లికలకుం దుకూలంబులై మించుచు మధుర మధురసభరిత కుముద
సముదయ చకచకలం బ్రకటింపుచు మహౌషధి దీపశిఖాదీపిత
పల్లవశయనసముల్లసత్పల్లవంబు లగు మందార వంశాల కుంజంబు
లకుం జను జ్యోత్స్నాభిసారికామంజువాణుల కంజలోచనధళ
ధళల నొరవట్టుచు దండతండంబులై పిండి యారఁబోసిన చందం
బున నుండఁ జకోరికల కోరికలు దీఱఁ జక్క నకవ లుక్కచెడి
వెక్కసంబుగ నొక్కవడిం గూఁత లిడుచు విరహావేదనం జక్క-
పెక్కు తెఱంగులం జొక్కంబులై యెక్కడం గాంచిన నక్కడం
గల వృషశైలవాహినీవ్రాతంబులు వృషభశైలాసగంగాప్రవా
హంబుల ననుకరింప నరవరు లెల్ల శంకరసామీప్యంబునం బొదల
జగంబు శ్వేతద్వీపరూపంబునం దీపింప నట్టిమోహ నయ్యంబుమున
కందర్పదశావశ యగుచుఁ జెలిమికత్తియలం గికురించి శృంగార
వనంబు చేరం జని. 77

చ. నెల వెదచల్లువెన్నెలకు నిర్దయుఁడై మరుఁ డేయు పుష్పము
లుక్కలకు వియోగనీజనము గుండెలు ఝల్లనఁ గూయు గండుకో
యిలకు మధువ్రతాదులకు హెచ్చరికం గలహించి పల్కుచి
ల్కలకుఁ దలంకి యాకలువకంటి వనావని సాహసంబునన్. 78

సీ. విపరాకుప్ల కైముప్పు తెగువతోఁ జేఁబూని
తమకించి యురమునఁ దాల్చఁ దలఁచు
విరహాలికృశత భావింపక శమనది
క్ప్లవనంబులో డిల్లపడక నడుచుఁ
గన్నెఱఁ జేసి కూఁకలు వేయుగయ్యాళి
కోయిలఁ గని యెదుర్కొనఁ దలంచు
మరుతుపాకీగుండ్లమాడ్కి రింగున వచ్చు
కొదమతుమ్మెదలకు నెదుర నేఁగు

గీ. జలుఁగుఁజెంగావిచీరచే నలవరించు
కొనుచు వెన్నెలవెల్లిలో మునుఁగఁ బోవుఁ
గటకటా ! గాఢమోహాంధకారవశతఁ
దమి మనంబున నాటి యుత్తలిరుఁబోఁడి.

వ. ఇవ్విధంబున జవ్వని యవ్వనిం బరిభ్రమించునెడ నబ్బిత్తరిచెలి
కత్తియ లత్తరుణిం గానక చిత్తంబునం దత్తఱిలి యత్తఱి.

ఉ. మేడలఁ జంద్రశాలికల మిద్దెల బావులక్రేవ క్రోవలం
గ్రీడ లొనర్చు చెంగలువరేకులు గప్పినచప్పరాల బ
ల్మ్రకువులన్ దగ న్వెదకి మానవతుల్ చెలిఁ జూడ కంతటన్
జాడలు వట్టి కన్గొనిరి జవ్వనిఁ బువ్వులతోఁటలోపలన్.

క. అం బతివఁ గనిరి సకియలు
మందస్మితవదన మదనమంజరి వాచా
నందిత నృపసుందరి య
య్యిందుముఖిం గలయఁజూచి యిట్లని పలికెన్.

ఉ. ఒప్పులకుప్ప నీ వికట నొంటిఁ జరింతువె యెందుఁ జూచినం
బుప్పొడితిప్ప లీరములుఁ బువ్వులతేనియవాఁక లయ్యయో

చెప్పఁగరాదుగా మధుపచేష్టలు మారుగుజాలు వోఁజులుం
గప్పుచు వచ్చుఁ దారసిలుఁ గాలునిదిక్కునుండి తెమ్మెరల్.

చ. వలువనిసాహసంబు తగువా మగువా యిటు లొంటిఁ దోఁటలో
నిలుతురె కల్గనేరుచున నెమ్మికి నెమ్మ మదాళులే మదా
ళులు కలకంఠులే వనములోఁ గలకంఠులు నక్కటక్కటా
తెలియవుగాక యిందుఁ గడతేరుదురే యబలావళుల్ సఖీ. 84

వ. అని యివ్విధంబునం బలుకు మదనమంజరిపలుకు లాలించి యంత
నయ్యింతి కాంతవకుంతాక్రాంతనితాంతతాంతానన యగుచు
మనోభవమనోభవజ్వరపరితాపంబున నుస్సు రనుచుఁ జెలులం
జీరి యభిప్రాయంబు తెల్లంబుగాఁ దెలిపి వేర్వేఱ నో మదనమంజరి
యో యనంగరేఖ యో వసంతసేన యో తరంగవతి యో మదన
మాలిని యో రాగలేఖ యో యూధిక యో కాంతిమతి యో చిత్ర
లేఖ యనుచుఁ బేరుపేరం బిలిచి విరహవేదనాపనోద మేదుర
వినోదవాద కథాసాదర శిశిరోపచారంబులచేఁ దన్ను నిర్వహిం
చుం డనుచు మధు మదన మలయానిలంబుల మాటికిం దూరుచుఁ
గుసుమకిసలయమంజులవంజులనికుంజపుంజంబులకుం దారుచు విర
హాగ్రస్తయుం బోలెఁ గుసుమబాణబాణజర్జరితయుం బోలె శృం
గారభావనావిషఘూర్ణితయుం బోలె యౌవనరాసి తరల తరతరంగ
పరంపరాపరివృతయుం బోలె ననురాగరజ్జుపరివారితయుం బోలె
మలయానిలోద్ధూతచైతన్యం బోలె మూర్ఛాగృహీతయుం బోలె
నున్నం గని తత్సఖీపరివారం బట్టియెడ. 85

సీ. వికచారవిందమాధ్వీకఝరీపూర
వారితకాసారతీరములను
గర్పూరకదళికాకాననాభ్యంతర
ఘనసారనిర్మితాంగణములకడ

మలయమరున్నటచ్చలపల్లవోల్లస
చ్చందనభూరుహచ్ఛాయలందుఁ
జంద్రకాంతోపలస్థలగళద్వారిధా
రాయంత్రశిశిరధరాతలములఁ

గీ. కుసుమకిసలయవిసరసత్కుంజములను
నచట నచట నొకింతప్రొద్దాలతాంగి
నుంచి సకియలు భయమునఁ బంచశరుని
కించుదనమునకును దమకించి మఱియు. 86

సీ. ఘనమోహకలుష మయ్యెను నాతిమానసం
బరయఁ జందనపంక మలదరాదు
మదనాగ్ని సోఁకెను సుదతి మైదీఁగపై
మలయానిలంబు మేల్కొలుపరాదు
రాజయోగముఁ గోరు రమణిదృక్కుముదము
ల్దవిలి పద్మాప్తుతఁ దలఁచరాదు
ఇనునిఁ జింతించు జవ్వనిమోముకెందమ్మిఁ
బంపువెన్నెలపాలు పఱచరాదు

గీ. చటులమకరాంకశరజాతజాతభీతి
విరహవిషపూరమున సుడి దిరిగి తిరిగి
దరి గనుంగొనలేని సుందరిని జూచి
జడధి నీ కబ్బె నని భీతి సలుపరాదు. 87

కం. అని వనజనయన లనయము
మదమునఁ బెనుభీతి దనరు మదిరాక్షిని సాం
త్వనవచనరచన దినమ
బ్దనిభంబుగఁ గడపి రొకవిధంబున నంతన్. 88

గీ. విరహజలరాశిఁ దరియించు వెరవు లేక
మానినీమణి నిజసఖీమండలంబు
గొలువఁ బూఁబాన్పుపై మేను నిలిపి చంద్రు
మనసిజాదులఁ గినుక నిట్లనియె నపుడు.

సీ. దోషాకరసమాఖ్యతో నుండుటయె కాదు
సత్ప్రభాహరణంబు సలిపినావు
సత్ప్రభాహరణంబు సలుపుటయే కాదు
చెలియలింటికిఁ గీడుఁ దలఁచినావు
చెలియలింటికిఁ గీడుఁ దలఁచుటయే కాదు
కుముదాశ్రయాకృతి నమరినావు
కుముదాశ్రయాకృతి నమరుటయే కాదు
రాకాసివై మిన్ను బ్రాఁకినావు

గీ. ఇంతరాజవు నిను మెచ్చ నెవరితరము
విరహిణీమారణోద్యోగవిభవ మెల్ల
నీకె చేకూడె మాదృశలోకపూర్వ
జన్మదుష్కర్మవశమున శర్వరీశ.

చ. కినుక శశాంకమౌళి యనికిం జనుదెంచిననాఁడు పాండుసూ
దనుఁ డలగాండివంబు గొని తాఁకిన నవ్విభుమస్తకాగ్రమం
టినహాతి నీకుఁ దప్పుట గణింపఁగ నోహరిణాంక మస్తకా
భినవమహోఘశక్తి యని పేర్కొనరాదె ధరాతలంబునన్.

సీ. విషరాశిలో నుద్భవించుట యుండఁగా
నొకవేళ వక్రత నొందరాదె
సత్సమూహంబు తేజము గొంటఁ దలఁచిన
దోషాకరుం డని తోఁచరాదె

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

అధ్యక్షులు

గణ్యకాంగ్రెసు, ఐతిహాసిక సమ్రాట్టు

శ్రీ బండారు తమ్మయ్య

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి

అభినవభోజ

శ్రీ దంటు భాస్కరరావు

సహాయ కార్యదర్శి

శ్రీ గువ్వ్యాల సూర్యనారాయణశాస్త్రి

కార్యనిర్వాహక వర్గ సభ్యులు

1. శ్రీ కోటా శివనాథశాస్త్రి
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ గిలకంగల పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిసూర్యాస్య, ప్రౌఢకవిచంద్ర)
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు
6. శ్రీ జమ్ముంగి బుచ్చిరామశర్మ
7. శ్రీ చికనోలు కోటీశ్వరరావు
8. శ్రీ దామెర రాజగోపాలరావు, బి. ఏ.
9. శ్రీ వేదుల రామచంద్రమూర్తి, ఎమ్. ఏ. (ఆనర్సు)
10. శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)
11. శ్రీ కానలి శ్రీరామమూర్తి, బి. ఏ. బి. ఎల్.

పత్రికా సంపాదకుడు

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | |
|---|---|
| 5వ సంపుటము | రు. 15—00 |
| 6వ సంపుటము | 15—00 |
| 7వ సంపుటము | 15—00 |

**1-4** సంపుటములు పునర్ముద్రణములు గావింపబడుచున్నవి.

ప్రతియొక్కటికి వెల రు 15 లు

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కుపాఠభేదములతోఁ గూడిన వెనుకటి విషయు మంతయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణ పీఠికతో ముద్రితమైనది వెల రు 1—50

## మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము మూల్యము రు. 2—50

ఆంధ్రసాహిత్యపరిషత్తు,

కాకినాడ.

Printed by J. Gopalam, B.A.L.T., at Republic Press, Kakinada.
Edited by **K. ISWARADUTT**
Published by Andhra Sahitya Parishat, Kakinada.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

వ్యవస్థాపకులు:

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు:

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు

ఉద్ధారకులు:

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక

[illegible] ఆశ్వయుజ - పుష్యములు

[illegible]ము 54: : : సంచికలు 4-5

సంపాదకుడు : శ్రీ కుందూరి ఈశ్వరదత్తు

విషయసూచిక

# సంపాదకీయము.

## భారతమహాప్రధాని లాల్ బహదర్-శాస్త్రి నిర్యాణము

నిర్ధనుఁడై జనించి నీతి నియమములకుఁ గట్టువడి, నిర్మలహృదయుఁడై, దేశసేవానిరతుఁడై, భారతమహాప్రధాన పదవి నధిష్ఠించి, నిష్కళంక చిత్తుఁడై, భారతపాకిస్థాను దేశాలమధ్య ప్రభవించిన కాశ్మీరసమస్యా పరిష్కారమునకు నిశ్చితోద్యోగుఁడై నిర్యాణమును గాంచిన నిరాడంబర జీవికి, మా జోహార్లు.

## పత్రికాప్రచురణము.

పత్రికాసంపాదకుని సామర్థ్యము - ముద్రాపకుల సహకారము, సాహిత్యవేత్తల సాహాయ్యము మూఁడును గలసివచ్చినగాని పత్రికా నిర్వహణము దుర్ఘటము. పై మూఁడిటిలో నేది మృగ్యమైనను కష్టమే మూఁడును మృగ్యమైనచో వచ్చు ముప్పు చెప్పవలవిగాదు. సాహిత్య పత్రికల నిర్వహించుట యొకనిశరముగాను. తప్పులు కుప్పలుగాఁ బడుచున్నవి. క్షమాపణ.

లాల్ బహదుర్ శాస్త్రిగారి ప్రతికృతి ఫలకము అడిగినవెంటనే పంపించిన ఆంధ్రప్రభా పత్రికాసంపాదకులకు మా నమస్కృతి. అట్లే. మదరాసు మెయిల్ పత్రికలోని మహాభారతమును గూర్చి వ్రాసిన వ్యాసము కోరినవెంటనే పంపించినందులకు పత్రికాసంపాదకులకు నమస్కారములు.

## FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars about the journal Andhra Sahitya Parishat Patrika.

| | | | |
|---|---|---|---|
| 1. | Place of publication | ... | Ramaraopet. Kakinada. |
| 2. | Date of its publication | ... | Bi-monthly |
| 3. | Printer's Name | ... | J. Gopalam |
| | Nationality | ... | Indian. Republic Press |
| | Address | ... | Main Road, Kakinada. |
| 4. | Publisher's Name | ... | Andhra Sahitya Parishat |
| | Nationality | ... | |
| | Address | ... | Ramaraopet, Kakinada. |
| 5. | Editor's Name | .. | K Iswaradutt |
| | Nationality | ... | Indian |
| | Address | ... | Gandhinagar, Kakinada. |
| 6. | Name and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent | ... | Andhra sahitya Parishat<br>No partners |

I, K. ISWARADUTT hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

K. ISWARADUTT
For Andhra Sahitya Parishat.

# లక్షణసారసంగ్రహము

## అను

## (సులక్షణసారము)

[గత సంచిక తరువాయి]

సీ॥ శ్రీ వైష్ణవహితుండఁ జిక్కయ భట్టరు
శిష్యుఁడ గవితావిశేష శేష
తులితసర్వార్యపౌత్రుఁడ, లక్ష్మణయకుఁ ది
మ్మాంబకు సుతుఁడ, వీరనకు, మార
నకు, రామకవివర్యునకు ననుజన్ముఁడ;
నా రామకవి చెప్పినట్టి మహిత
మత్స్యపురాణ, వామనపురాణాది స
త్కవితలకెల్ల లేఖకుఁడ, వృద్ధ

గీ॥ కుంతికాతీరలింగమగుంటనామ
షట్స్థితికుఁడ, సౌభాగ్యయుతుఁడ,
నాదిశాఖాప్రవర్తన నమరువాఁడఁ,
గాశ్యపసగోత్రుఁడను, దిమ్మకవిని నేను. 2

క॥ లక్షణశాస్త్రము లెల్లఁ బ
రీక్షింగమటఁ గొంతకొంత యెఱిఁగినవాఁడన్,
లాక్షిణికానుగ్రహిత సు
లక్షణసారంబొనర్తు లక్ష్యము లమరన్. 3

తే॥గీ॥ కొండ తెంచు లక్షణములు కొండ తెంచ,
రండఱును నెంచినవి కొన్ని, యవియునవియు
దొరయఁగాఁ గూర్చి కవిసమ్మతులను వ్రాయు
దొకటికొక్కటి సంస్కృతాంధ్రోక్తు లెనయ.

తే।గీ। "గ్రంథసామగ్రి గంబగుటఁ బ్రతిపదమున
కన్నిలక్షణములు వ్రాయుఁ" డనిన నందు
గ్రంథవిస్తార మగుఁగానఁ గవిత సూక్ష్మ
మెన్నిటను బొందుపడు నన్నియే లిఖంతు. 5

1. అవతారిక

సాహిత్యరత్నాకరే-

శ్లో॥ ఛందోజ్ఞానమిదం పురాత్రిణయనాల్లేభే గుహః సంగ్రాహః
తస్మాత్ప్రాప సనత్కుమారక? స్తతోఽగస్త్య స్తతో వాక్పతి
తస్మాద్దేవపతి స్తతః ఫణిపతి స్తస్యానుజః పింగళ
స్తచ్ఛిష్యైర్మునిభి ర్మహాత్మభిరిదం భూమహా ప్రతిష్ఠాపితమ్. 6

ఆంధ్రభాషాయామ్ అథర్వణఛందసి-

ఆ।వె। ఇందుమౌళివలన నందిగాంచిన ఛంద
మెలమిఁ జదివి రొకరివలన నొకరు
లలి సనత్కుమార కలశజ జీవ వృ
త్రారి శేష పింగళాఖ్యు లొలి. 7

అథాంధావసే (?) -

క॥ గంగాధర విపులకృపా
పాంగ సుధాపూరసని సిద్ధపావనదేహున్
పింగళనాగేంద్రుని ముని
పుంగవసన్నుతుని సుకవిపూజ్యునిఁ దలఁతున్. 8

2. గణసంఖ్యా.

కవికంఠపాశే-

తతోమ్యారస్తభ జ్నాభ్యాగణాస్సు (స్తేసు) ప్రకీర్తితాః 9

---

6. ఆనందరంగరాచ్ఛందములో 22వ పద్యమునకు పిమ్మట నున్నది

7. ఆ. రం. ఛం. లో అ 1 ప 23

కవిరాజగజాంకుశే-

క॥ ఒనరగ మ, య, ర, స, త, భ, జ, న
లన నివి యెనిమిది గణంబులని సత్కృపతో
నెనసినమతిఁ బింగళునకు
మనసిజ (తను) మథనుఁ డాగమంబులఁ దెలిపెన్. 10

3. గణోత్పత్తిః

చమత్కార చంద్రికాయామ్-

మయరసతభజన సంజ్ఞాః ప్రసూతాః 11

ఆంధ్ర భాషాయామ్-ఉత్తమగండ ఛందసి-

ఆ॥వె॥ చంద్రసూర్యవహ్ని చక్షుఁడౌ రుద్రుని
మూఁడుకన్నులందు మూఁడుగురువు
లుదయమయ్యెదాన నొప్పారె మగణంబు
అందు సప్తగణము లవతరించె. 12

కావ్యచింతామణి— తాతంభట్టు.

క॥ మగణము వలనన్ యగణము
యగణమువలనన్ జనించె నా రగణమ్మా
రగణమువలనన్ సగణము
సగణంబునను తగణంబు జననంబయ్యెన్. 13

క॥ తావలన జగణ మయ్యెన్
జావలనన్ భగణమయ్యె ఛందోగతి నా
భావలన నగణ మయ్యెను
భావింపగ జనకజన్యభావము గాఁగన్. 14

---

10. సులక్షణసారములో 246వ పద్యము

12. సు. సా. లో 245వ పద్యము- ఇది భీమకవికృత మని ఇతర పుస్తకములలోఁ జెప్పబడినది పొరపా టనవచ్చును.

13. సు. సా. లో 247 వది

14. సు. సా. లో 248 వది

క॥ అది గాన తల్లిదండ్రుల
కొదువను వైరమ్మటంచు నొనరఁగ సుకవుల్
కొదుకక బంధుగణంబుల
గదియించుచు రసలు దక్కఁగావ్య ముఖమునన్. 15

కవిసర్వగారుడే-

సీ॥ జయవిజయంబులు శంఖ మహాశంఖ
ములనంగఁ బొగటిజాల్వేలయుచుండు
రాత్రి జిత్రాత్రమనై రామసుప్తపరిసు
ప్తంబులుననియును బరగుచుండు
నీయెనిమిది జాలఁబాయక మగణాది
గా జనించె గణాష్టకంబు నరుస
నేజామునను గావ్యఁ డెలమిగబ్బంబును
విదళింపఁబూను నవ్వేళయందు

తే॥ నుద్భవంబై నగణము ప్రయోగమునకు
శుద్ధిగాఁగూర్ప కురక విజ్ఞోడుపడఁగ
గణము లూహించికూర్చు విశారికుకవి
పద్యమొల్లఁడు బ్రతుకాశపడఁడు వాఁడు. 16

4. గణానాం గురులఘుసంజ్ఞా.

వృత్తరత్నాకరే-

ఆదిమధ్యావసానేషు యరతా యాంతి లాఘవమ్,
భజసా గౌరవంయాంతి మనౌతు గురులాఘవమ్. 17

ఆంధ్రభాషాయాం-గోకర్ణచ్ఛందసి-

---

15. సు. సా. లో 249 వది

16. సు. సా. లో 261 వది- ఆనందరంగరాట్ఛందములో అ 1 ప 15- ౦లిగాఁ౦ అనిగాక ౦లిగాడి (= వెనుకఁబడిన వాఁడు) అను నర్థము కూష్పగో దావరి జిల్లాలో వాడుకలో గలదు.

17. ఆ. రం. ఛం. లో- అ 1 శ్లో 30

క॥ మొదల నడుమఁ దుదిఁ లఘువులు
వదలవు యరతలకు, వానివరుసనె భజసల్
విదితంబులు గురువులు తా
మొదలనడుమ మసలకేసఁగు, మొగి గురులఘువుల్. 18

విన్నకోట పెద్దిరాజు-

క॥ గురులఘువులు గలమగు; లఘు
గురులు, గురులఘువులు నెన్నికొన వహములగున్,
గురులఘువులు త్రితయములై
మురువుననవి మగణ నగణము లనఁగఁ బరగున్. 19

ఆ॥ వె॥ మగణరచన నాది మధ్యాంతలఘువులు
గలిగెనేని యరత గణములయ్యె;
నగణరచన మొదల నడుమను మఱిగురువు
లుండెనేని భ జ స లొప్పుమిగులు. 20

## 5. ఫలితార్థము

క॥ గలు గురులఘువులవియె ను
నలకు తటభయలు కాది నడుమచేర బకా
వలన తలను కడ సుఖముల
నిలు హావలకునిల్పు గణములన్నియు రామా! 21

గణాలు కల్పించే విధము-
'గ' ఇది గురువు. ఇవి రెండైతే 'గా' గణం.
'లు' ఇవి రెండైతే లలం.
వగణం । ∪ . ఇది లగ మనిపించికొనును. హగణం ∪ ।
ఇదే గల మనిపించికొనును.

---

19. విన్నకోట పెద్దిరాజు కావ్యాలంకారచూడామణి ఆ 7 ప 19
20. కా. చూ. ఆ 7 ప 20
21. ఇది తిప్పుల పద్యము- కాని రామసంబుద్ధిచేత లింగమునుంట తిమ్మకవికృత మని గుఱుతుపడుచున్నది

ఇంక ప్రధాన గణాలకు-

| | | | |
|---|---|---|---|
| మగణం | U U U | జగణం | I U I |
| యగణం | I U U | భగణం | U I I |
| రగణం | U I U | సగణం | I I U |
| తగణం | U U I | నగణం | I I I |

6. ఇంక అక్షరజాతులకువచ్చేగణాలకు ప్రస్తారము-

అనంత ఛందస్సు-

క॥ చాలుగను స్వరగురులిడి
లాలితముగ గురువుక్రింద లఘువు వెలుపలన్
ఓలి సమంబును దాపలి
వ్రాలునకు గురువుల నిలుపఁ బ్రస్తారమగున్. 22

క॥ ద్విత్రి చతుర్గురు భవములు
ధాత్రీధవ! రెండు దక్క తక్కినగణముల్
మిత్రేంద్ర చంద్రు లనఁదగు
మాత్రాదిగణంబు మొదలమాత్ర నిలుపగన్. 23

ఇందుకు టీక * ( — )

ఇందుకు పద్యము-

క॥ గల, నగణము లినుఁ డిందుఁడు
నల, నగ, సల, భర, త; లింక నగగ, సవ, సలా
భల, భగురు, మలఘు, సవ, సహా,
తల, రల, నవ, నలల, రగురు, తగ సింద్రుఁ డజా! 24

---

22. ఇది అచ్చుపడ్డ సులక్షణసారములో లేదు- అ. రం. ఛం. అ 1 ప 55.

23. అనంతుని ఛందోదర్పణము అ 1 ప 18- సు. సా. లో ప 30

* కొన్ని యక్షరములు బొత్తిగాఁ దెలియుటలేదు- కాన కాపీ చేయఁబడలేదు.

24. ఇది కూడ అనంతుని ఛందములోనిదె- సు-సా-లో ప 21

కవిసర్పగారుడే-

మ॥ ధరదైవంబు గ్రహంబు సౌమ్యుఁడు హరిద్వర్ణంబు నత్యంతి యా
సురమూహింపగణంబు జాతి దలపించున్ శౌద్రియా యోని దా
హారిణం బుజ్వలతార జ్యేష్ఠరస ముద్యద్రౌద్రమూ రాశి తే
లు భద్రంబు ఫలంబు నామగణ మింపొందున్
బుధస్తుత్యమై. 27

ఉత్తమగండ ఛందసి-

క॥ దరణిజ శశిరవి బుధగురు
సురరిపు గురుమందఫణులు సారిది గ్రహంబుల్
పొరి మ భ జ స న య ర త గ ణ
సరణికి ఛందోమతంబు చర్చింపంగన్. 28

గోకర్ణ ఛందసి-

గీ॥ కాశ్యపాత్రిపైశ్య కౌశిక గౌతమ
యలవసిష్ఠ భార్గవాంగిరసులు
మహితగోత్ర ఋషులు మ య ర స త భ జ న
తిట్లు నెనిమిదిగణములకెన్నఁబడును. 29

టీక. ఫలం భద్రం, రాశి వృశ్చికం, హరిణ యోని. హారి దర్ణ్నా, జ్యేష్ఠా నక్షత్రం, గ్రహం బుధుం డితఁడు సువర్ణ ఛాయ, శూద్ర జాతి, రౌద్ర రసం, దైత్య గణం. అధిదేవత భూమి,

---

27- ఆ-రం-ఛం- అ 2 ప 9

28- ఇది భీమనకృతమని దలచి కవిజనాశ్రయములోఁ జేర్చబడినది- ఆంధ్రసాహిత్య పరిషత్తువారి కవిజనాశ్రయము- సంజ్ఞా ప 27

29- తాటాకుప్రతిలో
మహితగోత్ర ఋషులు మయరసతబ్రభలు
కిట్లన గణమునకు నెన్నబడదు
అని తప్పుగా నుండగా బైనఁజెప్పిన విధముగా సవరించితిని- కొంత పోలికతో నీ పద్యము ఆం-సా-ప- వారి కవిజ సంజ్ఞా 29 ప గా నున్నది

కాశ్యపస గోత్రం, జననం జయనామ యామలో మొదటి
జాముస. భీమన మతం గ్రహం కుజుఁడన్నాడు. అంటే నేమి?
'బహునా మనుగ్రహార్యాయ' ప్రమాణమని యెరింగితి.
ప్రయోగసరణికి గణయోగ ఫలాలు-
చమత్కార చంద్రికాయాం-
క్షేమంసర్వగురుర్దత్తే మగణోభూమి దైవతః 30
సాహిత్యచంద్రోదయే-
సౌమ్యోపి మగణః క్రూరః క్రూరమ్ గణ ముపాశ్రితః
క్రూరగ్రహ సమాయుక్త శ్శతృ దేశే బుధోయథా,
నరపతిః బుధః పాపయుతః పాపీక్షీణచంద్రోఽన్యధామతః 31
శ్రీధర ఛందసి-

మగణం బెప్పుడు శుభకర
మగు, నైననుగ్రూరగణము నది డాసినచో
పెగి చంపు, బుధుఁడు క్రూరుం
డగుగ్రహమును గదిసి క్రూరుడై చనుమాడ్కిన్. 32

అలంకారచూడామణి.
కీర్తిః కారయితుశ్చైన మగణోబుధ కర్తృకః
సగణేన సమాయుక్త సర్వకాలఫలప్రదః 33

30- అ-రం-ఛం- అ 2 సం 10

31- అ-రం-ఛం- 2 సం 11- తాళపత్రప్రతిలో నరపతి యను పదసంపుటి యధికముగాఁ గలదు

32- అ-రం-ఛం- అ 2 ప 12- సు-సా-లో 296 పద్యము: ఇది భీమనఛందములోనిది యని చెప్పఁబడినది

33- అ-రం-ఛం- అ 2 సం 13

కవిరాజ గజాంకుశే-

మగణంబు పద్యముఖమున
సగణముతోఁ గూర్చి చెప్పజనుఁ గృతినొసఁగన్
దగఁ బద్యమందుఁ గర్తకు
నగణితముగ నర్థసిద్ధులగు సత్యముగన్. 34

కావ్యచింతామణి-తాతంబట్లు-

క॥ జగతిన్ గణములకెల్లను
మగణము కారణముగాన మగణముగదియ
న్నిగురించు గణము లెల్లను
దగ శుభ మొనరించు సెడు తగులగు దానన్ 35

ఉత్తమగండఛందసి-

క॥ రసలం జెప్పిన శుభమగు
జసలం జెప్పినను జయము సఖ్యాన వస్సున్
నసలం జెప్పిన మేలగు
మసలం జెప్పినను గర్వమండల మేలున్. 36

మగణ, సగణ ప్రయోగస్య లక్షణా-
రఘువంశే కాళిదాసోక్తం-
'వాగర్థావివసం పృక్తౌ' ఇతి 37

---

అ-రం-ఛం- అ 2 ప 14- సు-సా-లో 290 ప ; కాని ఇది శ్రీధరుని ఛందస్సు లోనిదని జెప్పఁబడినది

35- అ-రం-ఛం- అ 2 ప 15- సు-సా-లో 291 ప

36- సు-సా- 316వ పద్యమునకును, దీనికినిఁ జాల భేదము గలదు- అచ్చట [illegible] కర్తగాఁ జెప్పబడినాఁడు

37- అ-రం-ఛం- అ 2 సం 17

ఆదిపర్వాణ్యాన్ శబ్దశాసనేనోక్తం-
'శ్రీవాణీగిరిజాశ్చిరాయదధత' ఇతి. 38
ఏవం మగణ లక్షణం

(2) అథ యగణస్య.

పాదాంగ చూడామణి-

చ॥ జలమధిదైవమున్ రజితసన్నిభకాంతి కులంబు విప్రుఁడున్
ఫలముధనంబు తద్గ్రహము భార్గవుఁ డాతనివర్ణ మెన్నఁగా
వెలుపు జలంబు ధారకము తెల్లముగా ధనురాశి యోనియుఁ
బలుముఖ మగ్గణంబునను యగణంబు కీశ్వరా! 39

కవిసర్పగారుడే-

మ॥ అలరఁ దైవము వారి, బ్రాహ్మ్యము కులంబా, వన్నె తె
ల్పర్థమా
ఫలమా, యోని ప్లవంగి, మాగణము చెప్పఁ బానరం బా గ్రహం
బా శుక్రుండు రసంబు దాఁగగుణ పూర్వాషాఢ నక్షత్రమి
మ్ముల గోత్రంబు ... యగణ మొప్పఁ గోవిద
స్తుత్యమై. 40

టీక. ఉదక మధిదేవత, వర్ణం తెలుపు, కులం బ్రాహ్మ్యం, ఫలం
ధనం, గ్రహం శుక్రుడు, నక్షత్రం పూర్వాషాఢ, ధనూ రాశి,
వానర యోని, మనుష్య యోని, కరుణ రసం, అగ్ని వైశ్య
గోత్రం, జననం విజయనామసంవత్సరం రెండో జామున.

అగప్రయోగ సరణి-

చమత్కార చంద్రికాయాం-
కరోత్యర్థానాదిలఘు ర్యగణో వారి దైవతమ్. 41

---

38- అ-రం-చం- అ 2 సం 17

39- అ-రం-చం- అ2 ప 22- తాళపత్రి ప్రతిలో భేదముగా నుండుటయే గాక,
అఖరుచరణములో గణములుకూడ తగ్గినవి- కొన సంస్కరించితిని

40- అ-రం-చం- అ 2 ప 23- సు-సా-లో 251 ప

41 -అ-రం-చం- అ 2 సం 24

సాహిత్య రత్నాకరే-

ప్రకృత్యాయగణోనిత్యం శ్రీకరః కథ్యతే బుధైః

సఏవ వికృతిం యాతి సగణోనుగతో యది. ॥12॥

ఆంధ్రభాషాయాం-

గోకర్ణ ఛందసి-

క॥ సయలం జెప్పిన శుభమగు

జయలం జెప్పినను బతికి జయకీర్తులగుఁ

రయలం జెప్పిన నెంతయుఁ

బ్రియమగు మఱి మయలఁ జెప్ప బెంపొనరించుఁ. ॥13॥

ఉత్తమగండ ఛందసి-

క॥ సభఁ జెప్పిన విభవంబగు

రభసంబునఁ జెప్ప చేటు రయలం జెప్పఁ

శుభమగు నయలం జెప్పిన

నుభయము వర్ధిల్లునందు రుత్తమగండా! ॥14॥

(3) శ్రీ రగణస్య

పాదాంగ చూడామణి-

చ॥ జ్వలనుఁడధీశుఁ డాకులము క్షత్రియ సుప్రవరంబు గార్గ్య సం

పలరగ్రహంబు భూతనయుఁ డాతఁడర క్తపువన్నె ప్రాణశా

ఖ్యలలిత తార దైత్యగణ మయ్యజమోని యురః మేషరాశి సా

ఫలము భయప్రదంబు రగణంబున కిట్టి విశేషవర్ణనా! ॥15॥

---

42- అ-రం-చం- అ 2 సం 25

43- అ-రం-చం- అ 2 ప 26. సు-సా- 317 ప- తాళపత్ర ప్రతిలో నయలం అని ప్రారంభించుచుండగా పై పుస్తకముల ననుసరించి సయలం అని మార్చితిమి

44- సు-సా- 318 ప- ఇది భిన్నముగానున్నది

45- అ-రం-చం- అ 2 ప 30

ఆంధ్రభాషాయామ్ -

శ్రీధర ఛందసి-

క. పొగడందు పద్యముఖమున
రగణము యగణంబుగూడి రాగిల్లిన నీ
జగమంతయు నేలెడి వాఁ
డగుఁ గృతిపతి విభవయుక్తుఁడగుఁ గవి సగుణా. 50

రగణ సగణ యోగఫల విశేషం-

సాహిత్యచంద్రోదయే-

అనలానిల సంయోగం కరోతి విభువాంగనే
మహానలభయం తత్రాభీను జ్వాలా సమాకులం. 51

కవికంఠపాశే -

మారుత పూర్వ్వవహ్నివహ్ని
భయం శుభోయుతోన్యేషామ్. 52

ఆంధ్రభాషాయామ్-

అసిధర్వణఛంధ-

కం. అనలానిల సంయోగం
బనుపమ కీలాకరాళమగు వహ్నిభయం
బొనరించుఁ గర్త్రు గృహమున
ననుమానము లేదు దీన నండ్రు గవీంద్రుల్. 53

---

50- ఇది అథర్వణానిదని అ రం భం అ 2 ప 34 లో చెప్పనగుండి సు సా లో 298 ప.

51 అ రం భం అ 2 సంఖ్య 36.

52 అ రం భం అ 2 సం 38

53 అ రం చం అ 2 ప 40 సు సా లో $30_0$ ప.

## (4) శ్రీ స గ ణ స్య

పాదాంగచూడామణి:-

చ. అనిలుఁ డధీశుఁడున్, గువలయంబది కాంతి కులంబు హీనమునీ
జనుగ్రహమూశనైశ్చరుఁడు, చాలఁగ నల్పుకునెన్న, తొలయా
దనరగ రాశి, స్వాతి యగుఁదార, ఫలంబు క్షయంబు, దానవ
బొనరగణంబు, నామహిష యోని యగున్ సగణానకీశ్వరా! 5

కవిసర్పగారుడే-

సు. అనిలుండీశుఁడు స్వాతి తార రుచి శ్వేతాభావమొప్పన్ గ్రహం
బినజుండౌ తులరాశి హైన్యము కులంబే పార క్షీణంబు దా
మును లబ్ధంబు భయంబు తద్రసము, శార్ద్రొప్పె తెమ్మయిన్
యోని యొం
దును పైశ్యంబు గణంబు నాసగణ మొందున్ గిరి ప్రాచుర్యమై. 5

టీ.క:- అధిపతి వాయువు, స్వాతినక్షత్రం, ధాయునల్పు, గ్రహం శని
హీనకులం, క్షీణఫలం, భయరసం, సుహిష యోని, రాక్షస
గణం, గౌతమసగోత్రం, జవనం హాశంఖ నామయామం
నాలవది.

ప్రేమనమతం- బుధుఁడన్నాడు. అందుకు పంహారం ముందె వ్రాసినది.

ఆదిప్రయోగ ఫల విశేషమ్-
సాహిత్యరత్నాకరమ్-
'వాయుగణేశ్రమ' ఇతి. 56

---

54 ఆగం చం ఆ2 ప2 ప42సుసాతో253

55 ఆ రం చం ఆ 2 ప 43.

56 కొంత చెడిపోయినది కాని ఆ ర2 చం ఆ2 పం 44లో పూర్తిగానున్నది.

ఆంధ్రభాషాయామ్ -

శ్రీధర ఛందసి-

క. పొగడందు పద్యముఖమున
రగణము యగణంబుగూడి రాగిల్లిన నీ
జగమంతయు నేలెడి వాఁ
డగుఁ గృతిపతి విభవయుక్తుఁడగుఁగవి వసుధన్. 50

రగణ సగణ యోగఫల విశేషం-

సాహిత్యచంద్రోదయే-

అనలానిల సంయోగం కరోతి విభువంగిరే
మహానలభయం తత్రిభీమ జ్వాలా సమాకులం. 51

కవికంఠపాశే -

మారుత పూర్వేవ హన్త్నవహ్ని
భయం శుభోయుతో న్యేషామ్. 52

ఆంధ్రభాషాయామ్-

అసిధర్వణఛంధ-

కం. అనలానిల సంయోగం
బనుపమ కీలాకరాళమగు వహ్నిభయం
బొనరించుఁ గర్తృ గృహమున
ననుమానము లేదు దీన నండ్రు గవీంద్రుల్. 53

---

50- ఇది అథర్వణానిదని అ రం భం అ 2 ప 34 లో చెప్పఁగూండి సు సా లో 298 ప.

51 అ రం భం అ 2 సంఖ్య 36.

52 అ రం భం అ 2 సం 38

53 అ ర:చం అ 2 ప 40 సు సా లో 300 ప.

## (4) శ్రీ స గ ణ స్య

వాదాంగచూడామణి:-

చ. అనిలుఁడధీశుఁడున్, గువలయంబది కాంతి, కులంబు హీనమున్
జనుగ్రహమూశనైశ్చరుఁడు, చాలఁగ నల్పగునెన్న, తౌలయా
దనరగరాశి, స్వాతియగుఁదార, ఫలంబుక్షయంబు, దానవం
బౌనరగణంబు, నామహిష యోని యగున్ సగణానకీశ్వరా! 54

కవిసర్పగారుడే-

ను. అనిలుండీశుఁడు స్వాతితార రుచిశ్వేతాభావమెన్నన్ గ్రహం
బినజుండౌ తులరాశి హైన్యముకులంబేపార క్షీణంబు దా
మును లబ్ధంబు భయంబు తద్రసము, కార్స్నితెమ్మయిన్ యోని యొం
దును దైన్యంబు గణంబు నాసగణ మొందున్ గీర్తిప్రాచుర్యమై. 55

టీక:- అధిపతి వాయువు, స్వాతినక్షత్రం, ఛాయనల్పం, గ్రహం శని, హీనకులం, క్షీణఫలం, భయరసం, మహిషయోని, రాక్షసగణం, గౌతమసగోత్రం, జననం హాశంఖ నామయామం నాలవది.

శ్రీమనమతం- బుధుఁడన్నాడు. అందుకు పరిహారం ముందె వ్రాసినది.

ఆదిప్రయోగ ఫల విశేషమ్-

సాహిత్యరత్నాకరమ్-

'వాయుగణేశ్రమః' ఇతి. 56

---

54 అరం చం అ2 ప2 ప42సుసాతో 253

55 అ రం చం అ 2 ప 43.

56 కొంత చెడిపోయినది కాని అ ర2 చం అ2 పం 44లో పూర్తిగానున్నది.

సాహిత్య చంద్రోదయే-

దేశభ్రమం సోప్యగురితి ఏవమస్తు (?) 57

అయితే నేమిగణకూటవిశేషం అరయదగును.

లక్షణాదినికాయమ్-

సర్వదా నిత్యస్సగణస్సుయోగినాది (?)

కథమ్ శ్రేయఃకరిష్యతీతి. 58

సాహిత్యచంద్రోదయే

సగణస్సర్వ సౌభాగ్యదాయక స్సర్వతథా...కవిరాక్షసనే 59

అనంతపదవిన్యాస చాతుర్యంసరసం కవేః

బుధోయది సమీక్షస్థాన దగ్ధ (స్స) పునోయది. 60

కవిసర్పగారుడే-

గీ. సగణమగణములు పొసంగిన విభవంబు
రసగణంబు లెనయ పబలు గీడు
రగణయగణయుతము రాజ్యప్రదంబగు
భయము లిరువురకును భయముఖిమను. 61

సాహిత్రి చంద్రోదయమున-

సౌమ్యగ్రహాధిష్ఠితత్వాత్సగణ శ్శుభదాయకః
మిత్రామిత్రగణై స్సార్థం సారిశ్శుభఫల ప్రదః
శుభగ్రహాసితేందె జ్యాపాపామందార భాసరాః
బుధొవాసాయుతే పాపిక్షీణ చంద్రస్సదా శుభః ఇతి. 62

---

60 ఆ రం చం ఆ 2 ప 45 సు సా లా 319 ప.

61 అ-రం-ఛం- అ 2 ప 46 సు-సా-ప 319

62 అ-రం-ఛం- అ 2 సం 47

ఛప్పన్నే-

సగణం కానిదయితేనేమి గురుశుక్రగ్రహ వృద్ధగణాలు సమీపాన నున్నను వెనుక కుజగ్రహాధిష్ఠిత గణం లేకున్నా మంచిదని ఎరిగేది. 63

ఆంధ్రభాషాయాం-

అథర్వణ ఛందసి-

క. మునుకొని పద్యముఖంబున
నని లగణం బిడ్డనాయురారోగ్యంబుల్
గొనసాగు; దాని ముందట
ననలగణంబిడినఁ బతికి నలజడి సేయుఁ. 64

ఇందుకు చెల్లుబడియున్నది.

సాహిత్య చంద్రోదయే-

సగణచ్ఛందసి జ్ఞేయోరగణస్య పురస్థితో యది 65
అత్రోదాహరణమ్-సార్వభౌమకవి:-
అనలం బస్య హేరంబమిత్యాహ. 66

వృత్తరత్నాకరే- కేదారకవిః-
సుఖసంతాన సిద్ధ్యర్థమిత్యాహ. 67

(5) తగణస్య

వాదాంగ చూడామణౌ-

చ. నెలయనభంబు దైవమతిసీలము శాంతియు క్షత్రజాతి గీ
ర్వరుఁడు గ్రహంబుఁ గాంచనము వర్ణము తెండు ఫలంబు చెప్ప నై
శ్వర్యము తారపుష్యమియు వాలిన కర్కటరాశి మేషమూ
నిరవగు యోని దేవగణమీతగణంబున కిందుశేఖరా! 68

---

63. కర్త పేరున్నది. కాని తెలుగులో నుండుటచే ననుమానింప వలసియున్నది.
64- అ. రం. ఛం. ఆ 2 సంఖ్య 50. సు. సా. లో. 303 ప.
65- అ. రం. ఛం. ఆ 2. సం 49.
66- అ. రం. ఛం. ఆ 2. సం 51.
67- అ. గం. ఛం. ఆ 2. సం 52.
68. అ. రం. ఛం ఆ 2 ప. 55. మూడవచరణములోని మొదటి గణము తప్పుగా నున్నది.

కవిసర్పగారుడే-

మ. అమరన్ మిన్నధిదైవముక్కులము బ్రాహ్మాంబాగణంబెన్నదై
వము జీవుండుగ్రహంబు, నల్పురుచి, యైశ్వర్యాంబులబ్ధాంబు, మే
షము దాయోని,రసంబు శాంత మలనక్షత్రంబు పుష్యంబుగా
శి మహిన్ గర్కటకంబు నాదగణము త్సేకంబుగన్ జెప్పమై 69

భీమన-

క. మగణంబు శూద్రకులజుండు
భగణం బైశ్వర్యజాతి, బ్రాహ్మణ జాతుల్
నగణము, తగణము యగణము;
జగణము నృపజాతి, యంత్యజులు రసగణముల్ 70

వ. అధిదేవత ఆకాశం, నీలవర్ణం, బ్రాహ్మణజాతి, గ్రహం
బృహస్పతి, అతండు కాంచనవర్ణం, ఫలమైశ్వర్యం, పుష్యమీ
నక్షత్రం, కర్కాటరాశి, మేషయోని, దేవగణం, శాంతరసం,
వసిష్ఠగోత్రం, జననం రామనాడు ఏడవజాము.
భీమనగ్రహం రాహుడన్నాడు. పరిహారంబు మానుపె
వ్రాసినది. 71

ప్రయోగసరణి-

సాహిత్యరత్నాకరే-

తో హ్రా (?) రంత్యలఘు సుఖముఖమితి (?) 72

అలంకార చూడామణి:-

గగనేశూన్యమితి. 73

కవికంఠపాశే:-

వ్యోమశూన్యం హి (?) తనుత యితి 74

---

69_ అ. రం. ఛం. అ. 2 ప 56. సు. సా. 254 ప.

70 _ ఆ. సా. ప. వారి కవిజానాశ్రయము సంజ్ఞా. ప 28

ఆంధ్రభాషవలన విశేషంగలదు. 75

సాహిత్యరత్నాకరే:-

నిత్యం భగణ సాన్నిధ్యాత్యర్వాభీష్ట ఫలప్రదః,
కర్తుః కారయితాశ్చైవ తగణోవ్యోము దేవతః 76

ఇత్యత్రోదాహరణం :-

అమరుక కావ్యే:-

జ్యాకృష్టబద్ధ కటకాముఖపాణి పద్మమితి 77

ఆంధ్రభాషాయామ్

ఉత్తమగండ ఛందసి:-

క. తగణము తోడ్తఁ బిమ్మట
భగణము గదియంగ నిల్పి పద్యము హృద్యం
బుగ రచియించినఁ గర్తకు
నగణేశముగ నొదవు నాయురైశ్వర్యంబుల్. 78

వ. ఇటువలె శుభగ్రహం కూడినను తనగుణం విడువనేరదని కొం
దరన్నారు. 79

కవితనయకర్తృకత్వాత్ ప్రకృత్యా (?) హాని దస్సగణః,
యథాపలాండుః శ్రీగంధయోగేనకిం సుగంధో భవతి ఇతి.
శ్రీగంధంతో గూడినా వుల్లికూడి వాతన మునుపటి గుణం
విడువ నేరదు అనుట. 80

అంటేనేమి- తగణానికి అధిదేవత గగనం ఆ గగనం నిత్య
విభువు; గానతగణం మంచిది. 81

---

75- ఈవచనము స్థలము మారినట్లుగాఁ దోఁచుచున్నది.

76.- ఆ. రం. ఛం. ఆ 2 సం 57.

77- ఆ. రం. ఛం. ఆ 2 సం. 62.

78- ఆ. రం. ఛం. ఆ 2 ప. 58.

సీ. లలితముగ మంచిదని భువి వెలసినట్లు
గణములకు లక్ష్యముల వెల్లగాని వనిన
తగణజగణంబులకు వ్రాసెదను మహాక
వీంద్రయోగలక్ష్యంబులు వెతకినేను. 82

చమత్కారచంద్రికా:-
ఈశత్వమంత్యమ లఘుస్తగణోవ్యోమ దైవతః 83

సాహిత్యచంద్రోదయే:-
తగణస్సర్వసౌభాగ్యదాయక స్సర్వదాభవేత్. 84

తాతంభట్లు:-

క. తగణంబున కధిదేవత
గగనంబది శూన్యమనుచు గాదని వలరన్
దగ దది, మిక్కిలి మంచిది,
గగనంబిది నిత్యవిభువు గావున, దెలియన్. 85

ద్వితీయసరంధే:

ఉ. సర్వఫల ప్రవాతయును, సర్వశరణ్యుఁడును, సర్వశక్తియుత్
సర్వజగత్ప్రసిద్ధుఁడును, సర్వగుణాన్యుఁడునైన చక్రిగా
సర్వశరీరు లుర్విగత సంజ్ఞలఁజెంది విశీర్ణమానులై
పర్వెడుచో నభంబుగతిబ్రహ్మముదాఁజెడకుండునెప్పుడు- 86

వ. మరిన్ని:-

నానాలంకారేషు:- 87

పదవాక్య ప్రమాణాజ్ఞైర్మహాకవిభిస్తద్గ్రంథాగా. 88

---

83. ఆ. రం. ఛం. ఆ 2 సంఖ్య 59.

84. ఆ రం. ఛం. ఆ 2 సంఖ్య 60.

85 ఆ. రం. ఛం. ఆ 2 సంఖ్య 61. సు. సా. 307 ప.

తగణశ్శుభయుత ఇత్యంగీ కృతోభ వేత్. ఇం
శబ్దశాస్త్ర వాక్యం, మీమాంస పరిమాణాం, తర్కశాస్త్రం.
ఈమూడు తెరగుల వారిచేత-సమస్తులైన వారిచేతననుట. 89

ఉదాహరణాని వక్ష్యామి-

కుమారసంభవే:-

అస్త్యుత్తరస్యాం దిశీతి- కాళిదాసవచనం. 90

తర్కభాషాయామ్:

బాలోఽపి యో న్యాయనయే ప్రవేశమితి. 91

కృష్ణభట్ట కృష్ణజయే:

పాయాదపాయాత్పరమస్య పుంస ఇతి. 92

కుసుమాయుధ వ్యాకరణే:

యేనాక్షర సమామ్నాయ మితి. 93

మంత్రి మహార్ణవే:

ఓంకార పంజర శుకీమితి. 94

శంకరాచార్య మంత్రదర్పణే:

ఆధార పద్మవన ఖేలన రాజహంస మితి. 95

పృథ్వీధరాచార్య సాహసాంక కావ్యే:

అన్యాత్మనో యస్య సిసృక్షవకి, యితి పరిమేళ (?) 96

---

90. ఆ. గం. గ్రం. ఆ 2 సంఖ్య 63.
91. ఆ. గం. గ్రం. ఆ 2 సం 64
92. ,, ,, ,, 65
93. ,, ,, ,, 66
94. ,, ,, 67
95. ,, ,, ,, 68

## (6) జగణస్య

వాదాంగ చూడామణి:

చ. రవియధిదైవ మాదివసరాట్కులమున్, గురువిందకాంతియున్
రవిగ్రహ మెన్నఁగా నతఁడు రక్తపువర్ణము సింహరాశి ను
ద్భవమగు, రోగమాఫలము, తారకయుత్తర, ధేనుయోని, నా
నవగణమున్ దలంప జగణంబునకున్ ద్రిదశేంద్రవందితా! 97

కవిసర్పగారుడే:

మ. అరుణుం డేలిక, ఛాయ రక్తిమ, రసంబా వీర, మాయుష్యమం
బురువై రాజ్యము, రాశిసింహము, గ్రహంబున్ భానుఁ, డత్తారయు
త్తర, రోగంబు ఫలంబు, యోని యురవాదము ధేను, వమర్త్యవం
బరుదారంగ గణంబు నా జగణ మింపారున్ జగత్ప్రస్తుతై [illegible]గ

వ. అధిదైవత సూర్యుఁడు, క్షత్రియ కులం, రక్త వర్ణం, గ్రహోఽపి
సూర్యఏవ, సోపి రక్తవర్ణః, సింహరాశి, ఫలంరోగం, ఉత్తరా
నక్షత్రం, ధేనుయోని, మనుష్యగణం, వీరరసం, భార్గవగోత్రం
జననం శ్రీరామనామ యానం, షట్సంజ్ఞా. 99

ఆది ప్రయోగ సరణి :

చమత్కార చంద్రికాయాం:

రుజాకరో మధ్యగురుర్జగణో భానుదైవతః. 100

సాహిత్య రత్నాకరే:

మధ్యే గురుర్జోరుజః 101

---

97 ల. రం. ఛం. అ 2 సం 71
98- అ- రం. ఛం. అ 2 ప 72. సు. సా. ప 225
100. ,, ,, 73
101 అ. రం. ఛం. అ 1 ప 74

కవి కంఠపాశే:

భానుర్దుఃఖకర ఇతి. 102

కుమార సంభవే:

చతుర్ముఖముఖా ఇత్యాగావర్ణా జగణేఽపిచ

బ్రహ్మనామాంకితత్వేన కావ్యాదావతి శోభనమితిచ. 103

వర్ణోపిజగణశ్చైవ బ్రహ్మనామాంకనే వేదా

బ్రహ్మనామ చకారాక్షర సంయుక్తం

చన్‌జగణా వ్యోదాప్రియాగ శుభకరమ్. 104

ఇందుకు లక్ష్యం- వామననామ శకున గ్రంథే:

విరించి నారాయణ శంకరేభ్య ఇతి

నను గణ సామర్థ్య మజాత్వా

ఏవంచోద్యమా కృతా, ఉచ్యతేఖలు. 105

ఓయీ! జగణ సామర్థ్యం మెరుగఁబలికె ననుట. 106

సాహిత్య రత్నాలయే:

జగణాస్సూర్య దైవత్యో రుజం హంతి నదోషకృత్

గణానాముత్తమో జ్ఞేయో గ్రహాణాం భాస్కరోయదా. 107

తథామను: ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్. 108

కావచింతామణి - తాతంభట్లు:

అవివేకులు జగణంబును

భువి రోగముసేయుననుచుఁ బోనాడుదురా

కవివరులున్ శబ్దార్థము

వివరింపరు తెమరుయుక్తి విదితముగాఁగన్. 109

---

102. ఆ. రం. ఛం. అ 2. ప 75

103 ఆ. రం. ఛం. అ 2 ప 76

104. ఆ. రం. ఛం. అ 2 ప 77

107. ఆ. రం ఛం. అ 2 ప 78

109. ఆ. రం. ఛం. అ 2 ప 79

మరిన్ని- మహాకవి ప్రబంధోదాహరణాన్ వక్ష్యామి. 110

మాఘకావ్యే:

శ్రియఃపతి శ్రీమతీతి 111

భారవే:

శ్రియః కురుణా మధివస్యేతి. 112

ఉత్తర రామాయణే:

అలం కవిభ్యః ఇతి. 113

కాల నిధానే:

శ్రియః కరారోపిత రత్నముద్రికేతి. 114

మణిదర్పణే:

దివాకరం నమస్కృత్య ఇతి. 115

చప్పన్నే:

ప్రణమ్య లోకకర్తార మితి. 116

భోజరాజీయే:

సునీతిశాస్త్రం, సం (?) వైద్యం ఇతి. 117

గణితశాస్త్రే:

త్రిలోకరాజేంద్ర కిరీటకోటి ఇతి. 118

---

111. ఆ. రది. ఛం అ 2 ప 81

112- ఆ. రం. ఛం అ 2 ప 82

113- ఆ. రం. ఛం అ 2 ప 83

114- ఆ. రం. ఛం అ 2 ప 84

115- ఆ. రం. ఛం అ 2 ప 85

116- ఆ. రం. ఛం అ 2 ప 86

118- ఆ. రం. ఛని అ 2 ప 87

వీరార్య లక్షణాది నికాయమ్:
ప్రణమ్య విద్వజ్జన పారిజాతమ్. 119

సూర్య సిద్ధాంతే:
అచింత్యా వ్యక్తరూపమితి. 120

(7) భ గ ణ స్య

పాదాంగ చూడామణౌ:

ఉ. చంద్రుఁడధీశ్వరుం డమృతసారము కాంతియు, విట్కులంబు,త
చ్చంద్రుఁడె తద్గ్రహంబతని ఛాయయుఁ దెల్పు, వృషంబు రాశి,భో
గీంద్రసుయోని, దేవగణ, మీప్సిత సౌఖ్యము తత్ఫలంబునన్
జంద్రనితార యెన్నఁగను జంద్రధరాభగణాన కెన్నఁగన్. 121

కవిసర్పగారుడే:

మ. పతి చంద్రుం, డహియోని, రాశి వృష, మా వంశంబుదై
వతి మెన్నంగణమా ఫలంబు సుఖమా,వర్ణంబు శ్వేతంబు, సం
యుత నక్షత్రము చెప్పఁగా మృగశిరం బుద్యద్గ్రహంబా నిశా
పతి, హాస్యంబు రసంబునాభగణమొప్పన్మించె సన్మూర్తియై. 122

టీక. చంద్రుఁడధిదేవత, వర్ణం తెల్పు, ఉచ్ఛకులం, గ్రహంచంద్రుడు
అతని వర్ణం తెల్పు, వృషభరాశి, సర్పయోని, దైవగణం,
ఫలం సుఖం, నక్షత్రం మృగశిర, హాస్యరసం, అంగీరసగోత్రం
జననం సుప్రనామం ఒకపరి. 123

---

119 అ- రం- ఛం_ అ 2 ప 88

121 అ. రం. ఛం. అ. 2 ప 92. సు. సా. లో 256 ప.

122 అ రం. ఛం. అ. 2 ప 93

ఆది ప్రయోగ సరణిః-

సాహిత్యరత్నాకరేః-

దినకరముఖగ్రహాణామ్

ఇనశశివర్తతస్యరజని గుణం. 124

ఆంధ్రభాషాయామ్ః-

కవిసర్పగారుడేః-

ఆ.వె. చంద్రుఁడేగ్రహంబు సరసనిల్చినవాని
వర్ణమై శుభాశుభంబు లిచ్చు
భగణము మగణంబు నొగినిలం దత్ఫలం
బిచ్చుదనకు చంద్రుఁడధీశుఁడగుట. 125

అధర్వణ ఛందసిః-

యగణంబు గదిసి చంపును
రగణముతో గూడి ఘోరరణ మొనరించున్
భగణమిక నొక్క-చిత్రము
మగణముతో గూడ కాలమానము పతికిన్. 126

వ. భగణం ప్రత్యేకం కాని సకలశుభముల నీయజాలినందుకు లక్ష్యం. 127

శ్రీమద్రామాయణ యుద్ధకాండ శేషేలంకాదహనము పట్టు కథ—అవక్రమిస్తున్న శుభమపేక్షించి భగణానకు చంద్రుడా అధిపతిన్ని, గ్రహముంగన్న అయ్యలభట్టు భగణ ప్రయోగం చేసినాఁడు. 128

---

124 ఆ. రం. ఛం. అ. 2 ప 94

122 ఆ. రం. ఛం. అ 2 ప 95

ఉ. శ్రీనుతమూర్తియైనరఘుశేఖరు తేజముఁబోలె పర్వుచున్
భానుసహస్రమండల విభాసి సమగ్రతర ప్రకాశుఁడై
మానుగమింటిశోనొరయు మంటలు దిక్కుల గ్రమ్మనుగ్రమై
శ్వానరుడేపుతోనెసగెవానరరోషసముద్రుఁడో యనన్. 129

(8) నగణన్య

వాదాంగచూడామణౌ:-

చ. గుణములకెల్ల నాకరము కోరి కృతిందుని డాసియున్న దు
ర్గుణగణ దోషమున్ జెరుచు కోరినవస్తువినూత్నరత్న భూ
షణములనిచ్చుఁగావుఁ లసత్కవిశేఖరుఁ బెంచు సర్వ ల
క్షణములఁగల్గి యొప్పుబుధ సన్నుతమైనగణంబుశంకరా! 130

కవిసర్పగారుడే:-

మ. పరమాత్మం డధినాయకుండుజయసౌభాగ్యైకసామ్రాజ్యపూ
జ్యరమాసంతతులీగిలబ్ధిమునిజో పాంతస్థదుష్టాక్షరో
త్కరదోషాఢ్యగుణౌఘధూర్తగుణముల్ ఖండించుటల్ చాల యె
వ్వరికిన్ గాదనరాదు నానగణమవ్యాజస్థితిన్ బొల్పగున్. 131

ఉత్తమగండచ్ఛందసి:-

క. శుభసుఖ మక్షయ ధనకన
కభయైశ్వర్యములంజేయుం గ్రమమునన్ గార్య
ప్రభులకు, కవులకు గృతులను
మభజసనయరత గణాలిమల్లియరేచా! 132

టీక—పరమాత్మ అధిదేవత అన్నారు, గాని నగణం సర్వ శుభదం. కనుక మిగిలిన కవీశ్వరులుయెన్ని వ్రాసినవారుకారు.

---

130 అ. రం. ఛం. అ 2 ప 98

131 అ. రం. ఛం. ఆ 2 ప 99. సు. సా. ప 257

132 మల్లియరేచన కవి జనాశ్రయములోనిది గాని ఉత్తమగండ ఛందస్సులోనిది కాదని సంశోధన విశదపఱచుచున్నది.

భీమనమతం —ఫలం ధనం. గ్రహం జీవుడు. కులం బ్రాహ్మ్యం. ధవళవర్ణం,

కవిసర్పగారుడము—బసవనమతము—జననం ప్రసుప్త యామం ఎనిమిదవది. 133

ఆదిప్రయోగసరణి:-

చమత్కార చంద్రికాయామ్:-

ధనాకరస్సర్వలఘుర్నగణో బ్రాహ్మ్యదైవతః 134

సాహిత్యచంద్రోదయే:-

నగణస్యసమీపస్థో దుర్గుణశ్శుభదోభవేత్,

అయఃకాంచనతామేతి స్పర్శాత్స్పర్శవేదినమ్. 135

ఆంధ్రభాషాయాం:-

(భీమ)స్ఛందసి:-

క. ఏగణము గదియునగణం
బాగణము సమస్తమంగళావ్యాప్తంబై
రాగిల్లునినుము పరసము
యోగంబై పసిండివన్నెనూనిన భంగిన్. 136

ఉత్తమగండ చ్ఛందసి:-

క. చందనతరు సంగతింబిచు
మందంబులు పరిమళించు మాడ్కిన మందా
నందకరమైన నగణము
పొందున దుష్టగణవర్ణములు ప్రియమొసంగున్ 137

---

134 అ. రం. ఛం. సం 101

135 అ రం. ఛ. సం. 102

136 అ. రం. ఛం. సం. 104. సు. సా. ప 315

137 అ. రం. ఛం. ఆ 2 ప 105 సు. సా. 415 ప

కవికంఠపాశే:-

సర్వతానాం యథా మేరుః, సురానాం శంకరో యథా
మృగానాంచయథాసింహో, గణానాం నగణస్తథా. 138

ఆంధ్రభాషాయాం-అథర్వణచ్ఛందసి :-

గీ. పర్వతములందు మేరువుభాతియగుచు
సర్వసురలందు శంకరచందమగుచు
నరయమృగములయంద సింహంబుకరణి
గణములందెల్ల నగణంబు గరిమనెగడు. 139

నగణ ప్రయోగలక్ష్యాలు:-

నలోదయంబున:-'హృదయ సదసీ' యనుటను
శివభద్రింబున:- 'ప్రణమ సదసీ' యనుటకును జెల్లు
చుండును. 140

ప్రబంధపరమేశ్వరుండు అరణ్య పర్వశేషప్రారంభకాలంబున
శుభమపేక్షించి నగణ ప్రయోగం చేసినాడు.

చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోవసిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవ జృంభణముల్లసిల్ల ను
ద్ధురతర హంస సారసమధువ్రత నిస్వన ... చెలంగఁగాఁ
గరము వెలింగె వాపరముఖంబు... శా... వేళఁజూడఁగన్ 141

(8) అక్షరఫలము ...

కవిసర్పగారుడే:-

క. శివుసద్యోజాతాది
ప్రవిమల ముఖపంచకమునఁ గ... సము
ద్భవమై ... ఇ ఉ ఏ ఓ
లావిష్కృతిననియు నేఁబదై వరి ... 142

1:38 ఆ. గఁ. ఛం ఆ 2 ప 103
1:39 ఆ. ధం. ఛం. ఆ 2 ప 106 సు. సా. 314
142. ఆ. గం. ఛం. ఆ 2 ప 117.

క. ఆదులు పదియాఱ నంగ
కాదులు తానిరువదియును నైదుననంగా
యాదులు తొమ్మిదియనఁగా
నీదెస నక్షరములమరు నేఁబదియనఁజుమా. 143

ఇందుకువివరం—ఆదులు 16. అం అః అనువీనికి రుద్రుండె అధిదేవత- కాన అం అను అక్షరం విడువగానిల్చినవి పదిహేను- కాదులు 25. యాదులు ళతోఁగూడి దొమ్మిదిన్ని. క్షకారము- కకార షకార సంయుక్తంబై భిన్నదైవతంబును: ప్రత్యేక ఫలంబునగుట, క్షతోఁగూడియాదులు. 10. వెరసి అక్షరాలు 50. 444

ఈఅక్షరాలకు:-

క. ఫలములు, గ్రహములు, వర్ణం
బులు: నధిపాలకులును, బలములు నన్వయముల్
దెలిపి యిడవలయు గవితలు
పలికెడు వర్ణంబు లైదుపదులకు మొదలన్. 145

క. వేవిధముఫలంబు, రక్తిమ
వర్ణంబు: బీజమనిలంబు: గ్రహం
బాతనికి కులము బ్రాహ్మ్యము (1)
ఖ్యాతిగ విష్ణుండు పతి అకారంబునకున్ 146

క. పవనము బీజము దేవత
ల వనిగ్రహంబినుఁడు బ్రాహ్మ్యమన్వయము: రుచి
ప్రవణము గౌరవము, హర్ష
మవిరళఫలజాల మొసఁగు ఆ అక్షరమునకున్ (2) 147

క, ఇనుఁడ గ్రహ, మవని బీజము,
తనురుచి శ్యామంబు, తుష్టిదంబు ఫలంబౌ,
జననము బ్రాహ్మ్యము, కాముఁడు
గనుగొన నధినాయకుండు ఇ కారంబునకున్ (3) 148

క. అనలము బీజము, రవిగ్రహ
మనుపమ రుచిపీత, మన్వయము బ్రాహ్మ్యము, తు
ష్టినయంబు ఫలము, దేవత
యెనయఁగ శ్రీయెంచిచూడ ఈ మాతృకకున్. (4) 149

క. ఇలబీజము, నీలమురుచి,
ఫలంబు కామదము, గ్రహముభానుండు, బ్రాహ్మ్యం
బల రెడికుల, మధిదేవత
కలిత స్థితికాళితా ఉ కారంబునకున్. (5) 150

క. ధరబీజము, శ్యామరుచి,
తరణిగ్రహము, ఫలము కామదము, బ్రాహ్మ్యంబా
వరవంశం, బధిదేవత,
యురుతరముగ దేవమాత ఊ మాతృకకున్ (6) 151

క. నీరము, బీజము, వర్ణము
గౌరము, బ్రాహ్మ్యంబు కులము, గ్రహమర్కుండు, కౌ
మారి తలంప నధిదేవత,
యారయ సుతహాని ఋ నకు నార్యజనోక్తిన్. (7) 152

క. సలిలము బీజము, బ్రాహ్మ్యము
కుల, మినుఁడుగ్రహంబు, పుత్రికుల నాశముదా
ఫలము, రుచియంజనము, స
ట్టిలఁదావారాహిదేవి ౠ మాతృకకున్.(8) 153

క. గాలియు బీజము ఛాయా
పాలుడుగ్రహ, మన్వయంబు బ్రాహ్మ్యము, ఫలముల్
బొలతి సుఖము వసంతుం
డేలిక, సితంబు ఛాయ ఎ మాతృకకున్ (9) 154

క. ఇనుడుగ్రహ మగ్నిబీజము
జననము బ్రాహ్మ్యంబు రుచిల సన్గార మలం
ఘనవాక్కుడి ఫలంబగు
నెనయ దర్పకుఁడు భర్త ఏ మాతృకకున్ . (10) 155

క. ఘనవిధిబీజ, మరయగ
నినుఁడుగ్రహం, బమర వైద్యవినులు, బ్రాహ్మ్యం
బనఘకులము, రుచిర క్తిమ,
తనయ వినాశకము ఫలము తప్పదు ఐ కున్. (11) 156

క. గగనమణిగ్రహము, బీజము
గగనము, బ్రాహ్మ్యంబు కులము గౌరమువర్ణం
బగు, ఫలము పుత్రినాశక
మగుతలపోయగను వసువులధిపులు ఓ కున్. (12) 157

క. ధరణియుబీజము దుర్గయు
పరిపాలిని, యినుఁడుగ్రహము, బ్రాహ్మ్యము వంశం
బరయగ గౌరము వర్ణం,
బురుతరమోక్షదము ఫలము ఓ మాతృకకున్. (13) 158

క. సలిలము బీజము, బ్రాహ్మ్యము
కులము, విభూతిదము ఫలము కుముదారిగ్రహం
బలఘు తనుకాంతి గౌరం
బలరెడి చాముండదేవి ఔ మాతృకకున్ (14) 159

---

157. నాల్గవ చరణము యతిస్థానమునరి గా లేదు.

క. అంబుజ మిత్రుఁడుగ్రహము, కు
లంబది బ్రాహ్మణంబు, మునుఫలము దైర్యము, రా
గంబు వర్ణము, బీజం
బంబరమాహరుఁడు కర్త అమ్ మాతృకకున్ (15) 160

క. అనలము బీజము, బ్రాహ్మము
జననము, భౌముండుగ్రహము. శతధృతి నాథుం,
డనుపమ రుచికాళిమ,
ఘనలక్ష్మియ ఫలమగున్ గకారంబునకున్. (16) 161

క. తెలుపురుచి, కులము బ్రాహ్మము
నిలింపుఁడగు భానుఁడొండె నృపుఁ డు,గ్రహము మం
గళుఁడగ్ని బీజమగు శ్రీ
కలిమియు తత్ఫలమగున్ ఖ కారంబునకున్. (17) 162

క. ధరబీజము, కుల మగ్రజ
మరయగ శోణంబు వర్ణమగ్నిజుండుగడుగ్రహం
బురు నిత్య ఫలము శ్రీదము
కరివరదుఁడధీశ్వరుండు గ కారంబునకున్- (18) 163

క. బీజంబుదకము, గణపతి
రాజు, ఫలము కలిమి, కులము బ్రాహ్మము, తెలుపై
రాజిల్లువన్నె, గ్రహము
భూజన్ముండగు ఘకార ము న కెందటయున్, (19) 164

క. నలువుఅవు గ్రహము భౌముడు,
ఫలంబు శ్రీదంబు, కులము బ్రాహ్మము, వ్యోమం
బలరంగ బీజము, పతి వేం
కటరంగ నృసింహుడాజ్ఞకారంబునకున్ (20) 165

165 నలువుఅవు (నలువు + ఉఅవు), సౌందర్యము అధికము

క. ఆశుగ బీజము. గ్రహమా
శశిజుఁడు, కులము.........యశో
నాశము, పతి వామనుఁడు ప్రి
కాశిత రుచిమేచకము, చ కారంబునకున్. (21) 166

క. నారోగము ఫల, మధిపతి
యారయసేనాని, బీజమగ్ని, నలుపు కా
వీర రుచి, కులము బ్రాహ్మ్యం
బారుచిర గ్రహము బుధుఁడు ఛ అక్షరమునకున్. (22) 167

క. గాము బుధుడు, రక్తిమ రుచి
యామయ నాశకము ఫలద, మగ్రజకులం,
బామహి బీజము, దేవత
హైమవతి, జ కారమునకు నాగమ ఫణితిన్ (23) 168

క. మృతిఫల, ముదకము బీజము,
సితేకరము వన్నె, గ్రహము శీతకరజుఁడా
పతిభైరవుఁ డగ్రజము
న్నతకులము ఝ కారమునకు నాశోభిల్లన్. (24) 169

క. జినుడధి నాథుఁడు, బీజము
ఘనపదము, సితంబువన్నె, గ్రహమిందుజుఁడౌ,
జననము బ్రాహ్మ్యము, మరణము
మును ఫలమగునా ఞ కారమునకుఁ దలంపన్. (25) 170

క. కరువలి బీజము, దానవ
గురుండు గ్రహం బగ్రజంబు కులమగు బాధా
కరము ఫలస్థితి యగు, యం
గరుచి యెఱుపు, యముఁడు పతి ట కారంబునకున్. (26) 171

క. కులమగ్రజంబు, ఖేదము
ఫలము, తెలుపు ఛాయ, గ్రహము భార్గవుం, డీశుం
డల నిర్గతి, తనురుచి పిం
గళమగు తలపింపగా ఠ కారంబునకున్. (27) 172

క. శుభదంబు ఫలము, బ్రాహ్మ్యం
బభిజన్మము, గ్రహము శుక్రుఁడగు, పీతము, పై
ప్రభ బీజము సర్వేశుఁడు
ప్రభుండు డ కారమునకు విపశ్చిదనుజ్ఞన్. (28) 173

క. బీజంబు ధనము, ఫలదము
తేజోనాశకము, నల్పుదృఢరుచి, బ్రాహ్మ్యం
బాజననము, గ్రహము శని
రాజీవాసనుఁడు, పతి ఢా క్షరంబునకైనన్. (29) 174

క. గగనము బీజము, వర్ణం
బగు రక్తిము, కులము బ్రాహ్మ్యమధిదేవతదా
నగువాణి, గ్రహము శుక్రుఁడు
నగణిత లాభంబు ఫలము ణా క్షరమునకున్ (30) 175

క. కరువలి బీజము, భుజగే
శ్వరుఁడధిపతి, గ్రహము గురువు, క్షాత్రము కుల, మం
గ రుచియు గౌర, మవిఘ్నో
త్కరహర్షము ఫలము దా త కారంబునకున్. (31) 176

క. త్రైరాజ్యము కులమధిపతి
మారుతభుగ్భుజుఁడు, గ్రహమమరగురుఁడు, ఫలం
బారణము, కాంతి శుక్లా
కారము, బీజంబు శుచి థ కారంబునకున్. (32) 177

క. ఇలబీజము, రుచిశ్యామము,
ఫలంబు ధృతి, గ్రహము గురుఁడు బాహుజమరయన్
గులమగు నధినాథుఁడు దా
నలరఁగ నందీశ్వరుండు దా క్షరమునకున్, (33) 178

క. తెలుపైనట్టి గ్రహం, బధి
పాలుఁడు భాస్కరుఁడు కులము బాహుజ, ఫలం
బోలి ధృతి జలము బీజము,
క్రాలెడు రుచి, పీతమగు ధ కారంబునకున్ (34) 179

క. గౌరము వర్ణము, వంశము
వైరాజ్యము గురుడు గ్రహము వరుడీశుఁడగున్
భూరి పరితాపము ఫలము
నారయ బీజంబు ... నా క్షరమునకున్ (35) 180

క , , (36) 181

క. అనిలము బీజము, గ్రహమగు
శని విఘ్నేశ్వరుఁడు భర్త, శూద్రము కులమా
తనురుచి గౌరము ఫలముగ
ననుపదు రత్నప్రదంబు ఫా క్షరమునకున్. (37) 182

క. ఆరోగ్యదంబు ఫలమూ,
గౌరమురుచి బీజమవని గ్రహమరయంగా
సౌరి, పతులమర వైద్యులు
నారాజాన్వయము బాక్షరమునకున్. (38) 183

క. ఆతోయము బీజాబగు
ఖ్యాతిగ దైవంబు భద్రకాళి, కులముదో
ర్జాతము శనిగ్రహము, శుభం
బాతతఫలమెలుపునన్న భా క్ష రమునకున్. (39) 184

181 దీనికి సంబంధించిన పద్యము మూలములోనె లేదు.

క. ఆభర్త కాలరుద్రుఁడు,
క్షోభ ఫలము గ్రహమర్కజుఁడు శ్యామంబా
శోభయు జననము ఔత్రం
బాభపదము బీజమరయ మాంక్షరమునకుఁ. (40) 185

క. వెన్నెల రాయండుగ్రహము,
వన్నె తెలుపు, ఫలము లక్ష్మి, వైశ్యంబు కులం
బెన్నఁగ కరువలి యేలిక
యన్నయ బీజంబుగాలి యా క్షరమునకున్. (41) 186

క. సిరినైదోడుగ్రహం బం
గరుచి మెఱుపు బీజమగ్ని, ఔత్రముకులమా
వరుఁడు కృశానుడు, దాగా
కరణంబు ఫలంబగున్ ర కారంబునకున్. (42) 187

క. అంగరుచి నల్పు, చితమా
తంగుఁడ, (?) పతి ఫలము జాడ్యము,శని గ్రహమా
రంగుబీజము ధరనే
కాంగ కులము వైశ్యమాలకారంబునకున్.

క. వైరాగ్యం బన్వయ మగు
నారోగ్యాయుషటముల్ ఫలావళి. శ్వేతం
బౌరుచి, పతివరుణుఁడు, కమ
తారిగ్రహము, బీజమొప్పు వా క్షరమునకున్. 4(44) 189

క. పరిపాలిని కమల, నభం
(బరయఁగ) బీజము, శశిగ్రహము, వన్నియ బం
గరురుచి, విభూతిఫలవై
ఖరి, వైశ్యం బన్వయము శ కారంబునకుఁ. (45) 190

క. కమలారిగ్రహము, దైవము
క్షమణి, ఫలము ఖేద, మాశుగము బీజము, ర
క్తిమ చాయ, కులము వైశ్యము,
క్రమముగ నూహింప మ కారంబునకున్. (46) 191

క. పవనాప్తుఁడు దాబీజము,
దేవియువాణి- రుచిమెఱుపు గ్రహము విధుడు- మూ
డవ కులము కులము, సంపద,
కవఁగూడుట ఫలము, దా స కారంబునకున్. (47) 192

క. వరుఁడీశానుఁడు, రజనీ
వరుఁడు గ్రహము, ముక్తిఫలము, వసుమతి సుశ్రీ
కర విజయము, రుచిగౌరము'
గరిమ కులము వైశ్యమగు హ కారంబునకున్. (48) 193

క. నలినారి గ్రహము, జాడ్యము
ఫలమగు, భూతములు పతులు, ప్రభ గౌరము, స
త్కులమును శౌద్రము, బీజం
బలరంగా జీవనంబు ళా క్షరమునకున్. (49) 194

క. నరసింహుండధి నాథుం,
డరయగ్రహము రుద్రు, డన్వయము శౌద్రము, తె
ల్పురుతను రుచి, ఫలము శుభం
బరుదుగ బీజంబు మిన్ను క్ష కారంబునకున్, (50) 195

9. సంయుక్తాక్షర ప్రయోగము

తే. గీ. మొదలసంయుక్త వర్ణంబు గదిసెనేని
మఱువ కారెంటికిని గ్రహమైత్రివలయు
నిదివిచారింపరేనిఁ గృతీశ్వరుండు
పిడుగు మొత్తినగతిఁగూలు బిట్టు బిఱ్ఱు. 196

---

192 రెండవ చరణములో యతిస్థానము సరిగాలేదు.

196 సు. సా. లో. 242 ప

క. పొందెఱిఁగి యానుకూల్యము
బొందంగఁ గూర్చి తగం బ్రయోగిం పకృతిన్
సందర్భింప గణాక్షర
బృందఁబిరువురకుఁజాలఁబ్రీతి యొనర్చున్. 197

క. తలపోసి గద్య పద్యా
దుల గణముల్ గ్రహములకు నుందొరయుడు మైత్రిల్
గలుగఁగఁ జెప్పిన హస్తా
మలకముగాదె ఫలంబు మహినిర్వురకున్. 198

ఉ. లక్కణమెంచికైత మొదలన్ సుగణాక్షరముల్ ఘటింప రెం
డక్కరనేలు నేలగలయంతయు, సూరెల రాచచేసి కాం
బ్లొ (?)క్కట కొల్వగా మెఱపి యోజయ నిచ్చలుఁ బిచ్చ
లించు దా
పెక్కఁడి గబ్బముల్ వెలయు నెల్లరు మెచ్చ(చునుందు)
రెప్పుడున్. 199

కవి కంఠపాశే:-
అక్షరే పరిశుద్ధేతు నాయకో భూప ఉచ్యతే 200
చమత్కార చంద్రికాయామ్:-
న్యస్తా: కావ్యముఖేవర్ణా స్తత్తద్దైవ మూర్తయః
కర్తు : కారయితు, శ్రోతుః కల్పయంతి శుభాశుభమ్. 201

## 10. అక్షర గ్రహాలకు ఫలితార్థము.

తే. గీ. ఆదులకు రవి, కాదులకవనిజుండు,
చాదులకు బుధుఁడు, కవిటాదులకును
తాదులకును గురుండు, శని పాదులకును
యాదులకునెల్ల శశియుగ్రహములు రామ! 202

---

198 సు. సా. లో 244 ప

200. అ. రం, ఛం. ప 129

201. అ. రం ఛం. సం. 120 సు. సా. లో. 228 ప.

## 11. అక్షరాణాం వర్ణవివేకః

అలంకార సంగ్రహే :-

ద్విజాయితః పంచదశ పూజ్యాః కచటవర్గజాః
నృపాన్వయాస్త పరవా వర్ణా ద్వాదశ సంస్కృతాః
యలహాశ్చషసా వైశ్యకులజాః పూజితాశ్చషట్,
ళక్షరా శూద్రకులజా స్త్రయోవర్ణాః ప్రకీర్తితాః     203

ఆంధ్రభాషాయామ్:-

అథర్వణచ్ఛందసి:-

క. వసుధామరులకుఁ గచటలు
వసుధాపతులకునుఁ దపరవలు, వైశ్యులకున్
యసహాలశషలును, శూద్రుల
కసమున ళక్షరలుం జెప్పనగుఁ బద్యాలిన్.     204

కవిసర్వగారుడే:-

సీ. కాదిత్రివర్గవర్ణాదికి మౌక్తిక
వజ్రభూషలు తెల్పు వస్త్రచయము
తపవర్గ రవవర్ణ తతి కబ్జరాగంబు
తొడవులు వలువలు తొగరుచాయ
యలశషసహ బీజములకగు పుష్యరా
గాభరణములు పీతాంబరములు
ళక్షరమ్ములకు నీలాలసొమ్ములు కారు
కొనునీలివన్నెల కోకలెల్ల

తే. వరుస నీనాల్గు తెలుఁగుల వర్ణములకు
ననుభవంబగు ద్రవ్యంబు నానబాలు
నాజ్యమును గమ్మదేనియ యాసవంబు
దీనిఁదెలియకేగతిఁ గవియానుజగతి     205

---

203 అ. రం. ఛం. సం 128

204 అ. రం. ఛం. సం 126 ప సు. సా. లా. 239 ప.

205 అ. రం' ఛం. సం 133 సు. సా. లా.133 ప.

అనంతచ్ఛందసి:-

ఆ. ఆదులు వర్గత్రియమును
భూదేవతలు, తపవర్గములు రవలున్ క్షా
త్రియుతతుల, యలశష సహ
లాదట నూరుజులు. శక్షరాఖ్యలు శూద్రుల్. 206

## 42. తత్త్వాక్షరః

పాదాంగచూడామణౌ:-

క. పరఁగఁగ అ ఆ ఏలును
వరుసఁ గచటతపయషలు ధ్రువంబుగఁ బడయున్
ధరబవన బీజములు గో
నరవాహన! సకలలోక వందితచరణా! 207

క. క్రమమున ఇ ఈ ఐ లును
రమణ ఖ ఛ ఠ థ ఫ రసలును రాజిలఁబడయున్
విమలముగ నగ్నిబీజము
లమరఁగఁ దలపింప శంబరాంతక హరణా! 208

క. మున్నుగ ఉ ఊ ఓలును నా
యెన్నగ గజడదబలహలు నీపదియును నా
బన్నుగ భూబీజంబులు
పన్నగవరశయన బాణ ! పన్నగ భరణా! 209

క. ఆరయ ఋ ౠ ఔలును
సారపు ఘ ఝ ఢ ధ భ వళలు సరవిన్ బదియున్
ఘోరపు జలబీజంబులు
ఘోరాసురపురవిదార! గోధ్వజ కలితా! 210

---

206 ఆ. రం. ఛం అ 2 ప127

207 సు. సా. లో 209 ప

208 సు. సా. లో. 210 ప

209 సు. సా. లో 211 ప

210 సు. సా. లో 212 ప కాని ప్రాగ్రంథ పదము ఛేన్న మున్నగాన్న గ.

క. ఞ ఞా అం జ ఝ ణ నవలు
పలు విత్తములై వెలుంగు శక్తులు పదియుక్
గలుగ గగన బీజముల నా౯
దెల్లముగా మాద్రవాది దివిజస్తుత్యా! 211

ఇది ప్రస్తరించు లక్షణములు:—
అ ఇ ఉ ఋ ఌ యీ౽ అయిదువర్గాల కిందను అ విడిచి
ఆదులు పదిన్ని, కాదులు, యాదులు వ్రాస్తే యేర్పడును.
ఇందులో అనలానిలవర్ణ సంయోగం పద్యాదిని రాకుండ
బరిహరింపవలెను. 212

ఇందుకు ఫలాలు—
ఆంధ్రభాషాయాం:—
అథర్వణచ్ఛందసి:—

గీ. గగన బీజంబు పేదఱికంబు; వగపు
వాయు బీజంబు; మృతిఁజేయు వహ్ని బీజ;
మంబు బీజంబు సంతోష; మవని బీజ
మఖిలసంపత్కరంబు పద్యాదియందు. 213

13, అమృతాక్షర వివేకః

కవికంఠపాశే:—
అకచటతపయశ వర్గాదమృతం ప్రోక్తం విషాణి దీర్ఘాణి. 214
ఆంధ్రభాషాయాం:— 215
అథర్వణచ్ఛందసి:—

క. అమృతాక్షరములు హ్రస్వము
లమరంగ దీర్ఘములు విషలము లనబడు వీనిక్
గ్రమమున అకచట తపయశ
సముదయమునఁ దెలిసి నిల్పఁజను పద్యాదిన్. 216

---

211 సు. సా. లో 213
214 అ. రం. ఛం అ 2 ప 137
216 సు. సా. లో 215 ప

దీర్ఘాలు విషాలై నందుకు లక్ష్యం:—

వేములవాడ భీమన్న:—

క. కూరడుగము, కాయడుగము
ఆరంగా నల్లి పచ్చడని యడుగము మా
పేరామీద పోకడిగినన్
శారమ్మన (?) వేసెనట్టి బ్రాహ్మడు దెల్లెన్. 217

క. వినబడుదీర్ఘము విషమగు
ననియ నిజమ్మగును సంయుతాక్షర మైనన్,
మునుపటి గుణములు విడిపడి
తనరన్, వేరొక్కగుణము దాల్చును రామా! 218

విశ్వేశ్వరచ్ఛందః-

క. (శ్రీ)కారము ప్రథమంబున
ప్రకటముగనున్నఁ జాలు బహుదోషములన్
వేకుంచి శుభములొసగును
ప్రాకృతము నినుము సోకు పరుసము బోలెన్. 219

టీక:- (శ్రీ)కారంబెటువలె నంటె—శవర్ణ, రేఫ, ఈకారములు కూడగా (శ్రీ)కారమాయెను. అందు శవర్ణ రేఫలకుగ్రహం చంద్రుడు. కనక ఈకారానకు గ్రహంసూర్యుడు. వారిద్దరి కన్యోన్యమైత్రి. కనుక శవర్ణ ఈకారముల కధి దేవత లక్ష్మి. రేఫకు అగ్నిదేవత. అయితేనేమి అగ్నిలక్ష్మి ప్రదుండు. ఇందుకుసమ్మతి. 220

చమత్కార చంద్రికాయాం: ( ) 221

---

217 మూలములో 'పాకడిగిన' అనియున్నది.

218 అ. రం. ఛం అ 2 ప 140 లో సంభోధనమాత్రము లేదు.

219. అ ఇది లక్షణసారములోనిది యని, అ. రం. ఛం. అ 2. ప 145 గా నుదహరింపబడినది. అది పొరపాటని రుజువగుచున్నది. ఇట్లే ఈపద్యము సులక్షణ సారములోఁగూడ నుదహరింపబడినది.

220 అ. రం. ఛం లో. 142 క్రింది వచనము

221 ఉదాహరణ నీయ మరచినాడు. కాని అ.రం. ఛం అ 2 సం 143 గ నున్నది

కవికంఠపాశే:—

క. పంచమ వర్గాక్షరముల
నెంచింపక నేత్వ మిత్వమిడి కృతి మొదలన్
నుంచిన కృతిపతి మిక్కిలి
సంచలితైశ్వర్యుఁడగుచు జడుగతిఁదిరుగున్. 222

క. చొక్కటపు పయి శాక్షరములు
తక్కవవర్ణములయందు తలకట్టేత్వం
బక్కజముగఁ గొమ్ము దీర్ఘము
మక్కువతో నియ్యఁబతికి మంగళమమరున్ 223

గోకర్ణ చ్ఛందసి:-ఋషిప్రోక్తే—
లక్ష్మీ ప్రదో.........చ్ఛేద్దుతాశనాత్ 224

వ. అనుట అగ్నియు లక్ష్మీప్రదుఁడైన దేవర అనిన్ని శ్రీకారం
లక్ష్మీస్వరూపమనిన్ని ఎరుగవలెను. 225

14. అ క్ష రా ణాం గ త యః

కవికంఠపాశే:-దైవన్యతిర్యగ్గారవద దావర్ణః (?) తత్రక్రమస్సు.
లఘువో దేహా (?) కచటతపాఅధన రాదిఘా ఇతి. 226

ఆంధ్రభాషాయామ్:-

అథర్వణే:-

క. సురవర తిర్యగ్గిరవ
వరగతులగు భూసురాది వర్గాక్షరముల్
గురులఘువులు నరసురగతు
లరిరాయ విఫాల; సోమయవనీపాలా! 227

---

222 కవికంఠపాశము సంస్కృత రచన. కావున నీపద్యము దేనిలోదో?

224 అ. రం. ఛం ఆ 2 సం 148, 149 లలో వేరువేరుగా చెప్పఁబడిన భాగముం తయుం నిచ్చట ఒకటిగాఁ జెప్పబడినని. కాబట్టి యిదియె సరియైనదిగా భావించవచ్చును.

225 అ. రం. ఛం, ఆ 2 సం 144

227 ఇది అదర్వణ కృతముకాదు. ఈసంబోధనలు శ్రీధర ఛందస్సు (క్రీ.శ.1350) లోనివి యని తెలియుచున్నది.

కవిసర్పగారుడే:-

త్రి. నణనజఝ ఞహీనంబగు వర్గకం
చకములఁగల్గు నక్షరములెల్ల
నరయఁగఁగూడుచల్లె నిర్జర గతులగు
నిశదలై యుండిన నృగతులగును
న ఋ ౠ ఌ ౡ ఙ ఞ ణ మలు రేఫవిహీన
యాద్యష్టకమును దిర్యక్క్రమంబు
లగుగాని రేఫ యాద్యోగతి యగు నిందు
బ్రత్యేకదళము లేర్పడఁగ వరుస

తే. గీ. సురనృగత్యక్షరంబులు శుభములొసఁగు
మధ్యఫలద తిర్యగ్గత మాతృకాళి
నిరయగత వర్ణమొక్కటి నెరయఁగాదు
ప్రౌఢకవులు రచించు కబ్బముల మొదల, 228

అల్పప్రాణవర్గాః

అల్పప్రాణ వర్గాణాం ప్రథమతృతీయా అంతస్థాశ్చాల్పప్రాణాః
యథాతృతీయాస్తథాపంచమా ఇతరే సర్వే మహాప్రాణాః 229

అథర్వణచ్ఛందసి:-

క. అల్పప్రాణములతిమృదు
జల్పోచితవచన పంక్తి ఝ భ ఘ ధ ఠ ములౌ
నల్పకఠోరాక్షరములఁబ
నల్పొటగునవి మహాయుత ప్రాణంబుల్. 230

అక్షరాణాంగద్యపద్యేన తత్త్వస్థాన ప్రయోగ నిషిద్ధా. 231

సాహిత్యరత్నాకర:
షల్పప్త్రుదృసంస్థాశ్శుక నరహాచలే (?)
కలహాదాయకాః॥ చతుర్థరీతి॥ 232

---

228 అ. రం. ఛం. ఆ 3 ప 149 గూలములో పోయిన కొంతభాగమును అ. రం
ఛం. లోని పద్యమునుండెత్తి కుండలీ కరణములోఁ జూపించితిని.

229 అ. రం. ఛం. ఆ 2 సం 152 230 అ. రం. ఛం. ఆ 2 స 153

15 విషమాక్షర విచారము 233

ఆంధ్రోక్తమగండచ్ఛందసి:-

క. అకచట హాలసఁగ నేనును
బ్రికటితముగ ఋతుల గిరులఁబడు నొక్కింటన్
నికటముఁగ గూర్చి పద్యము
సుకవులు సత్రిభులకీ రశుభదము లగుటన్. 234

అనంతచ్ఛందసి:-

క. పురశర రసగిరి రుద్రుల
నరయ న కచటతపలిడుట యనుచితమయ్యా
క్షరములు నరచఛ జంబులు
బరిహరణీయంబు లాదిఁ బంకజనాభా! 235

కవిసర్పగారుడే:-

క. సంగతిగఁ గృతుల స్త్రీపుం
లింగంబగు శబ్దములు మొదల లెస్సగు నిల్పన్
వెంగలి బుద్ధి నపుంసక
లింగంబగు శబ్దమిడిన లేవు సుఖంబుల్ 236

రసగిరి రుద్రసంఖ్యలను రాదొన గూర్ప స్వరాదివర్ణముల్
వసుధహాకారమన్ క్షరట వర్ణచ వర్ణములన్ దలంపగా
నస జగడంబు వాగు లిడనైదగుచోట్ల హలాది వర్ణముల్
బొసగదు చెప్పనాది రసముల్ చజముల్ గదియింప వర్ణ
ముల్ 237

అథర్వణే:-

క. ఇ ఈ ఋ ౠ జ ఛ ఝ ఞ ట ఠ ఢ ణ
ధలు, నపబభమలు, సరణాలతతి, హాక్షసులుఁ

234 ఆ. రం. ఛం. అ 2 ప 155 సు. సా. ప 217
235 ఆ. రం. ఛం అ 2 ప 157 సు. సా. ప 218
236 ఆ. రం. ఛం. అ 2 ప 160. సు. సా. లో 265 ప.
237 సు. సా. లో 219 ప.

నెలకొనఁబద్య ముఖంబున
నిలుపరు సత్కవులు శాస్త్రవిద్యము లెఱుఁగన్. 238

ఇందుకు ఆదికవిలక్ష్యములు—భీమన్న:-

ఉ. నాయమది సీతపోత వసుధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ, జాహ్నవి వారధి, మారుడంజనీ
ప్రియతనయుండు సింగన విభీషణుఁడా గుడిమెట్ట లంక నా
జయమును బోత రక్కసుని చావును నేఁడవనాఁడు సూడుఁడే. 239

టీక. 1 హకారం 5 సకారం 11 ధకారం

శరభాంకుఁడు:-

ఉ. చాపముగాన హార్యమును, చక్రిని బాణముగాఁగ నారిగాఁ
బాపవరేణ్యుఁ జేసి తలపన్ త్రిపురంబులఁ గాల్చవే మహా
దీపిత తీవ్రకోపమున దేవత లెల్లనుతింప నాఁటి విల్
పాపు డిల్లిమీఁదదెగఁ జూపగదే శరభాంక లింగమా !
టీక-చకారం, 6హకారం, 11 క కారం. ఇట్లనఎఱుఁగవలెను.240

## 16 దేవతా వాచక భద్ర వాచకాలు

కవికంఠపాశే:-

దేవతా వాచకాశ్శబ్దాయేచ భద్రాది వాచకాః
తే సర్వేనైవ నింద్యాస్స్యుర్గణతో లిపితోఽపి వా, 241

సాహిత్య చూడామణౌ:-

అథసిద్ధి ప్రీణవాది శ్రీచంద్ర సూర్య దీర్ఘాయుః
ఆరోగ్యకుశల వాణీసాగర మేఘాద్రి మంగళాశ్శబ్దాః 242

ఆంధ్రకవిసర్పగారుడే:-

క. తరణీందు భద్రసాగర
గిరికుశలారోగ్య మేఘ గీస్తుత్యాయు

238 సు. సా. లో 220 ప 239 సు. సా. లో 239 ప

240 సు. సా. లో 224 ప

241 ఆ. రం. ఛం ఆ 2 ప 164

242 ఆ. రం. ఛం. ఆ 2 ప 165

స్ఫురదముల కీర్తి సుమనో
త్కరాది వాచకము లిడఁగఁదగుఁ బద్యాగ్రిన్ 243

గీ. దేవతావాచకముల వర్తిల్లె నేని
భద్రవాచకములఁగూడి పరగెనేని
నగణ సంపర్కలబ్ధితోఁ దగియెనేనిఁ
గూర్చిరసంయుక్తి లిపులైనఁ గూడు మొదల. 244

కావ్యచింతామణి—తాతంభట్లు—

క. నిరుపమ కావ్యాదిని సుర
వర భద్రాది ప్రశస్తవాచక పదముల్
బెరసిన దదుష్టగణా
క్షరదోషముల్ జయించిన సంపద నిచ్చున్. 245

అనంతచ్ఛందసి:-

క. తనరఁగ శుభవాచకములు
ఘనమలరగ దేవవాచకంబులునై పే
ర్చిన గణములు వర్ణంబులు
ననింద్యములు కృతుల మొదల నహిపతి శయనా! 246

దేవతా వాచకంబులకు లక్ష్యములు—

ఏకావళియందు 'ప్రాలేయాచల కన్యకా' యనుట; కల్పవల్లరి యందు 'హేరులు (?) మవలంజేయును; మరియు ఉభయకవి మిత్ర విరాటపర్వస్యాగ్రా [శ్రీ]యున' గౌరీనాథ'గు చెల్వాను' ననుట గల్గియుండును. 247

భద్రతా వాచక లక్ష్యములు.-

కాళిదాసస్య శ్యామలా దండకాదా వ్యక్తం 'జయ మాతంగ తనయే జయ' ఇతి; నంది తిమ్మయ త్రిస్థలి దండకం 'విజయ నగరిన్ హేమకూటంబునన్ నిల్చి పంపా విరూపాక్షునిం గొల్చి' యనుట గల్గియుండు నిటున........ 24

243 అ. రం. ఛం. అ 2 ప 166 244 అ. రం. ఛం. అ. ప 2 167
245 ,, ,, 168 246 ,, ,, 169

## షట్స్థలద, రగళె

పాలకురికి సోమనాథ మహాకవి కృతము)

—(మందానిల:- మధురగతి రగడ

శ్రీమదనాది విముక్తం భక్తం
ప్రేమకళాపంయుక్తం ,,
ఉత్సాహ గుణాసక్తం ,,
కుత్సిత కర్మ వివిక్తం ,,
లోకాచార విరక్తం ,,
లోకానుగ్రహ శక్తం ,,
స్నిగ్ధ వచస్సం ప్రోక్తం ,,
జగ[1]ద్భరణ మిత్యుక్తం ,,
వేదాంతరహస్యోక్తం ,,
బోధాఖ్యా[2]శ్రయయుక్తం ,,
ధర్మారంభోద్యుక్తం ,,
ఆర్జిత భూరి వివిక్తం ,,
నిర్జిత మోహాహోద్రిక్తం ,,
మంగళతర సద్వక్త్రం ,,
అంగసుసంగ నివృత్తం ,,
ఆచారాశ్రిత చిత్తం ,,
శ్రీచరతోషిత విత్తం ,,

(లలితె)=ద్విరదగతి రగడ.

శ్రీలింగ నిష్ఠాగరిష్ఠ మాహేశ్వరం
శీలవ్రత క్రియా శ్రేష్ఠ ,,
ప్రారబ్ధపర్యంత కారి ,,

---

1. త్వాతాస 2. ఖ్యాశ్రి

సారసజ్జన మనోధారి మాహేశ్వరం
ఉక్తిగమన ద్వితయ వంత ,,
యుక్తి పూర్వాంగ మితశాంత మాహేశ్వరం
వీరవ్రతం మహోదారి ,,
పారతార్కిక సుఖాకారి ,,
శ్రద్ధాపరం సత్వశుద్ధ ,,
సిద్ధగురులింగ సన్నద్ధ ,,
తుష్టాంత రంగ గుణహీన ,,
కష్టకర్మ చయావధీన మాహేశ్వరం
శస్తతర వర బుద్ధిహస్త ,,
అస్తిభావైక విశ్వస్థ ,,
అన్యచింతాతీత ధన్య ,,
సన్న్యాయ మార్గ జనమాన్య ,,
ఏకాగ్ర సంగతి శివాత్మ ,,
నైక పతిదృష్టి పవిత్రాత్మ ,,

ఉత్సాహ—తురగవల్లనరగడ

శ్రీశివాభిధాన లింగసావధాని సుప్రసాది
పాశమోచనార్పణ క్రియాభిమానిత ప్రసాది
ఇంద్రియాదిమిత సమస్త వస్తు భేదక ,,
బిందు నాదకాలకర్మ చక్రసాధక ,,
లింగముఖ నివేద్యమాన శబ్ద సేవక ,,
లింగతత్స్పర్శ సుఖసమర్పణ ప్రియ ,,
రస్యమాన సర్వవిధర సౌఖ్యదర్పక ,,
దృశ్యమాన సర్వరూప సుఖసమర్పక ,,
దివ్యతర సుగంధసుఖ సమర్పణ ప్రియ ,,

భవ్యతర విశిష్ట సర్వగుణ గణాశ్రియ ప్రసాది
దేశిక ప్రసన్న భావ భాజనస్థల ,,
శ్రీశివాతిశయ కృపాసముద్ర భూతల ప్రసాది
చారు తర చరాభిమాన లింగ 1 లాలిత ,,
సారసార భూత పాద వారిలాలిత ,,
పావన ప్రసాద ఘనమహత్వ కోవిద ,,
కేవలావధాని గుణ నిరస్త దుర్మన ,,
శుద్ధసిద్ధ సుప్రసిద్ధ తత్వ సుఖమయ ,,
వేద్య మానతనుగుణ ప్రహారణ నిర్దయ ,,
సూతక భ్రమావికల్ప జాతనిగ్రహ ,,
వాత మిశ్రలక్షణ ప్రతీత నిగ్రహ ,,

(లలిత=త్వరదగతి రగడ.

శ్రీమన్నిరూఢ గాఢానుభవ దివ్యప్ర
భామయ నిరామయ ప్రాణలింగేశ్వరం
వ్యామోహదూరకలికామ సంహారవి
శ్రామవిద్యామయ ప్రాణలింగేశ్వరం
అంగలింగోద్భవస్థల పరిజ్ఞానపా
రంగత సుసంగత ప్రాణలింగేశ్వరం
అంగస్థలం జీవలింగం శివేతివి
ద్యాంగనాలింగిత ప్రాణలింగేశ్వరం
దేహోహమింద్రియాణ్యహమేతి వికల్పనం

1 జాలిత

ద్రోహసంహారక ప్రాణలింగేశ్వరం
సోహం శివోహం శివోహమితి నిత్యంస
మాహితోత్సారక ప్రాణలింగేశ్వరం
మంగళమనోహాస్త సమ్యగ్ధరమహా
లింగస్వరూపక ప్రాణలింగేశ్వరం
భృంగచంపక పదాత్మజ్ఞానపారవ
శ్యంగతా లేపక ప్రాణలింగేశ్వరం
హృద్యశివయోగ నిశ్చలతరసమాధి నిర
వద్యాను భావమయ ప్రాణలింగేశ్వరం
ద్వైతమిథ్యాశుష్కవాద 1 బృంద ధ్వాంత
శీతకర సురుచిర ప్రాణలింగేశ్వరం
స్ఫీతపరమాద్వైత సద్భక్తిఘనరస
స్రోతస్వినీపతి ప్రాణలింగేశ్వరం
సత్యవిజ్ఞానమయ సద్గురు కృపాలబ్ధ
తత్త్వమసితత్పర ప్రాణలింగేశ్వరం
కృత్యకర్మాకృత్యకర్మపాశచ్ఛేద
నాత్యధిక విద్వర ప్రాణలింగేశ్వరం
జీవద్విముక్తోభవిష్యతి శ్రుతితతివ
చోవిశేషార్థక ప్రాణలింగేశ్వరం
వ్యావహారిక దృష్టి సత్యసద్భావమా
యావిలాసత్యయ ప్రాణలింగేశ్వరం
నిత్యంతరతిశోక మాత్మేతి పరిముఖ్య
శ్రుత్యర్థ కీర్తిత ప్రాణలింగేశ్వరం
ప్రత్యక్షభూత విర్మల జీవలింగవ్యా
ప్తిసహ వర్తిత ప్రాణలింగేశ్వరం

---

1 వృంద

మందానిల=మధురగతి రగడ.

శ్రీపరమానందోదయ శరణం
వ్యాపిత ఘనమహిమాంబుధి ,,
నిజలీలా పరివర్తిత ,,
త్రిజగజ్జన సంకీర్తిత ,,
సర్వానుగ్రహ నేత్రం ,,
సర్వవశ్యైక కళత్రం ,,
నిర్భీకృత నిరావరణం ,,
గర్భీకృత పురవారణం ,,
స్వచ్ఛందాచార పరం శరణం
స్వచ్ఛతర జ్ఞాన తరం శరణం
పరమాకాశ శరీరం శరణం
పరతత్త్వైకాకారం ,,
స్వవినోదాదృత పిండం ,,
శివసుఖరత్న కరండం ,,
భక్త్యయశోన్విత భోగం ,,
త్యక్త మహామల భాగం ,,
స్వయమేవ స్వయశః ప్రియ శరణం
జయజయజయ శబ్దాశ్రయ శరణం

మందానిల=మధురగతి రగడ.

శ్రీమన్నిస్సంగం లింగైక్యం
వ్యోమాతీతాంగం ,,
సుమహాద్భావ కరం ,,
సమరసరూపధరం ,,
పరతర వస్తునిజం ,,

1 సర్వవశైక

—: మందానిల :—

పరిపూర్ణ నిరంజన — లింగైక్యం
నష్టాష్టవిధార్చన — ,,
షస్థబ్రహ్మార్ణవ — ,,
నిశ్శేషం నిశ్చల — ,,
నిశ్శబ్దం నిష్కల — ,,
బహిరంతర శూన్యం — ,,
ఇహపరలోకాన్యం — ,,
స్తిమితోదధిసమశమ — ,,
హిమశిఖియోగక్రియ — ,,
ఘనషట్స్థల బీజం — ,,
వినమితగణరాజం — ,,
సాక్షిదయాత్రిష్ఠతి — ,,
సాక్షాద్దై పురపతి — ,,

మ॥ నిరవద్యామల షడ్విధస్థలద దివ్యస్తోత్రమం భక్తియిం
నిరుతం కేళ్దొడెపెళ్దొడోదిదోడెః తచ్ఛబ్దార్థమం భక్తియిం
పిరదుం తాళ్దొడెపేళ్దొడం పరమ సమ్యగ్జ్ఞానమం మాళ్పనై
పుర సోమేశ్వరదేవనం డెనలిదేం చోద్యం మహాసాధ్యమే ?.

కం॥ అష్టోత్తర శతవిధదిం
దిష్టసు షట్స్థలద సుప్రసంగ వనోరెదం
స్పష్టతరోక్తి గళిందం
శిష్టశ్రీసోమనాథ సద్గుణయూథం.

— సంపూర్ణము. —

గత సంచికలోఁ బ్రకటిత మయిన "చెన్నబసవ రగడ" తో పాటు సోమనాథుని లఘుకృతులందలి యీ షట్స్థలరగడకూడ మహబూబునగరోన్నతపాఠశాలాధ్యాపకులయిన శివ శ్రీ నాగలింగ శివయోగి గారి తాళపత్ర గ్రంథసంచయము నుండియే సేకరింపఁబడినది. వీరశైవ విజ్ఞానము భక్త, మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యస్థలములను షట్స్థలవిజ్ఞానముపై నాధారపడియున్నది. ఈషట్స్థలములను గూర్చినప్రామాణిక గ్రంథము శివయోగి శివాచార్యుఁడు, రేణుకాచార్యుఁడు అగస్త్యమహర్షికి బోధించినట్లుగా సంస్కృతభాషలో రచించిన సిద్ధాంతశిఖామణి. ఈషట్స్థలములే యవాంతర భేద: ములతో 101 ఏకోత్తరశతస్థలములయినవి. సోమనాథుని లఘుకృతులలో నీ షట్స్థల రగడకూడ నశ్రుతపూర్వ మయినది. మూలమునందలి పాఠము లర్థసంగతికి ననువుగాని చోటుల నించుక సవరించి మూలపాఠములను పుటలయడుగున 1. 2 మున్నగు గుఱుతులతో నుదాహరించితిని.

బండారు తమ్మయ్య,
పరిషదధ్యక్షుఁడు.

## విజయనగర సామ్రాజ్యము ను బరిపాలించిన కడపటి సంగమ వంశ రాజులలోని ప్రౌఢదేవరాయల (క్రీ. శ. 1419-1446) కాలమందలి మతవాఙ్మయము వివాదములు.

మైసూరురాష్ట్ర ఓరగాముక శాశాలా ప్రధాన చరిత్రోపన్యాసకులు, వీరశైవేతిహాసప్రవీణ శ్రీ బి. వి. శ్రీనివాసరావుగారు,
M. A. M. R. A. S. (Ceylon). F. R. A. S. (London)
(ఆంగ్ల వ్యాస రచయిత)

శ్రీ బండారు తమ్మయ్య (అనువాద కర్త)

సంగమవంశ రాజులలోని ప్రౌఢ దేవరాయల కాలము నాఁటి మతవాఙ్మయమునుగూర్చియు, వివాదముల గూర్చియుఁ దెలియుటకు

ముఖ్యాధారము కన్నడమున రచింపఁబడిన ప్రౌఢ దేవరాయన
మహాకావ్యము. ఇది వార్ధక షట్పది చ్ఛందమున నిరువది యొకటి
సంధులుగ, 1118 పద్యములలో రచింపఁబడినది. దీని కర్త మహా
మల్లేశప్ప శిష్యుఁడగు అద్రిశప్ప. ఇతనితండ్రి బిజాపూరు
ప్రాంతమందలి కొల్లాపురముపరగణాకు దేశాయిగా నుండిన
అన్నప్ప. అద్రిశప్పకు సిద్ధాద్రిప్యమహాకవి యను నామాంత
రము గూడఁ గలదు. అతని కాలము క్రీ. శ. 1580. (శ్రీ ఆర్.
నరసింహాచార్యులుగారి కర్ణాటకవిచరిత్ర మూఁడవ భాగము
(పుటలు 305-306). నాగవర్మ కృత కర్ణాటభాషా భూషణమునకు
మైసూరురాష్ట్ర విద్యాశాఖాధికారి శ్రీ Lewis Rice దొరగారు
రచించిన యుపోద్ఘాతము చూచునది. ఈ కావ్యమునుబట్టి ప్రౌఢ దేవ
రాయలకు ముకుందపెద్ది యను కందాళ దొడ్డయాచార్యుఁ డనెడి
శ్రీ వైష్ణవుఁడు రాజగురువుగా నుండినట్లు తెలియును. అతఁడు గాఢ
మయిన వైష్ణవ మతాభినివేశము గలవాఁడు. భారత పురాణమును
దొమ్మిదినెలలు ప్రౌఢరాయలకుఁ జదివివినిపించిన తరువాత ముకుంద
పెద్దియు నాతనితోడి వైష్ణవకవులు మఱికొందఱు రాజు సమ్మతితో
నా. భారతపురాణగ్రంథమును విజయనగర రాజవీథులలో గౌరవపూ
ర్వకముగా నూరేగించిరి. దీనికిఁ బోటీగఁ బ్రౌఢరాయల వీరశైవ
మంత్రి యయిన జక్కణార్యుఁడు వీరశైవ మత వాఙ్మయ గ్రంథముల
మహత్త్వమును బ్రకటింప నాయత్తపడెను. జక్కణార్యుఁడు కుమార
శంఖనాథుని శిష్యుఁడు. ఈ శంఖనాధుఁడు వీరశైవమతమందలి యేక
వింశతి గురుసంప్రదాయమునకుఁ జెందినవాఁడు. అతఁడు ఏకోత్తరశత
స్థల మను గ్రంథమును రచించెను. అది పురాతనుల వచనములను
గూర్చియు, ముఖ్యముగ ప్రభుదేవర వచనముల గూర్చియు వివరించు
నుత్తమ గ్రంథము. దీని కాతఁడే వ్యాఖ్యానమునుగూడ విరచించెను.

ఈ గ్రంథము నాతఁడు కలుమఠ ప్రభుదేవర, చామగుసారాధ్యుఁడు, కిరస్థల నాగిదేవుఁడు, వీరనారాధ్యుఁడు మున్నగు 101 విరక్తులతోఁ గలిసి యూరేగించి గౌరవింపసంకల్పించి, దానిని రాజవీధులం దొక రాత్రిభాగమున నూరేగించెను. ఈ 101 విరక్తులు భూమిపై నవత రించిన శివుని ప్రమథగణములకుఁ జెందినవారు. (ఇండియన్ ఆంటిక్వెరి సంపుటము 57 మేయి 1928, సంచికలు 1-12, పుటలు 77-88,) శాంతలింగదేశికులు (క్రీ.శ. 1672) రచించిన భైరవేశ్వర కావ్యకథా సూత్రరత్నాకరములో నిరువది యేడవ కథగాఁ బైని బేర్కొనిన యేకోత్తరశతస్థల గ్రంథముయొక్క యీ రేగింపునుగూర్చి వర్ణించెను. ధార్వారులోని మురుగ మఠము శ్రీ నిరంజన ప్రణవ మృత్యుంజయ మహాస్వాములు ప్రకటించిన, కలుమఠ ప్రభుదేవ విరచిత లింగలీలా విలాస చరిత్రము, పుట 10 చూచునది.

వైష్ణవగురువయిన ముకుంద పెద్ది శివశరణులుగావించిన పూర్వో చాహృత మహోత్సవమును దన యింటి మిద్దెపై నుండి విలోకించెను. ఆతఁడు రాజమంత్రి యగు జక్కణార్యుని యెదుట వీరశైవులు గావిం చిన యీ యుత్సవము శవముల యూరేగింపువలె నున్నదని ప్రసంగిం చెను. ఆ వైష్ణవగురుని యెత్తిపొడుపునకు జక్కణామంత్రి కోపగించి వైష్ణవుల భారతపురాణము నూరేగింపు, వాస్తవముగ నట్టి శవముల యూరేగింపుగాని, శివశరణుల యూరేగిం పట్టిదికాదని మాఱుపలికి శివశరణుల యత్సవము శివభక్తియను మాతృమూర్తికి జన్మించిన ముక్తి పుత్రిక జన్మదినోత్సవ మని నమ్మఁ బలికెను.

అందుపయి ముకుందపెద్ది శివశరణుల వచనములను రాగపూర్వ కముగ గానమొనరింపఁ జేయవలసినదని జక్కణామాత్యుని హెచ్చ రించెను. జక్కణార్యుని యాజ్ఞపయి నంత గాయకులొక శివశరణవచ నమును ముకుందపెద్ది వినుటకయి గానమొనర్చిరి. ఆ వచనముయొక్క

భావార్థమును వివరింపుటకు దాను సమర్థుఁడను గానని జక్కనామాత్యుండు ముకుందపెద్దినే దానిని వివరింపఁ గోరెను. ముకుందపెద్దియు జనపరిపాలకుండగు మమకార రాయుని యాస్థానమున మూర్ధన్యుఁడుగా నుండిన యల్లమ, యచ్చట నటిగానుండి యకాల మరణ మొందిన కామలతతోడి ప్రణయసంబంధిక గాథలో జరిగిన యాశాభంగమును దెలుపునదియే యీ వచనమనియు నది కేవలము కల్పితమని తన యభిప్రాయమనియుఁ దెలిపెను. ఈ వాక్యములు విని జక్కనమంత్రి శివశివాయని చెవులుమూసికొని కొన్నినాళ్ళయిన తరువాత వైష్ణవ గురునినోట శివశరణుల వచనములఁగూర్చి యిట్టి మాటలను దాను వినఁజాల ననియు, మాయామోహ పరబ్రహ్మముల విషయమై యాతడు పల్కినది వట్టియసత్యమనియు నుగ్గడించెను. దాని యథార్థమును నీవే వివరింపుమని ప్రౌఢరాయ లాజ్ఞాపింప జక్కన మంత్రి తన యభిప్రాయమును వెల్లడించెను. అదియే సర్వసమ్మతమని సభ్యులామోదించిరి. ప్రౌఢరాయ లమందానంద మంది, త్రిశర పదక రుద్రాక్ష కంకణ ప్రదానములతో జక్కన నుచిత రీతిని సత్కరింప నిశ్చయించెను. ముకుందపెద్దియు జక్కనామాత్యునియొక్క రాజునభిప్రాయమును మార్చికొనవలసినదనియు, తానుచెప్పినదే యావచనము యొక్క నిజభావమనియు దానిప్రకారము శివశరణులుమాయామోహములకు వశ్యులని, వారామాయామోహములకు చిహ్నములని విశదమగుననియు వాదించెను. ఇందు మూలమున యథార్థము నిర్ణయమగు వఱకు ప్రౌఢ రాయలుతాను జక్కనమంత్రికిఁ జేయదలంచిన సత్కారము నాపివైచెను. అందుచే మంత్రిజక్కనామాత్యుని యెదుట రాజసముక్షమందుండిన చామరసంయ్యముందుకువచ్చి వైష్ణవగురుండగు ముకుంద పెద్దికి సరియైన సమాధానములను దాను బదియైదు దివసములలోఁ

నిచ్చెదనని చెప్పి యచ్చటినుండి వెడలిపోయెను. ముకుందపెద్దియుండనని గూంటికి మరలెను. అనంతరము ప్రౌఢరాయలు చామరసాదాధ్యులు వచ్చుపోవలఁ దనకు శివశరణుల గాధలనుగొన్ని నివేదించి యానందము కలిగింపుమని జక్కన మంత్రిని ప్రార్థించెను. రాజువకు వైష్ణవము నెడఁగల మొగ్గుగుదగ్గిపఁదలంచి జక్కనార్యుండు నందు కంగీకరించి ఈసుగువఁ బేర్కొనిన శివశరణులగూర్చియు శైవవిషయములగూర్చియు నాతనికి నివేదించెను.

(1) ఘట్టివాళయ్య, (2) బంధహారిబ్రహ్మయ్య (3) కాళిదాసు (4) మయూర భాణకవులు (5) బాడవిపుత్రుఁడు మాధవరాయఁడు (6) కళాపధకుఁడు (7) శావవీరభూపాలుఁడు (8) దేవరదాసిమయ్య (9) అనలదేవి (10) పౌలస్త్యుఁడు (11) నూదన విజయరాయఁడు (12) పాదియాత్రికుఁడు (13) వీరపంగయ్య (14) జక్కనచూర దేవయ్య (15) శంకర దాసిమయ్య (16) గురుభక్తుఁడు (17) అష్టావరణములు (18) వాకుకృత్తముఁడు (19) ఉరులింగదేవుఁడు (20) లింగధారిశులమహిమ (21) గజేంద్రుడు (22) గుణగర్భుఁడు (23) కరికాలచోళుఁడు (24) ఉదకదానమహిమ (25) అన్నదానమహిమ (26) భిక్షావల్లవుని శిక్ష (27) దేవేంద్రకీర్తి దేవేంద్రవల్లభుఁడు (28) జలదానము (29) కన్యాదానము (30) కాలచంగ పెరుమాళ్ళు (31) దేవరాజ మలయరాజు (32) కలుకన్న చోళరాయలు (33) ఉగ్భటయ్య (34) సోమన్న (35) గోల్లాళుఁడు (36) లింగాభిషేకమహిమ (37) చండాపాఢి భక్తుఁడు (38) అగ్గణిహోన్నయ్య (39) కమలాదేవి (40) పవననాచిచిరుపులియారు (41) ధృతరాష్ట్రుఁడు (42) ధనశూరుఁడు (43) కామదహనుఁడు (44) శంబరాసురుఁడు (45) అనిరుద్ధుఁడు (46) పింగళాక్షుఁడు (47) కొంగోలియారు (48) సోమవ్వ

(49) లింగార్చనసిద్ధుడు (50) అసురనీతి (51) వీరసంగయ్య (52) దాత్రోహితరాయలు (53) సుకుమారుడు (54) కలికంబరాయలు (55) మానకంజారుడు (56) భుజబలరాయడు (57) భణితిమహాత్ముడు (58) భద్రనాయకుడు (59) అరిభక్తుడు (60) సుదాక్షమహిమ (61) చేరమరాయడు (62) నంబెన్న (63) శివపంచి (64) ఓహిలయ్య (65) బాచరసు (66) కుమారపాలఘూర్జరరాయలు (67) ఉపవాసి బ్రహ్మచారి (68) సానందుడు (69) సిద్ధరామేశ్వరుడు (70) సారంగరాయడు (71) కేశిరాజయ్య (72) ఘంటాకర్ణనాథుడు (73) మంగయ అక్కరిసి (74) చేరచోళపాండ్యుడు (75) మాణిక్యవాసుడు (76) నాగమాంబిక (77) సలాయి దాలిభూపుడు (78) రక్కసబ్రహ్మయ్య (79) మహాకాలయ్య (80) సిగ్గురాత్రి (81) ద్రౌపది (82) శిరియాళుడు (83) హాలాయుధుడు (84) బసవరాజన లీలబు (85) గొల్లాతి (86) బసవేశదర్శనము (87) మందారమల్లయ్య (88) బసవన లీల (89) చెన్నమ్మ (90) చిత్రిజసంగయ్య,

ఈతొంబది శివశరణవచసము లను రాజువినిన పిదప, వీరభద్ర ప్రసాదమున చామరసుతినయుంటనే ప్రభులింగలీల రచియించి తెచ్చి ప్రౌఢరాయలకు సమర్పించెను.

చామరసారాధ్యుల చరిత్రను సంగ్రహముగ పాఠకులకు వివరింతము. ఇతడు సహజవీరశైవుడు. సిద్ధనంజేశుడితనిని వీరశైవాచారమార్గుడని, అన్యమత కోలాహలుడని సంభావించెను. వీరశైవాచారధీరుడయిన యాతడు రాజసముక్షమున బలుమారులు వైష్ణవులతో వివదించి జయించెను. ప్రభులింగలీల కర్తలగు 101 విరక్తులలో నితడొకడు : రెండవదేవరాయలమంత్రి, వీరశైవ పండితుడయి, కవియైన జక్కన దండనాథుని యాదరమున నితడు

రాజాస్థానమున బ్రాముఖ్యమునొందెను. ఆంధ్రమున విక్రమార్క-చరిత్రము రచించిన జక్కన మహాకవి నాదరించిన సిద్ధనమంత్రి కీతఁడాశ్రియుఁడు.

ఈతఁడు రచించిన ప్రభులింగలీల శివుని ప్రమథగణ నాథులలో నొకని యవతారముగ నిరహంకార సుజ్ఞానదంపతులకు జనించి ప్రభులింగ, ప్రభు దేవ, గుహేశ్వర లింగనామములతో వర్తిల్లిన యల్లమ ప్రభువిచరిత్రమును వర్ణించును. నిరంజనుఁడగు నతనిశక్తి మహిమలఁ బరీక్షించుటకయి పార్వతీదేవి పరమేశ్వరునితోఁ బంతమొసర్చి తనయందలి తామసగుణమును, బలహాల దేశమందలి బనవసిపురమును బరిపాలించు మమకారప్రభునకు మోహినీదేవి యను భార్యయందు మాయ యను తనయగా నవతరింపఁజేసెను.

అల్లమునఁ డీ సంగతులనెఱింగి మాయాదేవి కుతంత్రములకుఁ బన్నాగములకు నెంతమాత్రము లొంగక యనిముషునివలన లింగముబడసి, మాయను మాయలఁబెట్టి జయించి, కల్యాణపట్టణమున కేగి యచ్చట బసవేశ్వరుఁడు నిర్మించిన, శూన్యసింహాసనము నధిష్ఠించె. భక్తవక్యాతి మనుభవగోష్ఠులకయి బసవేశ్వరుఁడు కట్టించిన అనుభవమంటపమున శధ్యక్షుఁడయి అటుపిమ్మట శ్రీశైలమునకుఁ బోయి యచటి కదళీవనమున వసించి బసవేశ్వరునకు కొంత ముందుగా నచ్చట లింగైక్యమయ్యెను (Iadian Antiqary) 57 సంపుటము మొదలు 1928 సంచికలు 1-12 పుటలు 77, 85, మైసూరు రాష్ట్ర విద్యాశాఖధికారులు Levis Rice MR.A.S. దొరగారు నాగవర్మ కృతకర్ణాటక భాషాభూషణమునకు రచించిన యవతారికముఁ జిత్తగించునది.

గురురాజచరిత్ర సంధి 13, 37, వ పద్యము, శ్రీకంఠయ్య యం. యస్. బసవలింగయ్య యం ఆర్. శ్రీనివాసమూర్తిగార్లు ప్రకటించిన ప్రభులింగ లీలాసంగ్రహము అవతారిక, Indian Asstivuary సంపుటము 57 పుట 78, 88, రైసు దొరగారి కర్ణాటక వాఙ్మయ చరిత్రకూడఁ జూమునది

ముకుందపెద్ది ప్రభులింగలీల యథార్థమును సరిగా జెప్పజాల నందున దానిని సత్యసమ్మతముగ వివరింపమని ప్రౌఢదేవరాయలు జక్కనమంత్రి కాదేశించెను. అతఁడు దానిని విశదముగ వివరింప నంతయు సంతసించి చామరసయ్యనభినందించి ప్రౌఢదేవరాయలాతనికి వస్త్రవాహనాదులతో నైదుగ్రామములగ్రహారములుగ నొసంగుటయే గాక జక్కనమంత్రికి త్రిశరపదకములను, రుద్రకంకణమును నొసంగి సత్కరించెను అటుతరువాత ప్రౌఢరాయలు వీరశైవమత వేదాంతము జూచి విశిష్టుఁడయి 101 విరక్తులకుఁ బ్రధానశిష్యుఁడయి వీరశైవదీక్ష నొంది వీరశైవచక్రవర్తియై వెలుఁగొందెను. రాజమహేంద్రవరము నందలి ఆంధ్రేతిహాసపరిశోధకమండలి వారి పత్రిక సంపుటము 24 సం॥ 1956-58 పుటలు 101, 102 చూడుడు.

ప్రౌఢదేవరాయల యనుమతితో ప్రభులింగలీల విశేషముగ గౌరవింపఁబడి కలుమఠ ప్రభుదేవర, చామరసయ్య, జక్కనమంత్రి మున్నగు వీరశైవులచే రాజవీధులందూరేగింపఁబడెను.

కన్నడకోటి షోలాపురము, ధార్వారునందు బేసిల్ మిషను వారి యాధ్వర్యమున చెన్నప్ప ఉత్తంగిగారు ప్రకటించిన సిద్ధరామ సాహిత్యసంగ్రహము అను గ్రంథముయొక్క 51, 52, 65 పుటలు చూడుఁడు. జక్కనార్యుని ప్రార్థనమువలన ప్రౌఢరాయలు చామరసయ్యను ప్రధానమంత్రిగా గ్రహించెను.

జక్కనమంత్రి రాజకీయముల విడనాడి వీరశైవమతవిషయముల యందు విశిష్టుడయ్యెను చామరసునకు రాజకీయముల నుపదేశించుచుఁ బిదప లింగైక్యమందెను. సిద్ధాద్రీశ మహాకవి విరచితమును సిద్ధాంతిసుబ్రహ్మణ్యశాస్త్రిగారిచేఁ బరిష్కృతమయి, శ్రీరంగపట్టణమున శ్రీఆదినారాయణశ్రేష్ఠిగారిచేఁ బ్రకటితమయి 1914 సం॥లో బళ్ళారి కన్నడబుక్‌డిపో వారిచే ముద్రింపఁబడిన ప్రౌఢరాయన కావ్యము పుటలు 11, 12, 18, 30 చూడుఁడు.

# రాజరాజు నందంపూడి శాసనము

## మూలము

### మొదటి పత్రము

1. (శ్రీ)ధామ్నః పురుషో_త్తమస్య మహతో నారాయణస్య ప్రభో
నాభీ పంకరుహా ద్బ(భూ)వ
2. జగత స్స్రష్టా స్వయంభూ _స్తతః । జజ్ఞే మానససూను రత్రి
రితి య _స్తస్మా న్మునే రత్రిత స్సోమో వం(శ)
3. కర స్సుధాంసు(శు) రుదిత శ్శ్రీకంఠచూడామణిః ॥ తస్మా
దాసీ త్సుధా సూతే ర్బుధో బుధనుత _స్తతః । జాతః
4. పురూరవా నామ చక్రవ ర్తీ సవిక్రమః ॥ (2) తస్మా దాయు
రాయుషో నహుషః । నహుషా ద్యయాతి చక్రవ
5. _ర్తీ వంశకర్తా । తతః ప్రాచీశః ప్రాచీశా _త్సైన్యయాతి
(ః) । సైన్యయాతే ర్హాయపతి। ర్హాయ
6. పతే స్సా(ర్వ)భౌమః । సార్వభౌమా జ్జయసేనః । జయ
సేనా న్మహాభౌమః । మహాభౌమా
7. దైశానకః । ఐశానకా త్క్రోధాననః । క్రోధాననా ద్దేవకిః ।
దేవ కేరిచుకః । రిచుకా[2]ద్బృతుకః । ఋ
8. తుకా న్మతివరః । సత్రయోగ[3]యాజీ సరస్వతీనదీనాథః । తతః
కాత్యాయనః । కాత్యాయనా న్నీలః ।
9. నీలా ద్దుష్యంతః । తత్సుతః । ఆర్యాణ । గంగాయమునా తీరే
యద్బవచ్ఛిన్నమ్ నిఖాయ యూపా న్క్రమశః । కృ
10. త్వా తథా స్వ(శ్వ)మేధా న్నామ మహాకర్మ భరత ఇతి
రూ లభతః[4] (3) తతో భరతా ద్భూమన్యుః । భూమన్యో
స్సుహోత్రః ।

---

1. తిః ] హా. 2. ర్బుభుకః । ఋభుకా. 3. వరస్సత్రయోగ. 4. త.

11. సు(హో)త్రా ద్ధస్తీ । హస్తినో విరోచనః । విరోచనా దజ
మీఢః అజమీఢా త్సంవరణః । సంవర(ణ)స్య

---

రెండవ పత్రము, మొదటి పుట.

12. తపనసుతాయా స్తపత్యాశ్చ సుధన్వా । సుధన్వనః పరిక్షిత్ ।
పరిక్షితో భీమసేనః । భీమసేనా త్ప్రదీ
13. పనః । ప్రదీపనాచ్ఛంతనుః । శంతనో ర్విచిత్రవీర్య్యః । విచిత్ర
వీర్య్యా త్పాండురాజః ॥ పుత్రా స్తస్య చ ధ
14. ర్మజభీమార్జున నకులసహదేవాః । పంచేంద్రియవత్ పంచ
స్య ర్విషయగ్రాహిన స్తత్ర ॥ (4) వృత్తం॥
15 (యే) నాదాహి విజిత్య శా(ఖా)ండవ మగ్నౌ గాండీవినా
వజ్రిణం యుద్ధే పాశుపతాస్త్రము(ం) ధకరిపో శ్శైలాభిద్రై
16. (త్యా)న్నభయాగినిందాద్రిద్వార సనమధ్యరోహి జయినా యత్కా-
లికే యూగికా స్నాత్వా స్వైర మకారి
17. (వం)శవిపినచ్ఛేదః కురూణాంవిభోః॥ (5) తతోర్జునా దభిమ
న్యుః । అభిమన్యో (ః) పరిక్షిత్ (1)
18. పరిక్షితో జనమేజయః । జనమేజయాత్ క్షేమకః । క్షేమకా
న్నరవాహనః । నరవా
19. హనా శ్ఛతానీకం । శతానీకా దుదయనః॥ తతః పరంత్ర్వ
భృతి ష్వేవ చ్ఛిన్నసంతానే ష్వయోధ్యాసింహా
20. సనాశీనే ష్వేకా(ద్వా)8షష్టి చకేన త్రిర్షు గతేషు తద్వం
శ్యో విజయాదిత్యో నామ రాజావిజిగీషయా దక్షి
1. (ణా)పథం గ(త్వా) త్రిలోచనపల్లవ మధిక్షిప్య దైవదురీహ
యా లోకాంతర మగమత్ । తస్మిన్నంకులేపు

---

ఛ 6. హూన్ । ఇంద్రా. 7. ఛ. 8. ష్వేకోన.

22. (రోహి)తేన సా(ర్ధ మ)ంతవర్త్తిని తస్య మహాదేవీ ముడి వేము నా మాగ్రహార ముపగమ్య తత్రాస్తవ్యేన

---

రెండవ పత్రము, రెండవపుట.

23. విష్ణుభట్టసోమయాజినా దుహిత్రి (తృ) నిర్విశేష మభిరక్షి తా సతీ విష్ణువర్ధన న్నామ ప్రసూయ । తస్యాచ కు

24. మారకస్య మానవ్యసగోత్ర హారీతీ పుత్రద్విపక్షగోత్రక్రమో చితాని కర్మాణి కారయిత్వా తమ వర్ధయత్ । సచమా

25. (తా)విది) తవృత్తాంత స్సన్నిర్గత్య చలుక్యగిరౌ నందాం భగవతీం గౌరీ మారాధ్య కుమారనారాయణ మాతృగణాన్ సంత్ర9(ప్య)

26. (శ్వే)తాతపత్రైక శంఖపంచ మహాశబ్దపాలికే (త) నప్రతి థక్కా-వరాహలాంఛనపింఛకుంతసింహా(హా)సన

27. మకరతోరణ కనకదండ గంగా యము (నా) దీని స్వకుల క్రమాగతాని (ని)క్షిప్తా నీవ తత్సాంబ్రా10

28. జ్యచి(హ్నా)ని సమాదాయ కదంబగంగాదిభూమిసా న్నిర్జిత్య సేతునర్మదా మధ్యం సార్ధ

29. సప్తలక్షం దక్షిణాపధం పాలయామాస॥ శ్లోకం (కః)। తస్యాసీ ద్విజయాదిత్యో విష్ణు

30. వర్ధనభూపతేః । పల్లవాన్వయజాతాయా మహాదేవ్యాశ్చ నందనః ॥ (6) తత్సుతః పొలకేశివల్లభః । తత్పుత్రః

31. కీర్తివర్మా । తస్య తనయః । స్వస్తి । శ్రీమతాం సకల భువనస స్తూయమాన మానవ్యసగోత్రా(ణాం) హా

---

9. సంత. 10 త్సామ్రా.

32. రీతీపుత్రాణాం కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యానాం మాతృగణపరి పాలితానాం స్వామిమహాసేనపా

33. దానుధ్యాతానాం భగవన్నారాయణప్రసాద సమాసాదిత వర వరాహలాంఛనే క్షణక్షణవశీకృతా రా(తి)

---

మూడవ పత్రము, మొదటి పుట.



34. మండలానా మశ్వమేధావభృత (థ) స్నాన పవిత్రీకృతవ పుషాం చాలుక్యానాం కుల మలంకరిష్ణో స్సత్యాశ్రి

35. యవల్లభేంద్రస్య భ్రాతా కుబ్జవిష్ణువర్ధనో ష్టాదశ వర్షాణి వేంగీదేశమపాలయత్ । తదాత్మజో జయసింఘ (హ)

36. వల్లభ(ః)11త్రయ స్త్రింశతం। తదనుజేంద్రరాజ స్స ప్తదినాని। తత్పుత్రో విష్ణువర్ధనో నవ॥ తత్సూను మ్మఙ్గియు

37. వరాజః పంచవింశతిం । తత్పుత్రో జయసింఘ (హ) వల్లభ(స్త్ర)యోదశ । తదవరజః కొక్కిలి ష్షణ్మాసాన్ । తస్య

38. జ్యేష్ఠో భ్రాతా విష్ణువర్ధన స్తముచ్చాట్య స ప్తత్రింశతం । తత్పుత్రో విజయాదిత్యభట్టారకో ష్టాద

39. శ । తద12నుజో విష్ణువర్ధన ష్షట్త్రింశతం । తత్సూను ర్వి జయాదిత్య నరేంద్ర మృగరాజ శ్చాష్టా

0. చత్వారింశతం। తత్సుతః కలివిష్ణువర్ధనో ద్వ్యర్ధవర్షం । త త్సుతో గుణగ విజయాదిత్య

1. శ్చతు శ్చత్వారింశతం । తద్భ్రాతు ర్విక్రమాదిత్య భూపతే స్తనయ శ్చాలుక్యభీమ స్త్రింతం । తత్సుతః కొల్ల

. బిగండవిజయాదిత్యః షణ్మాసాన్ । తత్సూను రమ్మరాజ స్సప్త వర్షాణి । తత్సుతం విజయాదిత్యం బా

---

భ(స్త్ర)య. 12. త త్తనుజో.

43. ల ముచ్చాట్య తాపకో నూస మేకం । తం జిత్వా యుధి చాలుక్యభీమ తనయో విక్రమాదిత్య ఏకాద

44. శమాసాన్ । తత్రా 13 దపరాజసుతో యుద్ధమల్ల స్స 14 స్త వర్షాణి । తం యుద్ధమల్లం పరిహృత్య దే

మూండవపత్రము: రెండవపుట.

45. శాద్విష్టేత్వత రేషా నుపి శాత్రవాణాం । త్స్మ మమ్మరాజానుజ రాజభీమో భీమ స్సమా ద్వాదశ రక్షతి స్మః (7)

46. తత్సూను స్వింనతా రాతి రమ్మరాజో నృపాగ్రణీః ః పంచ వింశతి వర్షాణి వేంగీభువ మపాలయత్॥ (8) ద్వైమాతు

47. రోమ్మనృపతే ర్ధానన్నృపో రాజభీమనృపతనయః ః విద్యా కలాపచతురః। చ 15 తురంతధరా మశాత్సమా స్త్రి

48. ంశః (9) అనుదావార్ణనా ద్దా16 సీ ద్వైవమశ్చేష్టయా తతః । సప్త వింశతివర్షాణి వేంగీమహీ రనాయకా॥ (10)

49. అతాంతరే దానవేంద్రమాను శ్రీ శక్తివర్మాన సురరా ట్సద్ధమూర్మా। య శ్శాయ్యశక్త్యా వినిహత్య

50. శత్రూ స్స ద్వాదశాబ్దా స్సమరక్ష దుర్వీం: (11) తత స్త దనుజో వీరో విమలాదిత్యభూపతిః॥ మ

51. హీమండలసామ్రాజ్యప్రాజ్యలక్ష్మీ మ్ముదా దధాత్॥ (72) తేజో యదీయ మఖిలక్షితిపాలమౌలి మాలా స్వభా

52. దమలరత్నరుచిచ్ఛలేన। పాతిస్మసప్తన సమా స్సకలా స్ధరిత్రీం భీమప్రతాపమహితో బిరుదాంక భీమః (12)

53. తస్మా ద్విమలాదిత్యాద్రవికులలక్ష్మ్యశ్చకుందవమహాదేవ్యాః 17నిజగుణవశీకృతాఖిలరాజన్యో రాజరాజవిభు ర

---

13. తతస్తాపడ. 14. స. 15 చతురశ్చతురంత 16 దా 17 కుందవా దేవ్యాః.

54. జని॥ (14) యస్సోమవంశతిలకః । శకవత్సరేషు వేదాంబు
రాశి నిధివర్తిషు సింహగే ర్కే॥ కృష్ణద్వితీయదివసో త్త
55. రభాద్రికాయాం వారే గురో వ్వణిజలగ్నవరే భిషిక్తః॥
(15) ఇంద్రో యథా దివ ముదారయశ 19 స్తథోర్వీం
శౌర్యేణ

నాలుగవ పత్రము, మొదటిపుట

56. శ(శ్వ)దఖిలా మభిరక్షితుం యః । శ్రీవిష్ణువర్ధననృపో
మకుటంపరార్ధ్యం మూర్ధ్నా దధాన్మణిమయూఖవి
57. భాసితాశం॥ (16) సంరక్షతి క్షితితలం క్షతితారివర్గే
మార్గేణ యేన నయశాలిని మానవేన 19॥ ప్రీతాః
58. ప్రజా (నిజపవి)త్రచరిత్రశోభైః ప్రక్షాలయంతికలికాలకలంక
పంకః (కం) 20 సన్మార్గేన 21 కులం కలాగమ
59. (ప)రిజ్ఞానేన (కుర్వ)న్ ధియం దీనానాథజనార్థితార్థౌ
నివహత్యాగేనలక్ష్మీంస్థి(స్థి)రాం । సంపూర్ణామల చంద్రికా
60. (విశ)దయా కీర్త్యా జగద్గీతయా యో దిక్చక్ర మలంకరోతి
సుతరాం చాలుక్యచూడామణిః (18)22 యస్యస్ఫారభుజా
61. కృపాణదళితా రాలీభకుంభస్థల (ప్రో)న్ముక్తామలవృత్త మౌక్తి
కచయ స్సంగ్రామరంగాంతరే॥ ధత్తే వీ(ర)

---

18 శాస్త్ర 19 శ్రీమచ్చళుక్య వంశశి । ఖామణిమార్గ రాజకరీంరవ...; భార. ఆ. ప. 8. 1) 20. ఘనదురితానుబంధ కలికాలజదోషతుషారసంహతిందనయుదయ ప్రభావమునఁదప్పఁగ దోసిజగజ్జనానురంజమగు... (భార ఆ.1.5.) 21 సన్మార్గేణ.
22. ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునన్ మనీషి విద్యాశ్రమతత్త్వ విత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవర్ణాశ్రమధర్మరక్షణమహామహి మన్ మహినొప్పు సర్వలోకాశ్రయుఁడాదిరాజనిభుఁడత్యకలంక చరిత్ర సంపదన్ (భార. ఆ. ప. 1. 6)

62. రసక్రియాభినయనప్రస్తావనా లక్షితాం వీరశ్రీర (చి)తాంజలి ప్రవిసరత్పుష్పాపహారశ్రి

63. యః23 (19)24 పిత్రో న్వర్ణాంశగురూ బభూవతురలం యస్య స్ఫురత్తేజసా సూర్యాచంద్రమసా నిరస్తతమసా.

64. (దే) కా జగచ్చక్షుషీ। దంష్ట్రాకోటినము ద్ధృతాఖిలమహీ చక్రం మహాక్రీడయా విష్ణో రాదివరాహరూపము

65. భవ ద్యచ్చాపనే లాంఛనమ్॥ (20) ససర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధనమహారాజాధిరాజో రాజపరమేశ్వర॥ పర

66. మభట్టారకః॥ పరమమాహేశ్వరః ।పరమబ్రహ్మణ్యః శ్రీరాజ రాజదేవో రెండేఱులనడిమి విషయనివా

67. సినోరాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినః సమాహూయ మంత్రిపురోహిత సేనాపతిస్తై25 వరాజదౌవారిక

68. ప్రధానసమక్ష మిత్థమాజ్ఞాపయతి యథా26॥హారీతిగోత్రే హారి మూర్తి రాపస్తంభ 27 ద్విజశ్రేష్ఠవిభు.

నాలుగవపత్రము రెండవపుట.

69. న్నిసితః సదా పురోడాశపవిత్రవక్త్రో విద్వాన్వభూ త్కంచెన సోమయాజిః (21) తస్య శ్రీమా

70. న్ హిమకరకరప్రస్ఫురత్కీర్తిరాశే రాసీత్సూనుః, సకల విదుషా మంచితః కంచెనా

71. ర్యాః । యమ్ మన్యంతే యమ మరిగణాః కామధేనుం కవీంద్రాః క్రీడారామం శరమసుహృదో (జీ)

---

23. యమ్. 24. ఘూర్ రాజిముఖోపలబ్ధ విజయప్రముదాశ్రిత బాహు దండ (భార. ఆ.ప. 1. 161) 25. యువరాజ 26. మంత్రిపురోహిత సేనాపతిదండనాయకదౌవారిక మహాప్రధానానంత సామంతవిలాసినీ పరివృతుండయి (భార. ఆ. ప. 1. 8 వచనము) 17. స్తంబ.

72. వితం బంధువర్గాః (22) తస్యాత్మజో మహాత్మాసముజనిశో
28చాంజనేయ ఇతి విదితః । ప్రజ్ఞాజితవాచస్ప

73. తి రకలంకాశంకనామాత్యః (23) స్యచ సుధర్మాపత్నా
గుణశాలిన్యాశ్చ సామెకాంబాయాః॥ అథ

74. (వ) దను (ష్టి) తజగదుపకారీణో నారాయణ స్తనయః (24)
యః సంస్కృతకర్ణాట ప్రాకృతపైశాచి

75. కాంధ్రభాషాసు । కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వవిభవేన
(25) కవీ న్మనీషాలవ

76. దుర్విదగ్ధాన్ మనోహరాభి స్స్వజసూక్తిభి ర్యః ।
కుర్వన్ న్నగర్వాన్ స్పటుభిర్బిభర్తి । 29కవిభవజాంకుశనా

77. మ సార్థమ్॥ (26)తస్మై సకలజగద్భుతగుణశా (లి) నే నర
స్వతికర్ణావతంసా యాష్టాదశావధారణచక్ర

78. వర్తినే నస్మి న్నారాయణాయ భవిద్విషయే నందమపూణ్టి
నామ గ్రామాగ్రహారీకృత్య సోమగ్ర

79. హణనిమిత్తే ధారాపూర్వకమస్మాభిస్సర్వకరపరిహారేణదత్త
మితి 30 విదితమస్తువః అస్య సీమా

80. నః॥ పూర్వతః ఇయ్యారియుంబిల్లెమ పెద్దపూణ్డియుంబొలగరు
సునపల్లమున కొణ్డియగుంట

అయిదవ పత్రము

81. నడుమనమా। ఆగ్నేయతః ఇయ్యారియు బిల్లెమపెద్దపూ
ణ్డియు నెరపులయుం బొలగరు(గ)

82. సునముయ్యలికుట్రి సీమా దక్షిణతః ఇయ్యారియు నెరపుల
యుంబొలగరుసున తొడ్లప్తే

28. శా. 29. బిభర్తి. 30. త్త ఇతి.

83. వ సీమా నైరృత్యతః ఇయ్యూరియు నెరపులయు ముందరము నయుంబొలగరుసున ముయ్యలికు

84. ట్రిసీమా పశ్చిమతః ఇయ్యూరియు ముందరమునయు మడ కుటితియుంబొలగరుసునముయ్యలి

85. కుట్రసీమా। వాయవ్యతః ఇయ్యూరియు మడకుటితియు బిల్లమ పెద్దపూణ్డియుం బొలగరు సున

86. ముయ్యలికుట్రన గొల్ల తేవ సీమా॥ ఉత్తరతః ఇయ్యూరియుం బిల్లెమపెద్దపూణ్డియుం బొలగరు

87. సున(యో)ఱువగడ్డయ సీమా ॥ ఐశాన్యతః ఇయ్యూరియుం బిల్లెమపెద్ద పూణ్డియుంబొలగర

88. సున మజ్జిగోడితాటియొద్ద చింతయ సీమా॥ అస్యోపరి న కేనచి ద్బాధా కరణీయా॥ యః క

89. రోతి స పంచమహాపాతకయుక్తో భవతి॥ తథా చోక్తం భగ వతా వ్యాసేన॥ స్వదత్తం వరదత్తం వా యో

90. హరేత వసుంధరాం షష్టిం వర్ష సహస్రాణివిష్ఠాయాం జాయతే క్రిమిః॥ (27) బహుభి ర్వసుధాదత్తాబహు

91. భిశ్చానుపాలితా । యస్య యస్య యదా భూమి స్తస్య తస్య తదా ఫలమ్ (28) ఇతి॥ ఆజ్ఞప్తిః రస్య,

92. కటకాధ31 రాజః కావ్యానాం కర్తార నన్నియభట్టో లేఖకో గండా చార్యః॥ ద్వాత్రింశ త్తమే విజ

93. య రాజ్యవర్షేవర్ధ(మా)నే కృత మిదం శాసన[32]

---

31. కాధరాజః 32. శాసనమ్

## శాసనవృత్తాంతము

ఈ శాసనమాంధ్రచారిత్ర సారస్వత నిర్మాణములకు సంబంధించిన శాసనరాజము. శాసనదాత శ్రీమదాంధ్ర మహాభారతమును రచింపఁజేసిన రాజరాజు. శాసనరచయిత ప్రథమాంధ్ర కావ్యకర్త యగు నన్నియభట్టు. శాసన ప్రతిగ్రహీత మహాభారత రచనావిధానమునందు నన్నియభట్టునకు సహాయుఁడైన నన్నినారాయణుఁడు. శాసనదత్తగ్రామము నేఁటి తూర్పుగోదావరి మండలములోని కోనసీమయందలి నందంపూడిగ్రామము. నన్నియభట్టు శ్రీమదాంధ్ర భారత ప్రారంభమునం దీ నన్నినారాయణుఁడగు నారాయణభట్టు నిట్లు ప్రశంసించియున్నాఁడు !

ఉ. పాయకపాకశాసనికి భారతఘోరరణమునందు నా
రాయణునట్లుదానును ధరామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధరంధరుఁడుందన కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునైన వాఁడభిమతంబుగఁదోడయి నిర్వహింపఁగన్

ఈకవిహారీతిస గోత్రుఁడు; ఆపస్తంభ సూత్రుఁడు; తల్లి సామెకాంబ; తండ్రి అకలంకశంక నామాత్యుఁడు;పితామహుఁడు కంచె నార్యుఁడు; ప్రపితామహుఁడు కంచెవ సోమయాజి. శాసనములోనీ కవినారాయణుఁడనియు, నన్నినారాయణుఁడనియుఁ బేర్కొనఁబడినాఁడు. కన్నడభాషలో నన్ని శబ్దమునకు సత్యము. ప్రియము ప్రేమ యర్థము (Truth, love, affection. Kittel) ఇతఁడు సంస్కృత కర్ణాట ప్రాకృతపైశాచి కాంధ్రభాషా ప్రవీణుఁడు. కవిరాజశేఖర, కవీభవజ్రాంకుశాష్టాదశావధారణ చక్రవర్తి, సరస్వతీకర్ణావతంసీత్యాది బిరుదాంకితుఁడు.

ఈశాసన పత్త్రము లైదు. రేకుఁపొడవు 10 1/4 అంగుళములు వెడల్పు 5 అంగుళములు. ఆద్యంత పత్త్రములకు లోపలి

ప్రక్కనుమాత్రమే అక్షరములు లిఖింపఁబడినవి. మిగిలిన మూఁడు రేకుల రెండుప్రక్కల నక్షరములు చెక్కఁబడినవి. రేకులయోరలు ఎత్తుగాజేయఁబడుటచే నక్షరములు చెడిపోక స్పష్టముగానున్నవి. రేకులకెడమభాగమున గుండ్రనిచిల్లులు పొడవఁబడి, వానిగుండ రేకులకొకరాగి కంకణము గ్రుచ్చబడియున్నది. ఈ కంకణము అరంగుళము దళమును. అయిదన్నర అంగుళముల వ్యాసరేఖయుఁ గలది. దీనిని జేర్చి 2 2/4 అంగుళముల వ్యాసరేఖగల యొకగుండ్రని రాజ ముద్రికయున్నది. ఈముద్రికనడుమభాగమున 'శ్రీత్రిభువనాంకుశ' యని పెద్దయక్షరములు చెక్కఁబడియున్నవి. ఈయక్షరముల నెగువభాగమున దక్షిణముఖమైయున్న యొకవరాహము, దానిపైన సూర్యచంద్రులు, ఆసూర్యచంద్రుల కిరుప్రక్కల రెండుచామరములునుగలవు. వరాహమునకు ముందువెనుకల శంఖమును, డమరుకము నున్నవి. ఈఅక్షరముల దిగువభాగమున నంకుశమును, దానిక్రింద వికసించిన పద్మము, (కాడతోసహితము) సింహాసనమును గలవు.

తొలుత నీశాసనమున బరిష్కరించి ప్రకటించిన వారు శార్మణ్యదేశవిద్వాంసులైన కీల్హారన్ (Kielhorn) దొరగారు. ఇయ్యది ఎపిగ్రాఫియా ఇండికా నాల్గవసంపుటములో నలుబదినాల్గవ సంఖ్యగా బ్రకటింపబడినది. (Epigraphia Indica. Vol. IV No 43) వీరుమనకు చిరస్మరణీయులుపూజ్య పాదులు.తరువాత ఆంధ్రసాహిత్యపరిషత్ప్రతిష్ఠాపకులగు శ్రీజయంతిరామయ్య పంతులుగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక ప్రథమసంపుటము ప్రథమసంచికలో యథామాతృకముగా బ్రతిబింబములతో నాంధ్రభాగమున కర్థవివరణమునిచ్చి ప్రకటించిరి. ఆయర్థవివరము దోషభూయిష్ఠమని, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు రాజమహేంద్రవర ఐతిహాసమండలివారు ప్రకటించిన

చాళుక్యసూచికలో రాజరాజు కాలమందున్న తెనుగు భాషయను వ్యాసమున విమర్శించియున్నారు.

## శా స న కా ల ము

ఈశాసనమునందు రాజరాజుపట్టాభిషేక కాలము చెప్పఁబడినది. అయ్యది శకసంవత్సరములు 944 సూర్యుఁడు సింహరాశి యందుండఁగా బహుళద్వితీయా గురువారము ఉత్తరాభాద్ర నక్షత్రయుక్త తులా లగ్నకాలము.

'యస్సోమవంశ తిలకః శకవత్సరేషు
వేదాంబురాశినిధి వర్తిషు సింహగేర్కే
కృష్ణద్వితీయ దివసోత్తర భాద్రికాయాం
వారేర్గురోర్వణిజలగ్నవరేభిషిక్తః.

ఆంగ్లమానమున క్రీ. శ. 1022 ఆగష్టు 16 వ తేదీయైనది. (16-8-1022) పైశ్లోకములో వేదము (నాల్గువేదములు) అంబురాశి (నాల్గుసముద్రములు) నిధి (నవనిధులు) అంకానాం వామతోగతిః అను సూత్రము ప్రకారము 944 అగు సంఖ్యయగుచున్నది. చాళుక్యులకాలమున సౌరమానమే యెక్కువ ప్రచారమునను౦డెను. వణిజలగ్నమనఁగా తులాలగ్నము శాసనాంతమున "ద్వాత్రింశత్తమే విజయ రాజ్యవర్షేవర్ధమానే కృతమిదం శాసనం" అని వ్రాయఁబడుటచే నీ శాసనము రాజనరేంద్రుని ముప్పదిరెండవ విజయరాజ్య సంవత్సరమునొసంగబడెనని తెలియుచున్నది. నఁగా శా.శ (975 క్రీ.శ. 1053) సంవత్సరమగుచున్నది. ఆసంవత్సరము చంద్రగ్రహణము మార్గశిర పౌర్ణమి యగును. ఆంగ్లమానమున 23-11-1053 దినమగుచున్నది.

## శాసనరచనము–లేఖనము

"కావ్యానాం కర్తా నన్నియభట్టో లేఖకో గండాచార్యః"

అని శాసనాంతమున రచింపఁబడుటచే శాసనమును రచించిన వాఁడు నన్నియభట్టనియుఁ జెక్కినవాఁడు గండాచార్యుఁడనియు వెలియుచున్నది. ఈగండాచార్యుఁడే రాజరాజు కోరుమిల్లి శాసనమును జెక్కినవాఁడు. కోరుమిల్లి శాసనకర్త చేతన భట్టు. ఈశాసనములోని మొదటి యేబది రెండుపంక్తులును. కోరుమిల్లిశాసనములోని మొదటి యేబది పంక్తులు చాలవఱకు సమానముగానున్నవి. మొదటిమూఁడు, ఇరువదియవ,శ్లోకములు కోరుమిల్లి శాసనములో శ్లోకములు నొక్కటియేపదునైదవ శ్లోకము కొంచెము భేదముతోనున్నది. ముఖ్యముగా నీశాసనములోని అరువదియైదవ పంక్తినుండి ఎనుబదియెనిమిదవ పంక్తి వఱకు, కడపటినాల్గు పంక్తులును నన్నియభట్టురచన.

ఈశాసనలిపిలో మొదటి నలువదితొమ్మిది పంక్తులకును తరువాత పంక్తులకును భేదముగపడుచున్నది. దీనినిబట్టి కీల్హారన్ పండితుఁడు ఈ శాసనము వేఱువేఱుకాలము లందుఁ జెక్కఁబడి యుండునని యూహించియున్నారు. ఈలిపిభేదము కాలభేదముకంటె లేఖకభేదము ననుసరించి సంభవించెయుండెనని(శ్రీ)రామయ్యపంతులు గారి యభిప్రాయము. ప్రాచీనకాలమున శాసనములోని వంశావతార భాగముల ప్రతిరూపములు (నమూనాలు) ముందుగనే చెక్కించియుంచుకొని దానకాలమునఁ దరువాతి పూర్తిచేయు నాచారముండెను, ఆవిధమునచే మొదటినలువది తొమ్మిదిపంక్తులు తొలుత చెక్కఁబడియుండి దానసమయమున మిగిలిన భాగము లిఖింపఁబడియుండును. ఈ రెండవభాగము గండాచార్యులు లిఖించిన కోరుమిల్లి శాసనపు లిపిని బోలియున్నది. గండాచార్యుఁడు లిఖించినది యీభాగము మాత్రమె.

## ఆంధ్రమహాభారతము పరభృతము.

ఆంధ్రమహాభారతమును రచించినవాఁడు నన్నియభట్టు. అని బాధనమునకుఁ తోడ్పడినవాఁడు నన్నినారాయణుఁడు. తత్కృతి రచనమున కానతిచ్చినవాఁడు వేఁగీదేశాధీశ్వరుఁడు రాజనారాయణాఖ్యుఁడగు రాజరాజనరేంద్రుఁడు. ఈ రాజరాజు విష్ణువర్ధనుఁడు. సత్యాశ్రయకులశేఖరుఁడు చాళుక్యాన్వయపయోధి చంద్రుఁడు. వేఁగీభూవల్లభుఁడు. పై విషయములనుబట్టి యితఁడు చళుక్యవంశతిలకుఁడు సత్యాశ్రయకుల శేఖరుఁడు. విష్ణువర్ధనుఁడు, రాజరాజను నామధేయములుగలవాఁడని తెలియుచున్నది.

వాతాపి పశ్చిమచాళుక్యరాజ్యమేలిన శ్రీసత్యాశ్రయపృథ్వీవల్లభ శ్రీ రెండవ పులకేశి మహారాజు బలపరాక్రమసంపన్నుఁడై క్రీ.శ 611 సంవత్సరమున దక్షిణాపథము నందలి తూర్పుభాగముపై దండెత్తి వేంగీకళింగములనాక్రమించి, తన తమ్ముఁడైనకుబ్జవిష్ణువర్ధనుని దనకు ప్రతినిధిగా నియమించి స్వదేశమునకు వెడలిపోయెను. తర్వాత విష్ణువర్ధనుఁడు స్వతంత్రుఁడై తూర్పున చాళుక్యవంశ రాజ్యస్థాపకుఁడాయెను.

తూర్పుచాళుక్యప్రభువులు విష్ణువర్ధననామధేయమునుదాల్చిరి. అనఁగా పైపదములు రాజరాజు పశ్చిమ చాళుక్యరాజవంశమునకు జెందినవాఁడని స్ఫురింపఁజేయుచున్నది. ఈ బాదామి చాళుక్యులు కర్ణాటకులు.

## చాళుక్య - ద్రవిడవంశసమ్మేళనము.

తూర్పుచాళుక్య ప్రభువులలో రాజరాజ నామమును ధరించిన వారిలోనితఁడే ప్రథముఁడు. ఈతనితండ్రి విమలాదిత్యుఁడు చోళదేశ ప్రభువగు ప్రథమ రాజరాజు కుమార్తెయగు కుందవాంబను వివాహ

మాడెను. వీరిసంతానమె రాజరాజు. రాజరాజునకు మాతామహుని నామము సంక్రమించినది. రాజరాజు తనమేనమామయగు రాజేంద్ర చోళుని కుమార్తెయైన అమ్మంగదేవిని బరిణయమాడెను. రాజరాజు అమ్మంగదేవుల కుమారుఁడు కులోత్తుంగచోళుఁడను రాజేంద్ర చోడుఁడు. ఈపేరు రాజేంద్రచోడునకు మాతామహుఁడగు రాజేంద్ర చోళునివలన సంక్రమించినది ఈరాజేంద్రచోడుఁడు తనమేనమామ యగు రాజేంద్రదేవుని కుమార్తెయైన మధురాంతకిని పెండ్లియాడెను. అనఁగా రాజరాజు తల్లి, భార్య, కోడలు, ద్రవిడరాచ కుమార్తెలు.

## సూర్యచంద్రవంశ సమ్మేళనము

బాదామి చాళుక్యులు తాము చంద్రవంశజులమని చెప్పు కొనలేదు. వేంగీ చాళుక్యులు రాజరాజుతండ్రియైన విమలాదిత్యుని తరమునుండి చంద్రవంశజులమని వ్రాయించుకొనిరి. ప్రప్రథమమున నీవిషయము విమలాదిత్యుని రణస్తిపూడిశాసనములో నుద్ఘాటింపఁబడి నది. నందంపూడిశాసనములో స్పష్టము చేయఁబడినది.

## చోళదేశముపై మహాభారత ప్రభావము.

చోళరాజ్యమేలిన పల్లవులకాలమునుండియు ద్రావిడ సారస్వతముపై, సంస్కృతిపై, మహాభారతప్రభావము సుప్రతిష్ఠమైయుం డెను. తొమ్మిదవశతాబ్దమునయున్న మూఁడవపల్లవ నందివర్మకాల మున పెరుందేవనారను తమిళకవి భారతవెంబయను తమిళప్రబంధ మును రచించెను. ఈకావ్యము మహాభారతమునకు దమిళభాషలో మొదటియను వాదము. ఈగ్రంథములో పండ్రెండువేల పద్యము లుండెననియు నిప్పుడెనిమిదివందలు లభ్యమైననవియు నవి ముద్రిణ రూపమునుదాల్చియుండెననియును దెలియుచున్నది. ఈగ్రంథములోని యుద్యోగపర్వమున మూఁడవ నందివర్మ పల్లవరాజు తెల్లారుయుద్ధ

ములో నతఁడు పాండ్యరాజును గెల్చినవిషయము ప్రస్తుతింపఁబడెను. తమిళసంఘకాలమున భారతము పాడిన పెరుందేవనారను కవి యుండెనట. ఆపేరునుబట్టియే యతఁడు మహాభారతమును తమిళభాషలో రచించియుండెనని యూహింపనగును. కాని యీ భారతము పాడిన పెరుందేవనారును, నందివర్మ సమకాలికుఁడైన పెరుందేవనారు నొక్కరే యనియుఁ దమిళభాషాసారస్వతవేత్తల యభిప్రాయము. ఏదిఏమైనన్నను ద్రావిడభాషలలోఁ దొమ్మిదవశతాబ్దమున మహాభారతము భాషాంతరీకరింపఁబడినని స్పష్టము. పై విషయము మదరాసు మెయిల్ ఆంగ్లదినపత్రిక యందొక తమిళవిద్వాంసుఁడు "తమిళ సారస్వతమునందు మహాభారతస్థానము" అను వ్యాసమును వ్రాసియున్నాడు.

Among the extent Tamil renderings of the Mahabharata, the oldest is the Bharata Venba of Perundevanar, a poet of the 9th century A.D. as referred to above. Here also the bulk of the poem has been lost. According to tradition the work contained about 12000 stanzas but we have now about 800 only. This poet lived during the time of Nandivarma Pallava III whose victory in the famous Tellaru battle against his enemies including the Pandya ruler is mentioned in a stanza in the Bharata Venba already referred to- "Mahabharata in Tamil literature by A V'S. The Madras Mail (11-7-65)

శ్రీమీనాక్షిసుందరము పిళ్ళగారు వారునూతనముగా ప్రచురించిన తమిళభాషాసారస్వత చరిత్రములోనిట్లు వ్రాసియున్నారు. 'మహాభారతము (తమిళ) కవులదృష్టినాకర్షించుటసహజము మూఁడవ పల్లవనందివర్మకాలమున పెరుందేవనార్ మహాభారతమును వెంప వృత్తములలో గద్యపద్యాత్మకముగ, సంస్కృత, పదభూయిష్ఠముగ మొదట రచించియుండెను.''

"Mahabharatam naturally attracts the attention of the poets. The earlier work by Perundevanar in the age of

the Pallavaking Nandivarma III was written in venpa metre intens persed with prose, abounding in Sanskrit words"Page 158 A History of Tamil Literature by T. P. Meenakshi sundaram 1965

శ్రీ మీనాక్షిసుందరము పిళ్లగారు అణ్ణామలై విశ్వవిద్యాలయ ద్రావిడభాషాశాఖాధ్యక్షులు. ఇప్పుడు మధుర విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా నియమింపఁబడియున్నారు.

ద్రావిడ శిల్పకళపై మహాభారత ప్రభావము

తమిళ సారస్వతముపై మహాభారతప్రభావము నిరూపించిన పిదప, శిల్పకళపై సహితమద్దాని ప్రతిష్ఠిత మెట్లు ప్రకాశించెనో వివరింపనగును. పల్లవరాజులు కవులు, విద్యాపోషకులు, మాత్రమేగాక శిల్పకళాభిమానులు. వీరి కాలమున దక్షిణదేశములో పెక్కుదేవాలయములు నిర్మింపఁబడెను. వానిలో మహాబలిపురములోని (మామిల్లపురము) యేడురథములు సుప్రసిద్ధములు. ఈరథములు మహామల్లమొదటినందివర్మ పల్లవరాజు కాలమునాటివి. ఈరథములొక్కొకటి పెద్దపాషాణములుదొల్చి కట్టబడినవి. వానిలో నైదింటికి ధర్మరాజు, భీమ, అర్జున, సహదేవ, ద్రౌపది యను నామకరణములు చేయఁబడినవి. ద్రవిడదేశములో మహాభారత ప్రభావము నుగ్గడించుచు శ్రీమీనాక్షిసుందరముగారు తమిళ సారస్వత చరిత్రలోఁ నిట్లువ్రాసి యున్నారు.

(A History of Tamil Literature P. 8 The Rathas or Temples in Mahabalipuram are also called after the Pandavas

ద్రావిడదేశమున మహాభారత పఠనమునకై బ్రాహ్మణవృత్తులు-భారత పఠనము.

పల్లవరాజైన విజయనందివర్మ మహాభారతపఠనమునకై యొక బ్రాహ్మణునికి వృత్తినేర్పఱచినట్లు దక్షిణదేశపుశాసన సంపుటములలోని యొక శాసనమునుబట్టి తెలియుచున్నది. (S.I.I- Vol II

Part V No. 99.) అట్లే చోళరాజైన రాజకేసరి పరిపాలనకాలమున నొక శాసనములో నాత్రేయగోత్రుఁడును, వైఖానససూత్రుఁడునునగు సింగనందిన్వరూపభట్టను బ్రాహ్మణునకు "ఇరయిలి భరతప్పంగు" గా నొక భూమిని నిత్యము మహాభారతపురాణ పఠనమునకు దాన మిచ్చెననియుఁ జెప్పఁబడినది (No 63 of 1897. S. I. I VI No 12) అట్లే పెక్కుదాహరణములు గలవు.

### సాహిత్యము-సమకాలిక పరిస్థితులకు దర్పణము.

సాహిత్యమాయాదేశ సమకాలిక రాజకీయ మత, సాంఘిక, పరిస్థితులకు దర్పణము. రాజరాజు మహాభారతమును భాషాంతరీకరించుటకు నన్నియభట్టును నియోగించుటకుఁ గల కారణములు వివరింపఁబడినవి. అతని మాతృదేశము ద్రవిడరాష్ట్రము. మాతృభాష ద్రవిడభాష. అతఁడు రాజ్యారూఢుఁడగుటకుఁ బూర్వము మాతృదేశముయొక్క సారస్వతశిల్పములపైనఁ మహాభారతాధిష్ఠానను దెలుసుకొన్నవాఁడు. అదియట్లుండ వంశాభిమానము దీనికిఁ దోడయ్యెను. తానుచంద్రవంశపురాజు, పాండవులు నట్లె.

కావుననే ఆంధ్రమహాభారతావతారికలో నీ క్రింది గద్యపద్యములయందలి ప్రత్యక్షరము రాజరాజుపై భారత ప్రభావమును ప్రస్ఫుటమును జేయుచున్నవి.

చం. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థ ధర్మ శా
స్త్రములు తెఱంగెఱింగితినుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కుసూచితి జగత్పరి పూజ్యములైన యీశ్వరా
గమముల యందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబుభక్తితోన్

వ. అయినను నాకు ననరతంబును శ్రీమహాభారతము నందలి యభి
ప్రాయము విన నభిలాష పెద్దయైయుండు.

మ॥ ఇవియేమున్ సతతంబు నాయెడ। గరంబిష్టంబులైయుండుఁబా
యవుభూదేవకులాభితర్పణమహీయః ప్రీతియున్ భారత

శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహో
త్సవమున్ సంతతదానశీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్.

వ. మఱి యదియునుగాక.

చం. హిమకరుఁడాదిగా పూరు భర తేశకురు ప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్టమెంతయున్.

క. జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచింపు మధిక ధీయుక్తిమెయిన్.

క. బహుభాషల బహువిధముల
బహుజనముల వలన వినుచు భారత బద్ధ
స్పృహలగు వారికి నెప్పుడు
బహుయాగముల ఫలంబు పరమార్థమగున్

అ ర్థ వి వ ర ణ ము

(1) అ ఏవార్థకము: నడుము + అ = నడుమ; ముయ్యాలికుట్రి + అ = ముయ్యాలికుట్రి; తాడ్లజేవు + అ తాడ్లజేవ; ఏఱువ గడ్డ + అ = ఏఱువగడ్డయ, చింత + అ = చింతయ; గడ్డ + అ = గడ్డయ.

(2) అగ్రహారము: బ్రాహ్మణపోషణమునకై యొసంగఁబడిన గ్రామము

(3) ఆజ్ఞప్తి = దూతకుఁడు, దానవివరములగూర్చి రాజాజ్ఞను సామంతాధి రాజులకుఁ దెలియఁజేయునుద్యోగి.

(4) ఇ = ఇ + ఊరు = ఇయ్యూరు. ఈయూరు = ఈయూరు + ఇ.

ఇయ్యారి + ఉ=ఇయ్యారియు। నిర్దేశకార్థకము

(5) ఉ - సముచ్చయార్థకము; ఇయ్యారి + ఉ=ఇయ్యారియుం, బిల్లెమపెద్దపూణ్ణి+ఉ=బిల్లెమ పెద్దపూణియు. ఇయ్యారియును, బిల్లెమపెద్దపూణియునని యర్థము.

(6) ఊరు=గ్రామము, ఊరప్రాచీనరూపము

(7) ఏరు. ఏరువు=నది। రెండేఱులనడిమి సీను=రెండునదుల మధ్య ప్రదేశము. ఏఱువ గడ్డ=నదియొడ్డు.

(8) ఒద్ద, ఓద్ద=, సమీపము; తాటియొద్ద= తాటి సమీపము.

(9) కటకాధీశ=కటకాధీశ, కటకేశ। కటకరాజ పదములు, రాజ శిబిరపర్యవేక్షకుండను నర్థమున శాసనములందుఁ బ్రయోగింపఁబడినవి (Superintendent of the royal camp)

(10) కుటింబినులు=వ్యవసాయ వృత్తిచే జీవించుగృహస్థులు। భూదానములు వారిసమక్షమున జేయుటసంప్రదాయము.

(11) కుఱ్ఱు=గ్రామనామాంత ప్రత్యయము, కుఱ్ఱు+తి+కుఱ్ఱి। మడకుఱు +తి= మడకుఱుతి

(12) గడ్డ= ఒడ్డు, ఏఱువగడ్డ=ఏటియొడ్డు.

(13) చింత=చింతచెట్టు, తింత్రిణీవృక్షము.

(14) తాడు= తాటిచెట్టు, తాళవృక్షము। తాడు+ఇ=తాటి.

(15) తోడ=తృతీయావిభక్తి, కూడ యని యర్థము మఱ్ఱితోడి= మఱ్ఱిచెట్టుతోకలిసి। కూడుకొని.

(16) దౌవారికుఁడు= ద్వారపాలకుఁడు। పడిహారి, పంచ ప్రధానులలో నొకఁరు.

(17) ధారాపూర్వకము =ఉదకపూర్వకము, దానము, ఉదకధారతో నిచ్చుట సాంప్రదాయము.

(18) నెరపులు= నెరపులు+అ= నెరపుల+యు = నెరపులయు।

ఇదిగ్రామనామమని శాసనపరిశోధకులు శ్రీకైలాసన్ పండితుఁడు పరిగణించియున్నాడు.

ఇది నెర + పొలె, అనగా, నెర = సమీపమార్గము; పోలె = త్రోవయని యర్థము స్ఫురించును, విచారణీయము.

(19) పురోహితుఁడు = శుభాశుభ వైదికకర్మలను జేయించి. మేలు కీడులను దెలుపు ఆచార్యుఁడు (సూ.ని) పంచ ప్రధాను లలో నొకఁడు.

(20) పూడు = గ్రామ నామాంత్య ప్రత్యయము.

పూణ్డు - పూండు - పూఁడు

బిల్లెమ పెద్దపూణ్డు + ఇ = బిల్లెమపెద్దపూణ్డి.

(21) మంత్రి = ప్రధాని; సచివుఁడు; పంచ ప్రధానులలో నొకఁడు

(22) యువరాజు = పట్టాభిషేకమున కర్హతగల ప్రభుకుమారుఁడు పంచ ప్రధానులలో నొకఁడు.

(23) రాష్ట్రకూటులు = రట్టగుళ్లు పదమునకు సంస్కృతీకరణము (చూడుడు "రెడ్డి పదోత్పత్తి" రెడ్డిసంచిక) కొంతభూమిని గుత్తముగాఁగొని దానిసర్వసత్త్వముల ననుభవించువారు, మాన్యగాండ్రు.

(24) రెండేఱుల నడిమి విషయము = రెండు + ఏరులు = నడుము + విషయము తూర్పుగోదావరిమండలములలోని గౌతమీ వైనతేయనదీ మధ్య దేశము. ఇయ్యది పృథ్వీశ్వరుని పితా పుర శాసనములో సింధుయుగ్మాంతర దేశమనివ్రాయఁ బడినది. ఇప్పటి కోనసీమ.

(25) తేవు = నద్యాదులందు మనుష్యులు దిగుట కనువుగా నేర్ప ఱచిన దారి. (సూ.ని) గొల్లతేవు, తాళ్లతేవు, అనఁగా ఆయాతేవులకుఁ బేళ్ళు.

(26) సర్వకరపరిహారము = (కరము = పన్ను) సకలమైన పన్నులు విడువఁబడినది. ప్రాచీనకాలమున, దేవాలయములకు బ్రాహ్మణులకు నిచ్చెడు భూదానములు సర్వకరపరివర్జితములు.

(27) సేనాపతి = దండనాయకుఁడు, పంచప్రధానులలో నొకఁడు. మంత్రిపురోహిత దౌవారిక, యువరాజ, సేనాపతులు పంచ ప్రధానులు. దానసమయమున ప్రభువు వీరిసమక్షమున దానమొసంగుట సాంప్రదాయము.

నా రా య ణ భ ట్టు - క ర్ణా ట భా ష

నందంపూడి శాసనమునుబట్టి నారాయణభట్టు సంస్కృతాంధ్ర కర్ణాట ప్రాకృతపైశాచికభాషలయందు కవిత్వము చెప్పఁగలవాఁడై కవిరాజశేఖర బిరుదమును గాంచి యుండెనని దెలియుచున్నది. ఇతఁడు రచించిన గ్రంథములెవ్వియో తెలియదు. కాని ఆంధ్రమహాభారత రచనాకాలమునకుఁ బూర్వుఁడు కర్ణాటకభాషలోఁ బంపకవి విక్రమార్జున విజయమను భారతగ్రంథమును రచించియుండెననియు నాగ్రంథమునుండి నన్నయ ఎన్నియో యనుసరణములు గావించి యుండెననియు శ్రీనిడుదవోలు వేంకటరావుగారు వారు రచించిన "తెనుఁగు కవులచరిత్ర" "ఆంధ్రకర్ణాట సారస్వతములు-పరస్పర సంబంధములు" అను గ్రంథములలో నిరూపించియున్నారు. అనఁగా నారాయణ, నన్నియభట్టులకుఁ గర్ణాటభారతమునుగూర్చి తెలిసియుండెననియు మనమూహింపనగును. ద్రవిడ కర్ణాటభాషలలో మహాభారతము వెలయుటచే నాంధ్రములో సహితము రచింపఁబడుటకు హేతువు, ఆనాటి ప్రభువునకు ద్రవిడభాషాసంస్కృతి సంపర్కములు, కవులకు కర్ణాటభాషా సంపర్కమును గల్గుటయే. ఇయ్యదియే "బహుభాషల, బహువిధముల" నను పద్యభావము.

## ఇతఁడు త్రైలోక్యమల్లుని ప్రధానియా?

నారాయణభట్టు కూతురు కుపమయను నామె ద్రాక్షారామ భీమేశ్వరస్వామికి నఖండదీపమునకై లోహపు దివియ యొసఁగి దాని నిలో "చక్రవర్తి త్రైలోక్యమల్లదేవర ప్రధాని నారాయణభట్టు కుం తుఁటు కుపమపెట్టిన అఖణ్డవర్తి లోహపు దివియ" యని వ్రాయించెను. తొలుత నీశాసనమును ప్రకటించిన శ్రీ లక్ష్మణరావుగారు శాసనము లోని నారాయణభట్టు, నందంపూడి శాసనములోని నారాయణభట్టు నొకఁ-డేయని వ్రాసియున్నారు. దీనిని శ్రీ నేలటూరి వెంకటరమణయ్య గారును బలపరచియున్నారు. కాని శ్రీ చాగంటి శేషయ్యగారు "ఆంధ్ర కవి తరంగిణి"లో నారాయణభట్టునుగూర్చి వ్రాయుచు నీవిషయము నిరాధారమైనదని నిరూపించియున్నారు. (ఆంధ్రకవితరంగిణి మొదటి సంపుటము-పుటలు 187-189)

## సామ్రాజ్యచిహ్నము-పాలికేతనము

శాసనములో శ్వేతాతపత్రము, శంఖము, పంచమహాశబ్దములు పాలికేతనము, ఢక్క, వరాహలాంఛనము, పింఛము, కుంతము, సింహాసనము, మకరతోరణము, కనకదండము, గంగ, యమునలు సామ్రాజ్యచిహ్నములుగాఁ జెప్పఁబడినవి. పై వానిలోఁ బాలికేతన మనునది యొకవిశేషచిహ్నము. పాలికేతనమనఁగా 'పూలదండ, వస్త్రము, నెమిలి, పద్మము హంస, గరుత్మంతుడు, సింహము, ఎద్దు, ఏనుగ, చక్రము, అను చిహ్నములుగల కేతనములు పదివిధములు. ఒక్కొక్క విధమునకు నూటఎనిమిది చొప్పున నొక దానివెనుక నొక టిగాఁ బదివరుసలు నిలువఁబెట్టినచో వేయిన్నైపై నెనుబది కేతనము లగును ఈ గుంపునకు పాలిధ్వజ మని పేరు. ప్రతిదిక్కున నొక పాలి ధ్వజము పెట్టినచోఁ గేతనములసంఖ్య నాలుగువేల మూఁడువందల

నిరువదియగును. దీనికిని పాలిధ్వజమనియే పేరు. తొలుత జినుడు మోహమును వర్జించి త్రిభువనేశత్వము సాధించినప్పుడు పాలిధ్వజమును ప్రభుత్వచిహ్నముగ గ్రహించెనట. నాటినుండియు నీ ధ్వజము సామ్రాజ్య చిహ్నముగా గ్రహింపఁబడెను

(అం. సా. ప. ప. సం. 19. సంచిక 5

## అష్టాదశావధారణ చక్రవర్తి

నారాయణభట్టాష్టాదశావధారణ చక్రవర్తియని శాసనములో వర్ణింపఁబడెను. ఇది యేదియో పెద్దబిరుదై యుండవలెను. అష్టాదశ స్మృతులు, అష్టాదశవిద్యలుగలవు. వీనిలో నేదైన యుండనోపును. కాని సంస్కృత భాషాపారంగతు లీవిషయమును పరిశోధించిచెప్పినఁ గాని నారయణభట్టు ప్రతిభ తెలియదు

## ఆంధ్ర మహా భా ర త ర చ న ము

సంస్కృతాంధ్ర కర్ణాట భాషాకోవిదుఁడై, నన్నియభట్టునకు సహాధ్యాయుఁడై, భారతరచనమునందు తాను దోడై సర్వము నిర్వహించుటచేత రాజరాజీతనికి నందంపూడి గ్రామమును దత్తముచేసి యుండును. అనఁగా నందంపూడి శాసనకాలము క్రీ.శ. 1053 నాటికి నన్నియ గ్రంథనిబంధనమును బూర్తిగావించి యుండవచ్చును. రాజరాజు పరిపాలనకాలము క్రీ.శ 1060 సంవత్సరముతో నంతమొందియుండెను. రాజరాజు పరిపాలనాద్యంతకాలములు కష్టపరంపరలతోఁ గూడియుండెను. ఆచరిత్రము వేఱొకస్థలమునఁ జర్చింపఁబడును.

## శాసన ప్రతిబింబములు.

శాసనపత్రములలో రెండు లభింపలేదు. స్థలాంతరమునఁబ్రకటింపఁదలఁచితిని.

కుందూరి ఈశ్వరదత్తు.

## గ్రంథస్వీకారము:— సమీక్ష

సంక్రాంతి (ప్రథమభాగము) క్రౌను, పుటలు 24 వెల రు 0-50

సంపాదకులు:— కోగంటి దుర్గా మల్లికార్జునరావుగారు.

కార్యదర్శి:— భారతీసమితి, పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

భారతీయుల పండువులలోఁ బెద్దపండువని పేరుగొనిన మకర సంక్రమణము, (ఉత్తరాయణ పుణ్యకాల ప్రవేశము,) గూర్చి కొందఱు పండితులు,కవులునుండి సేకరించిన పద్యగద్య వ్యాసములసంపుటి. యిది ఉత్తరాయణపుణ్యకాలము,మకరసంక్రాంతిఅను పేరితో వరుసగా శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు, శ్రీ పిలకా గణపతిశాస్త్రిగారు రచించినవి రెండుగద్యవ్యాసములు. వీనిలో నుత్తరాయణ పుణ్యకాల ప్రాశస్త్యము, సంక్రాంతిపండుగకు నీ దేశీయులలో జరుగు సంబరములు, అచ్చట్లు ముచ్చట్లు మున్నగునవి చక్కఁగా వర్ణింపఁబడినవి. అందఱు చదువఁదగినవి. సంక్రాంతి, సంక్రమణహేల, హిమజ్వాల, సంక్రాంతిలక్ష్మి, బస్తీసంక్రాంతి, రావేలుగలవాఁడ, సంక్రాంతి గీతి, సంక్రాంతి, మధురదృశ్యాలు అనుశీర్షికలతో పలువురు కవులురచించిన పద్యములు, గేయములు సరసతరముగ, మనోహరముగ నున్నవి.

మచ్చునకుఁగొన్ని—

(1) ఈచలిలో ఈనిసిలో ఎవ్వతవే బాలా
మంచుకురియు గుండెలలో మండిన ఓ జ్వాలా
చిక్కని నీలాంబరమున చుక్కలశుభమాలా
వలరా జేసిన వెచ్చనివెన్నెల విరికోలా.

(దాశరథి హిమజ్వాలనుండి)

(2) మొన్నటిదాఁక నిర్ఘృణత మోవికట్టార్భటికాయపట్టునై
యున్నకృషీవలాననము లుజ్జ్వలకాంతి వహించె లీలసం
పన్నవినాక్షివచ్చి గృహమధ్యమునన్ నటియింప ధాన్య మూ
ర్తి న్నవమాధురుల్ వెలువరించుచు గుమ్మడిపూల తమ్మునై

శ్రీ టి. బి. యం అయ్యవారి
(సంక్రమణహేలనుండి)

(2) గొడగూచిఁ బాలభక్తికావ్యము క్రౌను పుటలు 46 వెల రు 1-25 కర్త శ్రీవేదాంతము కాశీవిశ్వనాధము B O.L. ప్రభుత్వ బహుళార్థసాధకోన్నత పాఠశాల కరీంనగరము.

గొడగూచి దాక్షిణాత్యశైవభక్తవర్గమునందలి యొక్క ముగ్ధ బాలభక్తురాలు. ఈమె తండ్రి శివదేవుఁడు, ఆతనిసతి వారి గ్రామమందలి భోగేశ్వరనామక శివలింగమునకుఁ బ్రతిదినము నొకకోరలో క్షీరములఁ బిదికి యర్పణమొనరించి యింటికిఁదెచ్చుకొని తామారగించెడి వ్రతముగలవారు. ఒకనాఁడువారు శ్రీశైలఁయాత్రకు కేఁగుచు తమనిత్యవ్రతకృత్యమును బాల్యమందున్న తమముగ్ధకుమారిగొడగూచి కప్పగించి తాముతిరిగివచ్చువఱకేమఱకతమ వ్రతమును నెఱవేర్పుమని యానపెట్టి వెళ్ళుదురు. ఆమెయుఁ దమయింటి యావుపాలు పిదికి కొంచెమువెచ్చఁబెట్టి కోరలోఁబోసికొని శివలింగము నెదుటఁ బెట్టి తనసహజముగ్ధత్వమూలమున వానిని శివుఁడు స్వయముగాఁ ద్రావునని నమ్మినదవుటచే నట్టులాతఁడు త్రావకుండుటకుఁ బరిబరి విధములఁ బరితపించి త్రావుమని యాదేవుని బ్రార్థించుచు; తుదకామె దీనాలాపములకుఁగరఁగి తానుద్రావకున్న నామెప్రాణముల కలుగుట తలపోసి యాపాలనాతఁడు గుటగుటద్రావివేయును. దానికి సంతసించి యామె వట్టికోరతో నింటికి మరలి వచ్చుచుండును. తలిదండ్రులు తాము తిరిగివచ్చునాఁడామును దారిలోఁదారసిలి యామె చేతనున్న కోరనుజూచి "పాలేమి జేసితివే" యని యామెపై నాగ్రహింతురు. శివుఁడు త్రావెనని యామె మాఱుపలుక వారునమ్మక మఱింతకినిసి యామెయే వానిని దోడిపిల్లలతోఁ ద్రావివేసి తమవ్రతభంగముగావించెనని విచారించుచు మండిపడుదురు. "వలయుచో మఱునాఁడు దేవాలయమున కేఁగి స్వయముగాఁ బరీక్షింతురుగాక" యని వారినామె ప్రార్థించును. అప్పటికామెను శిక్షింపక మఱునాఁడామెతోఁ

శివాలయమున కేఁగి యావింత వీక్షింతమని వారామె వెంట నేఁగుదురు. గొడగూచియుఁ బాల కోరను దేవుని యెదుటఁబెట్టి త్రావుమని ప్రార్థింప నాతఁడు మిన్నకుండెను. "ఏమియేమరాగ్రుగ్రురాలా !" ఎట్టి కల్లలు నేర్చితివే! నానిత్యవ్రతమును మంటపాలు చేసితివే పాపాత్మురాలా అని మండిపడుచు నామెను ఖడ్గముతో నఱుకసంరంభించును. ఆమెయు, "హాలింగ హాలింగ!" యని యంగలార్చుచు లింగసన్నిధి కేఁగఁ బరమేశ్వరుఁడు పాలను గుటగుట త్రావి యామెను దనగర్భమున నైక్య మొనర్చుకొనును. తండ్రి గొడగూచి కేశములబట్టి యీడ్చి చంపనుద్య మించినప్పుడామె లింగగర్భమున నైక్యమవుసమయమున నామె మూర్ధాగ్రముపైఁజిక్కిన శిరోజములిప్పటికి నాశివలింగముపయిఁగాన వచ్చునని చెప్పుదురు. తమిళభాషయందలి పెరియపురాణములో నీకథ గాననగును. ఆంధ్రజాతీయ కవిసార్వభౌముఁడు పాల్కురికి సోమనాథుఁడు తనద్విపద బసవపురాణము తృతీయాశ్వాసములో ముగ్ధ భక్తులకథలలో నీకథను మూఁడులుగురియనట్లు గొడగూచి ముగ్ధత్వము జాలువాఱునట్లు వర్ణించియున్నాడు. ఏలూరు వాస్తవ్యులు కీ॥ శే॥ శివశ్రీ మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారింతకుమున్ను భోగేశ్వర మాహాత్మ్యమను పేరిలోఁ బ్రబంధరూపమున నీకథను రచించి కీర్తిగాంచిరి. నేఁడు కాశీనాథముగారు కూడ సులభశైలిలో సరసతరముగ రచించి తమ స్వగ్రామమగు వేములవాడలో వెలసిన రాజరాజేశ్వరస్వామి కంకితమొనర్చి చరితార్థులైరి. పలువురు పండితుల శుభాకాంక్షలు, సదభిప్రాయములు ముందుముందు ముద్రితములయినవి. అర్థానుస్వార, శకలరేఫలను గవిగారు బుద్ధిపూర్వకముగనే పరిహరించునట్లు కాన్పించును.

మచ్చునకు కొన్నిపద్యములు:-

"కత్తిని పైకినెత్తి పలుగర్చుచు కన్నుల నిప్పులొల్కుచున్

తత్తరమంది దారుణపు తామసకేలలపైకి జిమ్మనా
చిత్తవికారితంత్రీ యటచిందులుద్రొక్కుటమాని శంకరుఁ
జిత్తమునందునిల్పి తన చేతులు నెత్తుచు నార్చి "శంకరా"
చంపఁజూచెడి నాతండ్రి తెంపుచూచి
కరుణరాదేల నేఁడని గరళకంఠు
గుండెలనొక్కటి యమృతాలునిండి పొరల
గోలుగోలున గొడగూచి గొల్లుమనియె
అగ్గిగురిసెను నాతండ్రి నిగ్గదీసి
సిగ్గుచిమ్మనే నాకటబుగ్గిసేయ
లగ్గుగా ! నమ్మువారల కెగ్గుసేయ
సాకరావే ! కరిమండ! సాంబమూర్తి !
అంతప్రేమల విన్నాళ్ళు నరయుచేల
పంతగింపఁగ నేడేల పార్వతీశ!
వంతలన్ద్రోసిపి నీవంతసంతసింప
వేమిగొందువా! భక్తులయెగ్గుచూచి.

శ్రీ బండారు తమ్మయ్య.

(3) కవిశిరోభూషణము అహోబలపండితీయము.

ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం-శిరోమణి-శ్రీచమచర్ల రంగాచార్యులు- భాషాప్రవీణ శ్రీఅమరేశ్వరం రాజేశ్వరశర్మయను మువ్వుర సంయుక్తసంపాదకత్వమున- ఆంధ్రరచయితల సంఘము- విద్యానగరము హైదరాబాదునుండి వెలువడినది. వెల రు. 16 లు డెమ్మీసైజులో 725 పుటలలో ఈగ్రంథము ముద్రితమైనది. దీనికి ఖండవల్లిలక్ష్మీరంజనంగారు ఆంగ్లములో, బ్రహ్మశ్రీ వేంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు తెలుఁగులోను విపులమయిన యుపోద్ఘాతములు, శ్రీ రాజేశ్వరశర్మగారు ఉపక్రమణికను సంతరించిపెట్టినారు.

అహోబలపండితీయమూలము సంస్కృతభాగములు నాగరలిపిలోను వివరణము తెలుఁగులిపిలోను రచించుట జరిగినది. ఆంధ్రాను వాదము, సంజ్ఞాప్రకరణాంతభాగమునకు శ్రీ రంగాచార్యులవారును. మిగిలిన ప్రకరణములకు శ్రీరాజేశ్వరశర్మగారును గావించియున్నారు.

ఇంతకుముందొకమాఱు శ్రీ కొండ భద్రాద్రిరామశాస్త్రిగారి ఆంధ్రానువాదముతోసహా ఈ అహోబలపండితీయము ముద్రితమై కొంతకాలము ఆంధ్రపాఠకులకు లభించుచుండెడిది. దానిలో ముద్రణస్ఖాలిత్యము లధికముగ దొర్లుటచే, పాఠకులకుఁ జాలక్లేశ మేర్పడుచుండెడిది. అదికూడ చాలకాలము లభించుటయే మానివే సినది. అట్టిది నిర్దుష్టమైనది యీనాటికి లభించు నవకాశమేర్పడినది. ఇట్టిగ్రంథమును ఆంధ్రులకు లభింపఁజేయుటకు పూనుకొని కృతకృత్యు లయిన ఆంధ్రరచయితల సంఘము వారి కృషి ప్రశంసనీయము.

ఈ అహోబలపండితీయము అప్పటప్పట ఆంధ్రభాషలో విశిష్ట జ్ఞానము నార్జింపఁజూచిన విద్యార్థులకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపఁ బడినప్పుడు మాత్రమే దీనిని కొందఱేనాఁడు పఠించుట, బోధించుట జరుగుచున్నది. వ్యాకరణశుద్ధమైన భాషనే రచనకుపయోగింపవలె నను దృష్టి రచయితలకేర్పడిననాఁ డిట్టి వ్యాకరణగ్రంథములు వెలు వడుటవలన భాషకు విశిష్టమయిన సహాకారము లభించుననుట తథ్యము. అట్టిపరిస్థితి సమకూడిననాఁడే యిట్టిగ్రంథములను మిక్కిలి కష్టించి వెలుఁగులోనికిఁ దెచ్చిన వారిపరిశ్రమకు సరిపడినఫలము లభింపఁగలదు. అట్టిశుభదివసములు రాఁగలవని యాశింతము.

ఏ గ్రంథమునయినను ప్రాచీనమయినదానిని, సుసంఘటితము చేసి, అభిరుచిగలవారి కందుబాటులోనికిఁ దెచ్చుట కష్టసాధ్యమైన పని. ఇతరులందఱియభిరుచికి సరిపడినట్లు రచనసాగించుట యెవ్వనికిని సాధ్యముగాదు. దొసఁగులనెన్నఁదలఁచిన నెట్టివాని రచనకైన నెన్న

వచ్చును. ఉన్నంతలో గుణములనెన్నుకొని, రచయితకు, ఇట్టియుద్గ్రంథములు వెలుఁగులోనికిఁదెచ్చు సంస్థలకు ప్రోత్సాహమిచ్చుట భావ్యము. ఈగ్రంథపరిష్కర్తలు ముగ్గురును, అహోబలపండితీయ మూలమును చక్కఁగ పరిష్కరించి, ఆంధ్రులకేగాక సంస్కృతభాషా పరిచయముగలిగిన ఆంధ్రేతరులకుసైతము ఆంధ్రభాషాస్వరూప స్వభావములు తెలియుటకై వీలుపడునటు మూలమును నాగరిలిపిలో ముద్రించుట, మూలమునకు అన్యూనాతిరక్తముగ ఆంధ్రభాషలో వివరణముగావించుటయు ప్రశస్యతరము లు. అహోబలపండితీయము నందలి విషయములను దెలియఁగోరు వారికి, నిర్దుష్టమయిన యీగ్రంథ మును ప్రకటించియిచ్చిన, ఆంధ్రరచయితల సంఘమువారు మహోప కారము నెఱపినారని చెప్పకతప్పదు.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

(4) రమణీయము-బాలవ్యాకరణము. రచయిత-సుప్రసిద్ధాంధ్ర వ్యాకరణరహస్యవేత్తలు శ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారు వెల రు 15 లు. ప్రాప్తిస్థానము- రామనగర్- వాల్తేరు.

ప్రాచీనాంధ్ర వ్యాకరణములలోని విషయముల నన్నిటిని కూలంకషముగాఁ దెలిసికొని, ఆవిషయములన్నియుఁ దనవ్యాకరణ ములోఁ బ్రవేశపెట్టుపూనికతో, చిన్నయసూరి ముందు సంస్కృ తాంధ్రభాషలలో పాణినీయసూత్రక్రమ పద్ధతిని సూత్రములురచించి, తుదకు సిద్ధాంతకౌముది నాదర్శముగాఁ బెట్టుకొని బాలవ్యాకరణ మును రచించి 1858 లో తొలుతగఁ బ్రకటించియున్నాఁడు. అది బయలుదేఱిన నాఁటినుండియు దానిని జదివినవారికి ఆంధ్రమున విశిష్టమయిన వ్యాకరణజ్ఞాన మలవడుచుండుటచే నితరవ్యాకరణముల జోలికిఁబోనక్కఱలేని స్థితియేర్పడినది. తన్మూలముగ దానికి విశేష ప్రచారమువచ్చినది.

సూత్రనిర్మాణక్రమమున, వివరణమునందును పాణినీయ వ్యాకరణపద్ధతిని ప్రవేశపెట్టుటచే మిగిలిన వ్యాకరణములన్నిటికంటె నీబాలవ్యాకరణము విమర్శసహమైయుండుటచే పాణినీయాది సంస్కృతవ్యాకరణమార్గముల నెఱిఁగిన పండితులనుగూడ నాకర్షించుచు వచ్చినది. సూరిపాణినీయమున విశేషముగ పరిశ్రమించిన ప్రతిభాశాలిగావున, తనరచన నామార్గమున నడిపించి. కృతార్థుఁడు కాఁగలిగినాఁడు. ఈరమణీయనిర్మాతలకు ఆంధ్రవ్యాకరణములను గఱపిన, కీ. శే. వఝ్ఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారు, సూరిబాలవ్యాకరణ విషయములమీఁద బహుముఖముల విమర్శనము సాగించి, ఆంధ్రవ్యాకరణ విమర్శకులలో నగ్రగణ్యులై, యశోధనములు రెండింటినార్జించి ప్రఖ్యాతినిగాంచినారు. వారి చిట్టచివరి రచన, బాలవ్యాకరణోద్యోతము. దానిలోసూత్రము వారుసూరిసూత్రముల నన్యథాకరించుచు వచ్చినారు. సూరి రచించిన వ్యాకరణము ఆంధ్రభాషాసమిష్టికి సమగ్రవ్యాకరణము కాఁజాలదని, త్రిలింగలక్షణశేషమును రచించిన బహుజనపల్లి వారుకూడ నంతగ నన్యథాకరింపలేదనవచ్చును.

సూరిహృదయమును, ఆతని వ్యాకరణరచనా విధానమును నిదానముగ బహుకాలము పరిశీలించి, సూరివలెనే విమర్శింపఁదగిన విషయములకు ప్రణాళిక నేర్పఱచుకొని, రచించిన బాలవ్యాకరణ పరిశోధనగ్రంథ మీరమణీయము. దీనిలో మొదటిభాగము సమీక్ష. రెండవభాగము ప్రకరణక్రమమున బాలవ్యాకరణ విషయవివరణము. సమీక్షలో శ్రీశాస్త్రిగారు వ్యాకరణ రచనలో సూరి యెట్లుభావించుచు అక్షరవిన్యాసము గావించినాఁడో, పరిష్కర్తనిక్షేపములలోను అతఁడెంతటి నిదానమును వహించెనో దానిని నిరూపించుటకు యత్నించి కృతకృత్యులైనారు. తరువాతి వారి ముద్రణములలో సూరి

నిక్షేపించిన యక్షరములనుమార్చి, ఆయాతావులందపార్థములను గల్పించిన స్థలములనన్నిటిని పరిశీలించి, సవరణలను వివరణలను గావించియున్నారు.

బాలవ్యాకరణమునకు వ్యాఖ్యానములు విమర్శనములు చాల బయలుదేఱినవి. వానిలో నేదియు రమణీయమువలె సూరిహృదయావిష్కరణమునకు యత్నింపఁగా వచ్చినవి కావు. విమర్శకుల మధ్య వివాదగ్రస్తమైయున్న విషయములను పరిష్కరించి తెలుపుటలో కూడ శ్రీశాస్త్రిగారు సూరివలెనే మృదునిశిత మయిన పద్ధతినవలంబించియున్నారు. అది రమణీయమను పేరును సార్థకము చేయఁజాలి యున్నది. గ్రంథముద్రణమునందుకూడ రమణీయత యుండవలెనని శాస్త్రిగారు ప్రత్యేకశ్రద్ధ వహించి. కృతార్థులైనారు. ఇంతవఱకు బయలుదేఱిన బాలవ్యాకరణ వ్యాఖ్యలన్నిటికంటె నీరమణీయము సర్వవిధముల విలక్షణమైనదనుట తథ్యము. సూరి హృదయము నెఱుఁగఁ గోరువారి కిది పరమోపకార మనుట నిర్వివాదవిషయము.

## (5) వసుచరిత్రము—కాళహస్తి కవివిరచితము.

పరిష్కర్తలు ప్రకాశకులు—డాక్టరు. బి. రామరాజుగారు.

వెల నాలుగు రూపాయిలు. ప్రతులు లభించుచోటు—

W. G. C. Unit-Osmania University Hyderabad.

ఆంధ్రభాషలోని కవితామార్గములలో అపూర్వనిర్మాణమైన రామరాజభూషణుని వసుచరిత్రమున కిది సంస్కృతానువాదము. అప్పయ్యదీక్షితులవారికి శిష్యుఁడైన శ్రీకాళహస్తికవి యీసంస్కృత కావ్యరచయిత. తెలుఁగు భాషలో నవతరించిన యీవసుచరిత్రమును, అదిబయలుదేఱిన యచిరకాలముననే సంస్కృతములో కావ్యరూపమునను, వసుమంగళ, వసుచరిత్రములను పేర సంస్కృతనాటకములుగను, తమిళ కన్నడభాషలలోనికిని పరివర్తనము నొందుట,

ఆంధ్రప్రబంధములలో మఱి దేనికి లేదని చెప్పవచ్చును. దీనినిబట్టి తెలుగు ప్రబంధమైన వసుచరిత్ర ప్రశస్తి యెట్టిదో స్పష్టమగుచున్నది.

వెనుకటికాలములో సంస్కృతభాషా పాండిత్యముగలిగి ఆంధ్ర భాషలో కవిత్వము చెప్పనేర్చిన వారెవ్వరు, తెలుఁగుకవిత్వమునెడ నాదరము చూపించుటకే పాల్పడువారు కారు. అట్టివేళ వసుచరిత్ర మునందలి కవితా సారస్యమును గ్రహించి, దానిని గీర్వాణభాషలో ననువదించి, ఆసారస్యము చాలవఱకుఁ దననిర్మితిలోఁ బ్రతిఫలింపఁ జేసిన మహాకవి శ్రీకాళహస్తికవి. రామరాజభూషణుఁడు జగత్ప్రాణ నందన కారుణ్యకటాక్షలబ్ధ కవితాసుధాధారకలవాఁడు కావున, కంచి కామాక్షీ దాసుఁడైన శ్రీకాళహస్తికవి, తత్సుధాధారాసుస్నాతుఁడై ఆప్రబంధము సంస్కృతభాషలోనీ వసుచరిత్రముగ వెలార్పఁగలిగి నాఁడని చెప్పవచ్చును.

శ్రీరామరాజుగారు సంస్కృతాంధ్రములలో బయలు దేఱిన యీరెండు ప్రబంధములను బాగుగఁ బరిశీలించి, రెండింటికిఁగల సామ్యవైషమ్యములను నిరూపించుచు ఆంగ్లభాషలోను, ఆంధ్రభాష లోను ఉపోద్ఘాతములను రచించి, సాహిత్యప్రియులందఱకు ఉభయ వసుచరిత్రములందలి కవితా విశిష్టత వ్యక్తమగునట్లు చేసినారు. సం స్కృత వసుచరిత్రమునందలి పాఠములనుబట్టి తెలుఁగు వసుచరిత్రము నందలి పాఠములను పరిష్కరింపవలసిన వానిని సైతము సూచించి యున్నారు. ఆంధ్రసంస్కృత వసుచరిత్రములందలి కవిత్వములలో నుండెడి వ్యత్యాసములను నిరూపించుచు, రామరాజభూషణుని రచనలోని వ్యంగ్యార్థస్ఫురణ సంస్కృతములోనికి రానితావులను సైతము తమయుపోద్ఘాతమునఁ దెలిపియున్నారు. వీరీగ్రంథపరిష్క రణమునను ప్రకటనమునందు మిక్కిలి కష్టించి కృతకృత్యులైనారు.

వసుచరిత్రమును కాళహస్తికవి సంస్కృతీకరించెనని యొండు

రెండు శ్లోకములను జూచి, తన్మూలమున రామరాజభూషణుని రచన గొప్పదనుకొనుచుండుటయే గాని, తత్స్వరూపమును సమగ్రముగా నెఱుఁగుట కవకాశమును గల్పించిపెట్టిన శ్రీరామరాజుగారి యీ పూనిక, ఏతద్గ్రంథ పరిష్కరణమును నిర్దుష్టముగఁ గావించిన వారి కృషి, ప్రశంసనీయములు. అమూల్యము పురాతనము నయిన యిట్టిగ్రంథమును ప్రకటించుటకు సహాకరించిన, ఉస్మానియా విశ్వవిద్యాలయోపాధ్యక్షులయిన డి. సి. రెడ్డిగారి, యూనివర్సిటీగ్రాంట్స్ కమీషను వారి యౌదార్యము పరమ ప్రశంసనీయము. ఇట్టియుత్తమ గ్రంథముల నితోధికముగఁ వెలుఁగులోనికిఁ దెచ్చు సాహిత్యప్రీతి శ్రీరామరాజు గారికి విశేషముగ భగవంతుఁడు ప్రసాదించుఁగాక.

చి. సాపయ్యశాస్త్రి.

విజయనగర సంస్థానము—ఆంధ్రవాఙ్మయ పోషణ
గ్రంథకర్త:—శ్రీనిడుదవోలు వెంకటరావుగారు- (యూ.జి.సి)
ఆంధ్రభాషాధ్యాపకులు. ఉస్మానియా విశ్వవిద్యాలయము
వెల రు. 3-50

ఈగ్రంథము ఆంధ్రప్రదేశసాహిత్య అకాడమీవారి 1932-63 పోటీలో బహుమతి పొందినది శ్రీవెంకటరావుగారు ఆంధ్రసారస్వత సముద్ర సాంయాత్రికులు వీరు సారస్వతమునకు చేసిన కృషి యపారము; అపూర్వము.

విజయనగర సంస్థానము ఆంధ్రసరస్వతీస్థానము. వీరీగ్రంథము మూఁడుభాగములుగా వ్రాసిరి. మొదటిభాగములో క్రీ.శ. 6 మొదలు పదునేనవ శతాబ్దమువఱకు, రెండవభాగములో క్రీ.శ. పదునేనవ శతాబ్దము మొదలు పదునేడవశతాబ్దము వఱకు, మూఁడవ భాగములో పదునేడవశతాబ్దము మొదలు క్రీ॥శకము 1940 వఱకు, విజయనగర సంస్థానాధీశులు చేసిన ఆంధ్రసారస్వత పోషణ వివరింపఁబడినది.

ఈగ్రంథములో నాయాకాలమునాఁటి రాజకీయసాంఘిక వృత్తాంతములు సంక్షిప్తముగ క్రోడీకరింపఁబడినవి. విజయనగర సంస్థాన చరిత్ర రచయితలకు ఈ గ్రంథముల బహువిధములఁ దోడ్పడఁగలదు.

ఆంధ్రదేశసంస్థాన సారస్వతపోషణ చరిత్రకు శ్రీవెంకటరావు గారు శ్రీకారముచుట్టిరి. ఇట్టిచరిత్రలు తదితర పిఠాపురము, బొబ్బిలి, నూజివీడు, మూడుగుల, వెంకటగిరి, కార్వేటినగరము, గద్వాల, వనపర్తి మొదలగు సంస్థానాధీశు లొనర్చిన నపూర్వమగు పోషణ గూర్చి వ్రాయనవసర మెంతేనికలదు. కె. ఈశ్వరదత్తు.

## కుమారసంభవము:-పద్యకావ్యము

డెమ్మీ పుటలు 110+32 వెల రు 2-50,

కర్త:-శ్రీజొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు. ఎం. ఏ.

ఆంధ్రోపన్యాసకులు ప్రభుత్వకళాశాల రాజమహేంద్రవరము. ప్రాప్తిస్థానము శ్రీమతి జె. శకుంతల భారతి నికేతనము 6-2-1 ఇన్నీసుపేట రాజమహేంద్రవరము. మహాకవి కాళిదాసుని కృతియందలి మొదటియేడు సర్గలకునిది యనువాదము. పార్వతీ పరిణయము చివరినఱుఁగల కథనె వీరుగైకొనిరి. అట్లవుటచే దీనికి గిరిజా కల్యాణమో, లేక గౌరీకల్యాణమో అని పేరిడిననే బాగుగానుండునని మా యభిప్రాయము-మూలమునందలి ప్రతిశ్లోకమునకు నొకపద్యముగ నెడనెడ మల్లినాథుని వ్యాఖ్యానవిశేషములు గూడ గైకొనుచు వీరీయాంధ్రీకృతిని రచించిరి. ఆంధ్రీకరణము మొత్తముమీద సమర్థముగను సరసతరముగనున్నది. కాళిదాసుని కుమారసంభవము నింతకుమున్నె ఆధునికులలో కీ. శే. ఆదిపూడి సోమనాథరావుగారు గీత పద్యములలోను, త్రిపురాన సూర్యప్రసాదరావుగారు కంద పద్యములలోను ఆంధ్రీకరించియున్నారు. వక్కలంక వీరభద్రకవి మున్నగు పూర్వకవులు ప్రబంధఫక్కిగా ఆంధ్రీకరించియున్నారు. గద్యాను

కృతులు గూడ కొమ్మనమంచి జోగయ్యశర్మ, మోచెర్ల రామ కృష్ణయ్య, బండారు తమ్మయ్య మున్నగువారు రచించినవి యున్నవి. కవికులగురుని కృతులు పలువుర నాకర్షించి పలురీతుల యనువాద ముల వెలయింపఁ జేయుటలో నాశ్చర్యము లేదు.

ప్రస్తుత కృతికర్త అంగ్లసంస్కృతాంధ్రభాషలయందు సమ ధీక ప్రజ్ఞావిశేషముగలవారు. శ్రీవెంపరాల సూర్యనారాయణశాస్త్రి, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, మల్లంపల్లి శరభయ్య అను పండితులు పీఠిక, సమాలోకనము, ఆమోదము అను పేర్లతోఁ బ్రశంసాపూర్వకముగఁ గావించిన సమీక్షలు గ్రంథము న కలంకారముగనున్నవి. కృతికర్తయు నవతారికయను పేరితో 8 పుటల గ్రంథము పద్యములలోనే రచించి కృతిని హిమవన్నగాధి రాజున కంకితమొనరించి యందుకుఁదగిన యుపపత్తులను జూపి యున్నారు. హిమవంతుఁడు తనకన్యను బరమేశ్వరుని కర్పించఁగా వీరు తమకృతికన్యను బరమేశ్వరునకు శ్వశురుండగుచు పర్వతేశ్వ రున కర్పించుట సరసముగానేయున్నది. ఆంధ్రలోకము గుణవిశిష్ట మయిన యీ నవీనాంధ్రకృతికి స్వాగతమొసంగి యానందమొందుననఁ గాత మని యాశించుచున్నాము. రతివిలాపనామక చతుర్థసర్గమును కాళిదాసు వియోగినీ వృత్తములలోఁ గూర్పఁగ వీరావృత్తము లోనే తెలిఁగించుట యొకవిశేషము. మచ్చునకుఁ గొన్నిపద్యములను వాని మూలశ్లోకములతో నుదాహరించుచున్నాము.

చ. వెలయునుదీచియం దమరభూధరుఁడొక్కఁడు దేవతాత్ముఁడై
చెలఁగి హిమాలయం బను ప్రసిద్ధిఁదనర్చుచుఁ బూర్వపశ్చిమాం
బులఁజొరఁబారి భూవలయముఁ సకలమ్ముఁ గొలందివెట్టఁగా
గలకొలగఱ్ఱయోయనఁ క్ష్మాధరలోకమహాధిరాట్ప్రభా (సర్గ1 ప1).

శ్లో. అస్త్యుత్తరస్యాందిశి దేవతాత్మా
హిమాలయో నామనగాధి రాజః
పూర్వాపరౌ వారి నిధీవి గాహ్య
స్థితః పృథివ్యా ఇవమానదండః॥

ఉ. చందురునాశ్రయించి జలజమ్ములు గుణమ్ములం బొందలేకయా
సుందరపద్మమందు శశిశోభను గాంచఁగాలేకలోలయై
యిందిర యిందునందుఁ జనియెంతయునేసరి తద్ద్విసంశ్రయా
నందమునొందె శైలపతి నందన యందముచిందు మోమువన్
(1—43)

శ్లో. చంద్రంగతా పద్మగుణా న్న భుఙ్క్తే
పద్మాశ్రితాచాంద్రమసీమభిఖ్యాం
ఉమాముఖంతు ప్రతిపద్య లోలాద్విసంశ్రయ ప్రీతిము వాపలక్ష్మీః

గీ. ఇట్టివన్ను మేఘువృష్టికై తృష్ణాతు
రమ్ములైనచాతకమ్ములెట్లు
ఋభులరాతివి ప్రకృతులు యాచించిరి
సకానులార! యటుకుమారు కొంజను.

శ్లో. సోహం తృష్ణాతురైర్వృష్టిం
విద్యుత్వానివచాతకైః
అరిర్విప్రకృతైర్దేవైః
ప్రసూతిం ప్రతియాచితః

గీతగీసిన శివ పాదము వీని సహజభావాళి శైలికిఁ గొంత
గుంటు గలిగించినదని తలంతుము.

మహాన్ భేదఃసందర్భస్య అతిమృదుత్వం నామా సంయుక్తకోమలవర్ణ బంధత్వం ౯ తిప్రౌఢత్వం నామపరుషవర్ణ వికట బంధత్వం సంయుక్త మృదులవర్ణేషు ఈషన్మృదుత్వం అవికటబంధపరుషవర్ణేషు ఈషత్ప్రౌఢత్వం తస్మా దత్యంతసుకుమారా ద్వౌ శృంగారకరుణౌ రసౌ అత్యంతగిరసౌ రౌద్రభీభత్సౌ పరికీర్తితౌ, హాస్యశాంతాద్భుతా, కించిత్సుకుమారః పరికీర్తితౌ, ఈషత్ప్రౌఢా సమాఖ్యాతౌ రసౌ “సౌ వీర భయానకా” యత్ర శృంగారకరుణౌ రసౌ వతికోమలసందర్భేణ వర్ణ్యేతే తత్ర కైశికీ యత్ర రౌద్రభీభత్సౌ వతి.

ప్రౌఢసందర్భేణ నిర్వాహ్యేతే తత్రారభటీ. యత్ర నాతి సుకుమారాహాస్య శాంతాద్భుతా నాతిసుకుమారేణ సందర్భేణసమర్థ్యంతే తత్ర భారతీ. యత్ర నాతిప్రౌఢా వీరభయానకా నాతి ప్రౌఢేన వందర్భేణ ప్రతిపాద్యేతే తత్ర సాత్వతీతి

వ్యాఖ్యానమ్:—

వైదర్భ్యాదీనా మాసాం చ వైలక్షణ్యవిషయా న్వివినక్తి వైదర్భ్య దీనా మితి సుగమ మేతత్.

## అథ రీతయః

శ్లో. రీతి ర్నామ గుణాశ్లిష్టపదసంఘటనా మతా॥

వ్యాఖ్యానమ్:—

రీతిసామాన్యలక్షణ మాహ రీతి రితి. గుణాశ్లిష్టపదసంఘటనా మాధుర్యాది పరిత్యక్తసందర్భ ఇత్యర్థః. యద్వా ఓజఃప్రసాదాది విశిష్టపదరచనా.

సా త్రివిధా. వైదర్భీ గౌడీ పాంచాలీ చేతి, తస్యా విభాగ మాహా చేతి సా రీతిః

## వైదర్భి

శ్లో. బంధపారుష్యరహితా శబ్దకాఠిన్యవర్జితా
నాతిదీర్ఘసమాసా చ వైదర్భీరీతి రిష్యతే.

వ్యాఖ్యానమ్:—

వైదర్భీం లక్షయతి. బంధేతి. బంధపారుష్యం దుస్సంధానకృతం శబ్దకాఠిన్యం పరుషవర్ణారబ్ధం నఞర్థస్య నశబ్దస్య అతిదీర్ఘసమాసే త్యనేన సుప్సుపేతి సమాసః. విదర్భదేశీయవిదగ్ధజనపరిగ్రహేణ వైదర్భీ త్యన్వర్థసంజ్ఞా. యథా

శ్లో. జితారిమండల స్యాస్య
సూర్యరాయమహీపతేః
భాతి ప్రతాపకీర్తిభ్యామ్
పాటలీవ జగత్త్రయీ॥

వ్యాఖ్యానమ్:—

వైదర్భీ ముదాహరతి. జితేతి, జగత్త్రయీ పాటలీవ పాటల వర్ణేవ "శ్వేతరక్త స్తు పాటల" ఇత్యమరః. అత్ర కోమలవర్ణై రల్ప సమాసైర్మృదుబంధేన చ కీర్తిప్రతాపవర్ణనా దియం వైదర్భీ.

## గౌడీ

శ్లో. ఓజః కాంతిగుణోపేతా గౌడీ యం రీతి రిష్యతే.

వ్యాఖ్యానమ్:—

గౌడీం లక్షయతి, ఓజఇతి. ఓజశ్శబ్దేన సమాసభూయస్త్వ ముచ్యతే. కాంతిశబ్దేన చోద్భటత్వం గౌడదేశీయవిదగ్ధజనపరిగ్రహేణ గౌడీతి సంజ్ఞా.

యథా

శ్లో. శ్లేష్మాంకృతివిస్ఫారగర్భానర్గళవదన్తకాః
సూర్యరాయవిభో! వైరి
భామా భూభృద్భువం గతాః॥

వ్యాఖ్యానమ్:—

గౌడీముదాహరతి, శ్లేషేతి, అర్భకాశ్శిశవః భూభృద్భువం వనభూమి మిత్యర్థః అత్ర సమాసభూయస్త్వేనసమపరుషవర్ణసందర్భేణ చ ప్రతిపాదనా దియం గౌడీ.

పాంచాలీ

శ్లో. పాంచాలకీతి వైదర్భ
గౌడీరీ త్యుభయాత్మికా॥

వ్యాఖ్యానమ్:—

పాంచాలీం లక్షయతి. పాంచాలేతి, పాంచాలదేశీయైర్విదర్భజః పరిగ్రహేణ పాంచాలీ త్యన్వర్థం సంజ్ఞేయం యథా.

శ్లో. జేతు శ్రీవేంకటసూర్యరాయనృపతే ర్ధారాధరశ్యామలామ్
దంచన్ఖడ్గలతాం ప్రియుక్తగజతా కాలీభముక్తాఫలామ్
సశ్యామా, పరిపంథిపార్థివభటా స్సంగ్రామకేష్వద్భుతామ్
సంస్థాపింటికరాశవక్త్రకుహరాం కాళీం స్మరంత్యద్భుతామ్

వ్యాఖ్యానమ్:—

ఉదాహరతి, జేతు రితి. వ్యాఖ్యాతః. అత్ర పూర్వోదాహృత రీతిద్వయ సాంకర్యే ణాప్యుభయరసప్రతిపాదనా దియం పాంచాలీరీతిః.

## అథశయ్యా

శ్లో. యా పదానాం పరాన్యోన్య
మైత్రీ శయ్యేతి సా మతా॥

వ్యాఖ్యానమ్:—

రీతీ రుదాహృత్య శయ్యాపాకయో ర్మధ్యే [illegible]
న్యా దిత్యనంతరం శయ్యాం లక్షయతి. యేతి. పరా శ్రేష్ఠా పదానా
మన్యోన్యమైత్రీవినిమయా సహిష్ణుత్వ మిత్యర్థః. అత ఏవ [illegible]
నస్యాభేదః యథా.

శ్లో. శ్రీసూర్యనారాయనసుధాపతి రేవ నిత్యమ్
భూనాయకేషు సకలైః కవిభి ర్నిషేవ్యః
కల్పద్రు రేవ నిఖిలేష్వపిపాదపేషు
దేవై రభీక్ష్ణ మఖిలై రభిసాదనీయః॥

వ్యాఖ్యానమ్:—

ఉదాహరతి శ్రీసూర్యరాయవసుధాపతి రితి, అయ మసి
వ్యాఖ్యాతః. అత్ర పదవినిమయాసహిష్ణుత్వా ద్బంధస్య పదానుగుణ్యా
రూపాశయ్యా.

### పాకస్వరూపం నిరూప్యతే,

శ్లో. అర్థగంభీరిమాపాక
స్స ద్వేధా హృదయంగమః
ద్రాక్షాపాకో నారికేళ
పాక శ్చ ప్రస్ఫుటాంతరా॥

వ్యాఖ్యానమ్:—

పారిశేషాత్పాకస్వరూపం నిరూప్యతే. అర్థేతి. అర్థస్య శృంగా
రాదేర్గంభీరిమా ఆస్వాద్యమానతావిశేష ఇతి షష్ఠీసమాసః. పూరణ

గుణాద్యాదినా నిషేధస్తు తదశిష్యం సంజ్ఞాప్రమాణత్వా త్తద్యత్న సాధనం ప్రసజ్యేతేత్యాదిపాణిని శబరస్వామి ప్రముఖమహాపురుష ప్రయోగదర్శనా దసత్య ఇతి పదమంజరీకారః. ఏవం పాకస్వరూపం సంక్షిప్య తద్విభాగ మాహ స ద్విధేతి.

ద్రాక్షా పాకః

శ్లో. ద్రాక్షాపాకస్స నిర్దిష్టో
బహిరన్తస్స్ఫురద్రసః

వ్యాఖ్యానమ్ :—
ద్రాక్షాపాకం లక్షయతి ద్రాక్షాపాక ఇతి.

నారికేళ పాకః

శ్లో. స నారికేళపాకస్స్యా
దన్తర్గూఢరసోదయః

వ్యాఖ్యానమ్ :—
నారికేళపాకం లక్షయతి స ఇతి.

ననూ ఏతౌ ద్వౌ తత్పూర్వోదాహృతేషు ద్రష్టవ్యౌ. మతాంతరేణ పాకాంతరా ణ్యపి సంభవ న్యూహ్యాః.

ఏతదుదాహరణ ప్రస్తరభయా దుదాహృతేషు ద్రష్టవ్య మితి మతాంతరేణ పాకాంతరా శ్చ పరతో గ్రాహ్యా ఇతి చాహ. ఏతా వితి.

మహాకావ్యమ్

శ్లో. పూరారంభోద్ధతస్తు చంద్రతపనోద్యానాంబు కేళ్యుత్సవాః
సంభోగో మధుపానపుత్రజననోద్వాహోవిసంవాదనమ్
మంత్రిద్యూతసమిత్ప్రయాణ ముదయం నేతా చ సర్వేస్వమీ
వర్ణ్యంతే కవినాయకై ర్యది మహాకావ్యం తదేవ స్మృతమ్

వ్యాఖ్యానమ్:—

మహాకావ్యస్వరూప మాహ పురిత్యాదినా. పుః పురం ...
పర్వతాః సమిత్ర్యగాణాం యుక్తయాత్రా

## తత్త్రివిధమ్

శ్లో. తత్రావ త్రివిధం స్మృతం కవివరై ర్గద్యాత్మపద్యాత్మక
తద్యుగ్మాత్మక మిత్యపాదపదసంఘాత స్తు గద్యాత్మకమ్
పద్యం పాదయుతం చ తద్ద్వయమయీ చంపూ రితి ప్రోచ్యతే
తత్తద్వ్యభిదా స్తు విస్తరభయా న్నోదాహృతా మయ్యత్ర ॥

వ్యాఖ్యానమ్:—

మహాకావ్యస్వరూప నిరూపణానంతరం తద్భేదా నాహ
తత్రావ దితి. గద్యపద్యతదుభయాత్మకత్వేన కావ్యం త్రివిధ మిత్యర్థః.
తత్రిం స్వరూప మిత్యత ఆహ. అపాదేతి. ఛందోరహిత పదస
ఘాతో గద్యం. పాదబద్ధం పద్యం. తదుభయస్వరూపిణీ చంపూ
రిత్యర్థః. ఆఖ్యాయికా మాలిన్యాది భేదా స్వస్యతో గ్రన్థగౌరవ
ఇత్యాహ తత్త దితి.

ఇతి

సాహిత్యచింతామణి నామ్న్యలంకార శాస్త్రే

కావ్యపరికరణం సమాప్తమ్.

———

హాలాహలంబు తోడై పుట్టునప్పుడె
ముక్కంటియౌదల కెక్కరాదె
తమ్ములసిరిఁ జూడఁ దలఁచనిపని విని
యవనిలోనఁ గళంకి యనఁగరాదె

గీ. యిన్నిగుణముల నెన్నికై యున్నయపుడె
పాంథజనములఁ గడు భంగపఱచరాదె
నీ వశక్తుండ వన మయ్య నీరజారి
మమ్ము దయచేసి వేడిమి మానియున్న 92

గీ. కువలయము మెచ్చ రాజనుకొని నుతింతు
నవని సర్వజ్ఞమౌళి వీ వని భజింతు
నెలమి సన్మార్గరతుఁ డని యెంతు నిన్ను
నింతవేఁడిమి చూపకు మింక శశాంక. 93

చం. చెక్కెరవింటిరాజ సుమచాపము గైకొని మేరుధన్వివై
నెక్కటివై జయించి తిల నెవ్వరు నీ సము లెంచిచూడ నీ
చక్కనిపాదము ల్దలఁచి సాగిలి మాటికి మానసంబున
మ్రొక్కెద నెక్కుడించు శరము ల్దొనఁ జేర్చి నవేఁతు
చాపమున్. 94

ఉ. రాహుముఖంబునం బ్రితికె రాజల కైరవబాంధవుండు ఘో
రాహవ వృత్తి శూలి నయనాగ్నిహతిం బడి పైఁడిజాడ ను
త్సాహముతో జనించి కొనసాగితి వీవును మేనమామతో
నూహ యొనర్పఁ దా సముఁడవో సుమ కార్ముక
మీన కేతనా. 95

మ. కలకుండూపులు నూఱు నేమిటికి రంగద్భృంగ మౌర్వీ ధ్వను
ల్మారయ న్విల్లొన నేల నీవు జగతి న్మార్గాభిషిక్తుండవై
పఱవ న్నీ శుకశారికాది బల శుంభల్లీలకే పాంథులం

దఱుఁ బ్రాణంబు లొసంగుచుండఁ గనియున్ దర్పంబు
రెట్టింపఁగన్. 96

క. పవనా మలయానిల నిజ
భవనా నన్నిపుడు సత్కృపాబుద్ధిని గా
వవనా యబలాళులపై
నవనాహిత బుద్ధిదగు ధుతారి పవనా. 97

ఉ. బాలికల న్వియోగినులఁ బాపమెఱుంగక నొంచి యంతనా
భీల పటీర శైల ఫణిభీషణ దంష్ట్రల కామిషంబవై
కాలునిపోలు చొచ్చి తిరుగం జనుదెంచియు మమ్ము నేతురా
బాలసమీర మీఱక కృపాకలితాత్మతఁ గావు మేటికిన్. 98

ఉ. జాతికి దూరమై మధుపజాతిఁ దగుల్కొని దర్పకాశ్రియ
ఖ్యాతి వహించి కాంచనము గాంచితి వింతియకా వసంత నీ
రీతి పలాశమండలికిఁ బ్రేమకరంబగు చొప్పు సద్విజ
వ్రాతము లుత్సహించి ననుఁ బ్రార్థనసేయుట చిత్ర
మెన్నఁగన్. 99

ఉ. చాల సుజాతిఁ బ్రోచితొ కుజన్మతగాంచి చలించకుండు చం
డాలుల నప్పలాశ నివహంబుల డీలుపడంగఁ జేసితో
యేల వసంత మాధవసమీహిత నామము కౌశికాఖ్యచే
వేలుపుతేనిఁ బోలఁగలవే జగతీస్థలి ఘూకజాతముల్. 100

వ. అని

క. ఈగతిఁ బలుకుచు నయ్యేల
నాగ మహామోహ జలధి నడుమం దిరుగన్
వేగమె నావ లభించిన
లాగున నొక శారికాలలామం బటకున్. 103

క. చనుదెంచి తాఁ దమాలిక
నని తనపేరుగ్గడించి యబలా యీ రీ

తిని జంతయేల నన్నుం
బనిచిన నీప్రియునిఁ దెత్తుఁ బ్రమదంబలరన్.

చ. అనవిని తత్సభీజనము లందఱు సంతసమంది చూడ న.
వ్వనిత తమాలికం బొగడి వాంఛితను ల్సమకూర్చి పోం
మ్మని యొకలేఖ వ్రాసి తనయగ్రమునందిడ వేడ్కతోడఁ
గొని ననుఁగూడవచ్చె నిదిగో నని కీరము శారికామణిన్.

క. నమ్మించెను దానున్న క
తమ్మది యన నాక్షణంబ తద్భూరుహ మూ
లమ్మున నున్న నృపాలుఁడు
సమ్మదమునఁ బొదలెఁ గార్యసాఫల్యేచ్ఛన్.

వ. అప్పుడు

ఉ. మానవభర్తపాలికిఁ దమాలిక వచ్చి నమస్కరించి య
మ్మానిని యున్నజాడఁ బలుమాఱును దెల్లముగాఁగఁ

కోనగునంచుఁ బత్రిక నకుంఠితభక్తి నొసంగి నన్మహీ
జాని వినంగఁ దత్సఖుఁడు సంస్కృత వైఖరిఁ దెల్పె
నీ గతిన్.

ఆర్యా. ప్రత్యక్షదృష్టభావాప్యస్థిరహృదయా కామినీభవతి
స్వప్నాను భూతభావా దృఢయతి న ప్రత్యయం
యువతిః ॥

వ. అట్లు చదివిన

క. ఆర్యోదితమగు తత్తా
త్పర్యార్థముఁ దెలిసి రాజు తద్దయుఁ బ్రమదా
శ్చర్యముల తోడ మనసున
ధైర్యము రెట్టింప సుకృతితముఁడై యలరెన్.

మ. జితకల్పద్రుమదాన దానవరిపుశ్రీపాద పద్మాంతరాం
చితచేతోలసమాన మానవపతిశ్రేణీ నితాంతాదరా
ర్పిత సౌఖాసన యాన యావకరిణీ శ్రీమల్లతాంగీ మనో
రతిరాజన్యసమాన మానజితకౌరవ్య క్షమాధీశ్వరా ! 111

క. సద్వర్ణనీయ ఘనసం
విద్విశ్రుతచరిత నిఖిలవిద్వజ్జనితా
హృద్వాంఛితదాయక భూ
భృద్వరగురుధైర్య జగదభిస్తుతశౌర్యా ! 112

తరళ. సరససత్కవిరాజపోషణ సాధుసూనృతభాషణా
నిరుపమానదయావిభాసుర నిత్యపోషితభూసురా
పరచమూ తిమిర ప్రభాకర భవ్యనవ్య శుభాకరా
సరసిజాతముఖీ మనోభవ సౌరనాయకవైభవా. 113

గద్య. ఇది శ్రీ వక్కలంక చంద్రశేఖర మహాకవిపౌత్ర
భాస్కరసుకవిపుత్ర విద్వజ్జనవిధేయ
వీరభద్రనామధేయ విరచితంబైన
వాసవదత్తా పరిణయం బను
మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.

# వాసవదత్తాపరిణయము

## చతుర్థాశ్వాసము



కర బుధ విబుధ శుభవిభ
వాకర కరవాల భైరవాఖ్యా పరహృ
ద్భీకర పరితాప విదిత ది
వాకర గుణాలోల మాధవక్షితిపాలా! 1

వ. అవధరింపు మనంతర కథాప్రసంగంబు. 2

క. చాల తెఱంగంతయును ద
మాలికవివరించి యోషమావర రా ర
మ్యాలస్యము దగదు వృథా
కాలక్షేపమున కేమి కారణ మనుచున్ 3

చ. మదకలవాగ్విలాస గరిమంబు నిజశ్రుతి మధ్యసీమకున్
ముదమొనగూర్పఁగాబలికి మ్రొక్కుచు శారిక మ్రోలఁ
జేరి వ
న్నదయ మనస్కుఁడై ధరణిజాని తమాలిక పక్షిజాతము
ల్గదియఁగఁ బట్టి దువ్వి కడఁకం దన యక్కునఁ జేర్చె
వేడుకన్ 4

క. శౌరి కటాక్షము గతి నో
శారిక నీరాక మాకు సమకూర్చెఁ గదా
కోరికలెల్లను బద మీ
యూరి కనుచుఁ దత్సఖీతోద్యోగుఁడై 5

వ. అట్లమ్మహీపాలుండు తమాలికా సహాయుండై మకరందుం
డును దానునుఁ గొంతదవ్వేఁగి చంద్రికామధుపానమత్తచకోర
మత్తకాశినీ సంతోషాగమంబును మదన కేళీ పరవశ చోళీ

చూళీభాగ భాగ ఘటిత వికచ విచికల సౌరభ సంపాదన
చాతురీ ధురీణంబును నిశా శశాంక ముఖీ నిశ్వాస నిభంబును
నగు మలయానిలం బధ్వశ్రమం బపనయింపఁ గుసుమపుంజం
బుఁ జొచ్చి ముందటి సతతావగాహన చతుర వనితా కుచ
కుంభ గళిత మృగమద కర్పూర వాసనా వాసిత నీరంబులును
దట ఘటిత స్ఫుట స్ఫటిక శిలా సోపాన తల నిద్రాయమాణ
దుర్జ్ఞేయ రూప శ్వేత పారావత రూపంబులును ఘన సార
తీర భాసుర పులిన తల నినాదానుమేయ మాన రాజహంస
సమూహంబులును సుందరేందీవర బృంద మాధ్వీక నిష్యంద
సేవా పరిభ్రమ ద్భ్రమర విభ్రమాదభ్ర శోభావరంబులునగు
పద్మాకరంబులు దాఁటి యనిల సముచ్ఛలిత వ్యోమ భూమిమా
రుహాసిత లతాంత మంజరీ మంజుల పతాకానికర మనోహరం
బులును ననవరత ఘుమ ఘుమాయమాన కృష్ణాగరు ధూప
ధూమాళీక జలధర పటలీ సముద్భూత మురజ గంభీర నినాద
గర్జారవా హూత కృత కావలా గత భుజగ భుగహంబులును
నగు ప్రాసాదంబులునుఁ గడచి తదనంతరంబ, 6

క. భవనందన తుల్యుఁడు వై
భవజిత సురవిభుఁడు పద్మభవనిభస ప్రా
భవుఁడు నృపాలుఁడు తత్ప్రియ
భవనముఁ గాంచెను సుఖానుభవ మలరారన్ 7

సీ. తరళికే తరళయ తతధూప ధూమ సం
ఘాతే ముద్వ్యగ్రవాత్కుస్థలేషు
సహకారమంజర సహకార మంజరీ
మానయ త్వవధియం హల్లశేషు

మకరికేమకరికాం ప్రికటయ ప్రియసఖి
వక్షోజ కుట్మలద్వయ తటేషు
కేతకికేతకీ జాతపూ కల్పయ
మల్లికాలంకృత మంటపేషు
కుంతలేకుంతలే స్రిజంకింతనోపి
మేఖలేమేఖలే తనమిత్రితాస్తి
యనుచుఁ జతురతభాషించు వనజముఖుల
పలుకులాలించి మతిఁబొంగి పార్థివుండు 8

కలలోఁ జూచిననాఁటి సోయగము సాక్షాత్కారమై
యుండఁగా
నలివేణిం గలకంఠిఁ బద్మకరఁ గల్యాణిం బ్రివాళాధరన్
దళ దిందీవరలోచన న్నవలతా తన్విన్ శశాంకానన
న్గలికిం వాసవదత్త నందుఁ గనియెన్ క్ష్మావల్లభుం
డంతటన్ 9

వాసవదత్తయు మును దాఁ
జేసిన పుణ్యముల ఫలము చేకూరెఁ గదా
యీ సమయంబుననని కన
కాసనమున నృపతినునిచి యానందమునన్ 10
శ్రీలలిత భాషణములఁ ద
మాలికఁ గొనియాడి సబహుమానంబుగఁ దా
నాలింగనం బొనర్చి మ
హాలస వేషమున నృపతియండ వసించెన్ 11

మణిగణ నిఃరము.

ముసిముసినగవులు మురిపము దెలుపం
బ్రిసవశరుఁడు తనరసికత నెఱపన్

బిసరుహాముఖి మదిఁ బెనఁగొనుతఱి సి
గ్గెసఁగ విభునిదెస నిటునటు మెలగెన్ 12

ఉ. కాంచన మంచమంచితముగా నపు డిద్దఱుఁ గూరుచున్నచోఁ
బంచశిలీముఖ ప్రదరపాటిత మానసవృత్తిఁ జెంద, నే
త్రాంచల చంచలప్రతిభ లవ్వల నివ్వల నివ్వటిల్లఁగాఁ
గాంచుచు నొండొరు ల్ప్రమద గౌరవ మొప్పఁగ నుండి
రయ్యెడన్ 13

గీ. సరవి నన్యోన్య మోహాతిశయము కతన
నవమనోభవదశఁ జెంద నలినముఖులు
వారినప్పుడు శిశిరోపచార విధులఁ
దెలుపుచుండంగ నచటికి వెలఁది యొకతె 14

క. చనుదెంచి యోఁ గళావతి
నని తను నెఱిఁగించి యొకరహస్యము రాజా
వినుము వచించెదఁ గడఁకన్
ఘనమతితోఁ జిత్తగించఁగాఁ దగు నెలమిన్ 15

మ. కరుణాసాగర రాజవంశతిలకా కందర్పకేతుక్షమా
వర నీకై వెతఁబొందె నీ చెలియ నేవర్ణింపఁగా నోప నీ
శ్వర కారుణ్య విశేషయోగమున యుష్మద్దర్శనానంద మీ
తరుణీ రత్నము పొందె సర్వ శుభముల్ పై వారఁగా
నియ్యెడన్ 16

క. సమయముగా దిప్పుడు కథ
లమితము లెఱిఁగింప నున్నవయ్యా మా భా
గ్యము కతన మీ సమాగమ
మమరెంగా కున్న శక్యమా చెలిఁ దెలుపన్ 17

## అధ్యక్షులు

విమర్శకాగ్రేసర, ఐతిహాసిక సమ్రాట్టు

**శ్రీ బండారు తమ్మయ్య**

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి

ఆఖివనభోగ

**శ్రీ దంటు భాస్కరరావు**

సహాయ కార్యదర్శి

**శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సూర్యనారాయణశాస్త్రి**

కావ్యనిర్వాహక వర్గ సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి
2. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి (బాలవ్యాస)
3. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణ విద్యాప్రవీణ, భాషాప్రవీణ)
4. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తు
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ
7. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు
8. శ్రీ బామిర రాజగోపాలరావు, బి. ఏ.
9. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, ఎమ్. ఏ. (ఆనర్సు)
10. శ్రీ ఓలేటి సుబ్బరాయశాస్త్రి (ఉభయభాషాప్రవీణ)
11. శ్రీ శావలి శ్రీరామమూర్తి, బి. ఏ. బి. ఎల్.

పత్రికా సంపాదకులు

**శ్రీ కుందూరి ఈశ్వరదత్తు**

## శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు

| | |
|---|---|
| 5వ సంపుటము | రు. 15—00 |
| 6వ సంపుటము | 15—00 |
| 7వ సంపుటము | 15—00 |

**1-4** సంపుటములు పునర్ముద్రణములు గావింపబడుచున్నవి.

ప్రతియొక్కటికి వెల రు 15 లు

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కుపాఠభేదములతోఁ గూడిన వెనుకటి విషయసూచికయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణ పీఠికతోఁ ముద్రితమైనది వెల రు 1—50

## మాధ్యమిక కారికలు

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము. కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము మూల్యము రు. 2—[illegible]

ఆంధ్రసాహిత్యపరిషత్తు,

కాకినాడ.


Printed by [illegible] Press, Kakinada

[illegible]

Published by [illegible] Kakinada